

(81 పాఠకుల ప్రశ్నలు - నవలాకర్త జవాబులతో... )

# అర్ణాద్




1-9-286/3 విద్యానగర్, హైదరాబాద్-500044

**EETARAM STHREE** *(Novel)*
*(Winner of First Prize in the First Novel competition of Swati illustrated weekly)*
*by*
**ARNAD**

August, 2003

Publication No. 42



*Cover Illustration :*
**BAPU** (1984)

*Produced & Published by :*
**Vahini Book Trust (V.B.T.)**
1-9-286/3, Vidyanagar
Hyderabad - 500 044.




*For Copies :*
Vahini Book Trust, 1-9-286/3, Vidyanagar, Hyderabad - 500 044.
Visalandhra Book House, Bank Street, Hyderabad & Other Branches
Navodaya Book House, Opp: Aryasamaj Mandir, Badi Chowdi, Hyderabad
Navayuga Book House, Sultan Bazar, Hyderabad.
Navodaya Publishers, Governorpet, Vijayawada.

*Typesetting :*
**S.K.M.L. Graphics**, Visakhapatnam and
**Rachana Entinti Patrika,** Hyderabad - 500 044

*Text & Title Printed at :*
**Charita Graphics** - Offset Printers, 1-16-79/3,
Sainagar Colony, Lothukunta, Alwal, Secunderabad - 500 015.

Price : Rs. 80/- US $ 8



ఆప్త మిత్రులు

స్వాతి సంపాదకులు

శ్రీ వేమూరి బలరామ్‌కు

ప్రేమతో...




## నా అభిప్రాయం

'ఈతరం స్త్రీ' అర్నాద్ వ్రాసిన రెండో నవల.

ఇది అతని మూడు మంచి నవలలలో అత్యుత్తమమైనది.

ఈ నవలను అతను తన స్వంత గొంతుకతో వ్రాసాడు.

ఈ నవల అతను వ్రాసే నాటికి ఉద్యోగస్తులైన స్త్రీల సంఖ్య గణనీయంగా పెరిగింది. అప్పటికి వారి ఇబ్బందుల గురించి కథలు వస్తున్నాయి. పనిమనిషి ఆలస్యంగా రావటం, బస్సులో చోటు దొరకక పోవటం - మేనేజర్ ఆమెను తిట్టడం లాంటి ఇతివృత్తాలతో. ఆ రోజుల్లో పనిమనిషి కూడా ఉద్యోగస్థురాలే అన్న స్పృహ రచనలు చేసేవాళ్ళు చూపించే వారు కాదు. (ఈ నవలలో కూడా పనిపిల్ల లక్ష్మి కూడా ఈతరం-స్త్రీయేనన్న విషయం అర్నాద్ గుర్తించినట్టు నిదర్శనం లేదు!) అది వేరే విషయం. అసలు విషయం ఏమిటంటే అర్నాద్ ఉద్యోగినులకు సంసార సుఖం తక్కువ అవటాన్ని ఇతివృత్తంగా తీసుకొన్నాడు. అటువంటి సమస్యను అన్ని కోణాలోనూ పరిశీలించి చిత్రించాడు. అందుకు ధైర్యం కావాలి. బహుశ అందుకే పత్రికలో ఆడపేరుతో రాశాడు.

అయితే, పాఠకులు ఇది పురుషుడి రచనేనని పోల్చుకోగలిగారు. స్త్రీకి శృంగారం బలహీనత. దాని కోసం ఆమె తనని తాను అర్పించుకొంటుంది. పురుషుడికి లైంగికం (సెక్సు) బలహీనత. దాని సాధనకి శృంగారం ఓ మార్గంగా స్వీకరిస్తాడు. స్త్రీల రహస్యం శృంగార ప్రదర్శన

ఉంటే పురుష రచనల్లో కామకేళికి ప్రాముఖ్యత ఉంటుంది. ఈ నవలలో కామకేళి కొంత చిత్రితమైనది. పురుష కోణంలో చిత్రితమైనది. అందుకనే తెలివైన పాఠకులు పోల్చుకున్నారు. వారిలో కొందరు రచయితని రావిశాస్త్రిగా పోల్చుకొన్నారు. కాని ఇది రావిశాస్త్రి వ్రాసే నవల కాదు. శాస్త్రిగారితో సహా చాలామంది వామపక్షీయులు స్త్రీలు ఆర్థికమైన దోపిడీకి గురవటాన్ని పట్టించుకొన్నట్టుగా సాంఘికమైన అణచివేతకు గురవటాన్ని పట్టించుకోరు. సోషలిస్టు వ్యవస్థ వచ్చినా పురుషుడు మారండే, అతగాడు స్త్రీ విముక్తికి బద్ధుడైతే తప్ప స్త్రీలకు మంచి రోజులు రావు అని విజయ పాత్ర చేత చెప్పిస్తాడు అర్నాద్.

అర్నాద్ ఇది వ్రాసింది ఓల్గాలు, కుప్పిలి పద్మలు దీని గురించి ఏమీ వ్రాయని రోజుల్లో అని మనం గుర్తుంచుకోవాలి! అర్నాద్ కూడా (మగ) స్త్రీ వాద రచయితే!

ఒక అవివాహితురాలు ప్రేమించినవాడి వలన గర్భం ధరించి, ఆ సంతానం కేవలం తనకే చెందాలన్న భావం వలన ప్రియుడితో (పెళ్ళయిన వాడితో వివాహం చెల్లదు అన్న కారణం చేతకాక) పెళ్ళిని నిర్ద్వంద్వంగా నిరాకరించి, ఆపైన ప్రసూతి సెలవు గురించి తనకు న్యాయం జరిగేలా పోట్లాడిన అసాధారణ వ్యక్తిత్వం వున్న భామ ఛాయ. ఇది ఒక కొత్త దారి తొక్కిన పాత్ర. రచయిత మనస్సుకి చాలా దగ్గర పాత్రలా మనకి అనిపిస్తుంది. అప్పటికి నీనా గుప్తాలూ లేరు, ఆ కథలు వ్రాసిన వారూ లేరు. చాలా సంవత్సరాల తరువాతగాని స్త్రీ వాదులీ వస్తువుని తీసుకోలేదు. కేవలం ఈ పాత్ర చాలు. ఇది అత్యుత్తమ నవలగా మనం గుర్తించటానికి.

ఈ నవల వల్ల అర్నాదూ, దీన్ని ధారావాహికంగా ప్రచురించటం వల్ల స్వాతి వారపత్రికా, సరస శృంగార కథలు తరువాత ఓ వరదలా రావటానికి కారణం అని అనేవారు లేకపోలేదు. దీనికి 'సాంఘికం' నవలలో అర్నాదే జవాబు చెప్తాడు - రానున్నవి రాక మానవు, వ్యక్తులు వాటిని ఆలస్యం చేయటమో త్వరపరచటమో మాత్రమే చేయగలరు అంటూ. ఈ నవల ముందు కాలంలో పాఠకులు దయ్యాల కథలు చదివి విసుగెత్తిపోయి ఉన్నారు. మార్పు కోరుకోసాగారు. అయితే 'మత్తుమందు' మారటానికే సిద్ధపడి ఉన్నారు కాని 'మత్తుమందు' మానటానికి కాకపోవడంతో భయానక రచనల్ని తోసి సరస శృంగార కథలు మళ్ళీ రావలసి వచ్చింది. అల్లా ఈ 'రసా'లన్నీ తెరచాటుకు వెళ్తూ ఉంటాయి. మళ్ళీ కొన్నాళ్ళ తరువాత తెర మీదకొచ్చి మరికొన్నాళ్ళపాటు తైతక్కలాడిపోతాయి. అది పాఠకుల అభిరుచి లక్షణం. అది మారుతూ పోతూ ఉంటుంది. అయితే అర్నాద్ నవలలో సరస శృంగార కామములు చిత్రించినా వస్తువు బలంగా ఉండటం వల్ల వాటి చుట్టూనే తిరుగుతూ ఉండటం వల్ల నవల విలువకేమీ భంగం రాదు.

ఈ నవలలో ముఖ్యంగా ముగ్గురు స్త్రీలున్నారు - విజయ, సుజాత, ఛాయలు. చ(చె)లం

విజయ భర్త. విజయని నగల్తో, చీరల్తో అంకరించటానికి చేస్తున్న ఉద్యోగానికి తోడుగా రియల్ ఎస్టేట్ వ్యాపారంలో దిగుతాడు. వాటి మీద మోజులేని విజయ కేవలం చలం కంపెనీ మాత్రమే కోరుకొనే సాధారణ సంసార స్త్రీ. అయితే డబ్బు రంధిలో పడిన చలం టెన్షన్‌కి గురై దాని నుంచి తాగుడికి, వ్యభిచారానికి దిగేవరకు విజయ అతని నుంచి విముక్తి కోరుకోలేదు. చివరకు విధిలేక విడిపోతుంది. అతను ఆశ వల్ల గట్టి దెబ్బలు తిని చచ్చిపోతాడు.

రవి, సుజాతలు చెరో ఊళ్ళో ఉద్యోగాలు చేసే జంట - చలం విజయల స్నేహితులు. రవి, చలం, విజయ, ఛాయలు ఒక ఊళ్ళో ఉద్యోగం చేస్తుంటే సుజాత బైటూళ్ళో ఉద్యోగం చేస్తూ ట్రాన్స్‌ఫర్ చేయించుకోలేక ఉద్యోగం వదిలిపెట్టుకోవాలని నిర్ణయించుకొని భర్తకి తెలియజేస్తుంది. ఆమె జీతాన్ని వదులుకోలేని రవి ఆమెను రాజీనామా చెయ్యనివ్వడు. సెక్సు బాధని పనిపిల్లతో తీర్చుకోబోయి విఫలుడవుతాడు. రవి పరులకి సహాయం చేయాలన్న స్వభావం కల 'మంచివాడు'. కాని పెళ్ళాం పట్ల అతనికున్న అనుమానం అతనిలోని సంస్కారాన్ని ఓడిస్తూంటుంది. ఛాయ స్నేహితురాలు విజయ కూడా ఛాయలోని 'అవినీతి'ని అసహ్యించుకుంటుంది. కాని రవి పట్టించుకోడు. ఇతర్ల విషయంలో అంత మంచిగా ఉండగలిగిన అతన్ని ఎన్నో విధాల బతిమాలి భంగపడ్తుంటుంది, అతని భార్య సుజాత.

చలం, విజయ, రవి, సుజాతలు - ఈనాటి మధ్య తరగతి పాత్రలు. సజీవ పాత్రలు.

ఛాయ రచనా సమయానికే కాక ఈనాటికి కూడా అసాధారణ ప్రకృతి గల పాత్ర. ఇప్పటికీ అటువంటి వాళ్ళు అబ్బురమే కలిగిస్తారు. ఛాయతో దేహ సంబంధం పెట్టుకొన్న వ్యక్తి రాంబాబు. మంచివాడే గాని ఏ సంఘర్షణా లేని పాత్ర. ఛాయకి ఏ విధంగాను దీటైనవాడు కాదు. భార్య ఉండి పరాయి స్త్రీతో సంబంధం పెట్టుకొని ఆమెకి కడుపైతే దానికి అబార్షనో, పెళ్ళో మాత్రమే పరిష్కారం అని నమ్మే సాధారుణుడు. అతనిని కేవలం అవసరం తీర్చేవాడుగా ఛాయ స్వీకరించిందేమోనని పిస్తుంది. వాళిద్దరి మధ్య సంబంధం ఏర్పడటానికి దారి తీసిన పరిస్థితుల్ని చాలా బలంగా చిత్రించాడు అర్నాద్. కాని రాంబాబు మాత్రం చేటపెయ్యే!

ఈ నవలలో చెప్పక విడిచిపెట్టినవి కొన్ని ఈ నవలకి పెట్టిన పేరు దృష్ట్యా లోపాలనిపిస్తాయి. ముఖ్యంగా హేమ, లక్ష్మి పాత్రల వ్యక్తిత్వాలు. వాళ్ళు కూడా ఈ తరానికి చెందిన స్త్రీలే కదా! చలం, రవిలకి వీళ్ళు భోగ్యవస్తువులు అయినట్టే రచయిత వీళ్ళని చలం, రవిల కథలు చెప్పడానికి మాత్రమే ఎన్నుకున్నాడు.

ఆ పాత్రల గురించి రచయిత ఏ శ్రద్ధా తీసుకోలేదు. లక్ష్మి, రవి రమ్మంటే వచ్చి పొమ్మంటే పోయే పనిపిల్ల పాత్ర. పెళ్ళయినదైనా, ఆర్థికావసరం ఆమె చేత ఆ విధంగా చేయిస్తుంది అని రచయిత మనకి చెప్తాడు. హేమకి డబ్బూ, సుఖం తప్ప ఏ నైతిక విలువలూ పట్టవు. ఎందుకంటే ఆమె డబ్బున్న వాడి పెళ్ళాం. ఈ రెండు పాత్రలూ మధ్య తరగతికి చెందవు

కనుక రచయిత వీటిని మలచడంలో అశ్రద్ధ చేశాడనిపిస్తుంది. నవల పేరు "ఈ తరం మధ్య తరగతి స్త్రీ" అని పెట్టి ఉంటే ఏమో!

అల్లాగే మనకి కనిపించని పాత్ర రాంబాబు భార్య. రాంబాబు భార్య ఛాయ, రాంబాబుల సంబంధం ఎల్లా తీసుకొంటుంది? ఆమెకి అన్యాయం చేస్తున్న భావం ఛాయ కెందుకు లేదు? ఈ ప్రశ్నలు కనీసం చర్చించబడలేదు.

విజయ 'చెడ'లేదు. ఛాయ 'చెడింది' అనటానికి ఆమెకి పెళ్ళి కాలేదు. సుజాత చెడింది, చెడ లేదు, చెడింది అని వరసగా సూచనలుంటాయి గాని ఆమె శృంగారాన్ని చిత్రించలేదు పరాయి వాడితో. మధ్యతరగతి భార్యా భర్తల మధ్య శృంగారం కామకేళి చిత్రించబడినా మధ్యతరగతి స్త్రీ యొక్క వివాహేతర సంబంధం చిత్రించక 'ఔచిత్యం' కాపాడాడా అన్న అనుమానం తప్పక మిగుల్తుంది.

ఈ నవలలో సెక్స్ అవసరం తీరక హిస్టరికల్‌గా తయారైన ఛాయ ఒకానొక పరిస్థితిలో తమ్ముడిలో పురుషుడిని చూస్తుంది. అల్లాగే సుజాత రవిల కామకేళిని వాళ్ళ పిల్లలు చూసిన ఘట్టం కూడా ఉంది. పాఠకులు కొందరు ఈ రెంటిని జీర్ణించుకోలేక పోయారు గాని ఆ సంఘటనలకి దారితీసిన పరిస్థితుల్ని అర్నాద్ బలంగా, సహజంగా చిత్రించాడు.

రెచ్చగొట్టడానికి, నవలలు వ్రాసేవారో, సెక్సు ఎడ్యుకేషన్ అంటూ హావలాల్ ఎల్లిస్ రోజుల నుంచి ఒకేరకం ప్రశ్నలకి జవాబులు చెప్పే 'డాక్టర్' రచయితలో మాత్రమే తీసుకొనే సమస్యలను తీసుకొని అవి ఏ పరిస్థితుల్లో ఎదురౌతాయో నిజాయితీతో వ్రాసిన అర్నాద్‌ను మెచ్చుకోవలసిందే!

చదువుకొని ఉద్యోగాలు చేస్తూ సంస్కారం ప్రదర్శించే పురుషులు కూడా భార్యతో తీవ్రంగా తగువుపడ్డ పరిస్థితుల్లో 'బజారు భాష' వాడ్తారని కూడా అర్నాద్ నిర్మొహమాటంగా చెప్తాడు. తగువు తీవ్రత చిత్రించడంలో కొంత లోపం ఉన్నా, అది చిత్రించాలనుకొనే రచయితలు తప్పక చూడాల్సిన చిత్రం War of Roses.

ఈ నవల నాకు అతిగా నచ్చిన తెలుగు నవలల్లో ఒకటి.

ఈ తరం చదవాల్సిన నవలల్లో ఒకటి.

– కవనశర్మ

చలం ఇంటికి చేరేటప్పటికి రాత్రి తొమ్మిదిన్నర. స్కూటర్ చప్పుడు, హారన్ విని పనిమనిషి పరుగు పరుగున వచ్చి గబగబా గేటు తీసింది.

స్కూటర్ స్టాండు వేసి కాసేపు అలానించుండిపోయేడు చలం బిల్డింగ్‌కి అభిముఖంగా నించొని, నడుంపై చేతులు వేసుకొని తదేకంగా, తన్మయంగా, తనివితీరా బిల్డింగుని అలా చూస్తూ వుండిపోయాడు.

అతనా బిల్డింగ్ కట్టి ఏడాదిన్నర కావస్తోంది. అదే మొదటిసారి కాదు. బిల్డింగ్ కట్టి ఏడాదిన్నర పొడుగునా దాన్ని చూస్తూనేవున్నాడు. ఇంట్లోంచి బయిటకివెళ్ళే సమాయాలకన్నా – ఇంటి కొచ్చే సమయాల్లోనే – ఆ బిల్డింగ్ సొగసులు అతన్ని కట్టేసినట్టు ఆపేస్తున్నాయి.

ఆర్టిస్టిక్‌గా, అరిస్టోక్రటిక్‌గా కట్టబడిన ఆయిల్లు నిజంగా తనే కట్టించగల్గేడా అని యిప్పటికీ ఆశ్చర్యం 'నేనే, యస్. నేనే' అని ఇప్పటికీ గర్వం! గర్వం కలగగానే బిల్డింగ్ ముందు అమాంతం గా గెలివర్‌లా పెరిగిపోయి మీసం మీదకి చేయి అప్రయత్నంగా వెళ్ళిపోతుంది

చలం చేస్తున్నది ఆఫీసర్ వుద్యోగం వుద్యోగం తప్పించి అతనికి వెనకా ముందూ స్థిరాస్తీ చరాస్తీ అంటూ ఏమీలేవు. అతని భార్య వుద్యోగం చేస్తోందంటే ఆ వుద్యోగం యిల్లు కట్టేక సంపాదించిందే. ఐతే లక్షన్నర రూపాయిల ఖర్చుతో ఈ బిల్డింగ్‌ని ఎలా కట్టగలిగేడు?

కంపెనీ కూడా ఏ బిల్డింగ్ లోనూ ఇవ్వలేదు. విశాఖపట్నం విలువ రోజారోజుకీ పెరిగిపోవడంతో ఆ బిల్డింగ్ ఇపుడు ఆరు లక్షలయినా చేస్తుందని అంచనా.

ఆ బిల్డింగ్ అతనికి ఒక అద్భుతం, ఒక గొప్పవరం, అన్ని విజయాల్లోకెల్లా అతి గొప్ప విజయం.

ఇంతటి బిల్డింగ్ బోడి జీతంరాళ్ళతో అయ్యేదికాదు. అఫ్‌కోర్స్, తనకి అదనంగా లభిస్తున్న ఆదాయం లేకపోలేదు. అదనపు ఆదాయం వస్తోందంటే అదంతా ఏడుకొండలవాడి దయ! ఆయన దయే అయినప్పటికీ చలంకి ఒక సెంటిమెంటు కూడా వుంది.

అదేమిటంటే – అతను విజయను చేసుకున్న తర్వాతే అతని దశ తిరిగిందని.

అతనికి వరాలిచ్చే దేవత విజయ. అతనెందెందుచేయి పెట్టినా అందు బంగారం, బంగారం! అతని అన్ని విజయాల వెనుక విజయ వుంది.

గమ్మత్తేమిటంటే విజయ అతి ఆదాయాన్ని ఎన్నడూ ఎంకరేజ్ చేసిన పాపాన పోలేదు. పైగా నిరుత్సాహ పరుస్తుంది కూడా. ఈ విషయంలో ఇద్దరూ చిన్న చిన్న గొడవలు పడుతున్నా అతనికి విజయ వరాలిచ్చే దేవతే.

రావణుడి రాక్షసాలకి వ్యతిరేకులు దేవతలు. భస్మాసురిడికి బద్ధవైరులు దేవతలు. ఆ

దేవతలే ఆ రాక్షసులకి వచ్చినన్ని వరాలు, తమని చంపేటంత వరాలు ఇవ్వలేదా!

ఈ మధ్య విజయతో వచ్చిన ఆ మాత్రం భేదాభిప్రాయాలు తొందరలోనే తొలగిపోతాయని అతను నమ్ముతున్నాడు.

చలం విజయను ఎంత ప్రేమిస్తున్నాడనేది ఆ బిల్డింగ్‌కి ''విజయ నిలయం'' అని పేరు పెట్టి తెలియజేసాడు. ఆ పేరు చలవరాళ్ళతో చెక్కించి అమర్చాడు.

విజయ గుర్తుకిరాగానే అతనికాళ్ళు ముందుకి కదిలాయి. పోర్టికో, హాలుదాటి వడివడిగా మేడమెట్లు ఎక్కేయి.

మెట్లెక్కుతూ 'విజయా ! విజయా !' అని పిలుస్తూ మేడపైకి చేరుకున్న చలం కుడి చేతిలో కీచైన్ గింగిర్లుకొడుతూ చూపుడు వేలుకి చుట్టుకుపోతోంది. అదే వేగంతో అంటీక్లాక్‌గా వలయాలు తిరిగి తిరిగి విడుదల యిస్తోంది. అంతలోనే మళ్ళీ చుట్టలు! మళ్ళీ విడుదల!

అతను బెడ్‌రూమ్ చేరేడు.

తలుపులు చేరవేసి వున్నాయి. నెమ్మదిగా తోసాడు. చీకటిగావుంది.

స్విచ్ వేసాడు. ట్యూబ్‌లైట్ టప్‌టపా కొట్టుకుంటూ ఒక్క క్షణం అల్లరి పెట్టినా ఒక్కసారిగా కాంతిపుంజాలతో తేజరిల్లజేసింది.

కీచైన్ గింగిర్లు కొట్టడం మానేసి వేలాడిపోయింది – నీరసంగా.

పదిహేను బై పదిహేను వైశాల్యంగల పడకగదిలో – ఎదురుగా దక్షిణ కిటికీనానుకొని సన్‌మైక్ టేబిల్ కాట్, కాట్‌మీద డన్‌లప్ పరుపూ, తలగడలూ, కాళ్ళదిక్కున తూర్పుగోడనానుకొని డ్రెసింగ్ టేబుల్, గోద్రేజ్ బీరువా, బీరువాకి నిలవెత్తు అద్దం. ద్వారానికి కుడివైపు అందమైన పెద్ద సోఫాసెట్, సోఫాకి డబల్‌కాట్‌కీ మధ్య విశాలమైన టేబుల్ టేబుల్‌పై గాజుపలక, దానిపై స్టీరియో టేప్‌రికార్డర్, టేబుల్ లైట్ వగైరా పడకగదిలో వుండాల్సిన వస్తువులన్నీ వున్నాయి. ఉండడం ఎక్కడివక్కడే వున్నాయి.

చలంకి ఆమె ఎక్కడా ఆనలేదు. కనబడలేదు. గదంతాబోడిగా, బోసిగా, నిస్తేజంగా కన్పించింది. దేవతలేని దేవాలయం – పాడుబడిన గుడిలా వుంది.

విజయ ముందు ఆ గదిలోనిదేదీ అతనికి వెలువైంది కాదు. విజయలేని ఆ పడక ఎందుకు? పడక గదెందుకు? ఆ బిల్డింగ్ బిల్డింగే ఎందుకు? అసలు తానెందుకు ?

అతనికి ఎక్కడలేని నీరసం ఆవహించింది. కిటికీలోంచి వీచే నైట్‌క్వీన్ పరిమళం అతన్ని ఇంకా చికాకు పరిచింది.

''రంగం మామ్మా !'' కేకేస్తూ గబగబా మెట్లు దిగేడు.

''ఏం బాబు'' అనివచ్చింది రంగం మామ్మ.

''విజయేది?''

విజయని ఆమెకి అప్పగించి వెళ్ళిన వాళ్ళా అడిగేడు ఆ ప్రశ్న.

ఆమెపని – ఇంట్లో మనుషులకి ఏ సమయానికేది కావలసింది అందించడం, ఇంటిని

పరిశుభ్రంగా వుంచడం, మొక్కలకి నీళ్ళు పెట్టడం వరకే ఆమె పనిమనిషి. బర్మానుంచి వచ్చింది అంచేత రంగం మామ్మా అంటారు. అసలు పేరు ఏవిటో ఇంట్లోవాళ్ళు ఎప్పుడూ తెల్సుకొనే ప్రయత్నం చేయలేదు

రంగం మామ్మకి ఏభై ఏళ్ళుంటాయి సన్నంగా, పొడవుగా, దీనంగానే అయినా దిట్టంగానే వుంటుంది ఆమెకి ఒక కూతురు. ఆ కూతురు ఏడేళ్ళ మనవడిని తనకి వదిలేసి ఎవడితోనో లేచిపోయింది లేచిపోయిన కూతురు వస్తుందనే ఆశతో ఆమె బతకడంలేదు. తను బతకాలిగనక బతుకుతోంది మనవణ్ణి చూసుకుంటూ బతుకుతోంది. మనవణ్ణి భీమునిపట్నం వెల్ఫేర్ హాస్టల్లోవుంచి చదివిస్తోంది అప్పుడప్పుడూ మనవణ్ణి చూడ్డానికి వెళ్ళడం మినహా ఎప్పుడూ ఆ యింటిని కనిపెట్టుకునే వుంటుంది

''మాటాడవేం మామ్మా విజయేది?''

మరోసారి రెట్టించి అడగడంతో రంగం మామ్మ గాభరా పడింది

''అమ్మగారొచ్చినట్టులేదు బాబు.''

''మరామాట ముందెందుకు చెప్పలేదు?'' అన్నాడు చిరాగ్గా.

అవును రంగం మామ్మ చలంకి చిరాకు రప్పించడం ఏం బావులేదు. ఎవరూ ఆమెను హర్షించరు. విజయ లేకుండా చలం ఆ యింట్లో ఏమాత్రం వుండలేడని, నిలవలేడని రంగం మామ్మ ఏల గ్రహించదు? అతను అన్ని మెట్లెక్కి అతిప్రయాసపడి వెళ్తున్నది కేవలం విజయకోసమేనని ఎందుకు అనుకోలేదు ? 60 కేజీల కాయం 24 మెట్లెక్కి నాలుగ్గజాలదూరం నడిచి, గదినిచేరి, తలుపులు తెరిచి, లైటువేసి. ఇంతాచేసి చూస్తే అతనిక్కావలిసిన వెలుగు కనిపించలేదు. ఆ వెలుగు కనిపించకపోవడంతో పాపం అతని 60 కేజీల కాయం 600 కేజీలై, నాలుగ్గజాల దూరం 40 గజాలై, 24 మెట్లు 240 మెట్లై నీరసుడై, నిస్సత్తువుడై దిగలేక దిగిన చలంని ఎంత కష్టపెట్టావు రంగంమామ్మా! చాలా చాలా అన్యాయం రంగంమామ్మా!

విదిగో చెలంబాబు నీవన్నదేటో నాకరదంకాడంనేదు. మీకు విజయమ్మగోరంటే ఎంత పేవోఁ ఎంతెంత అప్మానఁవో నాకెరికే. ఆయమ్మ లేకుంటే నీవొక కల్లుతాగిన కోతివని నాకెరికే. విజయమ్మేది అని నీవుకాదు నేను అడగాల! నాకు తెల్సినమటుకి నీవు సాయంకాలం అమ్మగోరిని మీ బండిమీదేసుకుని తోలుకుపోయావు. తిరిగి యిప్పుడు నీవొక్కడివే వచ్చినావు. ఎల్లినపుడు యిద్దరెల్లి ఒచ్చినపుడు ఒకడు రాడవేటని నేను అడగాల. నీవు సెప్పాల. కాన్నీవు సెప్పవు. ఎంచేత? నేను పనిమనిషిని పోణ్నాకుగాభరాయేసి అడగొచ్చు అమ్మేదని. కాని నేనడగలేను. ఎంచేత నేను పనిమనిషిని.

''మరామాట ముందెందుకు చెప్పలేదు'' అనేదానికి పై విధంగా జవాబు చెప్పలేదు రంగంమామ్మ.

''భోజనం పెట్టేయమంటారా బాబూ'' అని మాత్రం అంది. అదే ఆమె చేయగల్గేపని.

భోజనంమీద బుద్ధికాలేదు చలంకి. వద్దని చెప్పేడు.

విజయ ఇంతవరకూ ఎందుకు రాలేదు ?

ఆడది... వయసులోనున్న ఆడది... వంటరిగా... ఇంత రాతిరి!

అనుమానిస్తున్నాడా ?

ఛఛ. భయం. అంతే! అంతే!

వంటరిగావున్న ఆడదానిపై.. పేపర్లో ఎన్నో రకాల వార్తలు. పత్రికల్లో ఎన్నో కధలు, మరింకెన్నో నవల్లు.. ఎన్నో సిల్వర్‌జూబ్లీ సినిమాలు, బోల్డు బాక్సాఫీస్ హిట్‌లు !

ఆ వార్తలు రేడియోలో విన్నాడు పేపర్లు చూసేడు. ఆ కధలూ, నవల్లూ చదివేడు. ఆ సినిమాలు చాలా చాలా చూసేడు.

ఆయా సంఘటనలు గుర్తుకొచ్చి ఆ విధంగా తన విజయను వూహించుకోడం భయమేస్తోంది. మనసు రాకుంటోంది.

కింద ఎడమపక్కనున్న గదిలోకి వెళ్ళేడు.

మంచంపై బాబు నిద్రపోతున్నాడు. తన రక్తంలో రక్తం. అచ్చంగా ముమ్మూర్తులా తన పోలిక. తన వంశోద్ధారకుడు. తనని పున్నామ నరకం నుంచి రక్షించేవాడు... బాబుని చూడగానే మనసు కొంత ఉపశమనం పొందింది. రోగిని పరీక్షిస్తున్న డాక్టర్లా గాక ఆత్మీయంగా, అప్యాయంగా బాబు ముఖంలోకి చూసేడు.

ఫేనుగాలికి, బాబు జుత్తు నుదుటి మీద ఆడుకుంటోంది. బాబు నిద్దట్లో నవ్వుతున్నాడు. మృదువుగా బుగ్గలు నిమిరేడు. తన బాబంత అందమైన బాబు ఈ ప్రపంచంలో ఏ తండ్రికీ లభించి వుండడు.

ఆ మంచం మీద తన మూడేళ్ళ బాబేకాదు, అరవయ్యేళ్ళ తల్లి కూడా వుందన్న సంగతి అతను పట్టించుకోకపోవడం నిజంగా నిజం!

రంగంమామ్మని బాబు భోంచేసాడా లేదా అనడిగేడు.

రంగంమామ్మని మా అమ్మ భోంచేసిందా అని అడగలేదు.

మనిషి (మగే కావచ్చు, ఆడేకావచ్చు) బిడ్డల్ని చూసి స్పందించినట్టుగా తల్లిని చూసి స్పందించడం జరగదు. నిజానికి నవమాసాలు కని పెంచి పెద్దచేసే తల్లికి ఎంత కృతజ్ఞత తెల్పాలి? ఎంతెంత బాగా చూసుకోవాలి. ఒకరిపై తప్పక ఆధారపడే దుర్భరవార్ధక్యంలో నున్న తల్లిని ఎంత ప్రేమగా చూసుకోవాలి?

పిల్లల్ని ప్రేమగా చూసుకోడం, పెంచడం, ప్రకృతి సహజం, జంతు ధర్మం.

తల్లినీ, తండ్రినీ ప్రేమగా చూడ్డం ప్రకృతి సహజంకాదు. మానవ ధర్మం. మనిషి బాధ్యత. మనిషికీ, జంతువుకీ, అదే తేడా. అక్కడేతేడా.

అయితే మనిషి యిపుడు సుఖాలు, నాగరికతతోపాటు జంతువుకి దగ్గరవుతున్నాడు పూర్తిగా తల్లిదండ్రుల్ని, తేలిగ్గా భార్యనీ విస్మరించి విడిచిపెట్టేయగల పాశ్చాత్య నాగరికతగురించి మనం వింటున్నాం. రేపు మన దేశంలో కూడా అదే చూడబోతున్నాం.

మనకున్న ఆ మాత్రం విలువలూ వలువల్లా విడిచేస్తున్నాం.

ఎంతోమందిలానే చలం కూడా మామూలు మనిషి.

భార్యాబిడ్డల గురించి తప్ప తల్లి గురించి తనెక్కువ ఆలోచించలేడు అతని బతుక్కో అర్థం, సార్థకతా, గమ్యం, అనుభూతీ, ఆరాటం, భార్యాబిడ్డల కోసమే. అతని సంపద అతని సర్వస్వం అంతా అతని భార్యాబిడ్డలకే

తనకి బతుకునిచ్చింది ఆ తల్లేనని – ఆ తల్లేలేకుంటే, వున్నా తనని కనకుంటే అతనికి భార్యాబిడ్డలు ఎలావుండేవారని అతనెప్పుడూ అనుకోలేదు. తననింతవాడిని చేసిన తల్లి, భార్యాబిడ్డలంతపాటి చేయదా అని కూడా అతనికెప్పుడూ తోచలేదు

అలాని తల్లినెపుడూ అతను నిర్లక్ష్యం చేయలేదు.

అవ్మూ ఆరోగ్యం ఎలావుంది ! భోజనం చేసావా ? నిద్రపడుతోందా అనే పొడిపొడిమాటలు! ఆ మాటల్లో ఆత్మీయత వుందా, ఆప్యాయత వుందా అని తల్లి ఎప్పుడూ ఆలోచించలేదు ఆ మాత్రం పలకరింపు కోసమే పలవరిస్తుంది తల్లి కలవరిస్తుంది తల్లి.

ఆ తల్లి పేరు పార్వతమ్మ

పార్వతమ్మకి చిన్న కొడుకు చలం. పెద్దకొడుకు కృష్ణ ఇద్దరి కొడుకుల మధ్యగాని, ముందుగాని, వెనకగాని మరేకొడుకు కలగలేదు. కూతుళ్ళు అసలే కలగలేదు. చిత్రమేమిటంటే ఇద్దరి కొడుకుల మధ్య ఎడం పన్నెండేళ్ళు !

మరిక పిల్లలు పుట్టరేమో అని ఆమె, ఆమె భర్త, ఆమె బంధువర్గం, ఆ వూరి ప్రజలంతా అనేసుకున్న తర్వాత – చలం పుట్టి అందర్నీ ఆశ్చర్యపరచేడు.

అపుడాతల్లి చాలా అవమానాలపాలైంది. రెండో కొడుకు పుట్టేడు అనే సంతోషం కన్నా – పన్నెండేళ్ళ తర్వాత ఎలా పుట్టేడన్న భర్త అనుమానం పార్వతమ్మ బతుకుని నరకం చేసింది. అప్పట్నించీ ఆమెకి రంకులంజ అనే తిట్లు, సాణుగుడు, మక్కెలు విరిగిపోయేటట్లు తాపులు తన్నులు ! అతను చచ్చినంతవరకూ ఆమెను నరకయాతనకి గురిచేసి చంపేడు. ఆమెను సాధిస్తూనే చచ్చేడు.

పార్వతమ్మది మొదటినుంచీ మధ్య తరగతి రైతుకుటుంబం. పదహారు ఎకరాల పొలం వుండేది. భర్త దుర్వ్యసనాలకి పొలం పదహారల్లా పదయింది. చలం చదువుకి పదల్లా అయిదయింది. ఆ మిగిలిన అయిదెకరాలు పెద్దకొడుకు క్రిష్ణ వూళ్ళోనే వుండి వ్యవసాయం చేస్తున్నాడు ముగ్గురు ఆడపిల్లల్ని కని ఆ మట్టి సారంతోనే పెంచుతున్నాడు.

గోంగూర అప్పలస్వామంటే వాళ్ళ వూళ్ళో ఎంతోపేరు. అతడు లేని గొడవలేదు. అతనికి ఎవరూ ఎదురు చెప్పడానికి వీలులేదు. పరాయి ఆడవాళ్ళతో తిరిగేవాడు. తాగేవాడు. పెళ్ళాన్ని కొట్టేవాడు. తిట్టేవాడు.

పార్వతమ్మ గోంగూర అప్పలస్వామి ఇల్లాలు కావడానికే తను ఈ భూమ్మీద పుట్టినట్టు, అదో గొప్ప వరంగాను, పుణ్యఫలంగానూ, పూర్వజన్మ సుకృతంగానూ ఇప్పటికీ భావిస్తుంది.

పెనిమిటి గొప్పలూ, ఘనకార్యాలూ చెబుతుంది. ఆ పొగరుమోత్తనం, బడాయి, అల్లరీ అభినయించి చూపిస్తుంది. అతనంటే ఆడవాళ్ళు ఎంతెంత వెర్రి పడేవాళ్ళో! ఆ రసికత్వం గురించి, మగతనం గురించి గొప్పగా, సిగ్గుతోనూ, నవ్వుతూనూ చెబుతుంది. ఏ నేరం చేయకపోయినా ఆమెను ఎలా చితకబాదేవాడో అదికూడా చెబుతుంది – అంతే గొప్పగా.

ఈ సోది అంతా ఎవరితో! మనవడితోనూ, రంగంమామ్మతోను! విజయకూడా వినకపోదుగాని – ఆ నస భరించలేక నవ్వుతూ తప్పించుకుంటుంది!

మనవడు మాత్రం దొరికిపోయేననుకోడు. వాడు ఎంత చెప్పినా ఇంకా చెప్పమంటాడు. ఆ పసివాడికి అదేదో వినడమే సరదా!

పార్వతమ్మకి తను పుట్టి పెరిగిన ఆ గ్రామంలోనే వుండాలని, పెద్దకొడుకు దగ్గరే మనవరాళ్ళతో గడుపుతూవుండాలని తను స్పష్టంగా అనుకుందోలేదో గాని –

చిన్న కొడుకు పిలుపుపై పట్నంలో వుండక తప్పలేదు.

చిన్నకొడుకు తల్లంటే ప్రేమకారిపోయి పిలిచేయడంలేదని గ్రహించలేనంత తెలివి తక్కువదికాదు తల్లి.

కొడుకూ, కోడలూ ఇద్దరూ ఉద్యోగస్తులే.

ఇద్దరూ ఉద్యోగాలకిపోతే పిల్లాణ్ణి ఎవరు సాకుతారు ?

తను అందుకు అవసరం.

వాళ్ళ బిడ్డకి ఆమె ఆయా.

తర్వాత్తర్వాత ఆమె మనసు ఆ పల్లెటూరువైపు పరుగులెట్టకుండా నగర జీవితాన్నే, అక్కడ లభించే సుఖాన్నే కోరుకుంటోందని గ్రహించగల్గింది.

అంతేగాక పెద్ద కొడుక్కి మగసంతానం లేకపోడం, చిన్న కొడుక్కి మగపిల్లాడు కలగడం ఆమెకి తిరిగి తన భర్తే పుట్టినట్టు ఆనంద పడిపోయింది.

మనవడి రూపురేఖల్లోనూ చేష్టల్లోనూ, భర్తే కనిపిస్తాడు. ఆ మనవణ్ణి గోంగూర అప్పలస్వామీ అని పిలుస్తుంది.

బోసి బోసిపళ్ళ పార్వతమ్మ ఆ బోసిపళ్ళ బాబుని చూస్తూ నవ్వుతుంది. హాస్యాలాడుతుంది. తద్వార ఆమె ఒకరకమైన సుఖం, సంతోషం పొందగల్గుతోంది. ఆ వయసులో అంతకన్నా మరేముచ్చటాలేదామెకి.

కథ చెప్పకపోతే బాబు తంతాడు! తన్నించుకోడం ఆమెకి సరదా.

గోంగూర అప్పలస్వామి అని ఎగతాళిచేసి ఆ చిన్న పిల్లవాడితో తన్నులు తన్నించుకుంటుంది. వాడు కొడుతుంటే – మొగుడు తన్నిన తన్నులు గుర్తుకు తెచ్చుకొని మొగుడే తంతున్నట్టుగా మురిసిపోతుంది. చచ్చిపోయేను బాబోయ్, చంపేసాడు బాబోయ్ అని అభినయిస్తూ నవ్వుతూ, పడిపోతూ ఎంతో మహదానంద పడిపోతుంది పార్వతమ్మ.

అంత చిన్నపిల్లడుతో అత్తగారి ప్రవర్తన విజయ ఆమోదించ లేకపోయేది. ఏమంటే ఏం

బాధపడుతుందోనని భయం.

ఆమె అంత చిన్న బాబును పట్టుకొని మొగుడుగా అనుకోవడం, అనిపించుకోవడం పిలవడం తను పెళ్ళాంలా ప్రవర్తిండం, ముద్దులు..ఒక్కోసారి భరించలేక – పిల్లలతో అలా మాట్లాడగూడదనీ, అలా ప్రవర్తించగూడదనీ, నెమ్మదిగా మందలించక తప్పేది కాదు విజయకి.

ఆ తరంస్త్రీకి ఈతరం స్త్రీ ఏమిటన్నదీ అర్థం అయ్యేదికాదు. పిల్లడిపట్ల ఆమె ప్రవర్తన ఆమెకేమీ తప్పనిపించలేదు. పోనీ తనకి తెలియన్దేదో సత్యం కొంత, కోడలు మందలింపులో వుండే వుంటుందని కూడా ఆమెకి అనిపించలేదు. కాని ఆమె ముందు, కొడుకు ముందు నోరు జారడం మటుకు తగ్గించేసింది పార్వతమ్మ.

బాబుకి బారసాలనాడు పేరు పెట్టేరు

అప్పటికే బాబుకి ఏం పేరు పెట్టాలనేది చాలా వూహించేసి వున్నాడు చలం.

విజయ కడుపుతో నున్నపుడే ఆడపిల్ల పుడితే ఏం పేరు పెట్టాలో మగపిల్లడయితే ఏం పేరు పెట్టాలో అన్నదానిపై చలం పెద్ద రీసెర్చ్ చేసేడు. తెలుగు నవల్లన్నీ తిరగేశాడు – కొత్త కొత్త పేర్లు కోసం.

మన తెలుగు నవలా హీరో, హీరోయిన్లకి తెలుగు పేర్లు వుండవు. అప్పారావు, సుబ్బారావు చచ్చిపోయేరు. 'రావు'లకు కాలం చెల్లింది. రమేష్, సురేష్, సతీష్ లాంటి పేర్లు గూడా మూలపడిపోయేయి. బెంగాలీ పేర్లమీద మనకి ఆది నుంచీ మంచి మోజు! దేశంలో ఎక్కడ ఏ మూలనున్న ఏ సొగసైన పేరైనా విఘ్నేశ్వరుడికి ఏనుగు తలకాయలా అమాంతంగా, ఆనందంగా తగిలించేస్తాం – అంటుంది విజయ.

అవతలవాడి జాతినీ, కల్చరునీ, వాడి త్యాగనిరతినీ, వాడి దేశ భక్తినీ, వాడి కళారంగాల్నీ, వాడి రాజకీయరంగాల్నీ, వాడి కీర్తినీ, వాడి పేరునీ, వాడి రాష్ట్రాన్ని ఘనంగా కీర్తించే, ప్రేమించే, జైకొట్టే మన ఆంధ్రుణ్ణి చూసి జాతీయ సమైక్యతా అవార్డు పొందిన నిర్మాతని చూసినట్టు పొంగిపోవాలో –

లేక తన రాష్ట్రాన్ని తనే కించపరుచుకొని, తనని తనే నిందించుకొని, ఎదుటివాడి ముందు తను తక్కువ్వాడినని భ్రమసే కాంప్లెక్సుతో సుబ్బారావని పేరు పెట్టుకుంటే అమ్మో! ఇంకేమైనావుందా అని గుండెల్ని బాదేసుకొని, తెలుగు మాటాడితే – ఎక్కడ తెలుగు వెధవగా గుర్తించేసి తనని రెండవజాతి పౌరుడిగా జమకట్టేసి డిక్లేర్ చేసి పక్కకి తోసేస్తారో అని భయపడే పిరికితత్వానికి సిగ్గుపడాలో –

ఆలోచిస్తే, నవ్వు విచారం కలుగుతాయి విజయకి.

ఏవేవో తనెప్పుడూ వినని పేర్ల లిస్టు చలం పట్టుకొచ్చినపుడు నవ్వు వచ్చింది విజయకి.

చలం పూర్తిపేరు ఆమెకి తెల్సు. కాని ఆ పేరు అతనింకెవరికీ చెప్పడు. ఏ చిన్ననాటి స్నేహితుడో కనిపించి ఏరా సింహాచలం అని పిల్స్తే – అతని ముఖం వడిలిపోవడం తను చూసింది. అతనిపేరు సింహాచలం అని ఎప్పుడూ, ఎవరితోనూ చెప్పుకోడు. చలం కూడా కాదు. 'చెలం'

అంటాడు. ఆఫీసులో అందర్కీ అతను జి.యస్. చెలంగానే తెల్సు. గోంగూర సింహాచలం కావాలండీ అంటే అలాటివాళ్ళు ఇక్కడెవరూ లేరు వెళ్ళండి – అనేస్తారు.

విజయకీ తెలీదు అతని సర్టిఫికేటు చూసేవరకూ.

చెలంగా పిలిపించుకుంటున్న సింహాచలం కొడుక్కి మంచిపేరు సెలక్టు చేయడానికి బోల్డు పేర్లు – ఆమె ముందు పడేస్తే ఆమెకి సెలక్టు చేయడం చేతగాక ''మీ యిష్టం'' అనేసింది.

తనుపై విధంగా ఆలోచించినప్పటికీ కొడుకు పేరు ఏ అప్పారావో, ఏ అసిరయ్యో పెట్టడానికి ఆమె మనసే అంగీకరించదు అనేది స్పష్టం.

అంటే ఆమెలోనో, ఆమె ఆలోచనలోనో ఏదో తిరకాసు వున్నట్టేకదా!

''మీ ఇష్టమే నా యిష్టం'' అని విజయ అనడంతో చలం కాదు చెలం ఆలోచించి, ఆలోచించి చివరికి బాబు పేరు డిక్లేరు చేసేడు.

''సందీప్''

విజయకి కూడా ఆ పేరు బాగా నచ్చింది.

అయితే అదేంపేరో అవతల పార్వతమ్మకి అర్థంకాలేదు. పైగా ఆమె అభ్యంతరం కూడా లేవదీసింది.

మనవడికి గోంగూర అప్పలస్వామి పేరు పెట్టాలంది. అది మీ నాన్న పేరు. పెట్టక తప్పదని పోరింది. కంటతడి పెట్టుకుంది. సందీప్ గొందేపు అవేం పేర్లని చెంపలు నొక్కుకుంది. ఈ కాలం పిల్లలకి పెద్దలమాట ఖాతరు లేదని నిందించింది.

తల్లి ప్రయోగాలన్నిటినీ ఒక్క నవ్వుతో అవతలకి నెట్టేసాడు చెలం. 'అప్పలస్వామి' ని చెత్త బుట్టలో పడేశాడు చెలం.

తల్లి మనసు ఆక్రోశించింది. బాధగా మూలిగింది. కొడుకు ఎక్కడ కొడితే ఎక్కడపడతాడో తెలిసిందాయి గాబట్టి అస్త్రం తీసింది: కాసుకోమని విసిరింది.

దెబ్బకి పడిపోయేడు చెలం.

'అలాగేనమ్మా' అనక తప్పలేదు.

మనవడికి అప్పలస్వామి పేరు పెడతానని ఆ సిమ్మాద్రి అప్పన్నకి మొక్కుకున్నానని, సింహాచలం వెళ్ళాలనీ, తలనీలాలు బాబువే కాకుండా ఆమెవికూడా ఇవ్వడానికి దేవుడికి మాట ఇచ్చేశానని చెప్పింది.

చెప్పాచేయకుండా ఎవడు నిన్ను దేవుడికి మాట ఇవ్వమన్నాడు ? అని కేకలు వేయలేదు చెలం. పదేళ్ళ కిందటయితే కేకలేసివుండును చెలం. అప్పుడతను ప్రోగ్రసివ్. ఇపుడు కన్సర్వేటివ్.

అతని పెరిగిన వయసూ, పెరిగిన హోదా, జీతం, ఆ తరగతికి సంబంధించిన స్నేహితులూ వీటన్నిటినీ మించి అతనికి వస్తున్న అదనపు ఆదాయం అతన్నలా మార్చేయి. అతను మారిపోయాడు అనుకోడానికి ఇష్టపడడు. అప్పుడది కుర్రతనం. అర్థంలేని ఆవేశం, ఉడుకు రక్తం అంతే!

చెలంకిపుడు భగవంతుడంటే అపారమైన భక్తి. విపరీతమైన భయం.

మనవడికి పెనిమిటి పేరు పెట్టాలనే పట్టుదలతో ఒక అబద్ధం ఆడి తనుగుండు కూడా కొట్టించేసుకోడానికి సిద్ధపడిన పార్వతమ్మా భక్తురాలే.

ఇంటిపేరు గోంగూర.

చెలం పెట్టిన పేరు సందీప్.

పార్వతమ్మది అప్పలస్వామి.

చెలం ఆలోచించి – 'గోంగూర అప్పల సందీప్' అన్నాడు. తనకది ఎందుకో ఎబ్బెట్టుగానే తోచింది.

ఇంతలో ఏడుకొండలవాడు, నేను వున్నానని చెలంకి గుర్తు చేశాడు. ఫీల్డులోకి దిగేడు.

తన ఆరాధ్య దైవాన్ని, కళ్యాణ చక్రవర్తిని, శ్రీ శ్రీనివాస మూర్తిని, తిరుమలేశుని, తిరుపతినివాసి ఏడుకొండలవాణ్ణి, వేంకటేశ్వరుణ్ణి మరిచిపోవడమా! అపచారం ! అపచారం !!

ఏడుకొండలవాడు లేకుండా ఏది పూర్తి అవుతుంది ?

అంచేత –

పేరు కొద్దిగా పొడిగింప బడింది.

గోంగూర వెంకట అప్పల సందీప్.

రేపు స్కూల్లో జాయిన్ చేసేటప్పుడు ఈ పేరంతా అవసరం కావొచ్చు. చెలం, విజయ పిలిచేదిమటుకూ సందీప్ అనే.

పార్వతమ్మ అప్పలస్వామి పేరు తప్పించి మరే నామం జపించలేదు.

గోంగూరని 'జి' అక్షరంలోకి వెంకటేశ్వరుణ్ణి 'వి' అక్షరం లోకి, అప్పలస్వామిని 'ఎ' అక్షరంలోకి కుక్కేసి సందీప్‌ని బయటకి లాగేడు చెలం.

జి.వి.ఎ. సందీప్ గా మారింది పేరు.

చెలంలాంటి భక్తిపరులే దేవుళ్ళని సింగిల్ ఇంగ్లీషు అక్షరంలోకి సర్దిపెట్టేసి నాగరికత యిచ్చిన షోకు పేర్లు పెడుతున్నారంటే – ఇక దేవుళ్లు సింగిల్ లెటరు వెనక ఇంకెంత కాలముంటారో!

మంచం మీద నిద్రిస్తున్న ఆ మూడేళ్ళ కాయం ముప్పయ్యేళ్ళ కాయాన్ని మాగ్నెట్‌లా ముందుకు లాగింది.

వంగి సందీప్‌ని ముద్దు పెట్టుకున్నాడు చెలం – నుదుటిమీద.

ఆ ముద్దు చేసిన చప్పుడికి కోడికునుకుతీస్తున్న, పార్వతమ్మ లేచి కూర్చుంది.

తల్లికి నిద్రాభంగం చేసినట్టుగా అతనికి తట్టలేదు.

''అమ్మా ! విజయ ఇంకా రాలేదా ?'' అనడిగేడు.

వాడికిపుడు పెళ్ళాం కన్పించక పోవటంతో తల్లి కన్పించిందన్నమాట.

''అదేంటి నాన్నా...నీవు, కోడలు సాయింత్రం కలిసే వెళ్ళారు గదమ్మా.. కలిసిరాలేదా''

తల్లి ఎంతో నమ్రతగా నెమ్మదిగా అన్నప్పటికీ చెలం చిరాకుపడ్డాడు.

''నేనేం ఆడుకు తిరగడం లేదమ్మా. వెళ్ళడం ఇద్దరం కలిసే మారేజ్‌పార్టీకి వెళ్ళాం. అర్జెంటు పనొకటి నాకు తగిలింది. ఏ బస్సు లోనో, ఆటోలోనో విజయని ఇంటికొచ్చేయమని చెప్పాను. అప్పుడు టైము, ఆరు, ఆరున్నర, ఈపాటికి వచ్చేయాలికద''

''వచ్చేయాలికదా'' అన్నమాటకి వచ్చేయాలన్నట్టు తల ఆడించింది తల్లి.

''దాన్నలా వదిలేసి కాకుండా - ఇంటిదగ్గర దించేసి వెళ్ళాల్సింది'' అందామనుకుందిగాని ధైర్యం చాల్లేదు.

''ఆటోలో బయల్దేరే వుంటుంది. కాని ఆటోకి ఏదైనా ప్రమాదం... లేదా ఆటో డ్రైవరు దురాగతం..'' పార్వతమ్మ అనలేదు. అవి ఆమె గుండెల్లో బీజమెత్తిన శంకలు.

''ఫర్లేదు - వచ్చేస్తాది బాబు'' ధైర్యం చెప్పింది తల్లి.

''బాబూ - పారిటీకాడకి తమరోపాలి స్కూటర్ మీదెళ్ళి చూడగూడదూ'' అంది రంగంమామ్మ.

పనిమనిషి చెబితే గాని తనకా విషయం తట్టనందుకు విసుక్కున్నాడు.

''ఉద్యోగం చేస్తున్న ఆడది. పైగా పెద్దకబుర్లు చెబుతుంది. ఆ మాత్రం రాలేదా'' అని తాను గొణుకున్నట్టుగా అన్నాడు.

''ఏం చెబుతాంబాబు - మాయదారిరోజులు'' అంది రంగంమామ్మ - '' ఆ భగమంతుడిక్కూడా కళ్ళు గప్పేసి గోరాలు, నేరాలు, దురమారగాలు జరిపేస్తున్నారు. ''

విజయ గురించి అక్కడెక్కువగా వాళ్ళతో డిస్కస్ చేయబుద్ధి కాలేదు చెలంకి. వెంటనే స్కూటర్‌పై మారేజ్ రిసెప్షన్ జరిగిన అప్సర హోటల్‌కి వెళ్తే బాగుణ్ణు అనుకున్నాడు. అది పనిమనిషి సలహాకాకుండా తనకి తట్టిందే అయినపక్షంలో ఈపాటికి స్కూటర్ అప్సరవైపు పరుగులెడుతూ వుండేది. అదీగాక దూరంకూడాను.

పార్టీలో బహుశా రాజశేఖర్ విజయని బలవంతంగా వుంచేసి వుండాలి - రిసెప్షన్ ముగిసేక కారులో డ్రాప్ చేస్తానంటూ.

తను అనవసరంగా ఎక్కువ వర్రీ అవుతున్నాడు - విజయ వచ్చేస్తుంది, వచ్చేస్తుంది. తప్పక వచ్చేస్తుంది - ఇదిగో యీ నిమిషంలోనో, మరునిమిషంలోనో - అనుకుంటుండగానే నిమిషాలమీద నిమిషాలు దొర్లేస్తున్నాయి.

విజయ జాడేమీ కనిపించడంలేదు.

అక్కణ్ణించి ఏ ఫ్రెండో తగిలి బలవంతంచేస్తే ఫస్టుషో సినిమాకి వెళ్ళిందా ? వెళ్తే బలవంతం చేసిన ఫ్రెండు ఆడా ! మగా !

విజయను తను అనుమానిస్తున్నాడా! ఆమె ఆడా, మగా అనకుండా స్నేహితులందరి

తోను క్లోజ్‌గా మూవ్ అయ్యేవేచరు. తను వాళ్ళింటి కెళ్తుంది. వాళ్ళు తనింటికొస్తారు. తనులేకుండా ఆమె సింగల్‌గా వెళ్ళిన సందర్భాలున్నాయి.

తను ఒక్కర్తే వెళ్ళిరావడం కొత్తకాదు. నో ప్రాబ్లెమ్ – ఎంత అనుకున్నా గుండె ఎందుకో నొక్కేసినట్టయిపోతోంది చెలంకి.

హాలులో సోఫామీద కూలబడ్డాడు. పేపరు తీసి అటూ, ఇటూ తిరగేసాడు. ఏ పేజీ ఎందుకుతిప్పుతున్నాడో, ఏవిఁటి చదువుతున్నాడో అతనికే తెలీడం లేదు.

టెన్షను

అస్థిమితంగా కూర్చున్న చోటే అటూ, ఇటూ కదిలేడు. పేపరు పడేసి వారపత్రిక తీసేడు.

రోడ్డుపై ఏ స్కూటర్ చప్పుడయినా, ఏ ఆటో శబ్దమయినా – అందులో విజయ వస్తున్నట్టు – ఆ వెహికల్ ఇంటిముందు ఏ క్షణంలోనో ఆగబోతున్నట్టు భ్రమ.

పత్రిక గిరాటువేసి, మేడ మెట్లెక్కి బెడ్‌రూమ్‌కి వెళ్ళేడు. మంచం మీద అడ్డంగా వెల్లకిలా పడుకున్నాడు. కుడిమోచేయి అతని నుదుటి మీద రెస్టయింది.

ట్యూబ్‌లైటు వెలుగు కళ్ళలోపడి చికాకు కలిగిస్తోంది. బెడ్ దగ్గర అమర్చబడిన స్విచ్‌ను నొక్కేడు.

గది చీకటిలో కలిసిపోయింది.

మనిషి అటూ ఇటూ ఎంతసేపో దొర్లేడు.

మెట్లమీద చప్పుడు.

గభాల్న లేచి, గదిలోంచి బయటకి వచ్చేడు.

★★★

మెట్లెక్కుతున్నది సందీప్ – తన కొడుకు.

కింద మెట్టుదగ్గర పార్వతమ్మ వున్నది.

''నిద్దట్లో అమ్మకావాలని గొడవ..ఎంత బుజ్జగించినా వినడం లేదు'' అందామె.

చెలం అప్పటికే నాలుగైదు మెట్లుదిగి సందీప్‌ని అందుకున్నాడు. ఎత్తుకున్నాడు.

మమ్మీ కావాలని మారాం చేస్తున్న కొడుకుని మాయపుచ్చి, బుజ్జగించి జో కొడుతూ నిద్రలోకి దించుతున్నాడు.

అలా సందీప్‌ని ఎత్తుకునే బాల్కనీ వద్దకి వెళ్ళేడు. గాలిచల్లగా, హాయిగా వీస్తోంది గాని అతని శరీరాన్ని ఆహ్లాదపరచడంలేదు.

బాల్కానీ నుంచి చూస్తుంటే నగరం చాలావరకు స్పష్టంగా కలర్ ఫొటో తీసినట్టు కనిపిస్తోంది.

నగరం శోభ వెన్నెల రాత్రుల్లో ఎలా వుంటుందో చూడాలనే కుతూహలంతో తారలు కిందికి దిగినట్టు, దీపాలు నిండుగా, సందడిగా పరుచుకొని ఉన్నాయి. కిందకి దిగిన అందాలతారలను అల్లరి పెట్టే ఆకతాయి రౌడీలా నల్లగా, భీకరంగా డాల్ఫిన్ కొండ. ఆ

కొండరౌడీ దొరికిన తార కల్లా కన్ను కొడుతున్నట్టు – కొండపై లైట్‌హౌస్.

ఎక్కడో దూరంగా వున్న రోడ్డు – దానిపై సాగే వాహనాలు కన్పించడంలేదు. ఆ వాహనాల లైట్లుమాత్రం మిణుకుమిణుకుమని వెలుగుతూ కనిపిస్తున్నాయి. నదిలో నూనెదీపాల్లా జారుకుంటూ పోతున్నాయి. పోయి పోయి ఆ మలువులో మాయమై పోతున్నాయి.

ఇంటిముందు ఫార్టీఫీట్ రోడ్డు పొడవునా వరుసగావున్న స్ట్రీటు లైట్లు నిస్సహాయలైన, అబలలైన ఆడపిల్లల కళ్ళులా బెదురు బెదురుగా, బేలబేలగా, నిస్తేజంగా మైల్డుగా వెలుగుతూ వణుకుతున్నాయి.

ఆ రోడ్డుపై 15 గజాల దూరం వరకూ సాగి జంక్షన్‌లో మిగతా మూడురోడ్లతో ముచ్చటిస్తోంది. ఆ జంక్షన్‌లో ఓ కిళ్ళీబడ్డీ తప్ప మిగతా షాపులన్నీ మూయబడి వున్నాయి.

రోడ్డుపై జనం అలికిడి అంతగా లేదుగాని – అల్లంత దూరం నించి నడిచివస్తున్న ఆడమనిషిని రిక్కించి రిక్కించి చూసేడు చెలం.

అలా అలా చూస్తూంటే – సందేహం లేదు. ఆమె విజయే అనుకున్నాడు

అతని దృష్టికి ఆమె ఇంకాస్త ముందుకొచ్చింది. స్ట్రీటులైటు వెలుగు నడుస్తున్న ఆమెపై ఒక క్షణం ఫోకస్‌లా పడింది. క్షణం వెలుగుచాలు, తన విజయని గుర్తుపట్టడానికి.

ఆమె విజయకాదు.

వస్తున్న వెహికిల్సు ఇక్కడిదాకా రాకుండా – ఆశమాత్రమే పెట్టి కుడికో, ఎడమకో తిరిగిపోయి దాటేస్తున్నాయి. యింటిముందు రోడ్డుకి ఏ వాహనం వచ్చినా ఇంటిముందు ఆగకుండా దౌడు తీస్తున్నది.

బాబుని అలా ఎత్తుకుని నించోడం చేత చెలం వెన్ను లాగేస్తోంది. చేయి పీకేస్తోంది.

టైము చూసేడు.

పావుతక్కువ పదకొండు.

గుండెలు దడదడమన్నాయి.

విజయ వస్తోందన్న నమ్మకం పూర్తిగా సన్నగిల్లిపోతోంది.

మరిక్కడ గోళ్ళు గిల్లుకు కూర్చుంటే లాభం లేదు.

వెళ్ళాలి. వెదకాలి.

సందీప్ నిద్రపోయేడు.

వాడిని పార్వతమ్మకి అప్పజెప్పి బయల్దేరాలని నిశ్చయించుకొని వెనుతిరిగేడు.

తిరుగుతూ – అటు రోడ్డువైపు చూసేడు.

ఇంటిముందు ఆటో ఆగివుంది.

చెలం గుండెలు ఘణఘణ మ్రోగేయి.

నీరసం అంతా ఎగిరిపోయి ఎక్కడలేని సత్తువ శరీరంలోకి ప్రవేశించింది.

చెలం గబగబా మెట్లు దిగేడు. బాబుని అలా ఎత్తుకునే గేటు దగ్గరికి పరిగెత్తేడు.

ఆటోవచ్చిందేగాని అందులోంచి దిగింది విజయకాదు. ఎదురింటి కొచ్చిన ఎవరో చుట్టాలు! ఆటో వెళ్ళిపోయింది.

చెలంలో ఉరకలేసిన ఉత్సాహమంతా చప్పున చల్లబడిపోయింది. మనిషి పూర్తిగా నీరుకారిపోయేడు.

చెలం వెనుతిరిగేడు.

ఎదురుగా తల్లి, రంగంమామ్మ.

వాళ్ళునుదాటి ఇంట్లోకి వెళ్ళలేకపోయేడు. ఒక గంట క్రితం వాళ్ళిద్దరిమధ్య కాకుండా, కావాలని దూరంగా మేడమీదికి వెళ్ళిపోయిన చెలం వాళ్ళ దగ్గర ఇపుడు ఒక చంటిపిల్లాడిలా నిలుచుండిపోయేడు.

వాళ్ళు తనతోబాటే, లేక తనకంటే ఎక్కువో భయాందోళనలు చెందుతున్నట్టు గ్రహించగల్గేడు.

''అలా రోడ్డుకి వెళ్ళి చూడుబాబు '' అంది రంగంమామ్మ మరోసారి.

ఈసారి ''నీవు చెప్పేదేవిఁటి నాకు' అని అనుకోలేదు. ఇపుడతను ఎవరేం చెప్పినా వినేలావున్నాడు. ఏం చేయమన్నా చేసే స్థితిలో వున్నాడు.

అతని మిత్రుడు రవి గుర్తుకువచ్చేడు.

రవి తనదగ్గరుంటే బావుణ్ణు. కొంత ధైర్యం చెప్పేవాడు. ఏం చేయాలో సలహా ఇచ్చేవాడు.

చెలం ఏ మాత్రం ఆలస్యం చేయలేదు.

సందీప్‌ని తల్లికిచ్చి – స్కూటర్ దగ్గరికెళ్ళేడు.

కీచైను ఎక్కడో మరిచిపోయేడు.

లోనకి పరుగున వెళ్ళేడు. హాలులో టీపాయ్‌మీద, సోఫామీద వెదికేడు. గబగబా 24 మెట్లనీ 12 అంగల్లో ఎక్కి బెడ్‌రూములోకి వెళ్ళేడు.

హమ్మయ్య! మంచంమీద వుంది కీచైను.

రెండునిమిషాల్లో – స్కూటర్‌గేటుదాటి, రోడ్డుచేరి, జంక్షన్‌లో మాయమయ్యింది.

గేటుదగ్గర అలా నించుండిపోయిన పార్వతమ్మ, రంగం మామ్మలకు, అప్పుడు టైము సరిగ్గా పదకొండు గంటలకు అయిదు నిముషాలు తక్కువ వుందని తెలీదు.

## 2

రవి ఇంటికి చేరేటప్పటికి రాత్రి తొమ్మిదిన్నర.

సముద్రపుగాలులు చల్లగా వీస్తున్నాయి. ఎండాకాలం కావడం చేత ఇళ్ళల్లో మంచాలు వీధుల్లోకి రోడ్డుకడ్డంగా ఊడ్చబడ్డాయి. వీధిలో పడుకున్నవారిని ఏమాత్రం డిస్టర్బు చేయకూడదని వీధిలైట్లన్నీ పడుకున్నాయి.

ఇంకా అందరూ పడుకున్నట్టులేదు. తినేవాళ్ళు తింటున్నారు. తినేసినవాళ్ళు త్రేన్పుతూ మంచాలపై విశ్రాంతి తీసుకుంటున్నారు. నిద్రపోయేవాళ్ళు పోతున్నారు.

రవి ఇంటికి చేరేటప్పుడు జనమంతా ఏ స్థితిలో వున్నారో గమనిస్తూనే వచ్చేడు. వీధిలో అందరూ ఒళ్లెరగకుండా నిద్రపోవాలని కోరుకున్నాడు. ఏమంటే ఒక స్త్రీ అతనికి శారీరక సుఖం ఇవ్వబోతోంది ఈ రోజు – మరికాసేపటిలో

అంచేత జనులారా! మహాజనులారా పడుకోండి. పడుకోండి. ఇంకాసేపటిలో ఒక ఆడశరీరం ఈ గదికి రాబోడం గమనించబోకండి. గదిలో నగ్నంగా చుట్టుకుపోయిన మమ్మల్ని తలుపులు దబదబా బాది రసభంగం చేయకండి. పడుకోండి పడుకోండి పడుకోండి. మమ్మల్ని బైటకీడ్చేసి అవమానం చేయకండి. తిట్టకండి. తిట్టకండి. కొట్టకండి. జనులారా పడుకోండి పడుకోండి. నా పరువు కాపాడండి. ఆమె పరువాన్ని పొందనీయండి. పొంది నా కరువు కసిదీరా తీరనీయండి. అంచేత జనులారా ప్రజలారా పడుకోండి. పడుకోండి.

తలుపులు తీసాడు రవి

తలుపులు వేసివున్నచో రవి వున్నట్టుగాను, మూసివున్నచో రవి లేన్నట్టుగాను అతని స్నేహితులకు లెక్క.

ఇంట్లో వుండేది అతనొక్కడే. అంతమాత్రాన అతను బ్రహ్మచారి కాదు.

ఇంటికి రాగానే అతనిక్కావల్సిందేదో ఇచ్చేయగల అర్ధాంగి వుంది.

ఇంటికి రాగానే డాడీ అని కాళ్ళకి చుట్టే అయిదేళ్ళ కూతురుంది. మూడేళ్ళ కొడుకున్నాడు

ఆ స్త్రీయు - ఆ పిల్లలు - ఇపుడక్కడలేరు. అతనొక్కడే వున్నాడు.

ఎప్పుడూ ఒక్కడే వుంటాడు. అప్పుడప్పుడు వాళ్ళొస్తారు. ఎప్పుడో ఒకప్పుడు అతను వాళ్ళ దగ్గిరికి వెళ్తాడు.

అతను వుంటున్నది వైజాగు. పెళ్లాం పిల్లలు హైద్రాబాదు.

అతనిది ఉద్యోగం. ఆమెది ఉద్యోగం.

అతని జీతం పదహారువందలు.

ఆమె జీతం పదివందలు.

భర్తకి భార్య చెందకుండా, భార్యకి భర్త చెంతలేకుండా ఏడిపించే పవరుంది – ఆ వందల వందల రూపాయలకి.

ఆమె అతనికి మామూలు దూరంలో కాదు – వెయ్యి రూపాయల దూరంలో ఉన్నది.

తలుపులు తెరిచి గదిలోకి రాగానే అదో కంపు కొట్టింది రవికి. ఆ కంపు కిటికీ, తలుపులు మూసి గదిని బంధించేయడంవల్లని అతనికి తెల్సు.

రోజూ ఆ కంపు తప్పదు మరి.

కిటికీలు తెరిచేడు.

గాలి చల్లగా తగిలింది.

గది కంగాళీగా వుంది.

టేబుల్‌పై పుస్తకాలు చిందరవందరగా వున్నాయి

మంచం మీద పక్క నలిగివుంది. దిండు నేలనిపడివుంది.

ఉదయం అతను డ్యూటీకెళ్ళేముందు విడిచిన పంచె అలానే నేలమీద వుంది

పుస్తకాలుండే టేబులుపైనే బ్రెష్షు, టూత్‌పేస్టూ, సబ్బూ, రేజరూ స్విస్‌బ్లేడు పాకిట్, క్రీమ్, కొబ్బరి నూనె సీసా, దువ్వెనా, పౌడరుడబ్బా చిన్న అద్దం పడివున్నాయి

రెండు కుర్చీలు, ఒక బల్ల, బట్టలు వేలాడుతున్న హేంగరూ, 'వంటిమీద బట్ట వుందోలేదో చెప్పు చూద్దాం' అంటూ కేలండర్ లోంచి ప్రశ్నిస్తున్నట్టున్న సినీతార.

ఇంకేముంటాయి ఆ గదిలో

ఆ గదినానుకుని చిన్న వంటగది చిన్న స్టవ్వు కొంత వంట సామగ్రి వున్నాయి అవి వుండాల్సిన చోటులో వున్నట్టు లేవు.

వంటగది ఎదురుగా చిన్న కొట్టు గది. అందులో భగవంతుణ్ణి బంధించేసాడు. భార్య వచ్చినపుడు అక్కడ ధూపదీప నైవేద్యాలు.

మనిషి ఏ మాత్రం అజాగర్తగా వున్నా గోడలు రాసుకొని చర్మం చీలిపోటానికి ఎక్కువ అవకాశమున్న ఇరుకు బాత్రూమ్. అలాంటిదే ఆ పక్కన సెప్టిక్ లెట్రిన్.

ఇంటికి ఎడమవైపు పందుల దొడ్లు, వెనక పశువులపాక, కుడిపక్క కుళ్ళుకాలవ. చుట్టుపక్కల చాలామంది అలగాజనం.

ఏదో మంచి లొకాలిటీలో ఒక మంచి యిల్లు తీసుకుంటే బాగుంటుందని అతని మిత్రులు అన్నారు. అతనూ అనుకున్నాడు కాని అద్దె అద్దంలోంచి కనబడి అతన్ని అక్కడే ఆపేస్తోంది.

అతను ఆ ఇంటికి 250 రూ. కడుతున్నాడిపుడు. ఆ అద్దెకి అతను కోరుకున్న ఏరియాలో కోరుకున్న ఇల్లు కాకపోయినా చిన్న గది గూడా రాదు. నిజానికి ఆ అద్దెను దాటి ముందుకు వెళ్లాలని లేదు అతనికి.

రవి యింట్లోకి రాగానే ముందుగా చేసిన పని – పెరటి తలుపు తీయడం!

తలుపు తీసి – అతనికి సుఖాన్నివ్వబోయే స్త్రీ అక్కడే గోడపక్క సిగ్గుతో నక్కివుందేమో అని అటూ యిటూ చూసేడు.

లేదామె.

అతనీరోజెందుకో చేయరానితప్పు చేయబోతున్నట్టు – అదోలా వున్నాడు. ఇన్నాళ్ళూ తను ఎలా వుంటో వచ్చాడో – అలానే ముందు ముందుకీ వుండాలనీ వుంది. ఆమె కావాలనీ వుంది.

ఆమె వస్తానందిగాని వచ్చేదాకా నమ్మకంలేదు.

అసలు ఆమె రాకపోతే బాగుంటుందనిపిస్తోందిగాని అతని శరీరం అతనితో సహకరించ డానికి నిరాకరిస్తోంది.

పెరటితలుపులు దగ్గరకు చేరవేశాడు గెడవేయలేదు.

అతని వళ్ళంతా చెమట చెమటగా చికాగ్గా వుంది.

నాలుగుచెంబులు వంపుకొని స్నానం చేశాడు.

కొంత రిలీఫ్‌గా వుంది.

''రండి భోజనం వడ్డించాను'' అని అర్ధాంగి పిలిచి రెండు కూరలూ, పచ్చడీ, సాంబారు వేడివేడి అన్నంతో ముందు పరిచినంత తేలిక గాదు అతనికి ఆకలివేయగానే తిండి దొరకడం!

వంటగదిలోకి వెళ్ళేడు.

ఉదయమే రెండుపూటలకి వండేసాడు. అన్నం, సాంబారు. జాడీలో పాత చింతకాయ పచ్చడి!

గబగబా వడ్డించుకున్నాడు – కంచం కడిగి. అన్నం నీరు పట్టింది. సాంబారు చెడింది.

ఏడుపొచ్చింది రవికి.

అతను ఎదురుచూస్తున్న స్త్రీ అప్పుడే వస్తే –

''తల్లీ! నీ ఒళ్ళుకోదండం. అదిగో ఆ స్టౌ వెలిగించి వంటచెయ్యి. నా కడుపు నింపు. చచ్చి నీ కడుపున పుడతా '' అనేయగలడు రవి.

కంచం ముందునుంచి భారంగా, దుఃఖంగా లేచేడు.

బట్టలు వేసుకొని హోటల్‌కి వెళ్లాలనిపించలేదు. ఇంతరాత్రప్పుడు ఇంకా హోటల్సు తెరిచివుంటాయని నమ్మకంలేదు. దానికైనా చాలా దూరం నడవాలి.

ఆకలి అతన్ని వెంటనే ఏదో ఏదో చేసినన్ను చల్లార్చు. లేకుంటే నిన్ను చంపేస్తానంది.

ఏ మాత్రం ఆలస్యం చేయకుండా లేచి రెండు గుడ్లు తీసి ఆమ్లెట్లు వేసేడు.

ఆమ్లెట్లు వేయగానే అన్నం తినాలనిపించలేదు. అమృతంతాగాలనిపించింది.

బీరువా తీసేడు.

రమ్ బాటిల్ రారమ్మని పిలిచింది. తీసేస్కోమంది. కమాన్ రవీ కమాన్ అంది.

బాటిల్ అందుకున్నాడు.

రవి రోజూ తాగడు. తాగాలనిపించినపుడే తాగుతాడు.

కాని ఈ మధ్య ఎందుకో మనసు అటువైపు లాగేస్తోంది ప్రతిరోజూ!

రవి మొదట్లో బుడ్డికి చాలా దూరం. అతని మిత్రులందరూ బుడ్డిగాళ్ళు.

ఆ బుడ్డిగాళ్ళకి వాళ్ళ వాళ్ళ కొంపల్లో తాగే ధైర్యాల్లేవు. పెళ్లాలు ఒప్పుకోరు. మందుని మంచినీళ్ళలా గడగడ తాగేయగలరుగాని బార్‌లకి వెళ్ళి డబ్బుని మంచినీళ్ళలా వెదజల్లడానికి మనసూ ఒప్పదు, అంత మనీ వుండదు!

అంచేత అతని మిత్రులందరికీ ఆ యిల్లు ఖరీదులేని బార్!

మరిక దేనిదేన్కైనా అలవాటు లేకపోతే సరే తప్పుకో, తప్పుకో అంటారు మందుకి 'సారీరా' అంటే మాత్రం మూతిమీద తంతాం అంటారు. కనీసం ఓ పెగ్ తీసుకొనయినా

కంపెనీ ఇమ్మంటారు. అక్కడే మొదలయింది రవి మందుకొట్టడం.

ఎంతలేదన్నా, ఎంతకాదన్నా వారానికి రెండు మూడుసార్లుంటాయి మందు పార్టీలు ఆయింట్లో. ఫుల్‌గా పట్టిస్తాడు రవి.

ఆ రవే పెళ్ళాం సుజాత వున్నన్నాళ్ళు మందుతాగడు. సుజాత వుంటే అతనికి మందు అక్కరలేదు. మత్తునీ, సుఖాన్నీ ఆమె ఇవ్వగలదని అతనికి తెల్సు. అంతే తప్ప ఆమెకి భయపడికాదు. దేనికీ ఆమె భయపెట్టదు. అభ్యంతరం చెప్పదు.

సుజాత లేని లోటును రమ్ముతో కొంత తీర్చుకుంటున్నాడు.

గ్లాసులోకి రమ్ము వెళ్ళింది. కొంత నీరు వెళ్ళింది. ఆ ద్రవం గొంతులోకి వెళ్ళింది. గుండెల్లో మండింది.

గ్లాసు ఖాలీ అయింది.

ఆమ్లెట్ ఒకటి ఎగిరిపోయింది.

కిక్కు ఇవ్వలేదు మందు.

మరో గ్లాసు.

మిగిలిన ఆమ్లెట్.

బాగుందిపుడు.

మూతి తుడుచుకుంటూ లేచేడు.

నిమిషానికి ఇరవైసార్లు అతని చూపులు పెరటి తలుపుమీదకి మళ్ళుతున్నాయి.

రెండునిమిషాల సుఖానికి ఎన్ని నిమిషాలు ఎన్నెన్ని గంటలు ఎదురుచూడాలి ?

అతని ఒళ్ళు వేడి వేడి సెగలు కక్కుతోంది. జ్వరం వచ్చినట్టు ఒళ్ళు జోగిపోతోంది.

ఆ స్థితిలో కూడా అతను చేయబోతున్నది తప్పని మనసు హెచ్చరిస్తోంది ఒకవైపు.

మందువలె, సెక్సు బలహీనతల జాబితాలోకి రాదు. ఆరోగ్యవంతమైన శరీరానికి సెక్సు అత్యంత అవసరం. మందు మనిషి సృష్టి, సెక్సు ప్రకృతి సృష్టి – తనని సమర్థించుకున్నాడు రవి.

రవికి సుజాతే వుంటే పెరటి చూపులు చూడడు. దొడ్డిదారిలో వెళ్లడు. ఆ సంగతి అతని ఆత్మకి తెల్సు. శరీరానికి తెల్సు.

ఆకలి అంతగాలేదుగాని, తినకపోతే తాగింది కడుపులో తిప్పి అతన్ని ఎంతగా గుంజేసి ఎంతగా దెబ్బతినిపిస్తుందో బాగా తెల్సు. ఏదో ఒకటి ఎలాగోలా తినివేయడం మంచిదనుకున్నాడు. కొంత అన్నం, ఆవకాయ తోను, కొంత పెరుగువేసుకొని బలవతంగా నాలుగు ముద్దలు మింగేడు.

చేతులు కడుక్కుని పెరటి తలుపు తెరచిచూసేడు.

ఆమె జాడలేదు.

ఆమె వస్తుంది, వస్తుంది తప్పక వస్తుందని నమ్మకం.

ఆమె రావడం ఎవరైనా చూస్తారేమో అని భయం.

టైము చూసేడు.

పదిన్నర.

ఆమె పదిగంటలకే వస్తానంది.

ఎంత వస్తానన్నా, మాట యిచ్చినా అందరికళ్ళు కప్పిరావొద్దూ!

పెరటి తలుపులు బారుగా తెరచివుంచేడు.

వంటగదిలో లైటు ఆర్పి మంచం మీద నడుం వాల్చేడు.

పుస్తకం తిరగవేశాడు మెదడు పెరటి తలుపు దగ్గర పెట్టేసి వచ్చాడు. బుర్ర పన్చేయడంలేదు.

మంచం మీద పడుకున్న రవికి పెరటితలుపులు కన్పించడంలేదు. కన్పించేటట్టుగా మంచం కొద్దిగా ముందుకు లాగేడు.

టేప్ రికార్డరూ, ఓ నాలుగు కేసెట్లు, బీరువా తెరచి తీసేడు. మంచం మీదకి చేరేడు.

కాసేపట్లో చిట్టిబాబు వీణా వాయిద్యం మంద్రమంద్రంగా గదంతా అలుముకుంది.

రవిని తీయని సుమధుర లోకాలికి తీసుకుపోతోంది.

ఆ తన్మయత్వంతో కళ్ళు మూతలుపడ్డాయి.

పెరటి తలుపుసంగతి మర్చిపోయేడు.

అంతలో. –

ఆ సంగీతం చేవులు మూసేసినట్టు సడన్‌గా ఆగిపోయింది. అయితే రవి సుమధుర లోకాలనుంచి కిందకి పడిపోలేదు. అక్కణ్ణించే స్వర్గంలోకి, వెన్నెల వీధుల్లోకి, చుక్కల్లోకి, వెండి మబ్బుల మీదకి. వెళ్ళి విహరించేడు.

చిట్టిబాబు సంగీతం కట్ అయి తీయని పాట వచ్చింది. అయిదేళ్ళ అతనికూతురు పాడిన కాన్వెంటు ఇంగ్లీషుపాట అది.

పాట అయిపోగానే పాడమ్మా పాడు మరోపాట పాడు. ఎంకరేజ్ చేస్తూ రవి గొంతు.

అక్క పాడుతుంటే నేనూ పాడుతానని మూడేళ్ళ కొడుకు మారాం.

అక్క పాడేస్తుంటే వాడికీ పాడేయాలనిపించింది ఏం పాడుతాడు? యింగ్లీషు అక్షరాలు ఈ మధ్య నేర్చుకుంటున్నాడు. పాట అదేగాబోలనుకొని ఏబీసీడీలు చదవడం మొదలెట్టేడు.

కేసెట్ నిండా నవ్వుల పువ్వులు. సుజాత ఎంత సేపో నవ్వింది. సుజాత నవ్వే ఒక పాటలా వుంది.

''సుజీ ! నీవు కూడా పాడొకపాట'' – రవి.

''అవును. మమ్మీ పాడాలని'' పిల్లలిద్దరి గోల.

సుజాత 'నాకు పాడ్డంరాదు మొర్రో' అని గోల.

లేదు. పాడాలి, పాడాలి – పిల్లతో బాటు రవి గోల.

పాడాలని ప్రయత్నించి పాడలేక సుజాత పారిపోవడం, అంతా పకపకా నవ్వడం రికార్డయింది అందులో.

వారంకి రెండు మూడు రోజులయినా ఆ కేసెట్ వేసుకొని ఆ దృశ్యంలో లీనమవడం అతనికి యిష్టం అనేకన్నా – ఆ స్థితిలో వున్న అతనికి అది ఒకే ఒక అవకాశం. పెద్ద రిలీఫ్.

మధురస్మృతులూ, తీయని జ్ఞాపకాలు మనసుని అలరిస్తాయి. ఆహ్లాదపరుస్తాయి.

శరీరం అలాంటి స్మృతుల్నీ, జ్ఞాపకాలనీమేస్తూ బతకలేదు. తనకి ఆకలంటుంది, నిద్రంటుంది. సుజాతని హత్తుకోవాలంటుంది. పిల్లల్ని ఎత్తుకోవాలంటుంది.

భోజనం ఏదో తింటున్నాడు

ఏదో నిద్ర తీస్తున్నాడు.

నిగ్రహించుకోగల శక్తి అతనిలో సన్నగిల్లినపుడు – సుజాత ఉండేది ఏ తునో, అనకాపల్లో అయితే రోజూ పరిగెట్టేవాడు. ఏ కాకినాడో, రాజమండ్రో అయితే వారంవారం పరిగెట్టేవాడు; కోరిక కోసం, కేవలం కోరిక తీర్చుకోడం కోసం హైద్రాబాద్ వెళ్ళేపని కాదు. ఏ సెలవలో, ఏ పనో తగిలితే తప్ప!

పెళ్ళయి ఏడేళ్ళయింది.

అప్పటికే ఉద్యోగాలు ఇద్దరికీ వున్నాయి. అలాగే ఉద్యోగాలు చేసారు. అలాగే కాపురాలు చేసారు. అలాగే పిల్లల్ని కన్నారు.

గత ఏడేళ్ళుగాను సుజాత వుద్యోగం మానేయాలనుకుంది. రవితో మానేస్తానూ అంది. యింకా ఆమె అలానే అంటోంది.

రవి ఆమెకి వైజాగులో ఉద్యోగం కోసం ప్రయత్నాలు చేస్తున్నాడు.

ఒక అవకాశం వచ్చింది.

సెలక్టవ్వొచ్చని నమ్మకం వుందిగాని జీతం ఏడువందలు మాత్రమే ఇస్తారు. అక్కడామె జీతం వెయ్యి, పదేళ్ళ సీనియారిటీ అన్నీ వదులుకురావడమంటే.. బాధే! అయినా ముందుగా ఇంటర్వ్యూకి అటెండు అవనీ అనుకున్నాడు.

రెండుమూడు వారాల్లో ఇంటర్వ్యూకి పిలుపు రావొచ్చు.

ఇంటర్వ్యూలో సెలక్టుకావడం, కాకపోవడం వేరే విషయం. కాని ఆమె ఇక్కడికి వస్తుందనేది, రెండు మూడు రోజులు గడుపుతుందనేది అతనికి సంతోషాన్ని కలిగిస్తున్న విషయం.

ఇంటర్వ్యూ ఒక వేళ లేకపోయినా సుజాత మాత్రం వైజాగ్ తప్పక వస్తుంది.

ఎంచేతంటే–

వచ్చేనెల పన్నెండో తారీఖు వాళ్ళ పెళ్ళిరోజు!

ఆ రోజుదాక ఆగేశక్తి లేదనే సంగతి అతనికి ఈ రోజు స్పష్టంగా అర్థమైపోయింది.

ఈ రోజు ఉదయం –

రవిపై పని మనిషి జోకేసింది.

దానివయసు ఇరవై దాటకపోవచ్చుగాని అప్పటికే ఇద్దరు పిల్లల్ని కనేసింది. కనేసినప్పటికీ దాని ఒల్లు గట్టిగా సోలిడ్‌గా రబ్బరుబంతిలా వుంటుంది – రవి చూపుకి

ఒళ్ళు నల్లగా, వక్షం ఎత్తుగా, కళ్ళు విశాలంగా, పిరుదులు గుండ్రంగా, తొడలు బలంగా... దాని పేరు లచ్చివి౦.

కొన్ని నెలలుగా అది పనిచేస్తోంది. తెల్లారి వచ్చి యిల్లు తుడిచి, నీళ్ళుపట్టి, అంట్లుతోమి, వెళ్ళిపోతుంది. ఆ పనంతా గబగబా పదీ, పదిహేను నిమిషాల్లో చేసేసి – సుందరమ్మ యింటికి వెళిపోతుంది పనికి.

రవికి దానితో మాటాడ్డానికూ్కడ అవకాశంలేదు. దాని పని అది చేసుకుపోతుంటే – రవి డ్యూటీకి తయారయ్యేతొందరలో వుంటాడు. కాలకృత్యాలు ఒక పక్క చేస్తూనే మరోపక్క వంటకి సిద్ధమవుతాడు.

గతంలో ఆరేడుసార్లు లచ్చివింపై కోరిక కలగకపోలేదు. కాని సంస్కారం అడ్డొచ్చింది. ఏ ఉద్రేకంలోనో ధైర్యంచేసి దాన్ని అడిగేస్తే – ఒప్పుకుంటే ఫర్వాలేదుగాని – నానా రంకెలూ, కేకలూవేసి నలుగురిలో పెట్టేసి ధాని మావంచేత నాలుగు తన్నులు కూడా తన్నించేయగలదు. పరువూ, మర్యాదా హోదా, బుద్ధి, జ్ఞానం, సంస్కారం లచ్చివింపై కోరికను అణుచుకోమన్నాయి. దానిజోలికి పోవద్దన్నాయి.

అయితే –

ఈరోజు ఉదయం జరిగిన సంఘటనే ఇంతవరకూ తీసుకొచ్చింది. స్టౌ మీద పాలు పెట్టి – ఇంకేదో పనిలోపడి మరిచిపోయేడు రవి.

వంటకీ లచ్చివింకీ సంబంధంలేదు. వంట పూర్తిగా రవి చేస్తాడు.

లచ్చివిం ఏ సాయం చేయమన్నా, చేయకపోదు. చేస్తుంది. ఒకటీ రెండుసార్లు వంకాయలు తరగడం, వుల్లిపాయలు కోయడం లాంటి చిన్నపనులు చేయకపోలేదు.

ఈరోజు సౌమీద పెట్టిన పాలు లచ్చివిం గుర్తుచేసేవరకూ రవికి గుర్తురాలేదు.

''బాబూ! పాలు పొంగిపోతున్నాయి''

గబగబా పరిగెట్టేడు. అక్కడ మసిగుడ్డాలేదు. చేతిలో పట్టకారులేదు. అటూ, ఇటూ, వాటిని వెతికే లోపల పాలు ఏమీ ఆ గెన్నెలో మిగలవిక.

అంచేత గాభరపడి, సాహసంచేసి చేత్తోనే దించేయబోయి చేయి కాల్చేసుకొని పాలు ఒంపేసాడు.

చెంగు నోటికడ్డం పెట్టుకొని వుబికివస్తున్న నవ్వుని ఆపుకుంది.

''ఎన్ని పాట్లొచ్చాయిబాబు! అమ్మగారు లేక యింకెన్ని యిబ్బందులు పడిపోతున్నారో పాపం'' అంది లచ్చివిం.

అది ఏ యిబ్బందిగురించి నొక్కి చెబుతోందో రవికి అర్థమయి అవకాశాన్ని గభాల్న

అందుకున్నాడు.

''అయ్యో పాపం అని జాలిపడేకన్నా ఆ యిబ్బందులేవో అమ్మగారి బదులు నీవే తీర్చొచ్చుగా.''

''అదెలాగవుద్ది. అమ్మగారు అమ్మగారేకదుబాబు.''

''అవును. అమ్మగారు అమ్మగారే. నీవు అమ్మగారివై పోనక్కర్లేదు – అమ్మగారిచ్చేవి యివ్వడానికి.''

''బాబుగారిది మా పెద్ద ఆశే''

దారికొచ్చిందనుకున్నాడు

''ఏం ఆశ పడగూడదా ?''

''తప్పుబాబు..ఎవరైనా చూస్తే అమ్మో ఇంకేమైనా వుందా!''

తను దార్లోకొచ్చేస్తున్నాడో, అది దార్లో పెట్టేస్తోందో అర్థం కాలేదు రవికి.

దార్లో ఎవరు పెట్టనీయ్, ఆదారి ఏ గోదారికానియ్– రవికిది గొప్ప అవకాశంగానే కనబడి వదుల్కోలేదు.

ఎందుకైనా మంచిదని ఓ పదిరూపాయల నోటు తీసుకొచ్చి బలవంతంగా దాని చేతిలో పెట్టేడు.

''అమ్మో ! ఇప్పుడెలాగ!''

''ఇప్పుడు కాదు – రాత్రికి'' అన్నాడు.

''అయితే పదింటికి కొస్తాను. దొడ్డిగుమ్మం తీసివుంచండి'' అంటూ పరుగున వెళిపోయింది లచ్చివి.

ఇపుడు దొడ్డిగుమ్మం తీసి వుంచబడింది.

రాలేదింకా లచ్చివి.

డబ్బులు తీసుకొని మోసం చెయ్యదుగా.. దాని మావ వదల కుంటున్నాడేమో –

'లేదు లేదు . లచ్చివి తప్పక వస్తుంది' అంది మనసు.

అదెక్కడ వచ్చేస్తాదేమోనని, రాకపోతే బాగుణ్ణు అని యింతవరకూ అనిపించింది. యిప్పుడు రాదేమోనని అనుమానం కలగ్గానే – లచ్చివి రావాలని బలంగా కోరుకుంటోంది మనసు.

ఇప్పుడు శరీరమే మనసు. మనసే శరీరం.

టైము చూసేడు. పదకొండు పది నిమిషాలు.

రవి ఎదురుతెన్నులు ఫలించేయి.

అతని కోరిక తనివితీరా, కరువుతీరా తీరిపోబోయే సమయం వచ్చేసింది

లచ్చివి వచ్చేసింది.

లోనకువచ్చి పెరటి తలుపులు వేసేసి – అక్కడే నించుండిపోయింది.

రవికి గుండెల్లోదడ.

వళ్ళంతా వణుకు.

వచ్చేసిందన్న ఆనందం.

వచ్చేసిందన్న భయం.

లోనకి రాదేవిఁటి ? అక్కడే వుండిపోయిందేవిఁటి ? అబ్బో ! సిగ్గుకూడానా!

శోభన పెళ్ళికూతుర్ననుకుంటుందా.

లైటార్పేశాడు రవి.

తడుముకుంటూ, అడుగులో అడుగేసుకుంటూ వెళ్తూ టప్‌మని గోడని గుద్దేశాడు.

'అబ్బా!' అన్నాడు – 'లచ్చివీఁ' అనకుండా.

తలకి గట్టిగానే తగిలినట్టుంది. లెక్కచేయకుండా లచ్చివిఁ దగ్గరకెళ్ళేడు.

''లోనకిరా '' అన్నాడు. మాటను మింగేశాడు. గొంతు ఎండి పోతోంది

''భయమేస్తోంది'' అంది లచ్చివిఁ.

లచ్చివిఁ భయం అనగానే రవికి డబల్ భయంవేసి ''ఎందుకు భయం ? నీవు రావడం ఎవరైనా చూశారా!'' అడిగేడు ఆత్రంగా.

''ఎవరు చూసింది నాకేం తెల్సు – చూసినవాళ్ళే చెప్పాలి ''

''చూసినవాళ్ళు చెప్పడం కాదు – చెప్పుతో కొడతారు'' అన్లేదు రవి.

''మీ మావఁ నిద్రపోతున్నాడా''

వచ్చిందాన్ని వదిలిపెట్టేసి – ఎవరైనా చూసేరా, మీ మావఁ నిద్రపోతున్నాడా యిదా సరసం! – అనుకు ంది. లచ్చివి.

''ఆలేటంతా అక్కడే. ఆణ్ణి వదిలించుకు రాబోతప్పటికి ఇదిగో యింతటయిమైనాది'' – అని మరిక లాభంలేదు తెల్లార్లు యిక్కడే అలా నించోబెట్టి గడిపే సేలాగున్నాడనుకొని రవిని రంగంలోకి దింపబోయింది.

అంతలో

అంతలోనే

తలుపు చప్పుడు. రవి గుండెల్లో రాయిపడింది.

లచ్చివి రావడం ! తలుపు తట్టడం !

కొంపదీసి దాని మావ కాదుగదా ! వాడే అయితే ఒక్కడే వచ్చాడా? వూరందర్నీ వేసుకువచ్చాడా?

తలుపుమీద మళ్ళీ చప్పుడు.

ఏంచేయాలోతోచదు రవికి. వళ్ళంతా చెమటలు. వళ్ళంతావణుకు

''నేనీపక్కన దాకుంటాను.. ముందు ఆ వచ్చిందెవరో సూడు?'' అంది లచ్చివి.

''వద్దు.వెళ్ళిపో.... వెంటనే వెళ్ళిపో'' ఆమెను తొందరపెట్టేడు.

రవి కోరిక చచ్చిపోయింది. యిప్పుడీ ట్రబుల్ నుంచి ఎలా బయటపడాలనేది సమస్య.

ఎదురుచూడగా చూడగా వచ్చిందాన్ని, కోరికను తీర్చడాన్ని కొచ్చిందాని వెళ్ళిపో మంటున్నాడు రవి.

అది వెళ్ళదు.

ఆవతల ఇంకాస్త గట్టిగా తలుపు చప్పుడు.

దాన్ని 'వెళ్ళిపోతల్లీ' అన్నాడు.

తలుపు దబదబా.

అది వెళ్ళదు.

తలుపు మళ్ళీ చప్పుడవడంతో – బతిమిలాట, బలవంతం రెండూ జోడించి దాన్ని అవతలకి నెట్టి పెరటి తలుపులు మూయడానికి అతని తలప్రాణం తోకకి వచ్చింది.

ఇదంతా జరిగింది ఒక్కనిమిషం. లచ్చివిఁ అతన్ని అల్లరి పెడదామని ఆగిపోలేదు. నిజంగా తనని వెళ్ళిపోమంటున్నాడో లేదో కన్ఫర్మ్ చేసుకోవడానికి ఒక అరనిమిషం తీసుకుందంతే.

అరనిమిషం అయిదునిమిషాల్లా తోచిది రవికి.

ఇందాక గట్టిదెబ్బే తగిలినట్టుది. నుదురు మంట పెడుతోంది.

చేత్తో తడిమేడు. చిన్న బొప్పికట్టింది.

తలుపు చప్పుడు.

లైటు వేశాడు.

బొప్పి తడుముకుంటూ తలుపు తెరిచేడు రవి.

ఎదురుగా చెలం!

రవి మొహం చూసి ఆక్షణంలో విజయ వీడి గదిలో లేదుకదా అని అనమానం వేసింది. చాలా అన్యాయంగా అలోచిస్తున్నాను అనుకున్నాడు వెంటనే.

## 3

చెలంకి ఆగది బాగా పరిచయమేఁ.

లోనకి చొరవగా వచ్చి మంచం మీద కూర్చున్నాడు, నిలబడే శక్తి లేదతనికి.

''అదేవిఁట్రా, ఇంత రాత్రిప్పుడొచ్చావ్.... ఏమయ్యింది ?'' అన్నాడు రవి.

''విజయ కనిపించడంలేదురా''

'' ఏవిఁటీ?! – రవి షాక్ తిన్నట్టయి పూర్తిగా ఈ లోకంలోకి వచ్చేశాడు.

''విజయ కనిపించకపోవడం ఏవిఁట్రా బాబు'' అన్నాడు నమ్మలేనట్టు.

జరిగిందంతా చెప్పేడు చెలం. పదేళ్ళకుర్రాడిలాచెప్పేడు. ఏడ్వలేదంతే!

రవిఅటూఇటూ పచార్లుచేస్తూవిన్నాడు. బాత్రూమ్‌కి వెళ్ళి మొహం కడుక్కొని వచ్చేడు. సిగరెట్ తీసేడు. బీరువా తెరిచి రమ్ బాటిల్ తీశాడు. రెండు గ్లాసుల్లో వేసేడు. వాటర్ కలిపేడు.

ఒక గ్లాసు చెలంకి ఇచ్చేడు.

చెలంని ఓదార్చే శక్తి కొంత ఆ గ్లాసుకే వుందని భావించేడు రవి.

''ఏమయ్యిందంటావురా ...'' అన్నాడు చెలం.

ఆ ఫేమిలీకి రవి మంచి స్నేహితుడే కావచ్చు తనూ అదేప్రశ్న వేయగల్గే స్థితి.

మందు ఒక గుటకవేసి, సిగరెట్ గట్టిగా దమ్ములాగి.. ''విజయకేం ఫర్వాలేదు'' అనిమాత్రం అనగల్గేడు.

''విజయకేం ఫర్వాలేదంటావా''.. గ్లాసు అప్పటికే సగం ఖాళీ అయింది.

''ఫర్వాలేదురా .. విజయకేం భయంలేదనే నా మనసు చెబుతోంది''

రవి మాట చెలంకి ఎంతో ధైర్యాన్నిచ్చింది.

గ్లాసు పూర్తిగా ఖాళీ అయింది.

ఈసారి చెలమేలేచి గ్లాసులో మందుఒంపుకొని.. వాటర్ కొద్దిగానే వేసి గొంతులోకి దించేడు. సిగరెట్ తీసేడు.

గోడకి తలగడఆన్చి.. మంచంమీదే అడ్డంగా పడుకొని నడుంవాల్చేడు చెలం.. గట్టిగా దమ్ములాగుతూ.

ఇద్దరూ మందుతాగడం, పొగతాగడంతప్పా ఏఒక్కరూ మాట్లాడిందిలేదు.. చాలాసేపటిదాక.

''పోలీసు రిపోర్టు ఇస్తే ఎలావుంటుంది'' అన్నాడు చెలం.

''వద్దు తొందరపడొద్దు''

''మరి ఏంచేద్దామంటావు''

కాసేపటికి ఇద్దరుమిత్రులూ స్కూటర్ పై నగరవీధుల్లోవున్నారు. విజయని గాలిస్తూ స్కూటర్నెమ్మదిగా ముందుకిపోతోంది.

స్కూటర్ అప్సరదగ్గర ఆగింది.

కిన్నెర గార్డెన్సు బోడిగా వుంది. పార్టీ తాలూకు అలికిడి ఏమీ లేదక్కడ. చెలం ముందు కిన్నెర గార్డెన్సుకి వచ్చే..ఏం చేయాలో తోచక రవి దగ్గరకొచ్చేడు.

''రాజశేఖర్ ఫోన్ నెంబరు తెల్సా'' అడిగేడు రవి.

తెల్సు అన్నాడు చెలం.

''పద, ఫోన్ చేద్దాం''

ఫోన్చేయడానికి ఇద్దరూ అప్సరలోకి వెళ్ళేరు.

.........రాజశేఖర్ చెలంకి మిత్రుడు. అతను తనవయసువాడే అయినప్పటికీ లేటుగా మారేజ్ చేసుకున్నాడు.

అసలు పెళ్ళికేరమ్మని ఎంతో ఫోర్స్ చేశాడు. పెళ్ళికి చెలం తప్పక వెళ్ళేవాడే.

పెళ్ళి ఇక్కడెక్కడోకాదు విజయవాడలో!

కొన్ని అర్జెంటుఫైల్సు పెండింగ్‌లో వున్నాయి. అవి క్లియర్ చేయాలి.

అది చెప్పి 'సారీరా' అన్నాడు.

''అఫ్‌కోర్స్ ! ఐకెన్ అండర్‌స్టాండ్ యువర్ ప్రాబ్లెమ్. బట్ వై డోంట్ యూ సెండ్ మై సిస్టర్ విజయ! ప్లీజ్ సెండ్ హెర్!''

''కష్టంరా''

''వాట్ కష్టం! ఒరే యూ ఆర్ టూమచ్ సెల్ఫిష్. అవతల నీ వ్యవహారాలు వదలవు. ఇవతల పెళ్ళాన్ని పంపవు. రెండు రోజుల్లో వెళ్ళివచ్చేస్తాం. ఓన్లీ టూనైట్స్! రెండే రెండు రాత్రులు. దట్ టూనైట్స్ కాంట్‌యూ కంట్రోల్ యువర్‌సెల్ఫ్.. బ్లడీఫూల్.''

చెలం నవ్వేసి..''అదికాదురా .. విజయవక్కడాన్ని వంటరిగా....''

''నాన్సెన్స్ నేనేం వంటరిగా దిక్కుమాలినపెళ్ళి చేసుకోడం లేదురే. బాజాభజంత్రీలు, బాణాసంచుల మధ్య బ్రహ్మాండంగా మారేజ్ చేసుకుంటుంటే ఎవడ్రానువ్వు వంటరిగా అంటావ్! మా ఇంటినిండా సెవంటీ పర్సెంట్ ఆడవాళ్ళే. అంచేత వంటరి ఎలా అవుతుంది? ఇక్కడనుంచి రెండు బస్సులుకూడా బుక్ చేయడం జరిగింది తెల్సా''

''రైటే.... విజయని మాత్రం పంపలేనని చెప్పడానికి విచారిస్తున్నాను''

''నీవు నిజంగా విచారించవలసినవిషయమేం. ఏమంటే నీవింకా ధైర్యంగా, వంటరిగా, పెళ్ళాన్ని బైటకి పంపలేని సంకుచిత సంస్కారంలోనే వున్నావు. రియల్లీ ఐ పిటియూ. నీవీ మోడ్రన్.. అల్ట్రా మోడ్రన్ సొసైటీలో ఇమడలేవు. ఒరే చలం! ఆడది వంటరిగా వెళ్తే ఏమైపోతుందోనని అనుమాన పెనుభూతాలతో యుద్ధంచేసే వాడికి నిజంగా నరకం, నరకం. నా పెళ్ళిపేరుతో నిన్ను నరక యాతనకి గురిచేసే కన్నా విజయని తీసుకెళ్ళకపోవడమే టెన్‌థవుజండ్ టైమ్సు బెటర్.''

''నిన్ను బాధపెట్టినట్టున్నాను .. సారీ''

''ఎందుకురా సారీలతో చంపుతావు.... పోనీ ఒక పని చెయ్... పెళ్ళయిన మూడోరోజు కిన్నెరలో రిసెప్షన్... కార్డుచూడు.... దానికి మీఇద్దరూ తప్పకరావాలి.... మరిక హరికథలు చెప్పకు''

''లేదు, లేదు... తప్పక వస్తాను '' అన్నాడు చెలం.

అంచేత తప్పుకోలేనిపరిస్థితిలో ఖచ్చితంగా రిసెప్షన్‌కి అటెండు అవ్వాల్సి వచ్చింది. తనకి అర్జంటు పని వున్నప్పటికి తప్పనిసరిగా విజయతో వెళ్ళేడు ఈరోజు.

రిసెప్షన్ కిన్నెరా గార్డెన్సులో బ్రహ్మాండంగా ఎరేంజ్ చేశాడు రాజశేఖర్.

మంద్రంగా, మత్తుగా డిస్కోమ్యూజిక్ అక్కడున్న మనుషులందర్నీ ఊపేస్తోంది. అటూ, ఇటూ బారులు తీరివున్న వృక్షాలు వంటినిండా చినచిన్న రంగురంగుల బల్బులు సింగారించుకుని వెలుగుతూ, ఆడుతూ డాన్సు చేస్తున్నాయి.

అక్కడున్న వాళ్ళంతా పెద పెద్ద వాళ్ళే!

రాజశేఖర్ పెద్ద కుటుంబానికి చెందినవాడు. మొన్న మొన్నే అమెరికానుంచి వచ్చేడు. రేపో, ఎల్లుండో పెద్ద నర్సింగ్ హోమ్ ఓపెన్ చేయబోతున్నాడు.

అందరి చేతుల్లోను డ్రింక్సు వున్నాయి.

చెలం, విజయ నూతన వధూవరుల వద్దకెళ్ళి తలపై అక్షింతలు వేసేరు. రాజశేఖర్ తన భార్యకి ఆ దంపతులను పరిచయం చేశాడు. ''విష్‌యూ హేపీ మారీడ్ లైఫ్'' అంటూ కరచాలనంచేసేడు చలం. గిఫ్ట్‌ని అందించింది విజయ.

''చూశావా! అన్నమాట ప్రకారం వచ్చేశాను'' అన్నాడు చెలం.

''నో! రాలేదు. నిన్ను విజయ యీడ్చుకొచ్చింది. కదమ్మా''

విజయ నవ్వేసి వూరుకుంది.

రాజశేఖర్‌కి దంపతులతో తీరుబడిగా హస్కు కొట్టే అవకాశంలేదు వరసగా ఎంతోమంది ఆ కపుల్‌ని విష్ చేయడానికొస్తున్నారు.

సూట్లూ, పట్టుచీరలూ, బాబ్‌డెహెయిర్‌లూ, ఖద్దరు పంచెలూ, హిప్పీక్రాపులూ, హైహీల్సు, స్లీవ్‌లెస్ జాకెట్లు, పంజాబీడ్రెస్‌లూ, బొచ్చు కుక్కలూ, కూర్చొని, నించొని, కదుల్తూ నడుస్తూ రాజకీయాలు, సినిమాలు, ఫ్యాషెన్లూ, ప్రయివేట్ సెక్టార్ ఈజ్ బెటర్‌దేన్ పబ్లిక్ సెక్టార్‌లూ, కంపెనీ షేర్లు, స్టాక్‌ఎక్ఛేంజ్‌లు, స్ట్రెయిక్స్‌షుడ్‌బి బాన్డ్‌లూ, అదర్‌వైజ్ వుయ్ కాంట్ సర్‌వైవ్‌లూ, ఇందిరాగాంధి ఈజ్ రియల్లీ డేరింగ్‌డెవిల్‌లూ, మీకు తెల్సా! అమితాబ్ మొక్కుతీర్చడానికి రేఖ తిరుపతి వెళ్ళిందట – వై ది ఎఫిషియంట్ బాట్స్‌మన్ విశ్వనాధ్ ఫెయిల్డ్ ఇన్‌ద సీరీస్‌లూ– మరో ఎమర్జన్సీయో, మిలటరీయో వస్తేగాని ఈకంట్రీ బాగుపడదుస్మీలూ కిన్నెరగార్డెనంతా రాసుకు తిరుగుతున్న చెలం విజయలకు వినబడి తెగిపోతున్నాయి.

విజయకి ఇదంతా తమాషాగా వుంది. ఎవరిలోను ఆమెకి సహజత్వం కన్పించడంలేదు. ఆ డ్రెస్సులూ, ఆ నించోడాలు, ఆ మాటలు, ఆ నవ్వులూ అన్నీ అంతే.

కీ ఇచ్చిన బొమ్మలనిచూస్తున్నట్టు, బఫూన్ ప్రపంచాన్ని చూస్తునట్టు సరదాపడింది. తన సరదా పంచుకునే స్థితిలో భర్తలేడు..

ఏదో ఆలోచనల్లో వున్నాడు. తరచూవాచీ చూసుకుంటున్నాడు అతను అప్పుడే పార్టీనుంచి చెక్కేయడానికి ప్లానులువేస్తున్నాడని ఆమెకి అర్ధమయింది.

పార్టీఅప్పుడే అయ్యేట్టులేదు. డిన్నరు ఏడున్నరకి స్టార్ట్‌వుతుంది బఫే.

స్టేజ్‌పై ఆర్కెస్ట్రా నుండి సంగీతం మధురాతి మధురంగా గార్డెనంతా నింపేసి ఆహ్లాదపరుస్తోంది.

భర్తతో సరదాగా ఏదోముచ్చటిస్తున్నా విజయకి కావాల్సిన రియాక్షను రావడం లేదు అట్నుంచి.

విజయకి చిరాకేసింది.

'' ఏం అలాగున్నారు! .. ఎక్కడికైనా వెళ్ళాలా?''

ఆమె చిరాకును అతను గమనించే స్థితిలో లేడు.

''అవును వెళ్ళాలి. చాలా ఇంపార్టెంట్ అండ్ అర్జంట్''

'' మీకన్నీ ఇంపార్టెంట్ అండ్ అర్జెంట్లే, ఏం కాదు?''

''నిజం విజయా, నేను ఆరుగంటలకల్లా అటెండుకావాలి.''

''ఆరయిపోయి పావుగంటయింది. ఈ రోజుకి మీ ఇంపార్టెంట్ అండ్ అర్జంట్‌కి నమస్కారం పెట్టేయండి''

''అమ్మమ్మా! అలా నమస్కారం పెట్టేసి పారేసే విషయం కాదు.చెప్తున్నాకదా! చాలా ఇంపార్టెంట్, చాలా అర్జంట్.''

''అలాంటప్పుడు ఆపనేచూస్కోలేకపోయేరా.. ఈ పార్టీ వెంటకి తీసుకురాకుండా''

''గురుడు రాజశేఖర్ ఏడ్చేస్తున్నాడుకదా. పెళ్ళికెలాగూ వెళ్ళలేదు. రిసెప్షన్ కూడా ఎగ్గొట్టేస్తే. ఇంకేమైనా వుందా.''

''స్నేహితుడి పార్టీకి రావాలని రాలేదు... ఏడుస్తాడని వచ్చేనంటారు బాగుంది. నేనూ అంతేనన్నమాట.... ఎక్కడికీ ఏ సాయంత్రం తీసుకెళ్ళడం లేదని ఏడుస్తోందని నన్ను ఈడ్చుకొచ్చేరన్న మాట. యీడ్చు కొచ్చినా ఏం సుఖం! ఏంఆనందం! తీసుకొచ్చినట్టు తీసుకొచ్చి ఏడిపిస్తున్నారు.''

''నేను ఏడ్వనూ...ఎవర్నీ ఏడిపించనూ'' అన్నాడు నవ్వుతూ.

'' ఏడ్చినట్టేవుంది. మరిపుడు అర్జెంట్ అండ్ ఇంపార్టెంట్‌కి డిన్నర్ తీసుకోకుండా వెళ్ళిపోతే మీ ఫ్రెండు ఏడుస్తాడు. నన్ను పార్టీకి తీసుకొచ్చి పదాపోదాం అంటే నాకు ఏడుపు– ఒకేసారి ఇద్దర్నీ ఏడిపించి– ఎవర్నీ ఏడిపించలేదంటారేం?''

''పొరబడుతున్నావు. నేను మీ ఇద్దర్నీ ఏడిపించడంలేదు.''

''అంటే మీ ఇంపార్టెంట్ అండ్ అర్జంట్‌కి వెళ్ళడం లేనట్టేకదా!''

''ఛుర్నీ మొదటికొచ్చేవు. నేను వెళ్ళకతప్పదు.''

''అనగా ఏడిపించకతప్పదు. అంతేగా మరి''

''కాదు.''

''ఎలా?''

''రాజశేఖర్ నేను రిసెప్షన్‌కి రావడంచూసేడు. అనగా నేను వచ్చినట్టు రికార్డయింధికదా. ఇకపోతే మధ్యలో నేను ఎప్పుడు చెక్కేస్తానన్నది అతనికి తెలీదు. ఇంత మందిలో నేనెంత?''

''అంటే చెప్పకుండా వెళ్ళిపోతానంటారు! అదేం బాగుంటుంది చెప్పండి! ఈ పెద్ద పెద్ద వాళ్ళ మధ్య మీరు మధ్యలో వెళ్ళిపోయినసంగతి గుర్తించలేడనేది.. మీదితప్పుడు అంచనా ఎందుక్కాగూడదు. ''

''నీవన్నది రైటే! కాని నైన్‌టీ నైన్ పర్సెంట్ జరగేపనికాదు. గుర్తించలేడు''

''మీరన్నదాంట్లోనే వన్ పర్సెంట్ గుర్తించడానికి అవకాశంవుందికదా''

''వన్ పర్సెంట్ నెగ్లెక్టుచేయొచ్చు. కాని నేను చేయడంలేదు. నాశరీరంలో సగభాగాన్ని ఇక్కడ డిన్నర్ అయ్యే వరకూ వదిలి వెళ్తున్నాను''

''అంటే''

''నా అర్ధాంగి నాబదులు వుంటుంది''

''ఎవరు మీ అర్ధాంగి?''

''ఇంకెవరు? ఎవరని ప్రశ్నిస్తున్న గడసరి చిన్నది. ఎదురుగా వున్నది''

''అంటే నన్నొక్కదాన్ని వదిలేసి మీరెళ్ళిపోతారా. బాగుందండీ. చాలాబాగుంది. నేను మీరులేకుండా వుండనిక్కడ.''

'' వుండాలి. వుండకపోతే రాజశేఖర్ ఏడుస్తాడు''

''వుంటే నేనేడుస్తాను.''

విజయకి నిజంగానే ఏడుపొస్తోంది. తీసుకొచ్చిన పెళ్ళాన్ని కూడా నిర్దాక్షిణ్యంగా వదిలేసి వెళ్ళిపోడానికి సిద్ధపడతాడని తనుఊహించలేక పోయింది.

''నా డాళింగ్ ఏడ్వదు. నన్ను అర్థంచేసుకుంటుంది. సహకరిస్తుంది. నన్ను వెళ్ళిరమ్మంటుంది''

''మీరు వెళ్ళండి–నన్ను ఇంటిదగ్గర డ్రాప్‌చేస్సి మీరెళిపోండి''

సీరియస్‌గానే అంది. ఆమె సీరియస్‌నెస్‌ని అతను సీరియస్‌గా తీసుకోలేదు.

''ఇద్దరం వెళిపోతే బాగోదుకదా. అయినా టైములేదు. మన ఇల్లు అటు. నేను వెళ్ళాల్సింది ఇటు''

''నన్నెలా వెళ్ళమంటారు ఇంటికి?''

''బస్సు. లేకుంటే ఆటో ఈరోజు నా డాళింగ్ నాకోసంఇబ్బంది భరిస్తుంది.'' విజయకి దుఃఖం ముంచుకొచ్చేస్తోంది.

''కలిసి వచ్చినవాళ్ళు తిరిగి కలిసివెళ్ళడం కనీస సంస్కారం కాదంటారా''

''భార్యాభర్తల మధ్య అవగాహన, అండర్‌స్టాండింగు లోపించినపుడు అన్నీ కుసంస్కారంగానే కనిపించే అవకాశముంది. సంస్కారం అనేది నా దృష్టిలో అర్థంలేనిమాట. భర్తని భార్యా, భార్యని భర్త, ఒకరినొకరు అర్థం చేసుకుంటేచాలు. ఏప్రాబ్లెమ్‌లేదు. నా డాళింగ్ నన్ను అర్థం చేసుకుంటుంది.''

''అదే డైలాగు పదిసార్లంటూ నన్ను హిప్నటైజ్ చేస్తున్నారు. నన్ను పడగొట్టాలని చూస్తారుగాని– భార్యని మీరేం అర్థం చేసుకున్నారు? మీరు నా పక్కనలేకుంటే నాకు పరమబోరు. పదిమందికి వినోదం కల్గించేది ఏదైనప్పటికీ–మీరులేకుండా ఆ వినోదం తిలకించలేను. నాకు వినోదం కలగదు. ఏ పార్టీ, ఏ సినిమా, ఏ సరదా అయినాసరే మీరు లేకుండా అవినాకక్కరలేదు–పదండి మీతోనే వస్తాను.''

''ఎక్కడికి?''

''మీరెక్కడకెళితే అక్కడికి '' నవ్వేడు చెలం

''నవ్వుతారేం నేను రాగూడదా''

''రావల్సిన చోటుకైతే నీవు చెప్పాలా డాళింగ్ నేనే తీసుకుపోతాను''

అతని మాటలు నమ్మేయలేదు విజయ ఆమెకి దుఃఖం, కోపం, విసుగూ కలుగుతున్నాయి చలం తన కెందుకో దూరమైపోతున్నాడనే భావన కలిగింది

''డాళింగ్! నేచెప్పేది విను నీవు ఇక్కడే వుండు నేను పని చూసుకొని వెంటనేవచ్చేయడానికి ప్రయత్నిస్తాను ఎయిటోక్లాక్ లోపు నేను రాలేకపోతే నాకోసం ఎదురుచూడకు ఏబస్సుమీదో, ఆటోమీదో వచ్చేయి ఏం వంట రిగా ఇంటికెళ్ళాలంటే భయమా!''

విజయలో రోషం ఉబికి ముఖం ఎర్రబారింది

''నా కెందుకు భయం, అలాంటి భయాలు నాకులేవు ఏ టైము లోనైనా వెళ్ళగలను, రాగలను భయమెందుకు వెళ్ళండి మీరు మీ ఇంపార్టెంట్ అండ్ అర్జెంటు కేసు పిలుస్తోంది మిమ్మల్ని''

''థాంక్యూ డాళింగ్!'' అని వెళ్ళిపోయేడు చెలం

పెళ్ళాం కోపం, దుఃఖం అర్ధంచేసుకునే శక్తిలేని వాడుకాదు చలం పెళ్ళాం ఏ స్థితిలో వున్నియ్యండి ఆమెను ప్రసన్నం చేసుకోగలననే ధైర్యం, గర్వం అతనికున్నాయి గనుకనే ఆమె ఏడ్చినా, కోప్పడినా, గెలుపు ఎప్పుడూ అతనిదే మరి

విజయను అక్కడ వదిలి వెళ్ళిపోయిన తర్వాత మళ్ళీ కనబడ లేదు చలంకి ఆమె



చెలం అప్సరలోంచి రాజశేఖర్‌కి ఫోన్ డయల్ చేశాడు రవి అక్కడే చేతులు కట్టుకుని గోడకానుకుని నించొనివున్నాడు ''యస్ రాజశేఖర్ స్పీకింగ్ ఆరే! నువ్వా(బా చెలం ఏవిటీఫోను ఇంతరాత్రప్పుడు''

''మరేంలేదు కంగ్రాట్స్ చెప్పడానికి''

'' ఏం అది రేపు ఉదయందాకా నీ జేబులో వుండదా సడ్లే ఎందుకట?''

''నీవిచ్చిన మారేజ్‌పార్టీ అదిరిపోయినందుకు''

''థాంక్యూ హౌ ఈజ్ ద డిన్నర్''

''అది డిన్నరా రకరకాల డిషెస్, ఎన్నెన్నో ఐటమ్స్ వాటి టేస్టు తినాల్సిందేగాని వర్ణించలేం''

''ఇదిమటుకు కరెక్టుగా చెప్పావు డిన్నర్ నీవు తింటేకదా వర్ణించడానికి''

''నీకు మళ్ళీ దొరికిపోయేను సారీరా''

''నీవు నాకు సంతృప్తికన్న సారీలే ఎక్కువిస్తున్నావు. ఏం చేసుకోమంటావ్. వాటిని? పార్టీనుండి నీవలా దొంగచాటుగా పోవాల్సిన ఖర్మేమిట్రా? ఆగాగు. మళ్ళీనాకు మరో సారీ కట్టబోకు నేచేప్పేది పూర్తిగా విను. డిన్నర్ దగ్గర విజయ మాత్రమే కనిపిస్తే నీగురించి అడిగేను ముసి ముసి నవ్వులు నవ్వింది గాని ఆ నవ్వులో జీవంలేదు ఇప్పుడే వెళ్ళారు ఇదిగో వచ్చేస్తారు అని నిన్ను కవరుచేయడానికి ప్రయత్నించింది. ఆమెకేమోఃగాని నాకు మటుకు నీవు రావని తెల్సు. నాకా సమయంలో నీపై ఎంత కోపం వచ్చిందో చెప్పలేను. ఎందుకు నీవు పార్టీనుంచి చెప్పకుండా వెళ్ళిపోయేవనికాదు. ఏకంపెనీలేక ఒక్కతేవున్న విజయను చూసి నాకు బాధేసింది. నీపై ఒళ్ళుమండింది. అందరూ జంటలు జంటలుగా గ్రూపు గ్రూపులుగా వుంటే వాళ్ళ మధ్య .. వంటరిగా విజయ ఎలావుంటుంది ఆమెకి? నేనూ నామిసెస్ ఆమెకి కంపెనీ ఇచ్చాం. కాని ఆమె బాధ పడ్తున్నట్టే తోచింది. పార్టీఅయ్యేక కారుమీద డ్రాప్ చేస్తానన్నాను. వద్దని సెలవు తీసుకు వచ్చేసింది. విజయ చెప్పలేదా నీకు విశేషాలు ఏమీ?

''లేదు – చెప్పలేదు ''

''ఏం ?''

''ఇంకా నేను ఇంటికెళ్ళలేదు.''

''ఇంకా యింటికెళ్ళలేదా!''

''లేదు''

''ఒరే ఫూల్ – ఇమీడియట్‌గా యింటికెళ్ళి విజయ కాళ్ళమీద పడు''

''డోంటాక్ టూమచ్''

టక్‌మని ఫోన్ పెట్టేశాడు చెలం.

చెలం ఏమీ చెప్పనక్కర్లేకుండానే అంతా అర్థమయింది రవికి

అడిగేడు రవి.

''నాకు ఎందుకో చెప్పాలనిపించలేదు నిజం! వాడసలు నాతో ఫ్రెండులా మాటాడడు. భూస్వామి పాలేరుతో మాటాడినట్టు మాటాడుతాడు. వాడిడబ్బు హోదా అలా మాటాడేటట్టు చేస్తుంది. డబ్బు అసలు వాడేం సంపాదించాడు ? వాడిబాబు సంపాదించింది తింటూ కబుర్లు ! కమాన్ ! చాలంజ్! నాలా సంపాదించమను చూద్దాం. రేపు వాడు నర్సింగ్‌హోమ్ పెట్టినా నాముందు బలాదూర్''.

''నీ వెందుకు ఫోన్ చేశావనేది మర్చిపోయి ఇంకేదో మాట్లాడుతున్నావ్''

''లేదురా ఆ రాస్కెల్ ఇప్పుడేకాదు చూస్తున్నాకదూ ఇష్టం వచ్చినట్టు వాగుతాడు. విజయ గురించి మాటాడ్డానికి వాడెవడు? నా ప్రాణంలో ప్రాణం. నా సర్వస్వం విజయ! నేనామెను బాధ పెడతానా? అంతంత మాటలు విజయే అనదు నాతో. వాడెవడు ? నా ప్రవర్తనకి విజయ బాధపడొచ్చు, సంతోషించొచ్చు. మరేదో అవ్వొచ్చు. అది మొగుడు పెళ్ళాల విషయం. మధ్యలో వాడికెందుకూ''

''నీవు స్నేహితుడవనే చనువుతో అన్నాడని నీవెందుకనుకోవు ? నాకు రాజశేఖరు అన్నదాంట్లో తప్పేం కనిపించడంలేదు.''

చిరాకుగా, చురుగ్గా చూసేడు చెలం.

''అయితే తప్పు నాదే అంటావా? విజయని బాధపెడుతున్నానని నీవ్వూ అనుకుంటున్నావా? నేను బాధ పెట్టడంచేతనే విజయ ఇంటికి చేరకుండా ఏనుయ్యో, గొయ్యో చూసుకుందంటావా?''

''ఆవేశపడకు చెలం అంతంత మాటలెందుకు. ఎదుటివాడు చేసిన కామెంట్‌లో సరిదిద్దుకోడానికి ఏమైన వుంటే దిద్దుకోడంలో తప్పేంవుంది? అక్కడ అహం అడ్డితే మనకేనష్టం. ఇపుడు సమస్య ఎవరిది తప్పని కాదు – విజయ ఏమయింది? మనం ఏం చేయాలన్నది. మిగతా విషయాలు తర్వాత.''

స్కూటర్ సిరిపురం జంక్షన్ మీదుగా వెళ్ళింది. అక్కడ మూడు లీటర్ల పెట్రోలు పొట్టలో వేయించుకుంది. అటు రామకృష్ణా బీచ్ వైపు సాగింది.

స్కూటరాపి బీచ్ అంతా కాసేపు వెదికారు. బీచ్ అంతా నిర్మానుష్యంగా వుంది. ఎక్కడ ఒక మనిషి కనిపించినా వదలకుండా చూసేరు.

బీచ్ నుంచి స్కూటర్ బయలుదేరింది.

కోస్టల్ బ్యాటరీ దగ్గర మలుపు తిరిగింది.

కలక్టరాఫీస్ జంక్షన్‌లో ఆగింది.

రవి తలలో ఫ్లాష్ వెలిగింది.

విజయ బయల్దేరినప్పుడు ఆక్సిడెంట్ ఏమైనా జరిగిందేమో. విశాఖపట్నంలో ఏక్సిడెంట్లకి లోటులేదు కదా.

స్కూటర్ కింగ్‌జార్జ్ హాస్పటల్‌కి బయలుదేరింది.

స్కూటర్ స్టాండువేసి హాస్పటల్‌కి వెళ్ళేరు. కేజువాలిటీలో లక్కీగా రవికి తెల్సిన డాక్టరు వున్నాడు. ఎంక్వయిరీ చేశాడు.

విజయ అనే పేరుతో ఏ యువతి కేసు రిజిష్టరు చేయబడలేదు.

సీత అనే అమ్మాయి బర్నింగ్ కేసు – అక్రమ సంబంధం ఎవడితోనో పెట్టుకుందని పెళ్ళాన్ని పొడిచినకేసు – కంపెనీ కేంటిన్‌లో ఫుడ్ పాయిజన్ అయి వాంతులు, విరేచనాలతో కొందరూ, స్పృహలేకుండా కొందరు ఉద్యోగులు – యంత్రచక్రంలో చేయిపడిపోయి బాధతో భయంకరంగా అరుస్తున్న కార్మికుడు – విపరీతమైన కడుపు నొప్పితో సుడులు తిరుగుతున్న ఇరవయ్యేళ్ళ యువకుడు – స్లీపింగ్ పిల్సు మింగేసిన పదహారేళ్ళ పాప – స్కూటర్ గుద్దేసిన అరవయ్యేళ్ళ వృద్ధుడు...కేజువాలిటీలో నున్న ప్రతి బెడ్ దగ్గరకి వెళ్లేరు అనుమానం తీరక.

పేషెంట్ల మూలుగులు, అరుపులు – అదొక మృత్యు గహ్వరం. అది ప్రత్యక్షనరకం. అక్కడ డాక్టర్లు తప్ప ఎవ్వరూ నవ్వలేని హృదయ విదారక వాతావరణం.

డెత్‌కేసులూ, చికిత్స చేసి వెంటనే పంపించేసిన కేసులూ కూడా విచారించేడు లాభం లేకపోయింది.

అక్కడ వార్డుబోయ్ ఒక ఇన్ఫర్‌మేషన్ ఇచ్చేడు –

చావులమదుం జంక్షన్‌లో ఒక ఆటో బస్సుతో ఢీకొని ఒక స్త్రీ ఆన్‌ది స్పాట్ మరణించిందని!

స్కూటర్ స్టార్టయి మూడు నిమిషాల్లో చావులమదుం జంక్షన్‌కి చేరింది

అక్కడ ఏక్సిడెంటు ఛాయలు ఏమీలేవు. అవతల హార్బరు జంక్షను దగ్గర చూసేరు. ఏ బస్సూ లేదు. ఏ స్త్రీ శవంలేదు

చావులమదుం దగ్గర ఎంక్వయిరీ చేస్తే ఏక్సిడెంటు జరగడం, స్త్రీ చనిపోవడం అంతా కరెక్టేగాని ఉదయం పదిగంటలకి జరిగిందన్నారు.

సాయంత్రం ఆరున్నర వరకూ విజయతో వున్నాడు చెలం.

ఒక నిట్టూర్పు విడిచి స్కూటరు బయల్దేరింది.

రైల్వేస్టేషన్ దగ్గర ఆగింది.

ప్లాట్ ఫారమ్ అంతా తిరిగేరు. ఎందుకో చెలం దృష్టి రైలుపట్టాల సైడు వెళ్ళింది.

ప్లాట్‌ఫారమ్ మీదే టీలు తాగేరు.

స్కూటర్ ఎటుపోనివ్వాలో తెలీక ఆగిపోయేరు.

యీ మహానగరంలో ఇద్దరు కలిసి కనబడని స్త్రీని వెదకడం సాధ్యమయ్యే పనికాదని చెలంకి అర్థమయింది.

''పోలీసు రిపోర్ట్ ఇచ్చేద్దాం రవి. – అంతకన్నా మనం చేసేది లేదు'' అన్నాడు చెలం.

''చేద్దాం! అప్పుడేకాదు.''

యీసారి స్కూటర్ రవి డ్రైవ్ చేయగా – చెలం వెనుక కూర్చున్నాడు.

స్కూటర్ మెయిన్ రోడ్డులోంచి పోయింది. పోతూ సరస్వతీ జంక్షన్ జగదాంబ జంక్షన్... పెద్ద పెద్ద జంక్షన్ల వద్ద ఆగింది. సినిమా హాళ్ళ దగ్గర ఆగింది. ఆర్.టీ.సి కాంప్లెక్సుకి వెళ్లింది. అక్కడ మళ్ళీ దిక్కు తోచలేదు.

''లాభం లేదురా. పోలీసు రిపోర్టు ఇవ్వడం తప్ప – మరో ఆల్టర్‌నేటివ్ లేదు'' అన్నాడు చెలం పూర్తిగా డీలపడిపోయి.

అంతకు తప్పించి చేసేదేమీలేదనిపించింది రవికి కూడా.

విజయకి ఇక్కడ బంధువులంటూ ఎవరూ లేరు. పల్లెటూళ్ళో వున్న ఆమె తండ్రి గత ఏడాదే మరణించేడు. రవి తప్పించి ప్రాణ స్నేహితులంటూ ఎవరూ పెద్దగా లేరు. చిన్న చిన్న స్నేహితులు, దూరపు బంధువులూ లేకపోలేదు. వాళ్ళ దగ్గరి కెళ్ళి 'నా పెళ్ళాం మీ ఇంటికొచ్చిందా' అని అడగడం చెలంకి ఇష్టం లేదు.

విజయ ఎవరి ఇళ్ళకైనా ఎందుకెళ్తుంది? ఏక్సిడెంటులాంటిది ఏదో అయివుంటుందంటే

అతని మనసు ఒప్పుకోడంలేదు.

రాజశేఖర్ అన్నట్టుగా విజయను రిసెప్షన్‌లో తను బాధించాడా ? ఆమె హర్టయిందా ? అంత చిన్న విషయానికి ఆమె ఏదో అఘాయిత్యానికి పాలుపడుతుందంటే చెలంకి నమ్మబుద్ధికావడంలేదు విజయదంత బలహీనమైన మనసుకాదని అతనికి తెల్సు.

ఒకటి జరగడానికి అవకాశముంది. బస్సులు రష్‌గా వుండడం చేత ఆటో ఎక్కివుంటుంది. ఆటోలో రమ్మని కూడా తనే చెప్పేడు. ఆటోలో డ్రైవరుతోబాటు, వాడి ఫ్రెండో ఎవడో వాడిసీటులోనే షేరు చేసుకుని కూర్చొని వుండడం కద్దు.

ఆటో స్టార్టయి కొంతదూరం వెళ్ళేక - వీలుచూసుకుని ఆటో డ్రైవర్ ఫ్రెండు విజయ సీటుకి చేరి ఆమె కేకలు వేయకుండా నోట్లో గుడ్డకుక్కి ఏ భీమునిపట్నం సైడో తీసుకువెళ్ళిపోయి వుంటారు

ఆటోలో ఒక్క మనిషి విజయని ఆపగలడా! ఆమెను అరవకుండా ఆపగలడా! ఒక్కడు విజయని ఆపలేడు. ఆమె పెనుగులాడుతూ వాడిని ఎంత తీవ్రంగా ఎదుర్కొంటుందో దృశ్యం అతని కళ్ళముందు కదిలింది. వాడికి విజయని కంట్రోల్ చేయడం సాధ్యం కావడంలేదు. వాడిని రక్కేస్తోంది, కొరికేస్తోంది. కాలుతో తంతోంది. జుత్తుపట్టుకు లాగేస్తోంది.

అంతలో రెండోవాడు కత్తితీసి బెదిరించేడు.

విజయ అచేతనంగా ఫోటో తీసినట్టు వుండిపోయింది.

లేకుంటే మరోలా జరిగివుండొచ్చు.

సింగల్ ఆటో డ్రైవరు ఆమెను తీసుకువెళ్తూ - ఒక దగ్గర సడన్‌గా ఆపుతాడు. ఆపడం, ఇద్దరు, ముగ్గురు రౌడీలు లోపలికి దూరడం - ఆటో స్పీడందుకోవడం క్షణంలో జరిగిపోతుంది.

రౌడీలు విజయని బీచ్‌లోకి తీసుకెళ్ళి వాళ్ళు ఆమెని రేప్ చేస్తున్న దృశ్యం ఎంత వూహించుకో గూడదన్నా భయంకరంగా అతని ముందు మెదుల్తోంది.

నో, అలా జరగడానికి వీల్లేదు. లేదు లేదు అలా జరిగివుండదు.

మరెలా జరిగి వుంటుంది. ?

ఆటో భీముడిపట్నం బీచ్‌వైపుకాకుండా అనకాపల్లి సైడు నేషనల్ హైవేమీద పోతోంది.

ఆటో తిన్నగా ఒక బ్రోతల్‌హౌస్ ముందు ఆగింది. ఆమెను ఎత్తుకుని లోపలకు తీసుకు పోయేరు. విజయని గదిలో బంధించేరు. తను లోపల నుంచి తలుపులు దబదబా బాదుతుండగా ఓనరు ఆటో వాళ్ళకి వెయ్యి రూపాయిలిచ్చుట -

''ఏమిత్రా ఆలోచిస్తున్నావ్'' భుజం కుదిపేడు రవి.

''ఏం లేదురా నా విజయకి ఏం అవలేదు గదా'' స్నేహితుని పట్టుకుని ఏడ్చేశాడు చెలం.

''ఏం ఫర్వాలేదు - పద పోలీస్‌స్టేషన్‌కు వెళ్దాం''

స్కూటర్ స్టేషన్‌ముందు ఆగింది.

టైము ఒంటిగంట

పోలీస్ స్టేషన్లోకి వెళ్ళడమంటే పులినోట్లో తలపెట్టడం. భయంతో రవి ఆగిపోయేడు. చెలాన్ని ఆపేడు.

ఇందాకటినుంచి రవికి ఒక అనుమానం మెదుల్తోంది.

పదకొండు గంటలకి చెలం ఇల్లువదలిపెట్టి రోడ్డుకొచ్చేడు.

ఇప్పుడు టైము ఒంటిగంట.

విజయ ఇంటికి చేరి వుండొచ్చుకదా.

అదే అన్నాడు రవి చెలంతో

''అది నీ భ్రమ. చేరితే ఎనిమిది తొమ్మిది లోపలే ఇంటికి చేరేది. మహాఅయితే పది. నేను పదకొండు వరకు చూశాను. అప్పుడురాలేనిది ఇప్పుడొస్తుందని నాకు నమ్మకంలేదు. నా విజయకి సమ్‌థింగ్ జరగరానిదేదో జరిగింది. పోలీస్ రిపోర్టు ఇవ్వడం ఇప్పటికే ఆలస్యం చేశాం అనుకుంటున్నాను''

''లేదు. నామాటవిను. విజయ వచ్చిందీ లేందీ ఒకసారి కన్‌ఫర్మ్ చేసుకుని రిపోర్టు ఇద్దాం. పోలీసు చేతిలో కేసు పెట్టింతర్వాత – వాడు మనల్ని అంతవేగంగా వదలడు. ఇన్ని గంటలు ఆగేం. ఒక్క పదినిముషాలు ''

''నీదంతా పిచ్చి నమ్మకం. ఇక్కడిదాకా వచ్చి రిపోర్టు ఇవ్వకుండా వెళ్ళడం ఏవిఁటి? పోనీ నీవన్నట్టు విజయ వచ్చేసింది అనుకో ఆ విషయం వీళ్ళకి ఇన్‌ఫార్మ్ చేసేస్తాం తర్వాత. ''

''నేను చెబ్తున్నది నీకు అర్థం కాదు. పోనీ నీవిక్కడే వుండు. నేను అయిదు నిమిషాల్లో వెళ్ళి వచ్చేస్తాను.''

''సరే నీ యిష్టం''

చెలం అక్కడ బల్లపై కూలబడి సిగరెట్ తీసేడు.

వెలిగించి, ఒక గట్టి దమ్ము తీసేటప్పటికి –

అక్కడ రవిలేడు. స్కూటరు లేదు.

కూర్చున్న చెలాన్ని కూర్చోనివ్వకుండా హెడ్‌కానిస్టేబుల్ రోడ్డు నుంచి వస్తూ ''మీకేం కావాలి'' అనడిగేడు.

రిపోర్టు ఇవ్వడానికి వచ్చేనని చెప్పేడు.

''అదిగో అక్కడ రైటరున్నాడు. అక్కడకెళ్లండి''

వెళ్ళి రిపోర్టు రాసిస్తే సరి! పదినిమిషాలయ్యేక అయినా తప్పదు. లోనికి వెళ్ళేడు.

రవి తిరిగి వచ్చేటప్పటికి చెలం బల్లమీద లేడు. రోడ్డుపై అటూ ఇటూ చూసేడు. లేడు. స్టేషను ప్రహారీదాటి లోనికివెళ్ళేడు. వరండాలో రైటరు ముందు రిపోర్టు రాస్తూ చెలం కనిపించేడు.

చెలం రవిని రమ్మని పిలిచేడు.

రవి వెళ్ళలేదు చెలం రాక తప్పలేదు.

చెలం చేతిలో సగం వ్రాసివున్న రిపోర్టు చూసేడు.

అది తీసుకున్నాడు రవి

స్టేషనులోంచి బయటకు వచ్చి ఆ రిపోర్టుని ముక్కలు ముక్కలుగా చించేశాడు.

''అరె! చించేస్తావేంరా''

''దాని అవసరం లేదుగనకా '' స్కూటర్ స్టార్టు చేసేడు

''అంటే''

''ముందు స్కూటరెక్కు''

మరు నిమిషంలో –

స్కూటరు హుషారుగా పోతోంది. రోడ్డు నిర్జనంగా వుండడంతో రోడ్డంతా ఆక్రమించి కుడినుంచి ఎడమ వైపుకీ – ఎడమనుంచి కుడివైపుకీ క్రాస్ చేస్తూ చెక్కర్లు కొడుతూ కేరింతలతో పోతోంది స్కూటర్.

చెలం రవిని గట్టిగా రెండు చేతులతో వాటేసుకుని కుదిపేస్తున్నాడు. రవి కాలుస్తున్న సిగరెట్‌ని చెలంకి అందించేడు, చెలం రెండుసార్లు పీల్చి రవి పెదాలపై పెట్టేడు. నిమిషాలు క్షణాలవ్వగా –

స్కూటరు చెలం ఇంటి ముందు ఆగింది.

## 4

స్కూటర్ ఆగేటప్పటికే – చెలం కిందికి దిగేసి వున్నాడు. విజయను ఎంతెంత వేగిరం చూస్తానా అనివుంది అతనికి. ఇంజన్ ఆపేడుగాని – స్కూటర్ దిగలేదు రవి.

''మరెనే వెళ్తాను '' అన్నాడు రవి.

''ఇప్పుడేం వెళ్తావు. – ఇక్కడే పడుకోగూడదూ ''

లేదు – అలవాటులేని చోట ఈ ప్రాణికి నిద్రపట్టదు''

''పోనీ లోనికిరా – తర్వాత వెళ్దువు.''

''ఇపుడు టైమెంతో తెల్సా ! – వంటిగంటన్నర. అంచేత మరే మనకు. స్కూటర్ నేను పట్టుకెళ్తాను. ఉదయం తీసుకొచ్చేస్తాను. ఇద్దరం ఇక్కణ్ణించే డ్యూటీకి వెళిపోదాం''

''సరే. అలాగే కానియ్''

''రైట్! వస్తాను''

ఇంజను స్టార్టుచేసి పోబోతూ చెలంతో అన్నాడు

''విజయతో ఏమీ గొడవపెట్టుకోకు. ఏమైనా వుంటే ఉదయం అడగొచ్చు. నిద్రపోనియ్. కేకలువేయకు.''

''భలేవాడివి. నేనెందుకేస్తా్రనా కేకలు''

''నీవు వేస్తావని కాదు  నీవు వేయాల్సి వచ్చేట్టుగా విజయ రెచ్చగొట్టవచ్చుగా! అలాంటి స్థితి వస్తే కంట్రోల్ చేసుకో  సర్దుకుపో – రైట్! వస్తాను  గుడ్‌నైట్''

''గుడ్‌నైట్''

అవతల స్కూటర్ గేటు దాటకముందే – ఇవతల డ్రాయింగ్ హాలుకి చేరి వున్నాడు చెలం

తల్లి, రంగమామ్మ ఉన్నారక్కడ

వాళ్ళు నిద్రపోకుండా తనకోసం ఎదురుచూస్తున్నారు

అలా విజయ ఎదురుచూస్తే ఎంత తృప్తి. తిరిగి, తిరిగి అలిసిపోయిన శరీరం ఎంత తేలికయ్యేది!

విజయ అతనెదురుగా లేకపోవడంతో నిరాశ, నీరసం!

''విజయ ఏది?''

''బెడ్‌రూమ్‌లో వుంది బాబు'' తల్లి పార్వతమ్మ.

''మహారాణి ఇంటికి ఎంచక్కా బాగానే వచ్చింది. నా చిట్టితండ్రి నిద్రలేకుండా ఎక్కడెక్కడ తిరిగి ఎన్నెన్ని అవస్థలు పడుతున్నాడో'' అనుకొని కొడుకు కోసం ఎదురుచూస్తూ అక్కడే అలా వుండిపోయిన తల్లిని అర్థం చేసుకున్నాడు చెలం.

తల్లిపై అతని మనసు ప్రేమతో  జాలితో నిండిపోయింది.

''వెళ్ళి పడుకో అమ్మా! ముందే నీ  ఆరోగ్యం మంచిదికాదు.'' అన్నాడు చెలం.

భోంచేయమంది కొడుకుని.

భోజనం చేయలేదనే సంగతి అంతవర్కూ గుర్తురాలేదు చెలంకి; నవ్వుకున్నాడు.

''వద్దమ్మా! ఆకలిగాలేదు''

''ఏమీ తినకుండా పడుకుంటే ఎలా. రెండు పళ్ళయినా తిను.''

రంగంమామ్మ ప్లేటులో పళ్ళు తీసుకొచ్చింది. గ్లాసుతో బటర్ మిల్క్  ఇచ్చింది.

తింటూ అడిగేడు చెలం – ''ఎన్ని గంటలకొచ్చింది విజయ.''

''పన్నెండవుద్దేమో''

''ఎందుకటా అంత ఆలస్యం ?''

పార్వతమ్మ మాటాడలేదు. తల దించేసింది.

చెలం మరోసారి అడిగేడు.

పార్వతమ్మ సమాధానం చెప్పలేదు.

చెలంకి కంగారెక్కువయింది. విజయ ఆలస్యానికి కారణం తల్లికి తెలుసని అర్థమవుతోంది. చెప్పడంలేదంటే చెప్పరానిదై వుండాలి ? తను అనుకున్నట్టు ఏ ఆటోవాడో అఘాయిత్యం ... జరగరానిదేదో జరిగి వుండాలి.

తెల్సిన కారణం చెప్పని తల్లిపై చిరాకు, చిరుకోపం వచ్చింది  చెలంకి.

''విజయ ఎందుకంత ఆలస్యంగా వచ్చిందో అడగలేదామ్మా నీవు ?''

అడిగినట్టు తల వూపింది పార్వతమ్మ.

''మరి చెప్పడానికేం?''

చెప్పక తప్పలేదు పార్వతమ్మకి – సెకండ్‌షో సినిమాకి వెళ్ళిందట బాబు.''

షాక్ తిన్నాడు చెలం కంగు తిన్నాడు చెలం. బ్రాన్పడిపోయేడు చెలం.

ఇంతవరకూ విజయ ఏమయ్యిందనేది ఎన్నోరకాలుగా, ఎన్నో కారణాలు అతనిముందు సినిమారీళ్ళలా కదలాడేయిగాని – ఆమె సినిమా కెళ్తుందనేది ఏ మాత్రం ఊహించలేకపోయేడు.

విజయపై చెలంకి చెప్పరాని కోపం వస్తోంది.

కొడుకుతో పార్వతమ్మ చెప్పాలంటే చాలా చెప్పగలదు.

ఆటోలో వచ్చిందని, ఆమె పక్కన మగవాడువున్నాడనీ . చెప్పగలదు. ''నన్ను వెదకడం ఎందుకు? నేనేంచిన్నపిల్లనా ఇల్లు తప్పిపోవడానికి? –'' ఇంకా ఏవేవో అంటూ భర్తపై విరుచుపడిన విజయ సంగతంతా ఆ తల్లి చెప్పగలదు. కాని చెప్పదు.

సినిమాకి వెళ్ళిన సంగతి కూడా చెప్పగూడదనుకుందిగాని తప్పలేదు.

పార్వతమ్మ కెందుకో భయంగా వుంది.

కొడుక్కీ కోడలికీ మధ్య అభిప్రాయ బేధాలేవో వచ్చి – అవి ఈ కొంపని కూల్చవుగదా అని భయపడింది. అలా కాకూడదని భగవంతుణ్ణి ప్రార్థించింది.

విజయ చేసిన పని పార్వతమ్మకి బొత్తిగా నచ్చలేదు.

మొగుడనే భక్తీ, భయం లేకుండా ఏవిఁటా తిరుగుళ్ళు ?

తనూ సంసారం చేసింది. ఏనాడైనా గడపదాటిందా ?

ఏనాడు ఆమె మొగుడు ఆమెను ఒక సినిమాకిగాని, షికారుకి గాని తీసుకువెళ్ళిన పాపానపోలేదు. ఏ సినిమాకైనా ఎప్పుడో రెండు మూడేళ్ళకోమారు ఇరుగమ్మ పొరుగమ్మతో భర్త పంపిస్తే వెళ్ళేది (మొగుడు పోయేక పార్వతమ్మ ఇపుడు, వారం, పదిరోజుల కొకసారి టంచనుగా సినిమాకి వెళ్తున్న సంగతి ఆమెకి గుర్తు రాలేదు!)

విజయలా తను ప్రవర్తిస్తే ఇంకేమైనా వుందా ? ఏ కాలో చేయో తీసేసి, జుట్టుపట్టుకొని బయటకి బరబరా ఈడ్చేసి 'పోయేలంజా' అని తలుపు మూసేయడూ! – అనుకుంది పార్వతమ్మ.

జేవురించిన ముఖంతో, కోపంతో వడివడిగా మెట్లెక్కుతున్న చెలం విజయని ఏం చేస్తాడో, ఏం గొడవ పడతాడో అని భయపడింది పార్వతమ్మ.

విసురుగా గదిలోకి ప్రవేశించాడు చెలం.

విజయ నిద్రపోతోంది.

రావడం, రావడం చెలం విజయను గట్టిగా మందలించి – ఎడా పెడా చెంపలు వాయిద్దామనే గదిలోకి ప్రవేశించేడు.

విజయ ముఖం చూసాక ఆ సంగతే మరిచేడు. ఆమెను లేపాలనిపించలేదు.

ఆమె ముఖం ఎంతో అమాయకంగా, బేలగా వుంది. కొద్దిగా వాడినట్టుగా కనిపించింది. ఆమె ముఖంలో అందం అలానే వుంది. ఆమె ముఖానికి పట్టిన చెమటని ఆర్పలేకపోతోంది పైనున్న సీలింగు ఫేను. ఆమె ముంగురులు వుంగరాలు తిరిగి చెంపలపైపడి చెక్కిలిగింతలు పెడుతున్నాయి.

చేతులు నడుంపై వేసుకుని నిమిషంపాటు అలా నిలుచుండిపోయేడు చెలం.

నిట్టూర్పు విడిచేడు. బాత్‌రూమ్‌కి వెళ్ళి వచ్చేడు

బట్టలు మార్చి లుంగీ చుట్టుకొన్నాడు.

లైటార్పి మంచం మీదకు చేరేడు. ఆమెనే మాత్రం అంటకుండా దూరంగా జరిగి పడుకున్నాడు.

అతనికి నిద్రపట్టడం లేదు.

సిగరెట్ వెలిగించేడు.

వెలిగించేడేగాని పొగతాగేది తక్కువ. సిగరెట్ వుందని గుర్తు కొచ్చినపుడు పొగ త్రాగుతున్నాడు.

అతనిది ఒకటే ఆలోచన –

ఎప్పుడూలేనిది విజయ ఎందుకిలా ప్రవర్తించింది ?

ఆ ప్రవర్తన వెనుక కారణాలు ఏమిటి ?

అందులో తన పాత్ర ఎంత ? ఆమె పాత్ర ఎంత ?

...

విజయ నిద్రపోవడంలేదని, నిద్ర నటిస్తోందని అతనికి తెలీదు.

ఆ మాటకొస్తే ఎందుకు నిద్ర నటించిందో విజయకే తెలీదు.

చెలం వడివడిగా మెట్లెక్కుతూ గథికి రావడం ఆమె పసిగట్టింది అంతే!

అతను గదిలోకి ప్రవేశించగానే అసంకల్పితంగా ఆమె కళ్ళు మూసుకున్నాయి.

తనెందుకలా కళ్ళు మూసుకుంది ? ఎందుకా నటన ?

భయమా ?

భయమెందుకూ ? – ఏదో తప్పుచేసినట్టు ?

తప్పు చేసిందాతను ?

లేదు

– రాజశేఖర్ దంపతుల నుంచి సెలవు పుచ్చుకుని విజయ కిన్నెర గార్డెన్స్ దాటేటప్పటికి టైము ఎనిమిదిన్నర దాటింది.

ఆటైము వరకూ విజయ కక్కడ వుండాలనిపించకపోయినా – చెలం వస్తే వస్తానన్నాడు గాబట్టి – వస్తాడేమో అని చూసిచూసి బయల్దేరింది.

ఆమె ఒక్కతే జగదాంబ జంక్షన్ వేపు నడుస్తోంది. ఆమెకి ఏడుపొస్తోంది.

పార్టీకి తీసికెళ్ళినట్టు తీసుకెళ్ళి మధ్యలో వదిలేసి వెళిపోవడం, ఆమె భరించలేకపోతోంది. ఒక అమానుష చర్యగాను, తనను తీవ్రంగా అవమానించినట్టుగాను ఫీలయింది.

ఇంటికి ఒంటరిగా వెళ్ళిపోమనడానికి అతని మనసెలా వచ్చింది.

పైగా ''ఏం భయమా'' అంటాడా ?

పాపం పెళ్ళం భయపడే రకమని ఇంటి దగ్గరే వదేసి పోవచ్చుకదా

తనంటే ఎంత నిర్లక్ష్యం ! ఎంత అహం !

ఈ విజయ దేనికీ భయపడదుగాక భయపడదు.

ఎవరికీ , దేనికీ తను భయపడేరకం కాదని అతనికి తెలియ చెప్పాల్సిన అవసరం వున్నట్టుగా భావించింది.

పరిస్థితులు వికటిస్తే భర్తను విడిచి స్వతంత్రంగా తను జీవించగలదు.

మాట పట్టింపుకొస్తే యీ ఆడది అర్ధరాత్రి పన్నెండు గంటలప్పుడయినా ఇంటికి నిర్భయంగా, ధైర్యంగా వెళ్ళగలదు.

బయల్దేరిందేగాని ఇంటికి వెళ్ళాలనిపించలేదు.

ఆమెకి చాలా చికాకుగా వుంది. మనసు కుతకుతలాడుతోంది. ఏదో చెప్పరాని కసిగావుంది.

జగదాంబ జంక్షన్ బస్టాండులో నించుంది.

ఆమె ఎక్కాల్సిన బస్సు వచ్చింది. ఎక్కలేదు. కాళీగా వుంది. ఎక్కలేదు.

ఆమెకెందుకో వెంటనే ఇంటికి వెళ్లాలనిపించడం లేదు.

మరొక బస్సు వదిలేసింది.

స్టాండులో పావుగంటనుంచి అలా నించుండిపోయింది.

రోషం, కోపం, దిగులు, అవమానం ఆమెనలా అంతసేపు నిలబెట్టేసేయి.

ఎంతసేపని నించుంటుంది ?

బస్సు వస్తే వెళిపోదామనుకుంది.

బస్‌రాదు. అయిదు నిమిషాలయింది బస్సురాదు.

బస్సు ఎంతకీ రాదేం అని బాధపడటం లేదు విజయ.

''హాయ్! విజ్జీ! ''

తల ఎత్తింది విజయ

ఛాయ!

కాలేజి రోజుల్లో స్నేహితురాలు.

కాలేజి చదువు సగంలో ఆపి ఉద్యోగంలోకి చేరడం వరకే తనకి తెల్సు, ఆ తర్వాత ఛాయని కల్సినట్టు గుర్తులేదు.

రెండు, మూడుసార్లు చూసిందిగాని పలకరించే అవకాశం కలగలేదు. ఒకటి రెండుసార్లు స్కూటర్‌పై నుంచే చేయి వూపింది. అంతే.

నగరంలో ఎవరి బతుకులు వాళ్ళవి. పక్కింటి వాడివైపు చూసే తీరిక, ఓపిక, టైము నగరవాసికిలేదు. ఎంతమందిలో నున్నా, నగరంలో మనిషి వంటరిజీవి. తన గురించి అవతలవాళ్ళకి అక్కర్లేదు. వాళ్ళ గురించి తనకీ అక్కర్లేదు. అవసరం వున్నప్పుడే అవతల మనిషి.

ఒకేవూళ్ళో వుంటూ పదేళ్ళయినా ఎదురెదురుపడి విజయ, ఛాయ మనస్సు విప్పి మాటాడుకోలేదంటే ఆశ్చర్యపడక్కర్లేదు.

కలిసి పదేళ్ళయిందనే భావం కూడా ఆ స్నేహితురాళ్ళకి కలగలేదు. అదే ఆశ్చర్యం!

మామూలు పరిచయం వున్నట్టే హలో అంటే హలో అని పలకరించుకున్నారు.

ఛాయని చూడగానే గొప్ప రిలీఫ్ ఫీలయింది విజయ.

ఛాయ ప్రక్కన పొడువుగా, బలంగా మగవాడు.

అతన్ని ''రాంబాబు'' అని పరిచయం చేసింది.

రాంబాబుకి విజయని పరిచయం చేసింది.

''ఎక్కణ్ణించి వస్తున్నావ్'' అడిగింది ఛాయ.

చెప్పింది విజయ.

''మీరెక్కడ నుంచి వస్తున్నారు ?'' అడిగింది విజయ.

''రావడం కాదు వెళ్తున్నాం. స్టాండులో నిన్ను చూసి ఆగేను''

''ఎక్కడికెళ్తున్నారు ?'' – విజయ.

''జగదాంబ – సినిమాకి'' – ఛాయ

పెళ్ళయిన కొత్తలో తనూ, చెలం, ఇలా ఎన్నిసార్లో సెకండు షోలకి వెళ్ళడం గుర్తుకొచ్చింది విజయకి.

''మాతో సినిమాకి రాగూడదూ'' – ఛాయ

''నేనా ?''

''మీ శ్రీవారు నీకోసం ఎదురుచూస్తుంటారా ?

''లేదు అర్జెంటు పనిమీద ఎక్కడికో వెళ్ళేరు.''

సినిమాకి వెళ్ళాలని నిశ్చయించుకుంది విజయ. అందుకు రెండు కారణాలు.

భర్త ఏడిపిస్తే – ఏడుస్తోంది తను.

అలాకాదు. భర్తనే ఏడిపించాలి.

ఏడిపించాలంటే సినిమాకి వెళ్తే చాలు – అది నెంబర్‌వన్.

తను భయపడేరకం కాదు.

అర్ధరాత్రయినా ఇంటికి చేరగలదు. అందుకిది సరైన అవకాశం – అది రెండవ కారణం.

విజయ వాళ్ళతో జగదాంబ ఇంగ్లీషు సినిమాకి వెళ్ళింది.

వెళ్ళడం వెళ్ళిందే గాని సినిమా సరిగా చూడలేకపోయింది.

గుండెల్లో దడదడ

ఏదో తప్పు చేయడంలేదు కదా – శంక, భయం

ఛాయతో కబుర్లు చెప్పలేకపోయింది.

ఇంట ర్వెల్ కయితే – ఇంటికెళ్లి పోదామనిపించింది. ఛాయ నవ్వుతుందని వూరుకుందిగాని తను ఒక్కతే వస్తే తప్పక వెళ్ళిపోయేది ఇంటికి.

సినిమా ముగియడంతో విజయకి ఎక్కడలేని భయం వచ్చింది టైము అప్పుడు సరిగ్గా 12 గంటలు.

ఇంటికి ఎలా వెళ్ళాలి ?వెళ్లి ఎందుకు లేటంటే ఏమని చెప్పాలి ?

''సారీ! విజయా. సినిమాకి పిలిచి నిన్ను బాధ పెట్టాను కదూ'' అంది ఛాయ.

''ఛ. ఛ. అదేం లేదు. సినిమాకి కావాలనే వచ్చాను. బాధేవిఁటి ? నిజానికి నీతో చాలా హేపీగా గడిచిపోయింది. సినిమాకూడా బాగుంది... ఇకపోతే ఇంటికిపుడెలాగెళ్ళాలని ఆలోచన. అంతే.'' అంది నవ్వుతూ.

''ఆటోమీద వెళదాం విజయా ! రాంబాబు నిన్ను ఇంటివరకు దిగబెడతాడు.''

ముగ్గురూ ఆటో ఎక్కేరు.

ఆటో దొండపర్తి మీదుగా వెళ్ళి – ఒక పెంకుటింటి ముందు ఆగింది.

ఛాయ దిగి ''ఇదే మా ఇల్లు'' అని విజయకి చూపించింది.

''మా ఇంటికి వొకసారి తప్పక రావాలి''

విజయ తప్పక వస్తానంది. ప్రామిస్ చేయమంది ఛాయ.

''ప్రామిస్'' అంది విజయ – ''మరి మా ఇంటికెపుడొస్తావ్''

''ముందు నీవురా. తర్వాత నేను'' చేయి నొక్కి వదిలింది ఛాయ.

''రాంబాబూ! జాగర్తగా దిగబెట్టేయ్'' అంది ఛాయ

ఆటో కదిలింది.

విజయకి గుండెల్లో దడ.

అర్ధరాత్రి ఆటోలో తను... తనపక్కన ఒక మగవాడు.

ఛాయవున్నంతసేపు రాంబాబు మంచివాడుగానే తోచేడు. ఇపుడు మృగంగా తోచేడు. ఏ క్షణంలో వంటిమీద చేయివేస్తాడో –

అతను ఒకమాట కూడా ఆడకుండా బుద్ధిగా చేతులు కట్టుకు కూర్చోడం చూసి అనవసరంగా భయపడ్డాననుకుంది; ఆటో కుదుపులతో, స్పీడుగా ముందుకి పోతోంది.

ఇంటికి ఎలా వెళ్ళాలి, ఏమని ఇంటిదగ్గర చెప్పాలి అని భయపడిన విజయలో ఒక మొండి ధైర్యం ఏర్పడింది. ఎలాటి పరిస్థితినైనా ఎదుర్కోడానికి సిద్ధపడింది.

''విజయ నిలయం'' ముందు ఆటో ఆగింది.

విజయ ఆటో దిగింది.

రాంబాబుకి థాంక్స్ చెప్పింది.

అప్పటికే పార్వతమ్మ, రంగంమామ్మ, అక్కడికి పరుగున వచ్చేరు.

పార్వతమ్మ 'అతనెవరూ' అని అడగలేదు. అంత ధైర్యం ఆమెకిలేదు. ఆలస్యం గురించి అడిగింది. అధికారంగాకాదు. అతి నెమ్మదిగా.

సినిమాకి వెళ్ళినట్టు కుండబద్దల కొట్టినట్టుగా చెప్పింది-విజయ.

చెలం వెదుక్కుంటూ వెళ్ళడం గురించి చెబితే – 'వెదకడం ఎందుకూ ? నేనేం చంటిపిల్లనా తప్పొడిపోడానికి'' అని లోపలికి వెళ్ళింది.

కొడుకు సందీప్ గురించి అడిగి, ఒకసారివాడిని తనివితీరా చూసుకొని – తన బెడ్‌రూమ్‌కి దారితీసింది.

ఆ రాత్రంతా చెలం తనని వెదుకుతున్నాడంటే ఆమె మనసు గర్వపడింది. ఆమె అహం తృప్తిపడింది.

ఫర్వాలేదు – కసితీర ఏడిపించాను అనుకుంది.

ఆమె అంతరాంతరాల్లో ఎక్కడో ఏ మూలో – ఛీ! పాపిష్టిదాన్ని అతన్ని ఎంత బాధపెట్టాను? ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో పాపం!' అన్న భావం ఆమెకి కలగలేదని అనుకుంటే అది ఆత్మవంచనే!

తను చేసింది తప్పు అవునోకాదో గాని తెలివితక్కువగా వ్యవహరించినట్టు ఆమెకి తోచకపోలేదు.

అంచేతనే చెలం బెడ్‌రూంలోకి వచ్చిరాగానే ఆమెకి తెలీకుండా నిద్ర నటించే పరిస్థితి ఏర్పడింది.

డబుల్‌కాట్‌పై పక్కనే వున్న చెలం నిద్రపోడంలేదని ఆమెకి తెల్సు.

విజయకి భర్త కుడిభుజాన్ని దిండుగా చేసుకుని అతని గుండెలపై చేయవేసి నిద్రపోడం అలవాటు. ఆ దిండుమీదికి చేరకుంటే ఆమెకి నిద్ర పట్టకపోవడమే కాదు – మనశ్శాంతి కూడా వుండేలా లేదు.

అస్థిమితంగా మంచంపై అటూ ఇటూ కదిలింది.

ఆమె నిద్రపోడంలేదని గ్రహించడానికి చెలంకి ఒక సెకను పట్టింది.

''విజయా'' అని పిలిచేడు. ఆ పిలుపు మృదువుగా లేదు.

విజయ మనసు చివుక్కుమంది. పలక్కపోతే మరోసారి నటించినట్టవుతుంది. తను నటించాల్సిన ఖర్మేమీ పట్టలేదు. పడుకున్నట్టు నటించడమే పెద్ద పొరపాటు చేసింది. రెండో పొరపాటు చేయదు.

''విజయా'' కాస్త గట్టిగానే పిలిచేడు.

''ఊఁ! ఏం'' అంది అదేస్థాయిలో, నిర్లక్ష్యంగా

లైటు వెలిగింది.

''కూర్చో''

కూర్చుంది.

''ఎక్కడికెళ్ళావ్''

అతను అడుగుతున్నతీరు ఆమెకి నచ్చలేదు. తనూ అదేతీరున వెళ్లక తప్పదు.

''వెళ్ళింది నేను ఒకర్తినేకాదు. ఇద్దరం వెళ్ళాం. మీకు తెలుసు ఎక్కడికెళ్ళింది.''

''అమ్మాయిగారి తెలివితేటలకి సంతోషించాంగాని - ఇంతరాత్రి వరకూ ఎక్కడ తగలడ్డావ్ అని అడుగుతున్నా.''

''మీరు నన్నక్కడ అర్ధాంతరంగా, అమాంతంగా, అమానుషంగా, నిర్దాక్షిణ్యంగా వదిలేసి వెళ్ళినపుడు - నేను ఎన్ని గంటలకి ఇంటికి తగలడతాననుకున్నారు. ?''

''తొమ్మిది - తొమ్మిదిన్నర''

'' ఆ తగలడాల్సిన టైముగూడా చెబితేపోనుకదా అప్పుడు ''

''చెప్పక్కర్లేదు. ఏ సంసారి అర్ధరాత్రుల్దాక తిరగదు.''

''బాగుంది. రాత్రులు తిరిగే ఆడది సంసారికాదు. మరి మీరెంత సంసారులు ? వారానికి నాలుగైదు రోజులైనా ఇంటిపట్టున ఉంటున్నారా ? వెళ్ళేక మీరు ఏ రాత్రి ఎంతెంత టైముకివస్తునారో గుర్తుచేసుకోండి. గుర్తు చేసికొని మీరు సంసారి అవునో కాదో నాకు చెప్పండి''.

''నీకు చెప్పాల్సిన పనిలేదు. మగాడికెన్నో పనులుంటాయి. అవినీకు చెప్పినా అర్ధం కావు. చెప్పక్కర్లేదు కూడాను. పెద్దలవాక్కు వినేవుంటావు. ఆడది తిరిగి చెడిందని. మగాడు తిరగక చెడ్డాడని.''

''ఆ పెద్దమనిషి మగాడే. వాడి రక్తమల్లా - మీకుమల్లేను - పురషాధిక్య అహంకారమే. మగాడికోనీతి, ఆడదానికోనీతి. ఎప్పుడో, ఎవడో పెద్దమనిషి అన్నాడంటే అప్పటి పరిస్థితుల్లో వాడి ఆలోచన ఆ స్థాయిలోనే వుండొచ్చుగాక. పెరగకపోవచ్చుగాక. సమాజం మారుతున్నా మీరా పెద్దమనిషిలానే అల్పంగా, నీచంగా ఆలోచించడం - ఛీ ఛీ నాకు సిగ్గేస్తోంది. చదువుకున్న వాడివి నీ సంస్కారం ఇంతే అనుకోలేదు.''

''నోర్ముయ్!'' అరిచేడు. రవి కంట్రోల్ చేసుకోమన్నాడనే సంగతి మరిచేడు చెలం.

''సందేహంలేదు. మీరూ ఆ పెద్దమనిషి ఒక్కటే! '' నిదానంగా అంది విజయ.

''పొగరుతగ్గించు. బరితెగించి అర్ధరాత్రిదాకా తిరిగొచ్చిందికాక పెద్ద కబుర్లు ఆడుతున్నావు- సెకండుషో సినిమాకి వెళ్ళావా లేదా ?''

''తెల్సే ఇంత నాటకం ఎందుకూ? ముందే ఆ మాట అడగొచ్చుగా. సరే నే చెబుతున్నాను వినండి. మీరు విన్నది కరక్టే. నేను సినిమాకి వెళ్ళేనన్నది పచ్చినిజం. అబద్ధంకాదు.''

''ఎవడెళ్ళమన్నాడు నిన్ను ?''

''ఎవడూ వెళ్ళమనలేదు. నేనే వెళ్ళాను'' 'డూ' అనే అక్షరం నొక్కిపలికింది.

''ఎందుకెళ్ళేవ్.''

''వెళ్ళాలనిపించింది. వెళ్ళేను. నన్ను వదిలేసి వెళిపోయేరు. అది మీ ఇష్టం. నేను సినిమాకి వెళ్ళాను. అది నా యిష్టం!?''

అంతే!

విజయ చెంప ఛెళ్ళుమంది.

విజయ కళ్ళు బైర్లుకమ్మేయి.

షాక్‌నుంచి తేరుకోడానికి ఆమెకి టైము పట్టింది.

చెంపమీద చేతితో అలా బొమ్మలా వుండిపోయింది. రెప్పపడలేదు. నోటిమాట రాలేదు.

ఆమెను బాధించింది అయిదు వేళ్ళూ అంటుకున్న తీవ్రమైన చెంపదెబ్బ కాదు. నా చెలం యింత హీన సంస్కారుడా. ఇంత పశువా. తను ప్రేమించి పెళ్ళిచేసుకున్న చెలం – ఈ చెలం ఒక్కడేనా!

ఆమె కళ్ళల్లో నీటికుండలు బద్దలయ్యేయి.

చెలం ముఖం చూడాలంటే నిలువెల్లా అసహ్యం! అసహ్యం!

ముఖాన్ని రెండుచేతులు మధ్య దాచుకొని భోరున ఏడ్చింది.

బొమ్మలా పడుకొని తలగడ మధ్య తలదూర్చి ఏడ్చింది.

చెలం ఆమెను ఓదార్చే ప్రయత్నం చేయలేదు.

చెలం కొడదామనుకోలేదు.

కావాలని కొట్టలేదు. కొట్టాలనీ కొట్టలేదు.

అప్పుడలా చేయి వెళ్ళిపోయిందంతే.

అందుకు బాధపడి లాభంలేదు. ఆ మాటకొస్తే బాధపడ్డంలేదు.

అతని మనసు శాంతించింది. అతని అహం చల్లబడింది.

ఆమెచేసిన తప్పుకి చెంపదెబ్బ చాలా చిన్నశిక్ష.

ఆడదాని స్వాతంత్రం, స్వేచ్ఛకి అతను వ్యతిరేకి కాడు. కాని ఆడదాన్ని వుంచాల్సినచోటున వుంచాలని నమ్ముతాడు.

విజయ చెలంని అసహ్యించుకున్నట్టుగా – చెలం విజయని ఏ మాత్రం అసహ్యించుకోవడంలేదు. ఆమెను ఎప్పటిలానే ప్రేమిస్తున్నాడు.

ఆ ప్రేమను కాపాడుకోవటానికే కొట్టేడు.

ఆమెలేనిదే బ్రతుకలేడు గనక ఆ విధంగా జాగ్రత్తపడ్డాడు.

లైటు ఆర్పేశాడు.

విజయ వెక్కిళ్ళు వినిపిస్తున్నాయి.

చెలం చేతులు రెండు తలకిందకి పెట్టుకొని వెల్లకిలా పడుకున్నాడు.

ఆమెను ఓదార్చే ప్రయత్నం ఏ మాత్రం చేయలేదు.

ఆమె వెక్కిళ్ళు ఆగకముందే చెలం నిద్రపోయేడు. తెల్లవారకముందే విజయ నిద్రపోయింది.

బాధలూ, భయాలూ, దుఃఖాలూ, సమస్యలూ నిద్రని మనిషికి అందనీయకుండా దూరంగా కొంతసేపు వుంచగలవేగాని మనిషికి నిద్ర లేకుడా చేయలేవు. అదివాటి తరంకాదు – ఒక్క అనారోగ్యం తప్ప!

ఆ తర్వాత –

మూడురోజుల వరకూ చెలం ఎడమొగం. విజయ పెడమొగం.

ఇద్దరి మధ్య మాటలులేవు.

దంపతులిద్దరూ ఎవరి పనులు వాళ్ళు చేసుకుని ఉద్యోగాలకి వెళ్ళిపోవడం – సాయంత్రం ఇంటికి రావడం – సాయంత్రం సందీప్‌తోనో, పుస్తకాలతోనో గడపడం – సైలెంటుగా డైనింగ్ టేబుల్‌పై భోజనాలు ముగించేయడం – నిద్ర వచ్చేవరకూ ఏ నవలో పట్టుకోడం – నిద్ర రాగానే పడుకోడం –

ఆ రాత్రి కూడా –

అలానే పడుకున్నారు. కాని – పొరపాటున ఒకరి శరీరాలు ఒకరికి తగిలేయి. అంతే! పెద్ద అలజడి.

విజయ గుండెలపై చెలం చేయి పడింది.

విజయ తుళ్ళిపడింది. మగత నిద్ర ఎగిరిపోయింది.

అతనిచేయి విసిరికొట్టింది. వళ్ళంతా బట్ట నిండుగా కప్పుకుంది.

ఒక సెకను మాత్రమే వేసిన చెలం చేయి – ఆమె శరీరానికి కరెంటు సప్లయి చేసింది. నరాల్లో తీయని బాధ – ఛీ ఛీ వెధవ శరీరం అనుకుంది.

ఆ కొంటి చేయి మళ్ళీ ఆమె గుండెలపై వాలింది.

విసిరికొట్టింది.

ఆ కోతిచేయి మళ్ళీ అదే పనిచేసింది.

చేయిని నెమ్మదిగా తీసేసింది.

చెలం చేయి మళ్ళీ పడింది.

ఈసారి ఆ చేతిని తీయడమేకాదు. కదపడం కూడా ఆమెకి సాధ్యం కాలేదు. ఆమె శక్తి చాలలేదు.

అతని రెండు చేతులూ పడ్డాయి.

ఆమె పెనుగులాడింది. గింజాకుంది.

ఆ చేతులను ఆమె బలంగా ఎదుర్కోడానికి విఫలయత్నం చేస్తోంది.

అతని చేతులు వెళ్ళాల్సిన చోటుకెళ్ళి ఆమెను వెర్రెక్కిస్తున్నాయి. వేడెక్కిస్తున్నాయి.

ఆమె ఓడిపోతోంది.

ఆమె ఏడుస్తోంది. అతన్ని రక్కేస్తోంది. తిడుతోంది.

ఆమె శరీరమే ఆమె మాటవినే స్థితిలో లేదు. అతనేం వింటాడు.

గదిలో డిమ్ముగా పరుచుకున్న నీలికాంతి.

కిటికీలోంచి చల్లగావీస్తున్న గాలి.

గాలిమత్తుగా మోసుకొస్తున్న నైట్‌క్వీన్ పరిమళం.

అతనిలో ఆమె, ఆమెలో అతను ఒదిగిపోయి, ఒకటైపోయి, కరిగిపోయి, కాగిపోయి అలాగే..అలాగే ఇంకా ఇంకా ఆ సుఖం, ఆ స్వర్గం, ఆ అద్భుతానందం, ఆ తీయతీయని బాధ. అలాగే వుండిపోవాలి – వుండిపోవాలి. రోజంతా కాదు జీవితాంతం – కాదుకాదు జన్మజన్మలకీ – వుండిపోవాలి.

వుండాలనుకున్నది మూడునిముషాల్లో ముగిసిపోయింది!

అయ్యో ముగిసిపోయిందనిపించినా అందులో ఏమాత్రం అసంతృప్తిలేదు ఆ శరీరాలకి

ఆ మూడు నిమిషాల్లోనే జీవితాంతం కలిగే సుఖం, జన్మజన్మలకీ వుండిపోవాలనే సుఖం పూర్తిగా, సంపూర్తిగా, సంతృప్తిగా అనుభవించేశారు.

ఇక చచ్చిపోయినా ఫర్వాలేదు – అన్నట్టుగా పడిపోయాయి శరీరాలు.

ఎటువంటి చికాకులైనా, కలతలైనా మరిచిపోయేదక్కడే. కోపాలూ, కక్షలూ అణగారి పోయేదక్కడే. శంకలూ, బాధలూ, భయాలూ, భారాలూ, బరువులూ తొలగి శరీరాలు తేలికయ్యేది అక్కడే. దుఃఖాలూ, ద్వేషాలూ, ఆవేదనలూ సమసిపోయి ఊరట చెందేదక్కడే పంతాలూ, పట్టుదలలూ, పట్టింపులూ సడలిపోయేదక్కడే. చల్లారిపోయేదక్కడే, సమస్తమైన సమస్యలనుంచీ శరీరానికి ఉపశమనం కలిగేది ఎక్కడో కాదు అక్కడే. అక్కడే.

ఆ మూడు నిమిషాల సుఖంలో పోగొట్టుకున్నదేదో పొందినట్టు, గజిబిజిగా వున్నదంతా సర్దుకున్నట్టు మాయగా, చిత్రంగా వుంటుంది.

అలసిన శరీరాలు రెండూ సేదతీరుతున్నాయి.

ఈ జన్మలో చెలంతో మాటాడగూడదనుకున్న విజయ, చావనైనా చస్తానుగాని అతన్ని తాకేదిలేదని అనుకున్న విజయ – ఇప్పుడు అతని గుండెలపై వాలి తృప్తిగా పడుకుంది. అతను చేసిన అవమానానికి చచ్చిపోదామనుకున్న విజయ – అతనులేకుంటే చచ్చిపోతాను, అతను లేకుండా తను బతుకెందుకు అంటోంది ఇపుడు.

అతడు ఆమెను కొట్టిన చెలమే. అతడు ఆమెను నీచంగా తిట్టిన చెలమే ఆమెకి పరమ పరమ అసహ్యం కలిగించిన చెలమే అతడు.

## 5

చెలం ఆమె నుదిటిపై చెమటికి చెల్లా చెదురైన ముంగురులను సరిచేసి సుతారంగా ముద్దు పెట్టుకున్నాడు.

వీపు నిమురుతూ, జుట్టులోకి వేలు పోనిస్తూ విజయను దగ్గరికి తీసుకున్నాడు.

ఆమెకి నిద్రవస్తోంది. నిద్రపోనీయ్‌మని బతిమాలుతోంది. కాని అతను అల్లరి పెడుతున్నాడు. నిద్రపోనివ్వడం లేదు

విజయకి హాయిగా నిద్రపోవాలని వుంది.

నిద్ర తప్ప ఆమెకి ఇంకే సమస్యాలేదు. అన్నీ పరిష్కారమై పోయేయి. అన్ని మబ్బులూ విడిపోయేయి.

అతను ఆమెను క్షమించేసాడు. ఆమె అతన్ని క్షమించేసింది.

ఆరోజు ఆమె చెంపని ఛెళ్ళుమనిపించడం, అనరానిమాటలనడం తప్పు, తప్పే అని ఒప్పుకున్నాడు. క్షమించు, క్షమించు అన్నాడు. క్షమించకపోతే ఒప్పుకోన్నాడు. తనుకు మనశ్శాంతి లేదన్నాడు.

విజయ అదే సమయమనుకుంది. రోజూ పోరుతున్న డిమాండ్లను గుర్తుచేసింది. అతనిముందు పెట్టింది.

ఏమిటవి?

''పార్టీ కవనీ, షికారుకవనీ – ఎక్కడికైనా కలిసి వెళ్లిన ఇద్దరూ తిరిగికలిసే రావాలి. ఏ పరిస్థితిలోను మధ్యలో వదిలేయగూడదు''

ఆ డిమాండుని ఆమోదించేడు చెలం.

''వారం కొకసారి – కనీసం వారం కొకసారి తనని ఎక్కడికైనా తీసుకువెళ్ళాలి. సినిమా కావొచ్చు, బీచ్‌కావొచ్చు. లేదంటే వూర్కోనే ఒక రవుండ్ కొట్టడమే కావొచ్చు.

రెండో డిమాండ్‌ని కూడా ఆమోదించేడు చెలం. సందీప్‌కి 'టింపనీ స్కూల్లో' సీటు సంపాదించాలంది. అలాగే అన్నాడు.

''మేరేజ్‌డే పెళ్ళిరోజు ఇంకెన్నాళ్ళోలేదు. నాకు పట్టుచీర కొనాలి''

ఒప్పుకున్నాడు. అది అతను డిమాండుగా అనుకోలేదు. ఆమెకి అలాంటివి ఎన్నైనా కొనగలడు.

పెళ్ళిరోజుకి చెలంకి బట్టలు తనే తీస్తానంది – ఆమె జీతంతో. బట్టలు ఆమె సెలక్టు చేస్తానంది కాదనగూడదు.

ఒప్పుకున్నాడు, ఆమెకోసం ఏమైనా చేస్తాడుతను.

ఇలాంటి చిన్న చిన్న డిమాండులు ఆమోదించేడు గాని మేజర్ డిమాండ్ ఆమోదించలేదు.

అదేమిటంటే –

'' చెలం సాయంత్రాలు అన్నీ పూర్తిగా విజయతోనే గడపాలి''

డ్యూటీనుంచి వచ్చేక మరెక్కడికీ వెళ్ళగూడదు. వెళితే ఆమెతోనే వెళ్ళాలి.

అయ్యేపని కాదన్నాడు చెలం.

ఎందుకు అయ్యేపనికాదో నచ్చ జెప్పేడు.

చెలం ఉద్యోగం చేస్తూ బిజినెస్ మరోసైడు చేస్తున్నాడు.

విశాఖపట్నం చుట్టుపక్కల గ్రామాలన్నీ తిరగడం – రైతుల నుంచి కొంతభూమి అడ్వాన్సు ఇచ్చి తీసుకోడం – వాటిని ప్లాట్లు వేయడం – అమ్మడం అదేపని. స్టీల్‌ప్లాంట్ రావడంతో కొన్నాళ్ళకి విశాఖ రూపురేఖలే మారిపోతాయని అందరూ అనుకోవడమే – విశాఖలో ఇసకకి కూడా అంత డిమాండ్

చెలం రైతు దగ్గర గజం ఏ పదికో కొని పాతిక్కీ, ముప్పయికి అమ్ముతాడు.

కొనేవాడు ఈ వేళ ముప్పయి రేపు మూడువందలు చేస్తుందని కొంటాడు.

దీనికోసం ఉడా ఆఫీసు వెనుకా, లేండ్‌సీలింగ్ ఆఫీసు వెనుకా లేఅవుట్ అప్రూవల్స్ కోసం తిరుగుతాడు.

ఇంకేం ఇంటిపట్టున వుంటాడు?

అవకాశం ఎక్కడిది?

విజయకి సాయంత్రాలు దక్కాలంటే ఒకటే మార్గం

చెలం లేండ్ బిజినెస్ మానేయాలి.

అతడు మానడని ఆమెకి తెల్సు.

తెల్సే అడిగింది, సాయంత్రాలు తనవి కావాలంది.

అది అయ్యేపని కాదన్నాడు చెలం.

ఆమె అలిగింది. అమరణ నిరాహారా దీక్ష చేస్తానని బెదిరించింది అతనికి సుఖాన్నివ్వకుండా సమ్మె చేస్తానంది.

యజమాని బెదిరిపోలేదు గాని–

సమస్యను సామరస్యంగా సహృద్భావ వాతావరణంలో పరిష్కరించుకోవాలని నచ్చజెప్పి – తనో పరిష్కారం చూపించేడు.

''సాయంత్రాలు అడగకు. అందుకు బదులుగా ఆదివారం అంతా నీది. ఆదివారం పూర్తిగా నీకు ధారాదత్తం చేస్తున్నాను. ఆ రోజంతా ఇలా నీ పక్కలో పడుకోమంటే పడుకుంటాను. పడుకోడంకాదు లేచి డాన్సు చేయాలి అంటే చిత్తం మహారాణీ అంటూ చేస్తాను'' అన్నాడు నవ్వుతూ.

విజయకి ఆ పరిష్కారం బాగానే వుందనిపించింది.

అందుకామె అంగీకరిస్తూ ఒ సవరణ చేసింది.

ఆదివారలేకాదు – పండుగసెలవులూ, పెళ్ళిరోజులూ, పుట్టిన రోజులూ – అవన్నీ ఆమెవే కావాలంది. ఆ రోజులన్నీ చెలం ఆమెతోనే గడపాలంది.

చెలం అంగీకరించక తప్పలేదు.

ఆ విధంగా ఉభయులూ ఒక పరిష్కారానికి వచ్చేరు.

ఆ ఎగ్రిమెంటుకి రాతలు లేవు. సంతాకాలు లేవు. సాక్ష్యాలు లేవు.

వారిద్దరూ అన్యోన్య దంపతులు. వారికి నోటిమాటకన్నా ప్రాంసరీ నోటుకి విలువలేదు. అంతరాత్మని మించిన సాక్షులు మరెవరూ లేరు. అక్కర్లేదు.

చెలం కౌగిల్లో పూర్తిగా ఒదిగిపోయి వుంది విజయ

అతని కుడి భుజాన్ని దిండుగా చేసుకుని అతని గుండెలపై దట్టంగా, రింగులు రింగులుగా తిరిగివున్న వెంట్రుకల్ని సుతారంగా స్పృశిస్తు పొడవుగా సాగదీస్తోంది. ఎంత సాగదీసినా ఉంగరాలుగా, రింగులు రింగులుగా అల్లుకుపోయే వుంటామంటున్నాయి ఆ వెంట్రుకలు. ''మేం చెలంకన్నా మొండివాళ్ళం వి మేమే నెగ్గుతాం' అంటున్నాయి అవి.

ఆ వెంద్రుకల్ని సాగదీస్తునే వుంది.

అవి సాగినట్టుసాగి ముడుచుకుపోతూనే వున్నాయి – రింగులుగా

డిమాండులు సాధించడంతో సరిగాదు –

వాటిని అమలు పరిచినపుడే ఎంతసాధించిందీ తేలేది! అసలు రంగు తెలిసేది ? విజయ సాధించేశానని సంబరపడిపోతోంది. తెగ సంబరపడిపోతోంది. ఆ సంబరం ఏమిటో మేం చూస్తామమ్మా సంబరాల విజయమ్మా !అంటున్నాయి ఆమె చేతికి లొంగని వెంట్రుకలు.

## 6

చెలం విజయకోసం ఆ రోజు రాత్రంతా ఎక్కడెక్కడకి తిరిగింది, ఎన్నెన్ని తిప్పలుపడింది వివరంగా చెప్పేడు.

పకపకమన్నది విజయ.

''ఆ రోజు నన్నేడిపించినందుకు మీకాపనిష్మెంటు జరగాల్సిందే'' అన్నది.

విజయ కూడా ఆ రోజు జరిగింది జరిగినట్టుగా సంగతంతా చెప్పింది. పూర్తిగా చెప్పలేదు. చెప్పనీయకుండా మధ్యలోనే కథని అడ్డం తిప్పేశాడు చెలం.

మారేజ్‌పార్టీనుంచి ఇంటికి బయల్దేరడం – అప్సరా నుంచి జగదాంబవరకూ నడిచిరావడం – వచ్చిన బస్ వదిలేయడం – బస్సుని వదిలేసి అలా నించోడం...

అంతవరకూ విజయ చెప్పింది బాగానే విన్నాడు.

ఫీల్డులోకి ఛాయ ప్రవేశించేప్పటికి – నిటారు అయేడు చెలం.

చిరాగ్గా నొసలు చిట్లించేడు చెలం.

అతను అనుకుంటున్న ఛాయ, జగదాంబ జంక్షన్‌లో కలిసిన ఛాయ – ఇద్దరూ వేర్వేరు అయితే బాగుండ్ను అనుకున్నాడు .

ఛాయ!

కోలమొహం, చామనఛాయ. పొడవుగా వుంటుంది. గుండెలు నిండుగా వుంటాయి.

సన్నగా వుంటుంది. బుగ్గమీద నల్లని చుక్క వుంటుంది. ఆమె ఆడవాళ్ళ మధ్య నుంచుంటే వాళ్ళలో ఒకరిలా కలిసిపోదు. ప్రత్యేకంగా స్పష్టంగా కనిపిస్తుంది. విలక్షణంగా తోస్తుంది. మనిషి మంచి పొడవు, సుమారు అందం.

ఆమె చెలంకి తెల్సిన ఛాయ.

విజయకి తెల్సిన ఛాయ ఆమేనా ?

అడిగేడు చెలం.

''ఛాయ మీ కంపెనీలోనే పని చేస్తోందట. మీరు చూసే ఉంటారు. మీరు తనకి తెల్సంది'' కన్‌ఫర్మ్ అయిపోయింది చెలంకి.

చెలం ముఖం వికృతంగా మారింది.

'' ఆ మహాతల్లి నాకేమిటి ? అందరికీ తెల్సు అది. దానికి అందరూ తెల్సు. దానికి తెలియని మగాడు లేడు ''

''అంటే?''

''అది నెంబర్‌వన్ బిచ్!''

''ఎవరి గురించి నీవంటున్నది ?''

''నీవెవరిగురించి అడిగేవు ?

''ఛాయ!''

''యస్ – అదే బిచ్! నెంబరువన్ బిచ్. ముతగ్గా చెప్పాలంటే లంజ''

''ప్లీజ్ ! అంతరూడ్‌గా మాటాడకు'' వారించింది విజయ.

ఆమె ఒక్కసారిగా అదోలా అయిపోయింది.

గడగడ మంచినీళ్ళు తాగింది.

ఛాయ బిచ్!

ఛాయ లంజ!

ఆ మాటలు తను భరించలేకపోయింది.

ఛాయ అటువంటిదంటే నమ్మశక్యం కావడంలేదు.

చెలం ఆమెపై నిందవేస్తున్నాడు. అన్యాయంగా, అర్థం లేకుండా వూరికినే ఆమె పై అంతనీచమైన ఆరోపణ చేస్తున్నాడు – అనిపించిందామెకి.

ఏమంటే –

తను చూస్తున్నదికదా. తను ఉద్యోగం చేస్తున్నది కదా. ఉద్యోగం చేస్తున్న ఆడది ఎన్నెన్నినిందలకు గురిఅవుతుందో! ఆడదంటే మగాడు ఎంతతేలికగా ఎంతెంత నీచంగా నలుగురిలో మాటాడతాడో తను చూస్తూనే వుంది.

నలుగురిలో తిరిగే ఆడదానిపై ఎలాంటి కథలల్లి ఒకపనిగా ఎలా ప్రచారం చేస్తారో తను ప్రత్యక్షంగా చూస్తూనే వుంది.

చెలం కూడా అందరు మగాళ్ళలాగే మాటాడ్డం ఆమెకి బాధ అనిపించింది.

ఏ వెనుకటి తరంవాళ్ళో ఏ మూర్ఖులో అలా వాగుతున్నారంటే ఏదో అనుకోవచ్చు. చెలం భార్యచేత ఉద్యోగం చేయిస్తూ వుండీకూడా తోటి ఉద్యోగిని గురించి అలా నీచంగా మాటాడ్డం నచ్చలేదు. అదేనా అతని చదువూ సంస్కారం!

ఆఫీసులో ఆడా, మగా కలిసి పనిచేస్తున్నప్పుడు ఒకరితో ఒకరు మాటాడుకోకుండా ఎలా వుంటారు ? స్నేహాలు కాకుండా ఎలా వుంటాయి? స్నేహం చేస్తే తప్పేవిటి?

ఒక ఆడా, మగా తరచూ మాటాడుకోవడం చూస్తేచాలు – పార్కులో కనిపిస్తే చాలు – రోడ్డుపై ఎదురైతే చాలు – సినిమాహాల్లో దొరికితేచాలు – ఇక బతకనీయరు. ఆ విషయం అందరి మధ్యకి వెళిపోతుంది. ఆ యిద్దరి గుడ్డలూ విప్పేసి – మంచంమీదికి తోసేసి ఊహల్లో బ్లూఫిలిం చూస్తారు.

అదేం సరదావో. అదేం ఆనందమో ! అనుకుంది బాధగా విజయ.

"చెలం! నీవన్నది నాకేం నచ్చలేదు. తోటి ఉద్యోగిని – ఆడదైన నేరానికి – పదిమంది పక్కలో పడుకోబెట్టేసి లంజ, బిచ్ అనడం చాలా దారుణం. నీవన్నది ఛాయ వింటే ఎంత హర్టవుతుంది. ఎంత బాధపడుతుంది . ఆలోచించు."

"ఆలోచించడానికి ందులో ఏంలేదు. మధ్యలో నీవు బాధపడిపోతున్నట్టు కనిపిస్తోంది గాని దానికి బాధా, సిగ్గు, భయం అలాంటివి లేవు. నిర్లజ్జగా, నిర్భయంగా, పబ్లిగ్గా వెధవతిరుగుళ్లు తిరగదు. దానికి బాధేమిటి ? నీమొహం."

ఆ రోజు విజయ సెకండ్‌షో సినిమాకి వెళ్ళినందుకు చెంపదెబ్బతో సరిపెట్టేసాడు గాని – ఛాయతో వెళ్ళినట్టు అప్పుడే తెలిస్తే విజయని చంపేసును ! ఆ రోజు పార్టీలో విజయని వదిలి వెళిపోవడం – ఎంత బుద్ధి తక్కువపనయింది ? ఆ బుద్ధితక్కువపని చేయకుంటే ఛాయ లంజ విజయకి తగిలేది కాదుకదా. విజయ రెండో ఆట సినిమాకి వెళ్ళిందంటే ఈ లంజనుంచే కదా! ఛాయనీడకూడా విజయపై పడితే తను సహించలేడు.

విజయ ఆమెను వెనకేసుకురావడం అతనికి చిరాగ్గా వుంది.

"చెలం! నీవన్నట్టు ఛాయ తిరుగుళ్ళు తిరుగుతుందే అనుకుందాం. తిరిగితే చెడిపోయినట్టేనా?"

"ఎందుక్కాదు ? ఆడది తిరిగి చెడింధన్నారు పెద్దలు వినలేదా ?"

"విన్నాను. ఆ పెద్దల మాట అమ్మమ్మలకాలంలోనిది. నేటి స్త్రీ నాలుగ్గోడల మధ్యనుంచి నలుగురిలోకి రావల్సిన పరిస్థితి ! అది నీవు అర్థం చేసుకోకుండా పాతకాలపు తాతలాగే మాటాడుతున్నావు– పోనీ నీవన్నట్టు చెడుతిరుగుళ్ళే తిరుగుతుందనుకుందాం. అందువల్ల నీకొచ్చిన నష్టం ఏవిటి ? చెడు తిరిగుళ్లు తిరుగుతుందోచ్చి అని దండోరా వేయడం వల్ల వచ్చే లాభం ఏవిటి ?"

"లాభనష్టాలు ఏవిటి ? నలుగురూ మసిలేచోట ఫలానా మనిషి ఫలానా విధంగా

నడుస్తోందని – అనుకోకుండా ,చెప్పుకోకుండా వుండలేడు మనిషి. అది సహజం. అందరిలా కాకుండా, భిన్నంగా నడిచేవాళ్ళ గురించి – చర్చించకుండా వుండలేరు ఏ ఒక్కరూను! అందులో తప్పేముంది? వెధవ పనులు చేస్తూ – వెధవపని చేసినట్టు ఎవరూ మాటాడకూడదంటే ఎట్లా ? అంత భయం ఉన్నప్పుడు, నలుగురికీ జడిసినపుడు – వెధవ పనులు మానెయ్య వచ్చుకదా ! తప్పుతోవలో నడిచేవాళ్ళని – అదిగోనడుస్తున్నారని వేలెత్తి చూపే హక్కు ప్రతివాడికీ వుందంటాను.

''నేను లేదంటాను. వాళ్ళు తప్పుతోవన వెళ్తున్నారని నీవు నిజంగా ఫీలయితే – వేలెత్తి చూపడంకాదు చెలం – నీకు చేతనయితే సరైన మార్గం చూపించు. అసలు మనం మన లోపాల్ని చూసుకోం. మన తప్పుల్ని మనం వెదుక్కోం. అవతలవాడి లోపాల్ని, తప్పుల్ని వెదుకుతాం. ఒకర్ని తప్పుపట్టే హక్కు ఎవర్కీ లేదంటాను.''

''ఓ.కే. ! నీవన్నట్లు అలాంటి హక్కు ఎవర్కీలేదనే అనుకుందాం. అంతమాత్రాన నిజం నిజంకాకుండా పోతుందా ? వాస్తవం వాస్తవమేకదా. డాల్ఫిన్స్ కొండ వైజాగులోవుందని ఎవరూ చెప్పకపోయినా, చెప్పింది నమ్మకపోయినా – డాల్ఫిన్స్ కొండ వైజాగులో వుందనేది తిరుగులేని వాస్తవం. ఛాయి చెడిన ఆడది అనే హక్కు ఎవర్కీలేక పోయినా, నీవు నమ్మకపోయినా 'ఛాయ చెడిన ఆడది' అనేది తిరుగులేని వాస్తవం '' అన్నాడు.

''వైజాగులో డాల్ఫిన్స్ వుందని ఒప్పుకునేవాళ్ళంతా ఛాయ చెడిపోయిందంటే ఒప్పేసుకోవాలి అంతేనా చెలం ?''

విజయ చెలంని ఒకోసారి పేరు పెట్టిపిలుస్తుంది. ఒసారి 'అండీ' అంటుంది. ఒకసారి 'మీరు' అంటుంది. ఆ తేడా ఆమె గుర్తించినట్టు కన్పించదు. ప్రేమించుకు తిరిగినపుడు నీవు అనడం, పేరు పెట్టి పిలవడం అలవాటు ఆమెకు. పెళ్ళయ్యేక అందరిలా అండీ, మీరు అందామనుకుందిగాని కుదరలేదు. ఆతర్వాత ఆ ప్రయత్నం మానేసింది, నోటికేదొస్తే అది. ఎలా పిలిచినా చెలం పలుకుతాడు.

''విజయా ! నీవొప్పుకున్నా, ఒప్పుకోకపోయినా ఛాయ ఒక లంజ అంతే!''

''చాలా అన్యాయంగా మాటాడుతున్నావ్ చెలం'' అంది విజయ.

అంతకన్నా ఏమి అనాలో తెలీడంలేదు. తల్లీ, చెల్లీ, పెళ్ళాం తప్ప ప్రతి ఆడదీ మగాడికి బిచ్! ఆ ముగ్గురు స్త్రీలను కూడా మినహాయించకుండా మొత్తం ఆడజాతినే లంజలనే ప్రభుద్దులూ లేకపోలేదు.

''చెలం! ఛాయా, నేను ఇద్దరం ఉద్యోగాలు చేస్తున్న ఆడవాళ్ళమే.. ఛాయ పరాయి ఆడది గనుక లంజ. నేను మీ పెళ్ళాన్ని గనుక మహాపతివ్రతని. కాని మిగతా పురుష ప్రపంచానికి వారి దృష్టిలో నేను లంజనే కదా ''

వెర్రెక్కిపోయేడు చెలం.

''పిచ్చిగా వాగకు... నీకూ, ఆ లంజకీ కంపేరిజనా ? నోర్మూస్కుకో!...నిప్పులేకుండా

పొగరాదు. అదెలాంటిదో నీకు తెలీదు. అది మగాళ్ళేసుకుని తిరిగడం నేను కళ్ళారా చూసాను.''

''అదే అంటున్నాను. అంతమాత్రం చేత 'లంజ' అనేస్తే ఎలా ? ఆరోజా నేను ఆటోలో అర్ధరాత్రి ఒక మగవాడి పక్కన వచ్చేను – నేను చెడిపోయానంటే నీవు నమ్ముతావా ? నమ్మవు. కాని ఆ స్థితిలో మరొకరు ఏమనుకుంటారు. ?''

చెలం ముఖం నల్లబడింది.

విజయ ఒక పరాయి పురుషుడితో ఆటోలా రావడం తను ఊహించలేనిది అతను సహించలేనిది, ఏ మాత్రం భరించలేనిది.

ఆ ఒక్కరాత్రి ఎన్నెన్ని చిత్రాలు చేసింది విజయ!

గట్టిగా మందలించేవాడే. ఆరాత్రి సంఘటన మీదే పెద్దరభస జరిగి లెంపకాయకొట్టి మూడు రోజులకి మళ్ళీ కలిసేరు. మళ్ళీ గొడవకి దిగడం అతనికి ఇష్టం లేకపోయింది. జరిగిందేదో జరిగిపోయింది. ఇకపై అటువంటివి జరగడానికి తను ఏ మాత్రం అవకాశం ఇవ్వడు. అదే తప్పు ఆమె మళ్ళీ చేస్తే క్షమించడు.

అదిసరే – ఆటోలో విజయ ప్రక్కన ఎవరా పురుషుడు ? – అడగకుండా వుండలేక పోయేడు చెలం.

''అంత అర్ధరాత్రి నీకంత సాయం చేసిన మహానుభావుడెవరు ?''

చెలం మాటల్లో వ్యంగ్యం, విసురు విజయకి అందలేదు.

''ఎవరో కాదు. ఛాయభర్త రాంబాబు''

''రాంబాబా ?''

''అవును ఏం''

''వాడితో నీవు రావడం చూసినవాళ్ళు ఏదో అనుకోడంకాదు. అనుమానం పడ్డంకాదు. నీపనిపట్టేసాడనే అనుకుంటారు ఎవరో ఎందుకూ. నీవు రాంబాబుతో వచ్చేవంటే నాలో ఏదో ఆందోళన !''

''చెలం!''

''అవును. విజయా! నీవు తెలిసో, తెలీకో చాలా తప్పు చేశావు''

''ఏం తప్పు చేశాను?'' ఆమె తెల్లబోయింది. ''ఒక స్నేహితురాలి భర్త సాయంతో సురక్షితంగా ఇంటికి చేరాను. అందులో తప్పేమిటీ''

''రాంబాబు ఛాయ మొగుడు గాదు. రంకు మొగుడు.''

ఆశ్చర్యపోయింది విజయ!

ఇంతవరకు రాంబాబుని ఛాయ భర్తగానే అనుకొని మాటాడుతోంది ఆరోజా 'మా శ్రీవారు' అని ఛాయ పరిచయం చేయనప్పటికీ ఛాయభర్తే అనుకుంది విజయ.

రాంబాబుకి 35 ఏళ్ళు.

ఛాయకీ వుంటాయి దరీ దగ్గర 30 ఏళ్ళు!

తనకి మరో ఆలోచన ఎలా వస్తుంది ?

అయినా ఆ రోజు తనమూడ్ బాగోలేదు. ఛాయ అడిగిన వాటికి జవాబులే చెప్పింది తప్పా, మనసువిప్పి మాటాడలేక పోయింది.

అందుకేనా చెలం ఛాయను అంత దారుణంగా తిడుతున్నది ? రాంబాబుని, ఛాయని భార్యాభర్తలుగా కాకుండా మరోవిధంగా వూహించుకోడం గొప్ప షాకింగ్‌గా వుంది.

''రాంబాబు పిట్టలరాయుడు. వాడితో నీవు తిరగడం, రావడం నాకు చాలా బాధగా వుంది విజయా!''

''క్షమించు చెలం! నాకు తెలీదు. నిజంగా నాకు తెల్వదు. అతను అటువంటివాడని తెలిస్తే ఎందుకంత పనిచేస్తాను?...చెలం! నా మీద నీకు నమ్మకం లేదా ''

''నీపై నమ్మకం లేక కాదు. వాడిపై నమ్మకంలేక. ? రోడ్డుపై నేను స్కూటర్ జాగ్రత్తగానే నడుపుతాను. మరేం భయంలేదు అనుకుంటాను. కాని పక్కవాడు కళ్ళుమూసుకు తొక్కేవాడు నాకు డేష్ కొడితే అక్కడ నా జాగర్తలూ, నియమాలు ఏం పనిచేస్తాయి ? నిన్ను వాడప్పుడు బలవంతం చేస్తే ... ఏం చేద్దువు? ఏమౌదువు ?''

గుండెలపై భయంగా చేయి వేసుకుంది విజయ. రాంబాబు అప్పడామెతో ఎంత మర్యాదగా వున్నదీ ఆమెకి గుర్తురాలేదు.

''వాడు అంత ఘాతుకం కాదు – నీ వంటి మీద చేయి వేసినా నేను భరించగలనా ? నీపై పరాయివాడి చేయి కాదు ఊపిరి తగిలినా నేను సహించలేను విజయా. నీవు నన్నేమనుకో. వట్టి అనుమానవు మొగుడో, పాతకాలపు మొగుడో – నీవేమనుకో . నాకు అభ్యంతరం లేదు కాని నా విజయపై పరాయి పురుషుడి గాలికూడా సోకడానికి వీల్లేదు.

చెలం అంటున్నది విజయ కొట్టి పారేయలేకపోతోంది.

'' అవును విజయా ! నన్ను నేను సమర్థించుకోడం కాదు. భార్య మరోమగాడితో తిరుగుతుంటే చూసీ చూడనట్టు వదిలేసి పట్టించుకోని వాళ్ళను చేతకాని చవటలంటాను. పెళ్ళాల్ని తార్చే బ్రోకర్‌వెధవ అంటాను. భార్యను నిజంగా ప్రేమించినవాడు అలా ప్రవర్తించడు. మా ఆఫీసులో నేను చూస్తున్నా కదా – బాస్ ప్రాపకం కోసం కొందరు లంజాకొడుకులు పెళ్ళాల్ని తాకట్టు పెడతారు. తారుస్తారు. నేను ఆ విషయంలో బాహాటంగా వాళ్ళని విమర్శిస్తాను. అలాంటి నాకు నా భార్యని ఫలానావాడితో ఆటోలో చూసానని చెప్పుకుంటే ఎలా వుంటుంది. ''

''క్షమించు చెలం! నిన్ను బాధపెట్టాను. నా అదృష్టం కొద్దీ అతడు నా పట్ల మర్యాదగానే ప్రవర్తించేడు. అయినా నాతప్పు నాకు అర్థమయింది. అది తల్చుకుంటే నాకు భయం కూడా వేస్తోంది.''

చెలంకి ఆమె సమాధానం తృప్తి నిచ్చింది.

అతడు ఆమెను క్షమించేసాడు.

రాంబాబు ఛాయ భర్తకానిచో మరెవరు ?

రాంబాబు ఛాయతో ఇల్లీగల్ కాంటాక్టు వున్న తుచ్ఛుడు. వాడికి భార్యా, పిల్లలూ వున్నారు. అందమైన పెళ్ళాం, ముచ్చటైన ముగ్గురు పిల్లలు. వాడు అదే కంపెనీలో పనిచేస్తున్నాడు.

''పెళ్ళాం, పిల్లలుంటుండగా వాడికదేం పాడుబుద్ధి ?'' అడిగింది విజయ.

''పాడు బుద్ధివాడిది కాదు. ఛాయది. వాడిని తప్పుపట్టకు. వాడు మగమహారాజా. నీతి ఆడదానిలో వుండాలి. ''

''అంటే మగాడు శ్రీరామచంద్రుడు కాకపోయినా ఫర్వాలేదు. ఆడదిమాత్రం సీతా అనసూయా కావాలి''

'' ఆడది సీతా అనసూయలు కానక్కర్లేదు. శ్రీరామచంద్రుళ్ళను కూడా చెడగొట్టే ఛాయలు లేకుంటే చాలు'' అన్నాడు నవ్వుతూ చెలం

''చెడు దగ్గర ఆడా, మగా తేడా ఏమిటి ?''

'' ఆడది అరిటాకు. మగాడు ముల్లు. !''

''నాన్సెన్సు. అరిటాకు – ముల్లు కబుర్లు వదిలేయండి. చెడు ఎవరు చేసినా చెడే. తప్పు చేసింది ఎవరు ? ఆడా, మగా అని వేరు చేయకుండా ఎవర్నైనా సరే ఆక్షేపించవలసిందే. ''

చెలం నవ్వేసాడు.

''వాదనలెందుకూ. నీవన్నది ఒప్పుకుంటాను. మొత్తానికి ఛాయ చెడిన ఆడదని నీవు ఒప్పుకున్నట్టేకదా. దాని తిరుగుళ్ళూ, దాని రంకు మొగుళ్ళూ కళ్ళారా చూసావు, నమ్మినట్టేకదా''

నమ్మలేకపోతున్నా విజయకి నమ్మక తప్పలేదు.

ఛాయ ఇంటికి ఏదోకరోజు వెళ్ళాలనుకుంది ఇంతవరకూ. ఒక నిట్టూర్పు విడిచి మరి వెళ్ళక్కర్లేదనే నిర్ణయానికి వచ్చేసింది.

ఛాయపై ఆమెకి అసహ్యం వేయలెదు గాని తనని ఫూల్ చేసినట్టు ఫీలయ్యింది. చెలంముందు తన వాదనంతా తీసికట్టుకావడానికి కారణం ఛాయే అనిపించి చిరాకు పడింది.

ఏది ఏమైనా ఛాయ ప్రవర్తన విజయకి నచ్చలేదు.

# 7

పనివంనిషి లచ్చివింతో పొందవలసిన అనుభవం చెలం రాకతో ఆ రోజు చెల్లాచెదురైపోయింది రవికి.

వారం రోజుల వరకూ ఏదో అవాంతరం! కుదరలేదు.

వారం తర్వాత – మొత్తానికి కుదిరింది అనుభవం.

నిజంగా అది అనుభవమా ?

రాత్రి పది గంటలపుడు – బెడ్‌లాంప్ వెల్తురులో – అతని గుండెలు దడదడలాడుతుండగా – ఒళ్ళంతా వేడివేడి సెగలతో మండి కాగిపోగా – వణుకుతున్న చేతులతో లచ్చిఁవిని కౌగిల్లోకి తీసుకున్నాడు.. అంతలోనే దూరంగా జరిగేడు.

లచ్చిఁవి దగ్గర ఏదో వాసన. మురికి కంపు. చెమట కంపు. చీర, జాకెట్టు మాసిన కంపు.

దాని తలలో మల్లెపూలు ఉన్నప్పటికీ పూలపరిమళం ఆ కంపులను పారదోలలేకపోతోంది.

అతని ఉద్రేకం ఉరకలు వేసినా ఉత్సాహం సన్నగిల్లింది.

ఆమెపై చేతులు తీసేసేడు.

లచ్చివిఁని స్నానం చేయమన్నాడు.

సబ్బు కొత్తది ఇచ్చేడు. తను వాడుతున్న సబ్బు ఎందుకో ఇవ్వలేకపోయాడు.

అదే సుజాత అయితే తను బాత్రూమ్‌లోకి దూరి అల్లరి చేసేవాడు.

పనిమనిషితో ఆరకం శృంగారం చేయాలనిపించలేదు.

బీరువాలో మందుతీసి గ్లాసులో ఒంపుకున్నాడు.

సిగరెట్ వెలిగించేడు.

సుజాతతో పడుకునే మంచం మీద లచ్చివిఁని ... అతనికి ఇష్టం లేకపోయింది.

పక్క నేలని పరిచేడు. ఇంతా స్నానంచేసి ఆ కంపుచీరతో ఒళ్లు తుడుచుకోదు కదా.!

వెళ్ళి టవల్ ఇచ్చేడు. తుడుచుకుంది ఒళ్ళు.

పౌడరు ఇచ్చేడు.

అది ముఖానికి మాత్రమే పులుముకుంది.

రవి దగ్గరికి వెళ్ళి ఆమె మెడ కింద, చంకలకింద, వీపుమీద, గుండెలమీద పౌడరు ఒత్తుగా జల్లిపావేఁడు.

అప్పటికే అతనిలో ఉద్రేకం కట్టలు తెచ్చుకుంటోంది.

ఆమె శరీరం కోసం అతని శరీరం తొందర పెడుతోంది.

ఆమెను దగ్గరిగా తీసుకుని ముద్దుపెట్టబోయేడు. ఎందుకో ఆగిపోయేడు.

అతని మనసు తిరగబడుతోంది. ఆమె ఒళ్ళంతా ముద్దులు ముద్దులు కురిపిద్దామనుకున్నాడు. మనస్కరించలేదు. ఆమె ఎంత స్నానం చేసి, శుభ్రంగా ఉన్నప్పటికీ – అతని పెదాలు ఆ శరీరాన్ని ముద్దులాడటానికి ముందుకు రామని మొండికేసేయి.

ఏ శృంగారం లేకుండా కేవలం వాంఛకి సిద్ధపడక తప్పలేదు రవికి.

అదే సుజాత అయితే శృంగారమొక రసవత్తర ఘట్టం. అరగంట శృంగారం తర్వాతగాని అసలు రంగంలోకి దిగడు!

ముద్దులతో ముంచెత్తని భాగంలేదు. గోళ్లతో కొరకని భాగంలేదు. అతనికప్పుడు

అడ్డులేదు. ఆపులేదు  అసహ్యంలేదు.

సెక్సువిషయంలో అతనికి సుజాతతో అలవాటుపడిన కొన్ని పద్ధతులున్నాయి.

లచ్చివిఁ ఎంత సహకరించినా

ఆమెను అనుభవించలేకపోయేడు.

అతనికిష్టమైన శరీరం సుజాతదేనని – మరే శరీరమైనా అతని మనసు సహకరించదని అతనికి అప్పుడు అర్ధం కాలేదు.

రవి పూర్తిగా ఫెయిలయ్యేడు.

తను ఏదో తప్పు చేస్తున్నానన్న భావవ, సుజాతకి అన్యాయం చేస్తున్నాననే తలంపు, ఎవరైనా తలుపుకొడ్తారనే బెదురు, ఏకళ్ళు ఎక్కడ చూస్తున్నాయో, ఏ క్షణంలో ఎవరికి దొరికిపోతామనో భయం – ఆడ శరీరమే అయినప్పటికీ ఆమెలో తను కలిసిపోడానికి కరిగిపోడానికి ఏదో అస్పష్టంగా అయిష్టతే – అతన్ని సెక్సులో విముఖుణ్ణీ, విఫలుడ్నీ చేసేయి.

అతను ఆమెతో అంతగా సుఖం, పెద్దగా తృప్తి పొందలేకపోయినప్పటికీ – ఆడదానిముందు అతను ఓటమి భరించలేకపోయేడు.

అది పనిమనిషికావొచ్చు, డబ్బుకి వచ్చే వేశ్య కావచ్చు. ఏ ఆడదైనప్పటికీ సెక్సులో ఓటమికి ఎంతో సిగ్గుపడ్డాడు.

అంత చేతకానివాడివి నన్నెందుకు పిలిచావనో, చేతకానివాడివి కాబట్టే పెళ్ళాంలేకుండా ఇలా ఒంటరిగా వుండగలుగుతున్నావనో – ఆమె అనుకుంటుందేమోనని సిగ్గుపడ్డాడు.

మరోసారి ప్రయత్నించి తన మగతనం చూపాలనుకున్నాడు.

కాని లచ్చిఁవి పక్కమీంచిలేచి – చీర కట్టుకుంటుంటే – వద్దని వారించలేకపోయేడు.

లచ్చివిఁ ఎంతెంతవేగంగా, గభాల్న ఇంట్లోంచి బయటపడుతుందా అని అతని మనసు ఎదురుచూస్తోందని గ్రహించలేకపోయేడు.

''వస్తాను'' అంది లచ్చివిఁ.

''వెళ్ళు'' అన్నాడు రవి.

వెళ్ళు తల్లీ మళ్ళీరావద్దు రావద్దు అంది మనసు.

లచ్చివిఁ పెరటి తలుపులు తెరుచుకు అలా వెళ్ళిందో లేదు తలుపులు వేగిరం చప్పుడు లేకుండా వేసేసి, గెడపెట్టేసి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు రవి.

అతనిపై అతనికి ఎనలేని అసహ్యం వేసింది.

తను చేసిన ఈ వెధవపని కన్నా స్వయంతృప్తి నయంగా తోచింది.

ఎంచక్కా పెళ్ళాలు వుండగా – పరాయి ఆడదాని పొందుకు మగాడు ఎందుకు వెళతాడో అర్ధం కాలేదు రవికి. సుజాతేవుంటే తను ఇలాంటి వెధవ పనులు చేయడుగాక చేయడు. తను సెక్సులో సుజాత దగ్గర వీరాధివీరుడు. మరో ఆడదాని దగ్గర నిర్వీర్యుడు. డామ్ ఇంపొటెంట్!

మళ్ళీ ఇలాంటి తప్పుడు పనులకు జన్మలో తలదూర్చనని లెంపలు వాయించుకున్న

రవి తనమాట ఎంతవరకూ నిలబెట్టుకోగలడనేది అనుమానమే!

బాత్రూమ్‌కి వెళ్ళి వచ్చిన రవికి అనుమానం వచ్చింది – ఈ ముండకి ముండ జబ్బుగాని లేదుగదా! – గుండెల్లో వణుకుపుట్టింది.

రేపు డాక్టరు దగ్గర కెళ్ళడం ఎందుకైనా మంచిది అనుకున్నాడు.

''సుజాతా! ఏ ఉద్యోగం వద్దు – వెంటనే రిజైన్ చేసి బయల్దేరిరా'' వెంటనే వెళ్లి టెలిగ్రాం చేయాలనిపించింది.

వెంటనే అతనికి సుజాత వ్రాసిన ఉత్తరం గుర్తుకొచ్చింది

మూడురోజులుగా రిష్లయి ఏమిటిరాయాలో తెలియక సతమతమవుతున్న తనకి సమాధానం దొరికినట్టయింది. టేబుల్ ముందుకూర్చుని కలం, కాగితం తీసేడు. వ్రాసేడు. వ్రాసిన కాగితాన్ని కవరులో పెట్టి, అంటించి అడ్రసు వ్రాసి – చొక్కా వేసుకుని – తలుపులు వేసుకుని వీధిలోకి వెళ్ళి ఉత్తరాన్ని పోస్టు చేశాడు.

సుజాత పెట్టిన గడువులోగా – ఆమెకీ ఉత్తరం పోస్టు చేసేసాడు. అతని మనసు తేలికయింది. తృప్తిగావుంది. లచ్చివింతో అనుభవం పూర్కొనే పోలేదు. సమాధానం దొరికింది!

రవి పడుకున్నాడు. అతనికి నిద్రపట్టలేదు.

సుజాత ఉత్తరం తీసి మరోసారి చదివేడు. ఈ మూడురోజులు ఎన్నిసార్లు చదివిందీ చెప్పటం కష్టం.

సిగరెట్ వెలిగించి చదవనారంభించేడు.

''శ్రీవారికి నమస్కారాలు –

మీదగ్గరనుంచి ఉత్తరాలు కరువవుతున్నాయి. మీ క్షేమ సమాచారాల గురించి నాకు ఎప్పటికప్పుడు తెలుపుతుండండిబాబూ అంటే మీకు ఏ మాత్రం లక్ష్యం లేదు. ఇక్కడ, ఇంతదూరంలో పెళ్ళాం ఎలా వుంటుందో, పిల్లలు ఎలావుంటున్నారో మీకు పట్టదు. మీకు అక్కర్లేదు. మేము మీకు అక్కర్లేనప్పుడు – మీరు మాకూ్కడా అక్కర్లేదు – అని అనుకోలేకపోతోంది ఈ పాడుమనసు.

మీరెలాగుంటున్నారో, ఏం తింటున్నారో, ఆరోగ్యం ఎలా వుందో అని రోజూ పిచ్చిగా నా మాట వినకుండా మీకోసం తపించిపోతోంది ఈ పాడుమనసు. ఆందోళన చెందుతోంది. మీ క్షేమసమాచారాలతో వారానికొక కార్డు ముక్క రాసినంతలో మీ విలువైన కాలం వృధా అయిపోతోందంటే నమ్మనంటుంది అదేమనసు!

మీరేం మగమహారాజు! అక్కడ హాయిగా వున్నారు. చావంతానాదే.

పిల్లల ఇద్దరి అల్లరీ విపరీతంగా వుంటోంది. తెల్లారి లేచింది మొదలు రాత్రి నిద్రపోయేవరకూ నాకు ఒకటే యాతన, హింస అయిపోతోంది. ఆ యాతనా, ఆ హింసా మీరు భరించనక్కర్లేదు, పంచుకోనక్కర్లేదు. ఆ పెంట అంతా నేనే భరిస్తాను. మీరు నా దగ్గరుంటే చాలు. లేదా నేను మీ దగ్గరుంటే చాలు!

అన్ని యాతనలూ, అన్ని హింసలూ, అన్ని బాధలూ, అన్ని బరువులూ – మీ గుండెలపై పడుకొని ఆ సుఖంలో వాటినుంచి రిలీఫ్ పొంద గల్గుతాను.

మీ వెచ్చని ఊపిరి తగులుతుంటే నన్నే సమస్యలూ బాధించవు. రోజూ నేను చేస్తున్న చాకిరీ పెరిగినా – ఏ విసుగూ, ఏ కష్టం లేకుండా చేసుకుపోగలను. రోజంతా ఎంత కష్టపడినా – రాత్రయ్యేటప్పటికి మీ పక్కని పడుకుంటే చాలు – అన్ని కష్టాలు తీరిపోయి 'సుఖం' గా మారిపోతుంది. హాయిగా నిద్రపడుతుంది తెల్లారి లేచేక వేయేనుగుల బలం వస్తుంది.

ఏ రోజుకారోజు పడిన శ్రమ, చిరాకు, విసుగు, బాధ అన్ని ఏ రాత్రికి ఆ రాత్రి – మీలో ఐక్యమై అన్నీ మరిచిపోగలను

నాకా అవకాశమేది ? అదృష్టమేది ?

ఆ రిలీఫ్ ఏది ? ఆ సుఖమేది ?

గత వారం పదిరోజులుగా నాకు అసలు నిద్ర పట్టడంలేదు. తరచూ మీరే గుర్తుకొస్తున్నారు. మీ గుండెలపై హాయిగా పడుకుని ఎన్నాళ్ళయింది ? ప్రతిరాత్రి వసంతరాత్రి అనేది ఒక పాటగా వుండిపోడంకాదు. అది నా జీవితంలో ఒక భాగం కావాలనుంది.

ఏ సుఖమూ లేకుండా గడిచిన రాత్రులు ఎలానూ గడిచిపోయేయి. రాబోయే రాత్రులయినా దక్కించుకోమంటుంది మనసు. అల్లరి పెడుతోంది వయసు.

మనసుకీ వయసుకీ సమాధానం చెప్పలేకుండావున్నాను. మీరే చెప్పాలి సమాధానం!

నాకు పిచ్చెక్కిపోయి – మీ దగ్గరికి పరిగెట్టుకు రావాలనిపిస్తోంది. ఈ ఉత్తరానికి ముందు నేను వచ్చేసినా ఆశ్చర్యపోనక్కర్లేదు.

ఒక్కోసారి చచ్చిపోవాలనిపిస్తోంది. ఎందుకు ఈ బతుకూ అనిపిస్తోంది.

ఉద్యోగం, వంటా, పిల్లల చాకిరీ ... ఇదే జీవితమైతే అక్కర్లేదునాకు.

మీతోనే నా జీవితం. మీరు తప్పించి నాకేం అక్కర్లేదు.

చూస్తున్నాకదూ.. పెళ్ళయినప్పట్నించి అదిగో, ఇదిగో అన్నారే గాని విశాఖలో ఉద్యోగం చూడలేకపోయేరు. చూస్తారని నాకు నమ్మకమూలేదు.

ఇంట్లో మగాడులేకపోతే ఎన్నెన్ని ఇబ్బందులో మీకు ఎంత చెప్పినా అర్థంకాదు. పిల్లలకి ఏ జ్వరం, ఏదోచ్చినా, హడలిపోతున్నాను. పిల్లలు పూర్తిగా పాడయిపోతున్నారు. నాకు ఇక్కడ ఉద్యోగం ఏ మాత్రం చేయాలనిపించడంలేదు.

ఇన్ని సంవత్సరాలు మీకు దూరంగా ఎలా గడపగలిగానో నాకు అర్థం కావడంలేదు! ఏమంటే మీరులేని రోజు తల్చుకుంటే యుగంలాతోస్తోంది. దుఃఖమొస్తోంది. బతుక్కి అర్థం లేదనిపిస్తోంది.

నా సంగతి ఏం చేశారు ? – అని మిమ్మల్ని అడిగి లాభంలేదు.

నేను ఉద్యోగం రాజీనామా చేయడానికి నిర్ణయించుకున్నాను. అక్కడ ఉద్యోగం అదే దొరుకుతుంది. నేను వుండగా చేసే ప్రయత్నాలు వేరు. నేను లేకుండా చేసే ప్రయత్నాలు వేరు.

తప్పక ఉద్యోగం అక్కడ దొరక్కపోదు. పోనీ దొరక్కపోతేమానె – ఏం నష్టమేమిటి ? ఎంచక్కా మీకూ, పిల్లకీ సేవచేసుకునే, ఇల్లుతీర్చి దిద్దుకునే అవకాశం కావలసినంత తీరక – ఎంతో మంది యిల్లాళ్ళకుమల్లే – నాకు లభించిందనుకుంటాను. పాడు ఉద్యోగాలొచ్చి పాడు చేశాయిగాని ఆడదానికి ఇల్లు, భర్త, పిల్లలు అంతకన్నా ఏంకావాలి ?

అన్ని విధాల ఆలోచించే ఉద్యోగం రాజీనామా చేయడానికి నిర్ణయించుకున్నాను. హాస్యంకాదు. నిజంగానే సీరియస్‌గానే వ్రాస్తున్నాను.

రాజీనామా ఎవరైనా చేస్తే కంపెనీ బాస్ ఆమోదించవలసి వుంటుంది. అందుకు మీ ఆమోద ముద్ర ముందుగా అక్కర్లేదు – రూలు ప్రకారంగా!

కాని ఆడదానికి భర్తే బాస్. ఆమెకి రిజైన్ చేసే స్వతంత్రం లేదు భర్త ఆమోదముద్రకావాలి. స్త్రీ ఆర్థిక స్వాతంత్రం ఏమిటో, ఎంతో ఇక్కడే అర్థమవుతోంది! నా డబ్బుతో నేను చీర కొనక్కోవాలన్నా భర్త పర్మిషన్, ఆమోదం తీసుకోవాలి. అదీ ఉద్యోగస్తురాలి ఆర్థికస్వాతంత్రం!

ఈ పరిస్థితిల్లో ఇక్కడ ఉద్యోగం చేయడం నాకు ఏ మాత్రం ఇష్టంలేకపోయినా – మీ ఇష్టం కోసం చేస్తున్నాను.

ఇష్టంలేని ఉద్యోగం ఎందుకు చేయాలి ? రిజైన్‌చేసే హక్కు నైతికంగా వున్నది. అధికారం లీగల్‌గావున్నది. హక్కు, అధికారం, వున్నప్పటికీ మన సాంఘిక స్థితి అవరోధం కల్పిస్తుంది. అందుకునేను బాధపడ్డంలేదు. ఏమంటే మీరు అర్థం చేసుకుంటారు. అంగీకరిస్తారు.

మీరు అంగీకరించరని నేను అనుకోడంలేదు.

ఎందుకు అంగీకరించరు ?

మీరు నన్ను పెళ్ళిచేసుకున్నది నా కోసంకాకుండా నా జీతం కోసమే అయితే అవును – అంగీకరించరు.

నేను వచ్చేసి మీ దగ్గరవుంటే అదొక గుదిబండలా, సంకెళ్ళుగా భావించి తప్పించుకు తిరగాలంటే అంగీకరించరు మరి!

మీ స్వేచ్ఛకీ, తాగుళ్ళకీ, తిరుగుళ్ళకీ, – నేను మీకు అడ్డుగా, ఇబ్బందిగా తోచినప్పుడు నా నిర్ణయం అంగీకరించరు. ఏ స్త్రీతోనో సంబంధం పెట్టుకుని వుంటే అవును ఎలా అంగీకరిస్తారు?

మా శ్రీవారు అలాంటివారు కాదనీ, ఎంతో బుద్ధిమంతులనీ, నా రాజీనామా నిర్ణయానికి అనుమతి ఇస్తారని నేను గట్టిగా నమ్ముతున్నాను.

నా నమ్మకాన్ని నిలబెడతారో, కూలదోస్తారో – మీ ఇష్టం. ఏ సంగతీ ఉత్తరం వ్రాయండి. ఇది చాలా సీరియస్‌మేటరుగా గుర్తించండి. బద్ధకించి ఉత్తరం వ్రాయడం మానేస్తారని గడువు వారం రోజులు మాత్రమే పెడుతున్నాను.

వారం లోపుగా మీవద్ద నుంచి రిప్లయి రాకపోతే అది మీ అంగీకారంగానే భావించి నా

ఉద్యోగానికి రాజీనామా సమర్పించగలను.

మీకీ ఉత్తరం ఎకెనాలెడ్జ్మెంటు డ్యూతో రిజిష్టరు చేస్తున్నాను. మీకీ ఉత్తరం అందిన తేదీనుంచి వారంలెక్క. వారంలో నాలుగురోజులు మీ నిర్ణయానికీ, మూడురోజులు ఉత్తరం ప్రయాణానికీను! మీరు ఓకే అనడానికీ 'నో' అనడానికీ నాలుగురోజు లెందుకూ ? ఒక గంట, మహా అయితే ఒకరోజు చాలు!

మీ నిర్ణయం కోసం ఎదురుచూస్తుంటాను.

పాప, బాబు మీకు ముద్దులు చెబుతున్నారు నేను మాత్రం సారీ.. చెప్పడంలేదు! నా నిర్ణయం మీరు ఒప్పుకున్నప్పుడే ముద్దులు !

మీ రిప్లయికోసం ఎదురుచూస్తూ మీ సన్నిధికోసం పరితపించిపోతూ –

మీ అర్ధాంగి సుజాత.

ఆ ఉత్తరం రవిని అతలాకుతలం చేసింది. అటూ, ఇటూ కుదిపేసింది. చదివిందే పదిసార్లు చదివేడు. ఏం చేయాలో అర్ధంకాదు. ఏమి వ్రాయాలో అర్ధం కాదు.

వారం రోజులు గడువు!

ఏం చేయాలో, ఏంవ్రాయాలో ఆలోచిస్తూనే రెండురోజులు గడిపేడు.

రిప్లయి వ్రాయడానికి నాలుగైదు సార్లు ప్రయత్నించి పది, పన్నెండు కాగితాలు రాసినవి చించేయడమే కనిపించింది గాని రిప్లయి కుదరలేదు.

గడువుచూస్తే దగ్గరపడుతోంది. సుజాతపై చిరాకు కోపం వచ్చేయి. రాజీనామా, గడువూ గాడిదగుడ్డు అంటూ అర్ధం పర్ధం లేకుండా ఏమిటా బుద్ధిలేని రాతలు!

అయితే ఆ రోజు –

పనిమనిషి లచ్చిమితో అనుభవం నీచంగానూ, అసహ్యంగానూ, తప్పుగాను తోచి గుండెల్లో కలిగిన బాధ, పతనం చెందుతున్నాననే భయం, రవి రిప్లయి ఏమిటి రాయాలో తెలియజేసాయి సందిగ్ధంలో కొట్టుమిట్టాడుతున్న అతని నిర్ణయానికి ఒక స్పష్టతను ఇచ్చేయి.

సుజాతను ఉద్యోగం రిజైనుచేసి, వచ్చేయమని ఉత్తరం వ్రాసి ఆరాత్రే పోస్టుబాక్సులో పడేసి మరోసారి ఉత్తరం సుజాతది చదువుతూనే నిద్రలోకి జారిపోయేడు.

పోస్టుబాక్సులోని ఉత్తరాలను మొదటి తడవుగా కలెక్టు చేసుకోడానికి ఉదయం ఎనిమిది గంటలకి వస్తాడు పోస్టల్‌వాడు.

పోస్టల్‌వాడు, పోస్టుబాక్సు దగ్గరకి వచ్చేటప్పటికి – అక్కడ అతని కోసం వెయిట్ చేస్తూ రవి!

ఎడ్రసు తప్పు వ్రాసేనని చెప్పి ఉత్తరం వెనక్కి తీసుకున్నాడు. అతను తెల్సినవాడు గనక ఇచ్చేడు.

ఎడ్రసు తప్పు వ్రాయడంకాదు.

రాత్రి తీసుకున్న నిర్ణయం తెల్లారేసరికి మారిపోయింది!

తన కవరు తీసేసుకుని ఒక కార్డు పోస్టల్ వాడి సంచీలో పడేసాడు.

ఆ కార్డులో రెండే రెండు ముక్కలు –

''సుజీ – నీవు రెజైన్ చేయాలా, వద్దా అనేదానికి నీవు పెట్టిన వారం గడువు ఏ మాత్రం చాలదు. మరోవారం గడువు నీపై చొరవతో తీసుకుంటున్నాను. ఈలోగా తప్పక నా నిర్ణయం నీకు తెలియజేస్తాను. నీవు మాత్రం తొందరపడి రిజైన్ చేయబోకు '' అని వ్రాసేడు.

**8**

''ఇదివిన్నావా ?''

పనిచేసుకుంటున్న చెలం కలం పక్కన పెట్టి 'ఏమిట్రోయ్' అనడిగేడు.

''ఏవిఁటో నిజంగా నీకు తెలీదా ?''

ఆఫీసు తెరిచి అరగంటయినా ఇంకా ఆ వార్త తెలీకపోవడం చాలా అన్యాయంగానూ, ఆ కంపెనీకి అవమానకర విషయంగానూ భావించేడు అతను.

''నిజంగా నాకు తెలీదు '' అన్నాడు చెలం.

''శ్రీకన్య లాడ్జిలో రైడింగ్ జరిగిందట. విన్నావా ?''

'' ఆహాఁ !''

''నిన్న రాత్రి – అర్ధరాత్రి కాదు – ఎనిమిది గంటల ప్రాంతంలో జరిగింది రైడింగ్ – మనవాళ్ళు దొరికిపోయేరు ''

''ఎవర్రోయ్! మనబాస్‌గాని చిక్కేడా ?''

''వాడెక్కడ చిక్కుతాడ్రా బాబూ. బాస్‌గాని నిజంగా చిక్కితే నీకు శివరామ్ స్వీటు నోట్లో పెట్టి – న్యూస్ చెవిలో వేస్తాను. ''

''మరెవర్రాబాబూ! దొరికింది !''

''అదే తెలీదు!''

''కొయ్యకు''

''నిజంరా! తల్లితోడు! తెలీదు. ఎవరో దొరికేరన్నదే తెల్సు. ఎవరన్నది తెలీదు.''

'' ఆ సస్పెన్సు ఏమిఁటో! ఏడ్చేదేదో పూర్తిగా ఏడ్వక!''

''తొందరపడుకురా ! సీరియల్ సస్పెన్సు. వచ్చే సంచికలో అన్నట్టు కొన్ని నిమిషాల్లో దాని తల్లో జేజమ్మ తెలుస్తుంది. అది తెల్సుకోడానికేరా నేను వచ్చింది. అర్థం కాలేదా ? ఆ సస్పెన్సు ముడి ఎవరి దగ్గరో కాదు – నీ దగ్గరే వుంది '' అన్నాడు అతను.

''నా దగ్గరా ? ''

''అవును '' అన్నాడు అతను తాపీగా.

''ఇది బలేబాగుందిరోయ్! నాకు తెలియడం ఏవిఁటి నీ మొహం?''

''కొట్టిపారేయకు నాన్నా ! నీకు తెల్సు అంతే!''

''ఎలా?''

''అలా అడుగు చెబుతాను. రవి నీకు బాగా తెల్సుకదా !''

''తెల్సు''

''తెలీడం ఏమిటి ? నీ క్లోజ్ ఫ్రెండు''

''అయితే ?''

''మాకు చెప్పలేనిది నీకు చెబుతాడు గనుక ''

''వాడికి తెల్సని నీకెలా తెల్సు''

''గోంగూర పుల్సురా ఎలాగో తెల్సింది అంతే - ముందు రవికి ఫోన్‌చేయ్. కమాన్ కమాన్. క్విక్ క్విక్. వేగిరం చేయరా బాబూ చంపక''

చెలందీ, రవిదీ వేర్వేరు డిపార్టుమెంట్లు. అన్ని డిపార్టుమెంట్లని కలుపుతూ ఇంటర్నెల్ ఫోన్ సిస్టం వుంది ఆ కంపెనీలో.

చెలం రవికి ఫోన్ చేయబోతూ ఆగేడు.

''ఎంత ఫ్రెండయితే మాత్రం వాడినడగడానికి బేస్‌వుండొద్దూ. తీరా అడిగేక - నన్నడుగుతావేం- నేనేం బ్రోకర్నా అంటే!''

''నీకో నమస్కారం!'' చేతులు జోడించేడు అతను - ''వాడు ఏం అనడు. అడగడు. రవి వాళ్ళని పోలీసుల బారినుండి రక్షించేడని తెల్సింది. సరేనా. మరిక ఫోన్ చేయి.''

''అదికాదురా. లాక్కొచ్చిన వాడు ఎవడో తెల్సిందిగాని - ఎవర్ని లాక్కొచ్చేడో మీకు తెలీదా?'' అనుమానం వెలిబుచ్చేడు చెలం.

''అబ్బా! చంపుతున్నావురా చెలం! తెలీకేకదరా నీ కాళ్ళా వేళ్లా పడుతున్నది - రవి ఫోన్ నెంబరు చెప్పు. నేను చేస్తాను '' అన్నాడు అతను. చెలం ఫోన్ చేసేవాటం కన్పించక, అంతవరకూ ఆగలేక!

''త్రిబుల్ ఫైవ్'' అన్నాడు చెలం.

అతను ఫోన్ తీసి, డయిల్‌టోన్ వచ్చేవరకూ ఆగలేక ఆగి - డయిల్‌టోన్ వచ్చేక మూడు ఐదులు బర్‌బర్‌మని చూపుడువేలుతో కొట్టి - అవతల నుంచి రెస్పాన్సు ఏమిటయ్యా అనిచూస్తే ఎంగేజ్‌డు!

చిరాగ్గా రిసీవర్‌ని క్రెడిల్‌మీద పెట్టేసాడు.

ఆరుసార్లు తర్వాత ఏడోసారి రెస్పాన్సు వచ్చింది. అతని ముఖం వెలిగింది.

''హలో - రవీ స్పీకింగ్''

అతను రిసీవర్ చెలం చెవికి తగిలించేసి - చెలంని మాటాడమని సైగచేసాడు. అంత హంగామా, హడావుడీ చేస్తున్నాడే - 'అతను' ఎవరు ?

ఎవరతను?

ఎవరంటే చెప్పడం కష్టం.

ఆ కంపెనీలో ఆరువేలమంది ఎంప్లాయిస్ వున్నారు. అర్వై డిపార్టు మెంట్లున్నాయి.

అతనెవరంటే ఏమని చెప్తాం ? అతను ఎంప్లాయిస్ అందరిలోనూ ఉన్నాడు అన్ని డిపార్టుమెంటుల్లోను కనిపిస్తాడు అంచేత ఫలానావాడని చెప్పడం చాలా కష్టం.

అతనికి తాజాతాజా వార్తలు వినడం ఇష్టం. విన్నది అంతకన్నా వేగంగా, మరొకరికి చేర్చడం ఇష్టం.

ఆ ఇష్టం చెప్పాలంటే ఒక అంటురోగం! రోజూ ఏదో ఓతాజా కబర్ వుండాలి. ఏదోక వార్త ప్రచారంలో నానాలి! అది నిజవాఁ, అబద్ధవాఁ, గాసిప్పా, గాలికబురా ? రూమరా? హేమరా ? ఏదైనా ఫర్వాలేదు

అంతగా వదంతులకి పూర్తిగా ఎడిక్ట్ అయిపోయేడు అతను

అతన్ని పట్టుకుందామని విశ్వ ప్రయత్నాలు చేసింది మానేజ్‌మెంట్.

ఆ వదంతులవల్లా, పుకార్లవల్లా, రూమర్లవల్లా కంపెనీ ఉత్పత్తికి అంతరాయం కలుగుతోంది ఉద్యోగి–యజమాని రిలేషను చెడుతోంది ఉద్యోగి – ఉద్యోగి మధ్య అనేక దూరాలు సృష్టిస్తోంది. ఉద్యోగం చేస్తున్న ఆడవాళ్ళనయితే సరేసరి! – నిష్పక్షపాతంగా మొత్తం అందర్నీ శీలరహితల్ని చేసి ఎవడిపక్కనో పడుకున్నట్టు నమ్మించే వరకూ నిద్రపోకుంటోంది

ఇందులో యజమాన్యంది ఎంతో తప్పుంది. వదంతుల్ని నేర్పిందీ, మొదలెట్టిందీ, ఎంకరేజ్ చేసిందీ అదే. యజమాన్యం కేవలం తన ప్రయోజనాల కోసం వదంతులను ప్రచారం చేసింది. ఆ వదంతులలో కార్మికుల ఐక్యతను బలహీన పరిచింది కలిసి వున్న కార్మికుల్లో కలతలు రేపింది. ఉన్న రెండుమూడు యూనియన్ల మధ్య గొడవలూ, కొట్లాటలూ, తన్నుకోడాలూ పురికొల్పింది.

యజమాన్యం ఉద్యోగులకి విస్కీ ఒక్కటే నేర్పితే వాళ్ళు విస్కీతోబాటు రమ్ము, బ్రాందీ, ఫారెన్‌ది, దేశవాళీదీ – అక్కడితో ఆగక కంట్రీసారా, కల్లు, గంజాయి మొత్తం నేర్చేసుకున్నట్టయింది అక్కడ స్థితి!

చివరికి యజమాన్యాన్నే బలహీనపరిచేటట్టుగా వాళ్ళలోవాళ్ళకి అనుమానాలూ, స్పర్ధలూ, గొడవలూ వచ్చేటట్టుగా వదంతులు ముదిరిపోయాయి. యూనియన్, మరిదేనికి, జడవక పోయినా వదంతులకి మాత్రం జడిసేపని ఏర్పడింది యజమాన్యానికి.

వాళ్ళకి వదంతుల్ని అరికట్టడం అసాధ్యమైంది. వాటిని ప్రచారం చేస్తున్న వాణ్ణి పట్టుకోడం చేతకాకపోయింది.

వదంతులు ఎవరు వ్యాప్తి చేస్తున్నదీ తెల్సుకోడానికి కమిటీని రహస్యంగా వేసింది. కమిటినీ రహస్యంగా వేసారనేది మరునిముషంలోనే బయట కొచ్చేసింది! అందులో ఎవరెవరు సభ్యులో అంతా బాహాటంగా చెప్పుకున్నారు!

యజమాన్యం తెల్లబోయి ఆ కమిటీని ఎత్తివేయక తప్పలేదు. ఎత్తేసి 'వదంతులు వ్యాప్తి చేస్తున్నది ఎవరైనా సరే వారు కఠినంగా శిక్షింప బడుదురు'' అని సర్క్యులర్స్ ఒకదానిపై ఒకటి అనేక రకాలుగా భయపెడుతూ జారీచేసింది. లాభం లేకపోయింది. వదంతులు చావలేదు.

అవి ప్రచారం చేస్తున్న అతను దొరకలేదు. ఇక ఏమీ చేయలేక ''వదంతుతులను ఖండించండి – ఉత్పత్తిని పెంచండి '' అని గోడలకి బోర్డులు వేలాడదీసి వూర్కుంది. నోరుమూస్కుంది. అంతేతప్ప 'అతణ్ణి' పట్టుకోలేకపోయింది

అతనే చెలంని రవికి ఫోన్‌చేసి లాడ్జిలో దొరికిందెవరో తెల్సుకోమంటున్నాడు.

అతనికి పేరులేదు. లేదా అన్ని పేర్లూ అతనివే.

అతను చెలానికి ఫోన్ అందించేడు

''యస్ ! రవీ స్పీకింగ్''

''చాల్లేరా స్పీకింగు..ఏమిటి సంగతి ? బిజీయా ?''

ఆ గొంతు చెలందని గుర్తుపట్టేయగలడు రవి.

''బిజీయా ! పాడా ! చేస్తేపని – చేయకుంటేలేదు – ఏమిటివిశేషం?''

''నీవే చెప్పాలి. విశేషం నీదగ్గరే వుంది. ''

''ఏమిటి ?''

''మనవాళ్ళెవరో నిన్న రాత్రి లాడ్జిలో దొరికిపోయేరట విన్నావా ?''

''వినడంకాదు. వాళ్ళని విడిపించి తీసుకొచ్చింది నేనే. కాని అందరూ అనుకుంటున్నదేమిటో తెల్సా. నేనే రైడింగ్‌లో దొరికిపోయేనని ! ఈ కంపెనీనెవరూ బాగుచేయలేరు.''

''నాకు మటుకు కరెక్టుగానే వచ్చింది ఇన్ఫరమేషను.''

''ఏమని?''

''నీవు విడిపించావని. కాని ఆ హీరో హీరోయిన్స్ ఎవరనేది మాత్రం తెలీదు.''

''అవును. తెలీదు.''

''నీకు తెల్సుకదా''

''తెల్సనుకో – కాని చెప్పడం నాకిష్టంలేదు.''

''ఎంచేత?''

''అడగకు. మన సోదరులు వాళ్ళని బతకనీయరు.''

''నేనెవరికీ చెప్పను''

''నిజవేఁనా ?''

''ప్రామిస్''

''సరే చెబ్తాను. ఆ గుట్టు మనిద్దరి మధ్యే వుండాలి'' అలా అప్పటికే నల్గురైదుగురికి చెప్పేసి వున్నాడు రవి.

''అలాగే చెప్పు.''

''వాళ్ళు రాంబాబు – ఛాయ !''

'అతను' చెవికూడా అక్కడే వుందని రవికి తెలీదు.

అతను ఇక చెలం దగ్గరలేడు. ఆ న్యూస్ పట్టుకొని అప్పటికేగాల్లో కలిసిపోయేడు.

ఇక ఫోనులన్నీ ట్రింగ్ ట్రింగ్ మన్నాయి. నోళ్ళన్నీ దొరికిన చెవులను కొరికేసేయి. కొన్ని డిపార్టుమెంటుల్లో అది ఒక గ్రూప్ డిస్కషన్ అయింది. అందులో వాళ్ళకున్న పాండిత్యాన్ని అనుభవంతో రంగరించి కుమ్మరించేరు.

చెలం మరోరకంగా ప్రొసీడ్ అయేడు.

ఇది కంపెనీకి అవమానకర విషయంగా భావించి ఛాయపై తగుచర్యలు తీసుకోవల్సిందిగా యజమాన్యానికి రిపోర్టు ఇచ్చేడు చెలం.

అతనికెందుకో తన ఒక్క సంతకంతో రిపోర్టుపంపే ధైర్యం చాలక పదిమంది సంతకాలు సేకరించి రిపోర్టు పర్సనల్ డిపార్టుమెంటుకి ఇచ్చేడు.

ఛాయ లాడ్జిలో దొరికిన సంగతి చెలం మర్చిపోకుండా - అదొక పనిగా పెట్టుకుని - ఇంటికి వెళ్ళగానే విజయకి చేర్చేడు.

విజయ విని నిర్ఘాంతపోయింది.

అంతకుముందు చెలం చెప్పినదాంట్లో పూర్తిగా నమ్మకం కలగలేదు. ఇపుడు తేటతెల్లమయిపోయింది. అనుమానంలేదు!

ఛాయ బిచ్!

ఛాయ తలపుకి వచ్చి అసహ్యం వేసింది విజయకి.

అయితే -

చెలం ఛాయపై యజమాన్యానికి రిపోర్టు ఇవ్వడం ఆమె హర్షించలేకపోయింది!

''నీవాపని చేయకుండా వుండాల్సింది చెలం'' అంది విజయ.

చెలం మాటాడలేదు.

## 9

ఛాయ తలెత్తుకు తిరగలేక ఉద్యోగం మానేస్తుంది అనుకున్నారు చాలామంది. కనీసం 'అంతా మరిచిపోయేరు ' అని మనసుకి నచ్చజెప్పి డ్యూటీకి రావడానికైనా నెలరోజులు ఎగనామం పెట్టేస్తుందనుకున్నారు. (వీళ్ళంతా రాంబాబు గురించి చెడుగా ఏమీ అనుకోడంలేదనేది గమనార్హం!)

కాని -

ఛాయ అందరి అంచనాలను తలకిందులు చేసింది. ఆ రోజే డ్యూటీకి వచ్చి అందర్నీ ఆశ్చర్య పరిచింది.

ఆఫీసుకి వచ్చిమామూలుగానే తన పనులు చేసుకోడం మొదలెట్టింది.

ఆమెను ఎవరూ ఏదీ ప్రశ్నించలేకపోయేరు.

అందరి చూపులు ఆమెపైనే వున్నాయని గ్రహించింది. అయినా ఎవరికీ ఆమె ముఖంలోకి సూటిగా చూసే ధైర్యంలేదు. ఆమె పసిగట్టినట్టు తోచగానే దృష్టి మరోపక్క మరలిపోతోంది!

అది చూసి ఛాయ నవ్వుకుంది.

హెడ్‌క్లర్క్ ఆమెకి టైపు చేయవలసిన కాగితాలు ఇచ్చేడు. అతను మామూలుగానే పలకరించేడు.

ఛాయ టైపు చేసుకుంటోంది.

ఫోన్ రింగయింది.

హెడ్‌క్లర్కు పిలిచేడు. 'ఛాయా! నీకు ఫోన్'

అందరూ అటువైపు చూసేరు.

ఛాయ కుర్చీ జరుపుకులేచి, హెడ్‌క్లర్క్ టేబుల్ వద్దకి వెళ్ళి ఫోన్ అందుకుంది.

రాంబాబుతో ఫోన్ సరసంకి అప్పుడే తెల్లారింది అనుకున్నారు.

''హలో'' అంది ఛాయ.

''ఎవరూ'' అంది అవతల గొంతు.

ఆ గొంతు ఎప్పుడూ వినలేదు ఛాయ.

'' ఎవరుకావాలి ?'' అంది.

''నీవు ఛాయవేనా ?''

''అవును మీరెవరు ?''

''నేనెవరైతే నీకెందుకే ఏం మొహం పెట్టుకుని డ్యూటీకి వచ్చేవు సిగ్గులేదటే నీకు ?''

''షటప్! నాకెందుకురా సిగ్గు ! నీవు సిగ్గుపడాలి. నీవామాటలు ఎదురుగా చెప్పలేనివాడివి, పేరు చెప్పడానికి భయపడేవాడివి నీవెంత సిగ్గుమాలిన వెధవ్వో, ఎంత డర్టీ రాస్కెల్‌వో తెలుస్తూనే వుంది. మైండ్ యువర్ ఓన్ బిజినెస్ రాస్కెల్'' టక్‌మని ఫోన్ పెట్టేసి వెళ్ళి తన సీటులో కూర్చుంది.

ఆ రెండు నిముషాలు డిపార్టుమెంటంతా ఫ్రీజ్ షాట్‌లా – ఒకబొమ్మలా వుండిపోయింది.

ఛాయ రుమాలుతో ముఖం తుడుచుకుంది.

టైపు చేయడం మొదలెట్టింది.

ఫింగర్స్ అదుపు తప్పేయి. అన్నీ తప్పులు పడ్డాయి.

రోలర్‌నుంచి ఆ కాగితాలని లాగేసి చింపేసింది. నలిపేసింది. చెత్తబుట్టలోకి విసిరేసింది.

కొత్తకాయితాలు, కార్బన్లు పెట్టింది.

హెడ్‌క్లర్కు సుందరయ్య ఛాయను పిలిచేడు.

లేచి వెళ్ళింది. కూర్చోమన్నాడు. ఎదురుసీట్లో కూర్చుంది.

''ఎవడో ఏదో వాగాడని బాధపడకమ్మా '' సుందరయ్య సానుభూతి చూపేడు ''ఏనుగుపోతుంటే కుక్కలెన్నో మొరుగుతాయి '' అన్నాడు.

''నేనేం బాధపడ్డం లేదండి ?'' మీ మాటలే ఇప్పుడు బాధిస్తున్నాయి అన్నట్టు చూసింది.

''నీకు ఫోన్ వస్తే అవతలవాడి పేరు కనుక్కొని నిన్ను పిలుస్తాను''

''అలాగేనండి. థాంక్స్'' అంది ఛాయ.

ఆమెకి అతను ఫ్లాస్కులో తెచ్చుకున్న టీని గ్లాసులో పోసి ఇచ్చేడు.

అతను ఆమెకి అర్ధమయేడు. ఆమె కళ్ళలో నీళ్ళు కనబడనీయకుండా జాగ్రత్త పడింది. ఆమె మనసు కొంత వూరట చెందింది.

సీటుకి వెళ్ళిపోయి – టైపు కంటిన్యూ చేయసాగింది.

ప్యూన్ వచ్చేడు ఛాయ దగ్గరికి.

హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు పిలుస్తునట్టు చెప్పేడు.

ఛాయ లేచింది.

కేబిన్ లోకి వెళ్ళింది.

అంతే. చాలామంది సీటుల్లోంచి లేచిపోయేరు. చిన్న చిన్న గ్రూపులు, గుసగుసలు. కొందరు సాహసించి కేబిన్ వ్యూ ఫైండర్ లోంచి దొంగచాటుగా చూసే ప్రయత్నాలు. ఒకణ్ణి తోసుకొని ఒకడు; పూర్తిగా చూడ్డంలేదు. పూర్తిగా ఎవరికీ కనిపించడంలేదు. అది ఎయిర్ కండిషన్డ్ కేబిన్. అందులోంచి గాలికూడా బయటకిరాదు. సైలంటు పిక్చరు లానే వుంది. మాటలు వినబడ్డంలేదు.

సినిమా మూడునిముషాలు.

ఛాయ బాస్ దగ్గర నుంచి సెలవుపుచ్చుకు బయటకి వచ్చేస్తుంటే ఎవరి సీట్లలోకి వాళ్ల పరుగు.

ఛాయ బాస్ మంచివాడే.

అతను ఆమెను అవమానించలేదు. ఆమె వ్యవహారంలోకి తల దూర్చలేదు. విషయం తెల్సుకోవాలనే కుతుహలం చూపలేదు.

ఆమెను ఎందుకు పిల్చేడంటే –

రేపు వుదయం పర్సనల్ డిపార్టుమెంటులో ఆమె హాజరుకావల్సి వుంది. చెలం ఇచ్చిన రిపోర్టుపై ఎంక్వయిరీ.

ఆ యెంక్వయిరీలో తనూ వుంటానన్నాడు.

ఛాయ టెంపరుమెంటు తెల్సినవాడుకావడంచేత రేపు జాగ్రత్తగా మాటాడమన్నాడు.

''ఆ మాటకొస్తే అది ఎంక్వయిరీ కాదు – చిన్న ఇంటర్‌వ్యూ – జస్ట్ టునో ద ఫేక్ట్సు అంతే! జాగ్రత్తగా, నెమ్మదిగా మానేజ్ చేయి. మరేం ఫర్వాలేదు. నీకేం భయంలేదు. అంతా నేను చూసుకుంటాను'' అన్నాడు.

ఆ సంగతి ఒక్క ఛాయకే తెల్సు.

కాని డిపార్టుమెంటు అనుకున్నదేమిటంటే – బాస్ ఛాయని పిల్చి పుచ్చదొబ్బులు నెమ్మదిగానే అయినా గట్టిగానే అంటించేసాడన్నారు. కొందరది నమ్మలేదు 'అదెక్కడిదిరా జాణ! నెరజాణ! గట్టిగా దొబ్బులు పెడదామనుకున్నవాణ్ణే – తాళంచెవి అంతచేసేసి జాకిట్లో

గుండెల మధ్య పడేసుకుని ఊపిరి సల్పనివ్వకుండా చేసేసి వుంటుంది '' అన్నారు.

ఛాయ ధైర్యంగానే నిలబడగలిగాను అనుకుంది గాని – సీట్లో బరస్ట్ అవకముందే గబగబా టాయిలెట్ రూంకి వెళిపోయి గెడవేసుకుని గోడకి చేరగిల బడిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది.

తర్వాత శుభ్రంగా ముఖం వాష్ బేసిన్‌లో కడిగేసుకుని ఫ్రెష్‌గా బయటకు వచ్చింది. ఆమె ముఖం చూస్తే క్షణం క్రితం ఆమె ఏడ్చి వుంటుందని ఎవరికీ అనిపించదు.

## 10

రేపు ఆ ఎంక్వయిరీకి ఛాయతో రాంబాబు కూడా వెళ్ళాలి.

ఎంక్వయిరీని ఎలా ఫేస్ చేయలనేది చర్చ –

రవి గదిలో రవితోబాటు రాంబాబు, ఛాయ !

ముగ్గురూ ఏం చేయాలనేది, ఎలా ఎదుర్కోవాలనేది చర్చిస్తున్నారు.

ఆ రోజు –

రవి భోజనంచేయడానికి హోటల్‌కి వెళ్తుంటే –

''ఇదిగో !'' అమర్యాద పిలుపు.

ఎవర్రా అని చూస్తే పోలీస్!

అదిరిపోయేడు రవి.

తనకి ముందే పోలీసులంటే తగనిభయం.

''నిన్ను పిలుస్తున్నారు ''

ఎవరు పిలుస్తున్నారనేది పోలీసు లాఠీతో పోలీస్ వ్యాను చూపించేడు.

''న్నన్నా !''

'' ఆఁ నిన్నే ''

వెళ్ళకపోతే ఈడ్చుకుపోయేలా ఉన్నాడు పోలీసు.

రవి అయోమయంగా పోలీసుతో నడిచేడు.

వ్యాన్‌లో చాలామంది వున్నారు.

''రవీ!'' రాంబాబు పలకరించేడు.

రాంబాబు, రాంబాబు పక్కన ఛాయ కన్పించేరు రవికి. నిర్ఘాంతపోయేడు రవి.

''ప్లీజ్! హెల్ప్ అజ్ '' అంది ఛాయ.

రాంబాబు ఏదో చెప్పబోయేడు.

అందుకు అవకాశం ఇవ్వకుండానే –

వ్యాన్ కదిలిపోయింది.

వ్యాన్ వెనక పరిగెట్టేడుగాని రాంబాబు మెసేజ్ రవిని చేరలేక పోయింది.

వ్యాన్ మాయమయింది.

కేసు ఏమిటో అర్థమైంది రవికి.

వాళ్ళకి కావలసింది హెల్పు.

రాంబాబు ఏదో సోర్సు, ఎవరికో కబురు చేయమని చెప్పబోయేడని అర్థమైందిగాని అది ఏసోర్సో, ఎవరికి కబురు చేయాలో అర్థం కాలేదు రవికి.

ఏం చేయాలో తోచలేదు అతనికి.

హోటల్‌కి వెళ్ళి మీల్స్ ఆర్డరిచ్చేడు.

భోజనం తినబుద్ధి కాలేదు.

భోజనం చేస్తున్న రవిని ''ప్లీజ్ హెల్ప్ అజ్ 'అంటోంది ఛాయ. రాంబాబు ఏదో చెప్పబోతున్నాడు.

రవి సగంలోనే చేయి కడుగుకు లేచాడు.

వాళ్ళకి హెల్పుచేయడం ధర్మంగా భావించేడు.

రవి అప్పటికే వాళ్ళిద్దరి వ్యవహారం వినే వున్నాడు. రాంబాబుదీ, రవిదీ పక్క పక్క సీట్లే అయినప్పటికీ ఆ వ్యవహారంలోకి ఎప్పుడూ కలగజేసుకోలేదు రవి. నవ్వుకునేవాడు అంతే. ఒక్కోసారి రాంబాబు అదృష్టానికి జెలసీ కలిగేది. తనకి ఒక్క ఆడది – అదీ ఇక్కడలేదు. వాడికి ఇద్దరు! ఇక్కడే వున్నారు

రవీ, రాంబాబుల మధ్య స్నేహం వుందో, లేదో చెప్పడం కష్టం. అయితే శత్రుత్వం లేదనేది స్పష్టం!

ఛాయతో తనకేం పరిచయంలేదు. ఎప్పుడైనా డిపార్టుమెంటుకి ఆమె రాంబాబు కోసం వస్తే– వాడు సీట్లో లేకపోతే – ఎక్కడికి వెళ్ళాడని ఆమె అడగడమో, ఒక్కోసారి ఆమె అడగకుండానే తను చెప్పడమో జరిగేది.

ఛాయపై అతనికి వున్నది సదభిప్రాయమో, దురభిప్రాయమో అతనికే తెలీదు.

''ప్లీజ్ హెల్ప్ అజ్!''

ఛాయ రిక్వెస్టు అతన్ని వెంటాడుతోంది. ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

రవి తోడల్లుడు అన్నయ్య డియస్పీ! అతనితో పెద్ద పరిచయం లేకపోయినా తనని గుర్తుపట్టగలడని నమ్మకం వుంది.

అతనిదగ్గిరకి పరిగెట్టేడు.

వున్నాడో! లేడో!

ఉన్నాడు.

హెల్పు చేస్తాడో! లేదో!

చేసాడు!

ఏకేసు లేకుండా వాళ్ళను బయటకు తీసుకొచ్చేడు రవి.

ఛాయ, రాంబాబు రవికి ఎంతగానో థాంక్స్ చెప్పేరు.

తనొక సాయం చేయగలిగినందుకు రవికి తృప్తి.

ఒకస్త్రీ – ఎలాంటిదైతేనేం ప్లీజ్ హెల్ప్ అంటే హెల్పు చేయ గలిగినందుకు సంతృప్తి.

అతనికెందుకో అది ఒక పెద్దరికాన్ని తెచ్చిపెట్టింది.

అతను అనుకోని సాయం వాళ్ళకి చేసిన తర్వాత – వాళ్ళకొక శ్రేయోభిలాషిగా, ఒక సలహాదారుడిగా, ఒక మిత్రుడుగా అతనికి తెలియకుండానే అతను ఆ పాత్ర స్వీకరించేడు.

అంచేతనే తను విడిపించి తీసుకొచ్చిన వారిపై – కంపెనీ అంతా కథలుకథలుగా చెప్పుకోడం విని బాధపడ్డాడు. ఒకరిద్దరి దగ్గర తను నోరుజారడమే ఆ కథలకి కారణంగా తోచి తనని తనే తిట్టుకున్నాడు కూడా.

ఛాయ, రాంబాబులను ఎలాగైనా రేపటి ఎంక్వయిరీ నుంచి గట్టెక్కించాలని సిన్సియర్‌గా సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు రవి.

ఛాయ చొరవగా వంటగదిలోకి వెళ్ళి స్టౌ వెలిగించి టీ కలిపింది.

తాగేరు ముగ్గురూ.

''ఏం చేద్దామనుకుంటున్నావ్?'' అడిగేడు రవి.

''దేన్ని గురించి ?'' – రాంబాబు.

''అదే – రేపు ఎంక్వయిరీ''

''ఏం చేయాలో నాకు తోచడంలేదు. చివరికి కంపెనీ నన్ను ఛాయని పెళ్ళిచేసుకోవాలని నిర్ణయిస్తే అందుకు సిద్ధమే. ''

''నీవు పెళ్ళి అయినవాడివి. హిందూవి. చట్టంగాని, కంపెనీ గాని ఎలా అంగీకరిస్తుంది – రెండో పెళ్ళికి?''

''చట్టం అంగీకరించినా, కంపెనీ అంగీకరించినా – నేనుమటుకు అంగీకరించను.'' స్పష్టం చేసింది ఛాయ– ''ఇది నా సమస్య. కంపెనీ సమస్యకాదు. ఎవరి సమస్యాకాదు. అంచేత ఆ సమస్య రేపక్కడరాదు. రాడానికి వీల్లేదు ... అసలు రవీ – రేపు మొత్తం ఎంక్వయిరీనే బాయ్‌కాట్ చేసి వెళ్ళకుంటే బాగుంటుందనిపిస్తోంది నాకు.''

''అదేం ?''

''మన పర్సనల్ విషయాలు కంపెనీకెందుకూ ? వాళ్ళకా హక్కు ఎక్కడిది ?''

''ఉద్యోగుల పర్సనల్ విషయాల్లో కలుగజేసుకునే హక్కు యజమాన్యంకిలేదు. అట్ ద సేమ్ టైమ్ అదే హక్కు యజమాన్యంకి వుంది. యజమాన్యం ఒక పవర్‌ఫుల్ వ్యవస్థ. దాని నోట్లో తల పెట్టడం అంటే పులినోట్లో తల పెట్టడం అన్నమాట. దానితో ఫైట్ చేసే శక్తి మనకుందా ? లేదా? అవి ఆలోచించాలి. లేనప్పుడు స్ట్రాటజీ మార్చాలి. పులిని బోల్తా కొట్టించి మనం తప్పుకోవాలి. అంచేత నా ఉద్దేశం ఏమిటంటే యజమాన్యం హక్కుని ప్రశ్నించడం, ఎంక్వయిరీని బాయికాట్ చేయాలనుకోవడం మూర్ఖం. అవివేకం. గోటితో పోయేది గొడ్డలిదాకా తెచ్చుకోడమే ! పిచ్చి పిచ్చి ఆలోచన్లు చేయకండి '' అన్నాడు రవి.

ఛాయ నిట్టూర్చింది. ఆమెకి యజమాన్యంని ఎదుర్కోవాలనే వుంది. కాని రవి అన్నట్టు

అందుకు తన శక్తి సరిపోతుందా ?

''రేపు ఎలా ఎదుర్కోవాలనేది – నేనో రకంగా ఆలోచించాను'' అన్నాడు రవి.

''ఏ రకంగా ?''

''ఏమిటది ?''

''రేపు అక్కడ కమిటీముందు మీ ఇద్దరూ ఎవరికి ఎవరో అంతే మీ ఇద్దరికీ ఎటువంటి సంబంధం లేదు. జస్ట్ కో – వర్కర్సు. కొలీగ్స్ కాకుంటే చిన్ననాటి స్నేహితులు అంతకు తప్ప మీ ఇద్దరూ ఎవరికెవరు ఏమీకారు.

ఏమీ కానప్పుడు మీరు లాడ్జిలో దొరికి పోయారనేది పచ్చి అబద్ధమవుతుంది.

అవును. అబద్ధం. పచ్చి అబద్ధం. అక్కడికి రవి రాలేదు. చూళ్లేదు విడిపించలేదు. అంతా అబద్ధం.

రేపు మీరు గాని, నేనుగాని ఆడాల్సింది పచ్చి అబద్ధాలే.

వాళ్ళు 'అబద్ధం' ఆడేస్తున్నారు అని అవతల పార్టీ గోలపెడితే సరిపోదు. రుజువు చేయాలి. రుజువు చేసే అవకాశం ఎవడికీ లేదు. అది మాత్రం నిజం!

అటుచూస్తే మిమ్మల్ని పట్టుకున్నట్టు ఏ పోలీసు కేసులేదు. అంచేత మీరు లాడ్జిలో దొరికిపోయేరనేది నిలబడదు.

మీ ఇద్దరిపై అటువంటి ప్రచారం కేవలం పుకారు.

పుకార్లకీ, వదంతులకీ ఈ కంపెనీ ప్రపంచంలో ప్రథమ స్థానమని యాజమాన్యంకి తెల్సు.

మీరిలా నేకీగా జాగ్రత్తగా రేపు తప్పుకుపోతే చాలు. నో ప్రోబ్లెమ్.

ఎలా వుంది ?'' అన్నాడు రవి.

బాగుంది బాగుందన్నాడు రాంబాబు. ఏమీ అన్లేదు ఛాయ.

అయితే మరుసటిరోజు ఏ ఎంక్వయిరీ జరగలేదు !

యాజమాన్యంకి అంతకన్నా ముఖ్యమైన పనితగిలి నిరవధికంగా వాయిదా వేసింది. వీలుచూసుకుని తేదీ తెలుపుతానంది.

ఈలోగా చెలం రిపోర్టు ఉపసంహరించుకున్నాడు !

కాదు – చెలం రిపోర్టు ఉపసంహరించుకునేలా చేసాడు రవి.

రిపోర్టు ఇచ్చిన చెలాన్ని రవి తిట్టేడు. పిచ్చ చివాట్లు పెట్టేడు.

''ఛాయ, రాంబాబు దొరికిపోయేరు గనుక దొంగలు. దొరకని దొంగలు ఇంకెంతమందో ! వాళ్ళని పట్టుకు రిపోర్టు ఇవ్వగలవా ?

పెద్దలెవిల్లో కొంత మంది మహానుభావులున్నారు. వాళ్ళ భాగవతాలు చాలామందికి తెల్సు. వాళ్ళపై నీకు రిపోర్టు ఇచ్చే దమ్ముందా ?

రిపోర్టు చేసినా బుట్టదాఖ లవుతుంది. అంతకన్నా ముందు నీ ఉద్యోగం వూడుతుంది.

ఏది ఏమైనా ఒరే చలం ! నీవు చేసిన పని బాగాలేదురా . ఎవర్కీ చెప్పనని నాతో చెప్పి

నెమ్మదిగా సీక్రెట్ లాగేవు. లాగి నీవే కేసుని ఇంతవరూ తీసుకురావడం నాకు నచ్చలేదు. ''- అని తీవ్రంగానే ఖండించేడు రవి.

చెలం కూడా తను తొందరపడినట్టు తెల్సుకున్నాడు గాని రిపోర్టు వెనక్కి తీసుకోడానికి అహం అడ్డు!

తనిచ్చిన రిపోర్టుకి బలమైన సాక్షి రవే – అనుకుంటే రవే ఛాయను వెనకేసుకురావడం చూసి విస్తుపోయేడు చెలం. తన్నిలా జాడించేస్తాడనుకోలేదు చెలం

చివరికి రవి పోరుపడలేక రిపోర్టు ఉపసంహరించుకున్నాడు చెలం.

ఛాయకి ఎంత పరాభవం జరగాలని కోరుకున్నాడో అంత పరాభవం ఎంక్వయిరీకి ముందే జరిగిపోయింది. ఛాయకి ఆ శిక్ష చాలు అనుకున్నాడు చెలం. రిపోర్టు ఉపసంహరించుకున్నప్పటికీ అతని కసి తీరింది. తృప్తిగా నిట్టూర్చేడు.

అయితే –

ఛాయ అక్కడితో ఊర్కోలేదు.

చెలంకి రింగ్ చేసింది.

''హలో'' అన్నాడు చెలం.

''నేను ఛాయని – మీతో కొద్దిగా మాటాడాలి కాంటీన్ కొస్తారా ?''

షేక్ అయ్యేడు చెలం.

''నాకు కుదర్దు. కాంటిన్‌కి రాలేను'' తడబడ్డాడు చెలం.

''పోనీ మీ సీటుకి రమ్మన్నారా ?''

అదిరేడు చెలం.

''లేదు. బిజీగా వున్నాను. నాకు తీరికలేదు.''

''పోనీ మీ ఇంటికి రమ్మంటారా?''

''నీవు రావాల్సిన పనిలేదు. నీతో మాటాల్సిన అవసరంనాకులేదు''

''అలా అనేస్తే ఎలా ? మీతో మాటాల్సిన అవసరం నాకుంది మరి!''

''నాకు తీరికలేదు.''

''నాపై రిపోర్టు ఇవ్వడానికున్న తీరిక నాతో మాటాడ్డానికి లేదా ? సరే నా డవుటు ఇక్కడే క్లారిఫై చేసుకుంటాను ?''

'' ఏమిటి?'' చెలంకి ఇబ్బదిగా వుంది.

''మీరు నాపై ఎందుకు రిపోర్టు ఇచ్చినట్టు ? ఎందుకు ఉపసంహరించుకున్నట్టు ?''

''అది నా యిష్టం''

''నాపై మీ ఇష్టం ఏమిటి ? మీకు విజయ వుంది కదా. విజయ కూడా ఉద్యోగం చేస్తోంది

కదా అక్కడివ్వండి రిపోర్టు.''

చెలం ఉగ్రుడయ్యేడు.

''విజయ పేరెత్తే అర్హత నీకులేదు ''

''విజయ పేరెత్తగానే మీకు చాలా కోపం వచ్చిందే ! మరిమీపై నా కెంత కోపంరావాలి ? విజయ పేరెత్తే అర్హతనాకు లేదు. నాపేరెత్తే అర్హత మీకుందనుకుంటున్నారా ?''

తడబడ్డాడు చెలం

''కంపెనీ అనేది ఒక కుటుంబం. ఆ కుటుంబంలో చెడుగా ప్రవర్తించే వారిని శిక్షించాల్సిందే. లేకుంటే అంతా చెడిపోతారు. కంపెనీ గుడ్డుగుడిసుకుపోతుంది.''

''కంపెనీ గుడ్డుగుడుసుకుపోకుండా కుటుంబ బాధ్యతలు కంపెనీ మీకెప్పుడు అప్పగించింది?'' – ఛాయ.

''అప్పగించక్కర్లేదు. ఒక రెస్పాన్సుబుల్ ఆఫీసరుగా నాకా హక్కుంది. ''

''చూడండి ఆఫీసర్‌గారూ ! నామీద వచ్చింది పచ్చిరూమర్ లేదా పచ్చినిజం, ఏద్దైనా అది నా పర్సనల్ విషయం. నా తిరుగుళ్ళు నా యిష్టం. దానివల్ల కంపెనీకి నష్టంలేదు. ఎనిమిది గంటలు కష్టపడి నా జీతానికి మించిన పని చేస్తున్నాను. ఆ మాటకొస్తే మీకన్నా నేను ఎక్కువే చేస్తున్నాను.

''డోంటాక్ రబ్బిష్''

''అయామ్ నాట్ టాకింగ్ రబ్బిష్. వాట్ యూ ఆర్ డూయింగ్ ఈజ్ డర్టీ రబ్బిష్! మీరు చేస్తున్నవి పరమ రబ్బిష్ పనులు. మీ డ్యూటీ మీరెంతవరకు సక్రమంగా నిర్వహిస్తున్నారు ? మీరు చెప్పలేరు. నేను చెబుతాను.''

''నీవేం చెప్పక్కర్లేదు. ''

''అక్కర వుంది. ముందు వినండి. మీకు లాండ్ బిజినెస్ వుంది. అది మీకు ప్రైమరీ. ఉద్యోగం సెకండరీ. బిజినెస్ తర్వాతనే మీకు ఉద్యోగం. ఉద్యోగి ఎటువంటి బిజినెస్ చేయడమైనా అఫెన్సు! మీరు చేస్తున్నది నేరమని, కంపెనీకి ద్రోహమని నేను మీకు వేరే మనవి చేయనక్కర్లేదు. నేరుగా మానేజ్‌మెంట్‌కే రిపోర్టు ఇవ్వొచ్చు. ఏమంటారు ?''

''......''

''నేను మీలా కంపెనీ అవర్సులో కంపెనీ ఉద్యోగులుపై బిజినెస్ చేసి మేడలు కట్టడంలేదు. బాంక్ అకౌంట్లు పెంచడంలేదు. మీ పై రిపోర్టు ఇవ్వడానికి ఒక్క నిముషం పట్టదు. ఈ క్షణం మీపై రిపోర్టు ఇవ్వగలను. ఇమ్మంటారా ?''

''.....''

''భయపడకండి. మిమ్మల్ని వదిలేస్తున్నాను. మిమ్మల్ని చెలంగా కాకుండా విజయ భర్తగా మిమ్మల్ని క్షమించి వదిలేస్తున్నాను. మీకింద నలుపు మీరు చూసుకోండి. అంతేగాని తెలివితక్కువగా ఒకరిపై రిపోర్టు ఇవ్వకండి. మైండ్ యువర్ ఓన్ బిజినెస్ అండ్ డూ యువర్

డ్యూటీ! దట్సాల్!'' అని టక్ మని ఫోన్ పెట్టేసింది ఛాయ.

చెలంకి చెమటలు పట్టేశాయి.

అతని చేతిలో రిసీవర్ అలానే వుండిపోయింది.

ఆమె ఫోన్ డిస్‌కనెక్టు చేసిందని అతనికి తెల్సినప్పటికీ ఆవేశం అణుచుకోలేక షివరైపోతూ ''యూ డర్టీ బిచ్! '' అని అరిచేడు చెలం

## 11

చెలంపై ఛాయ రిపోర్టు ఇవ్వకపోయినా అతనిపై రిపోర్టులు మానేజ్‌మెంటు దృష్టికి వెళ్ళకపోలేదు.

మానేజ్‌మెంటు వర్కరుపై చర్యతీసుకునేటట్లుగా ఆఫీసరుపై తీసుకోదు. ఏ నోటీసూ ఇవ్వదు. నెమ్మదిగా పిలుస్తుంది. మందలించి వూర్కుంటుంది.

అయినా వ్యాపారాలు సైడుగా చేస్తున్న ఉద్యోగుల్ని చూసీ చూడనట్టు ఊరుకోక తప్పడంలేదు మానేజ్‌మెంటుకి. ఉద్యోగులందరిలో వ్యాపార సంస్కృతి వంట బట్టేసింది.

చాలని జీతం పెంచమని, జీతం చాలనివాడు, ఒక్కడూ డిమాండ్ చేయలేడు డిమాండ్ అందరూ ఐక్యంగా చేయాలి. సమ్మెలు చేయాలి. ఇంత జరిగినా లీడర్లు వెన్నుపోటు పొడవకుంటే – పావలా డబ్బులు పెరుగుతాయి. అప్పటికే అర్ధా, పావలా పెరిగి వుంటాయి ధరలు! – ఇదంతా చాలా కష్టమైన పని.

బిజినెస్ అనేది చాలా తేలికైన పని. అతిసులువైన మార్గం. కార్మిక శక్తి మీద, యూనియన్ లీడర్లమీద ఆధారపడకుండా – తన శక్తి యుక్తులతో ఏదైనా ఒక చిన్న వ్యాపారం చేసి ఆ పావలా డబ్బులు సంపాదించడం ఈజీ. అనేది అందరికీ అర్థమయిపోయింది. అంతే రకరకాల వ్యాపారాలు. ఒకరి తర్వాత ఒకరు. ఒకరిపై ఒకరుపోటీ. కంపెనీలో మూడు పూవులూ, ఆరుకాయలుగా విరాజిల్లుతూ వ్యాపారం. పావలా కోసం దిగిన సంపాదన పావలా రాబడితో ఆగిపోదు. ఆగనంటుంది. పెరుగుతుంది. విస్తరిస్తుంది. పావలా పదులవుతుంది. పదులు వందలు. వందలు వేలు. వేలు లక్షలు. లక్షలు గడించేస్తున్నాడు ఆరణాల కార్మికుడు! నెంబర్‌వన్ వ్యాపారి అవుతున్నాడు – పావలా పోరాటాల కార్మికుడు.

అదీ ఆ కంపెనీలో కార్మికుని చైతన్యం!

ఆ కంపెనీలో నూటికి యాభై మందికి ఏదోక సైడు బిజినెస్ వుంది. వుండడం వాళ్ళ పేరు మీద కాకాపోతే పెళ్ళాంపేరనో, బామ్మర్ది పేరునో వుంటుంది. అతడే కంపెనీకి కారు అద్దెకిస్తాడు. అతడే గుడ్డలు పట్టుకొచ్చి ఇన్‌స్టాలుమెంట్లు అంటాడు. అంటగడతాడు. గుడ్డలేమిటి? చెప్పులు, చెంబులూ, బీరువాలూ, రేడియోలూ, టేప్‌రికార్డర్లూ, స్కూటర్లూ రకరకాల స్మగ్లింగ్ వస్తువులు – అధిక వడ్డీలకి డబ్బులు – సమస్తం కంపెనీ గేటు దాటకుండానే పొందవచ్చు. గప్‌చిప్‌గా భారీ ఎత్తున వ్యాపారం సాగే మార్కెట్.

ఉద్యోగికి ఇక్కడొక సులువుంది. కస్టమర్స్ కోసం రోడ్డుపై తలుపులు తెరిచి వెయిట్

చేసే పనిలేదు మిగతా ఉద్యోగులంతా ఇతని కస్టమర్సే వినియోగదారులే. వాళ్ళని వెదుక్కునే పనిలేదు. వాయిదా పద్ధతులంటే ఆ వస్తువు అవసరంవున్నా లేకపోయినా కొనేసేవాళ్ళు ఉన్నారు చాలామంది !

చెలం వ్యాపారంలోకి నెమ్మదిగా దిగేడు – తనకి తెలీకుండానే !

చెలం దువ్వాడ హరనాధబాబా ఆశ్రమానికి పిక్నిక్‌కి వెళ్ళేడు. అపుడక్కడ ఆ పక్క గ్రామంలోని కరణం కలిసేడు తన కులస్థుడు. కదిపితే కందిపిసరంత బంధుత్వమూ కలిసింది

అతను చెలంకి లాండు చూపించేడు అవి ప్లాట్లువేసి అమ్మమన్నాడు గజం పదిరూపాయలు. 'నీ వెంతకి అమ్ముకుంటావో నీ యిష్టం' అన్నాడు.

'నా దగ్గర కొనడానికి డబ్బులేదే ! ''

''డబ్బంతా అక్కర్లేదు. ఒక వెయ్యి అడ్వాన్సు ఇచ్చి పురోణీ రాయించు. లాండు అమ్మేకే మిగతా సొమ్ము ఇయ్యి '' అన్నాడు.

అమ్మేడు చెలం. ప్లాట్లు పళ్ళెంలో చక్కిడాల్లా చకచకా ఎగిరి పోయేయి అతనికి బ్రహ్మాండమైన లాభం వచ్చింది.

తన జీతం నాలుగంకెలువస్తున్నా – జాగర్తగా ప్లాను చేసుకోపోతే నెలాఖరు ఇబ్బందిగా వుండేది. అప్పు చేయవల్సి వచ్చేది. ఏదైనా ఒక లగ్జరీ అయిటమ్ కొనాలంటే – అది తనకి చాలా ఎత్తుగా దూరంగా కనబడేది. అప్పుడే కొత్తగా పెళ్ళిచేసుకున్నాడేమో -- డబ్బు అవసరం బాగా కనబడింది!

విజయని చేసుకున్న అదృష్ట ఫలంగా – అతనికి అదనపు ఆదాయం బ్రహ్మాండంగా రావడం మొదలెట్టింది.

మొదట కొన్నాళ్ళుపాటు ఆ కరణంని పట్టుకుని అక్కడా, ఇక్కడా లాండు సంపాదించేడు. ఆ వ్యవహారం కనిపెట్టే తనే స్వతంత్రంగా వూళ్ళు తిరిగి లాండు సంపాదించడం సాగించేడు. లాండు కొనడం – అమ్మడం. కొనడం – అమ్మడం.

అంతే ! 'విజయ నిలయం' బిల్డింగ్ కట్టేయగలిగేడు.

నెలజీతం లెక్కలడిగే విజయ కుప్పల తెప్పలుగా వచ్చిపడుతున్న డబ్బు చూసి పారవశ్యంతో వుక్కిరి బిక్కిరి అయేది.

వచ్చి పడుతున్న డబ్బు ఇస్తున్న సుఖాలను విజయ పొందగలిగింది.ఎంజాయ్ చేయగల్గింది. ఏది కావాలన్నా కాదనకుండా కొన్నాడు చెలం. అమర్చేడు చెలం. మార్కెట్లోకి వచ్చిన లేటెస్టు వస్తువు. – ఆయింటికి అమాంతంగా చేరుతోంది. అలా చేరుతుంటే విజయ కెంతో సంతోషంగా వుంది. విజయని సంతోషపెట్టడమే అతని లక్ష్యం. అతనికి సంతోషం!

చెలం ఇంటిపట్టున వుండకా రాత్రనకా, పగలనకా తిరుగుతుంటే పెద్దగా వారించలేకపోయింది. డబ్బు సుఖంలో భర్త సుఖాన్ని కొంత మరిచింది. కొంత త్యాగం చేసింది. మొత్తానికి అతన్ని పూర్తిగా బయటకి వదిలేసింది.

డబ్బు ఇచ్చే మినిమమ్ మరియు మేగ్జిమమ్ సుఖాలు అంతో, ఇంతో అనుభవించడం అలవాటుగా మారేక - ప్రేమించి ప్రేమకోసమే పెళ్ళి చేసుకున్న భర్తని దూరం చేసుకుంటున్నాననేది ఆమెకి నెమ్మది నెమ్మదిగా తర్వాత స్పష్టంగా అర్థమయింది

తొలిరోజుల్లో తనని ఒక క్షణంకూడా వదిలి వుండలేని భర్తని చెలంలో మళ్ళీ చూడాలని ఆమె మనసు తహతహ లాడింది. అప్పటిలా అందమైన సాయంత్రాలు, పూర్తి ఆదివారాలు గడపాలి గడపాలి అనుకుంది అందుకు పోరాడి, పోరాడి, అలిగి ఎలాగైతేనేం ఆదివారాలు సాధించింది. అలాగే సాయింత్రాలు సాధించకపోతానా అనే ధైర్యం ఆమెకి లేకపోలేదు.

విజయకి వాగ్దానం చేసాడేగాని - నిజానికి అతనికి టైము చాలడం లేదు. అందుకు తగ్గట్టుగా ఇక్కడ డ్యూటీ టైట్ అయిపోయింది.

అతనిపై వస్తున్న రిపోర్టులూ, డ్యూటీకి ఇర్రెగ్యులర్‌గా రావడం, వచ్చినా మధ్యలో వెళిపోవడం, సీట్లో వుండకుండా బిజినెస్‌పై కంపెనీ అంతా ఏజెంటులా తిరగడం మానేజిమెంటు నోటీసుకి వచ్చింది.

మానేజ్‌మెంటు చెలంని పిలిచి మందలించింది అంతే అంతకన్నా ఏమీ చేయలేదు. ఏమంటే అతను అప్పటికే వాళ్ళకి కూడా తక్కువ రేటుకి ప్లాట్లు అమ్మగలిగేడు. వాళ్ళు కొనగలిగేరు. అదీ పరిస్థితి!

అతనిపై తీసుకున్న ఏక్షన్ ఏమిటంటే మరో డిపార్టుమెంటుకి ట్రాన్సఫర్!

చెలంకి ట్రాన్సఫర్ అయ్యేక ఆ డిపార్టుమెంటులో సీటు కదలడం ఇబ్బంది అయింది!

లాభం లేదని చెలం ఒకరోజు డిపార్టుమెంటు హెడ్ దగ్గరకి తలుపు తోసుకుని వెళ్ళేడు.

వెళ్ళి అతనికి గౌరవంగా ఒక కానుక ఇచ్చేడు.

బాస్ అర్థం కానట్టు చూసేడు.

''మీ దగ్గర వుంచండి సార్!''

అవి మూడు కాగితాలు.

ఒక కాగితం చదవక మునుపే బాస్ ముఖం వెలిగిపోయింది.

సింహాచలం ఏరియాలో 500 గజాల ప్లాటు బాస్ పేరున రిజిస్టరు చేయించి ఇచ్చిన కాగితాలు!

''ఎందుకూ ?'' అన్నాడు బాస్.

''వుంచండి సార్. నా సంతోషం కోసం.''

చెలం సంతోషం కోసం బాస్ ఆ దస్తావేజుని తీసుకున్నాడు.

అప్పటినుండి చెలం సంతోషాన్ని ప్రొటెక్టు చేస్తునే వున్నాడు.

బిజినెస్ తను వక్కడే చేయడం యమయాతనగా వుంది చెలంకి. రెండు ఆదివారాలు విజయకి వదిలేటప్పటికి ప్రాణాలు పోయేయి. ఆదివారాలు విజయతో ఎంజాయ్ చేయలేకపోయేడు. ఆమెనూ సంతోషపర్చలేకపోయేడు.

ఆమెను సంతోషపర్చలేక పోయినందుకు అంతగా బాధపడ్డం లేదుగాని బిజినెస్ బరువు ఒక్కడూ మోయలేకపోతున్నాడు. ఒక్కడూ చేసుకోలేక పోతున్నాడు. చుట్టుపక్కల తిరిగి రైతులని మంచిచేసుకోవడం వాళ్ళతో లావాదేవీలు చేయడం, రిజిస్ట్రేషన్లకి ఆఫీసు చుట్టూ తిరగడం అవన్నీ వక్కడికీ సాధ్యం అయ్యేపనా?

సరిగ్గా ఆ సమయంలో రవి చెలం దగ్గరకొచ్చేడు.

''వొరేయ్ మా కొలీగ్‌కి ఒక మంచి ప్లాట్ కావాలంటా. వున్నాయా ?'' అడిగేడు రవి. ''ఏదో నా ద్వారా అయితే గజం దగ్గర రేటు కొంత తగ్గిస్తావని పిచ్చినమ్మకం వాడికి.''

సోరుగులోంచి ఒక లే – అవుట్ తీసి టేబుల్‌పై పరిచేడు చెలం.

''ఏదికావాలో తీసుకో ''

''నాకేంతెల్సు ? గురుడికి చూపిస్తాను.''

''వాడికే కాదు – మీ కొలిగ్స్ మిగతావాళ్ళకి కూడా చూపించు ''

''నేను చూపించడం కన్నా – నీవు వస్తే బాగుంటుంది.''

''నాకు టైమ్ లేదురా రవి! నేను గాజువాకలో మంచి సైటు చూసేను ఆపనిలో వున్నాను. అదిగాని మన చేతిలో పడిందా బంగారమే. నేనా బిజీలో వున్నాను. ప్లీజ్ ఈ హెల్పు చేద్దూ''

''నీకు బంగారం నాకు మట్టి '' అన్నాడు నవ్వుతూ రవి – '' ఈ లేఅవుట్లో ముప్పయి ప్లాట్లు వున్నాయి ఎలాగోలా అమ్మేసి నీకు సాయం చేస్తాననుకో – మరి నా కొచ్చేదేమిటీ ?''

చెలం ముఖం అదోలా పెట్టేడు.

''ఊరికినే. సరదాకి అన్నాను'' అని నవ్వేసి లేఅవుట్‌ని తీసుకు లేవబోయేడు రవి.

రవి సరదాకి అనలేదని చెలంకి తెల్సు.

రవి అతనికి నమ్మకమైన స్నేహితుడు. మోసగాడు, మాయగాడు కాదు. ద్రోహి, దుర్మార్గుడూ కాదు.

''ఒరే రవి నీవు అన్ని ప్లాట్లు నిజంగా అమ్మేస్తే – నీకో స్కూటర్ బహుమతి '' అన్నాడు చెలం.

చెలం సరదాకి అనలేదని రవికి అర్థమయింది.

రవి నోరు ఆవలించేడు!

ఆ తెరిచిన నోటిలో రవి ఆనందాశ్చర్యాలను చూసి నవ్వుకున్నాడు చెలం.

## 12

ఒకసారి లాడ్జిలో దొరికిపోయి, నానా రభస అయిన తర్వాత కూడా – ఛాయ, రాంబాబుల తిరుగుళ్ళు ఏ మాత్రం తగ్గకపోడంచూసి – విస్తుపోయి 'వీళ్ళు సిగ్గూ శరంలేని మనుషులు – బరితెగించారు' అనుకున్నారు కొలిగ్స్.

సాయంత్రం, డ్యూటీ అయిపోగానే రాంబాబు ఛాయ వాళ్ళువాళ్ళు ఇళ్ళకి ఏరోజో తప్ప

వెళ్ళరు ఇద్దరూ డ్యూటీ నుంచే డైరెక్టుగా కంపెనీ బస్సులో నగరంలో దిగుతారు దిగి ఏ హోటల్లోనో కాఫీ, టిఫిన్ కొడతారు చెక్కర్లు కొడతారు షికార్లు చేస్తారు బీచ్‌లో షైర్లు కొడతారు పార్కులకి వెళతారు

విశాఖ మహానగరంలో సరైన పార్కు ఒక్కటైనా వుందా ?

ప్రేయసీ, ప్రియులకి అనువైన స్థలాలు వైజాగ్‌లో లేవనే చెప్పాలి

వాళ్ళిద్దరూ తిరిగిన చోటే తిరగడం, కబుర్లతో కాలం గడపడం ఏ రాత్రికో ఎవరిళ్ళకి వాళ్ళు చేరడం !

తిరుగుళ్ళూ, కబుర్లూ ఛాయకి మానసికంగా కావలసినంత తృప్తి నిస్తున్నా - ఆమెకి పూర్తి సంతృప్తినిచ్చేది ఒక్కటే ! - అది రాంబాబుతో శారీరక సుఖం! నిజానికి రాంబాబు నుంచి ఆమె కోరుకునేది అదే!

వారం, పదిరోజులకొకసారి ఏ లాడ్జీలోనో ఆమె శరీరం రాంబాబు శరీరంతో కలిసేది కరిగేది. అలిసేది. సేద తీరేది. సుఖపడేది శరీరం తేలికపడేది

అంతటి సుఖం ఆమెకి నెలరోజులుగా కరువయింది ఒళ్ళు బరువయ్యింది. పిచ్చెక్కుతోంది. మనశ్శాంతి పోతోంది. నిద్ర అస్సలు పట్టకుంటోంది. వూర్కోనే చిరాకు పడిపోతోంది. అనవసరంగా కోపం తెచ్చుకుంటోంది

పశువులకీ, పక్షులకీ లేని ప్రాబ్లెమ్ మనుషులకుంది.

సంఘం లైసెన్సు, చట్టం ఆమోదంలేని మనుషులకి అది మరీ పెద్ద ప్రోబ్లెమ్.

ఇంతకుముందులా ఏ లాడ్జిలోనో రాత్రికి రూమ్ తీసుకుందామంటే - నగరంలో విపరీతంగా పోలీసుదాడులు ! కొత్త యస్.పి. ఎవరో చండశాసనుడు వచ్చేడు !

ఆ రోజు లాడ్జీలో దొరికిపోయేక - లాడ్జంటే భయమేస్తోంది వాళ్లకి. ఒకరు ధైర్యంతో ఏమాత్రం ముందుకెళ్ళినా మరొకరు భయంతో వెనక్కి లాగేస్తున్నారు !

పోనీ ఏదొక రూమ్ అద్దెకి తీసుకోవచ్చు అనుకుంటే - అద్దె ఏ రెండువందలో మినిమమ్ వుంటుంది. అంత అద్దె భరించడం కష్టం. ఇలాంటి కేసుకి ఎవరు గదులు అద్దెకిస్తారు ? అంత అద్దెభరించి, ఏ మాయచేసో గది అద్దెకు తీసుకున్నా - వ్యవహారం రెండుమూడురోజుల్లో చుట్టు పక్కలవాళ్ళు పసిగట్టకపోరు. ఇన్ఫర్మేషన్ ఇస్తే పోలీసులు తలుపు తట్టకాపోరు !!

అన్ని ఇబ్బందులు వున్నప్పటికీ - వారం రోజులుగా ఏదో చిన్న రూమ్ కోసం ఛాయ ప్రయత్నాలు చేస్తూనే వుంది, యిద్దరూ కలిసే వూరంతా గాలిస్తున్నారు.

దొరకడంలేదు గది.

పర్మెనెంట్ సెటప్‌కి ఒకగదంటూ దొరక్కపోయినా తాత్కాలికంగా తక్షణ ప్రయోజనానికి రాంబాబు ఒక ఆల్టర్‌నేటివ్ చూసే వున్నాడు. ఎటొచ్చీ ఆ సంగతి ఛాయకి చెప్పలేదు.

ఛాయ ఒకటే అనుకుంటున్నది - జనం వెళ్ళిపోయేవరకూ బీచ్‌లోనే వుండిపోవడం -

ఇంకా ఒకరూ ఇద్దరూ వుంటే ఎవరూ లేనిచోటు చూసుకుని రాంబాబు కౌగిల్లో కరిగిపోవడం . కోరుకున్న సుఖం రాకపోయినా కొంతలో కొంత గుడ్డిలోమెల్ల!

బీచ్‌లో ఉండిపోదామనే ఛాయ ప్రపోజలుని ఒప్పుకోలేదు రాంబాబు

'' ఈ బీచ్‌లో ఏకాంతం దొరికే ప్రశ్నలేదు. జనం కనుమరుగయ్యేరనుకుంటే ఆ టైముకి ఇనుపబూట్లు, లారీలు, ఎర్రటోపీలు ఇక్కడ వీరవిహారం చేస్తాయి'' అన్నాడు రాంబాబు.

ఛాయకి భయమేసింది రాంబాబు చెప్పింది నిజమేఅనిపించింది

''మరేం చేయడం ?'' అది ఛాయ

''చేసేదేముంది ? నీ ఇంటికి నీవు. నా యింటికి నేను''

''అంతేనా ?'''

''అంతే!''

''అవునవును అంతేమరి! నా కోసం నీవుగాని - నీకోసం నేనుగాదు. ఎంచక్కా ఇంటిదగ్గర పెళ్ళాం వుంది. నేనెందుకు కనిపిస్తాను నీకు ?''

''అన్యాయంగా నిందలు వేయకు - బయల్దేరు ''

''నేర్రాను - నీవెళ్ళు''

''నీవు రాకపోతే నేనెట్లా వెళ్ళనూ ?''

''నడిచి!''

''గొప్పగా జోకేవుగాని - నేను వెళ్తాన్నది ఎక్కడికని అడగవేం?''

''మీ ఇంటికి - తర్వాత పెళ్ళం పక్కలోకి.''

''అక్కడే పొరబడ్డావు - నేను బయల్దేరుతున్నది గృహానికే గాని అది అతిధి గృహం. గృహములో పెళ్ళామూ, అతిధిగృహములో ప్రియురాలు ! ప్రియురాలు లేకుండా అతిధి గృహము కెళ్ళి సుఖమేమీ '' అన్నాడు.

రాంబాబు ఒక ప్రయివేటు కంపెనీ గెస్టుహౌసుని ఈ రాత్రికి ఎంగేజ్ చేసే వున్నాడు అదృష్టవశాత్తు అతని చిననాటి మిత్రుడు సుధాకర్ ఆ గెస్టు హౌస్ సూపర్వైజర్! అంతే! లభించింది అవకాశం. అపూర్వ అవకాశం. సువర్ణ అవకాశం!

అంతటి అవకాశం వస్తే - ఇంతవరకూ ఛాయకి ఎందుకు చెప్పలేదు?

చెప్పకపోడానికి కారణం ఏమీలేదు. ఆమెను కాసేపు వుడికించాలనే. కొంతసేపు ఆమెను. సస్పెన్సులో ఉక్కిరిబిక్కిరి చేయాలనే.

ఛాయ నిజంగానే ఉక్కిరిబిక్కిరి అయింది. సంతోషంతో ఊగిపోయింది.

''ఇప్పుడు చెప్పు వస్తావా ? రావా ?''

ఛాయ చివాల్నలేచి రాంబాబుని ముద్దుపెట్టుకు తోసేసింది.

రాంబాబు పడిపోతూ - ఆమెను తనపైకి లాక్కున్నాడు.

అక్కడక్కడ మిగిలివున్న జనం వాళ్ళనప్పుడు కన్పించనేలేదు

మహానందంతో ఛాయ రాంబాబు వెనుక గెస్టు హౌసుకి బయల్దేరిది.

నెలరోజాలుగా కరువైన సుఖం ఈ రోజా కరువుతీరా పొందబోతోంది



ఆ గెస్టుహౌసు నిజంగా ఇంద్రభవనంలానే వుంది

సుధాకర్ – రాంబాబు మిత్రుడు ఇంద్రుడిలా తేజస్సుతో తొణికిసలాడుతున్నాడు

రాంబాబు, ఛాయలను ఆహ్వానించేడు

ఛాయకి భయం భయంగా, సిగ్గు సిగ్గుగా వుంది.

సుధాకర్‌వైపు చూడలేక – తలదించుకు, ఒదిగి ఒదిగి రాంబాబుని రాసుకు నడుస్తోంది.

సుధాకర్ మేడపై గది చూపించేడు – తాళంతీసి

గది విశాలంగా వుంది. పెద్ద మంచం – అది డబుల్‌కాట్ నిమించి వుంది. గుండ్రంగా వుంది. కిటికీలకీ, తలుపులకీ ఎర్రటి కర్టెన్లు. నేలంతా ఎర్రటి కార్పెటు ఆ వైపు వారగా సోఫాసెట్టు. వాటి రంగూ ఎరుపే

కిటికీలన్నీ మూసేసి – తెరలన్నీ వేసేసి ఎయిర్ కండిషన్ ఆన్ చేశాడు సుధాకర్.

క్రమంగా గది చల్లబడుతోది.

''హాట్ డ్రింక్స్ కావాలా ? కావాలంటే రప్పిస్తాను.''

వద్దన్నాడు రాంబాబు.

ఛాయకెందుకో భయం, భయంగా వుంది.

సుధాకర్ రాంబాబు చిననాటి మిత్రుడే కావచ్చు. చేసిన సాయం గట్టిదే కావచ్చు. కాని ఒత్తి పుణ్యానికే సాయం చేస్తున్నాడా ? – అతడు గది లోంచి ఎప్పుడు బయటికి పోతాడా – అని చూస్తోంది ఛాయ

రాంబాబు గూడా నాలుగైదుసార్లు థాంక్స్ థాంక్స్ అనడం తప్పించి ఎక్కువగా మాట్లాడలేకపోతున్నాడు. చిననాటి స్నేహితుడే గాని ఒరే అంటే ఒరే అనే స్నేహం లేదు. ఆమాట కొస్తే తను సుధాకర్‌ని కలిసి మాటాడి ఏడెనిమిదేళ్ళయి వుండవచ్చు!

''మా మేనేజింగ్ డైరెక్టర్‌గారు వైజాగ్ వేంచేసేటప్పుడు విడిది చేసే గది ఇది. అంతటి గది ఇప్పుడు మీది. పావనంచేయండి. కంప్లీట్‌గా ఎంజాయ్ చేయండి'' అని రాంబాబు వీపుతట్టి డోర్ తెరుచుకు వెళిపోయేడు సుధాకర్.

హమ్మయ్య! తుఫాను వెలిసింది!

గుండెలపై చేయివేసుకుంది ఛాయ.

రాంబాబు ఆమె దగ్గరకి వచ్చేడు.

ఆమె గుండెలపై ఆమె వేసుకున్న చేతులు తీసేసి అతని చేతులు వేసేడు అక్కడ!

''నాకెందుకో భయంగా వుంది రామ్''

''ఇపుడు పొందాల్సింది భయంకాదు – అనుభవం!''

ఛాయను మంచం దగ్గరికి లాక్కెళ్ళేడు.

ఛాయను మంచం మీదికి తోసేడు.

రాంబాబు కౌగిల్లో ఛాయ నలిగిపోతుండగా కరిగిపోతుండగా

తలుపు చప్పుడు!

ఆ చప్పుడు వాళ్ళకి వెంటనే తెలీలేదు తెల్సేప్పటికి అంత వుద్రేకపు శరీరాలు చప్పబడిపోయేయి. తీవ్ర అసంతృప్తి. నిరాశ చెందేయి

కాసేపు వాళ్ళు అలానే బొమ్మల్లా వుండిపోయేరు

మళ్ళీ తలుపు చప్పుడవడంతో – ఛాయ రాంబాబుని తోసేసి బట్టలు వెదుక్కోసాగింది

రాంబాబు కట్ డ్రాయరు మాత్రమే వేసుకుని – తలుపు తెరవడానికి వెళ్ళబోతుంటే – తను, లంగా, బ్రాసరీ, జాకెట్, చీర – మొత్తం కట్టుకునే వరకూ తలుపు తీయనీయలేదు ఛాయ.

మరోసారి తలుపు చప్పుడవుతుంటే – చిరాగ్గా వెళ్ళి తలుపుతీసేడు కొంత మేరకు.

పూర్తిగా లోనకి తోసుకొచ్చేడు సుధాకర్.

''బ్రదర్! ఇంతసేపూ నీవొక్కడివే! అన్యాయం! . నాక్కూడా ఛాన్సియ్యి''

'' నీకేం మతుందా ? ఆమె అలాంటిది కాదు...''

''ఆమె అలాంటిది కాకుంటే నీతో ఎందుకొస్తుంది బ్రదర్! నాకు హరికథలు చెప్పకు ఎలాంటిదాన్ని ఎలా లైన్లో పెట్టాలో నాకుతెల్సు. నీవు తప్పుకో. కూల్‌వాటర్ త్రాగి విశ్రాంతి తీసుకో. కావలిస్తే రెండోసారి– నేను వచ్చేక – కానిద్దువు. బయటకి నడు బ్రదర్!''

''మిస్టర్ సుధాకర్! మర్యాదగా చెబుతున్నాను . ముందు నీవు బయటకు వెళ్ళు.''

'' నా గెస్టుహౌసుకొచ్చి నన్నే పొమ్మంటున్నావా బ్రదర్! చాలా అన్యాయం, ఏం బాగాలేదు. ముందు నామాటవిని ఒక్క అయిదు నిముషాలు బయటకెళ్ళు. ఓన్లీ ఫైవ్‌మినిట్స్! అయిదే అయిదు నిముషాలు!''

సుధాకర్ రాంబాబుని బయటకి తోయడం ఆరంభించేడు.

రాంబాబు వాడి చేతులు నెమ్మదిగా విదిలించుకోబోతే బలంగా తోసేడు.

తూలిపడబోయి రాంబాబు నిలదొక్కుకున్నాడు.

నిలదొక్కుకుని ఒక్కటి ఫడేల్మని దవడ మీదకి ఇచ్చుకున్నాడు రాంబాబు.

పెదవి తడుముకున్నాడు సుధాకర్ – రక్తం!

తన పరాక్రమం రాంబాబు మీద పనికిరాదని గుర్తించిన సుధాకర్ ఛాయవైపు పరిగెత్తేడు.

ఛాయను సుధాకర్ పట్టుకోకముందే – రాంబాబు సుధాకర్‌ని పట్టుకుని రెండు ఎడాపెడా వాయించేసాడు. అంతేకాదు–

పక్కలో తీసి పెట్టితన్నగానే దబ్బున పడిపోయి వెంటనే లేవలేకపోయేడు సుధాకర్.

కట్‌డ్రాయర్‌లో రాంబాబు పహిల్వాన్‌లా వున్నాడు.

దెబ్బలకి జడిసిపోయి పారిపోబోతుంటే – వాడి కాలర్ పట్టుకు ఆపేసాడు రాంబాబు.

వాడిని అలా అక్కడే నిలబెట్టి – రాంబాబు గబగబా డ్రెస్సేప్పయి, ఛాయతో బయటపడి – వాడిని గదిలోనే వుంచేసి తలుపు గడియ పెట్టేసాడు.

గబగబా మెట్లుదిగి – హాలు దాటి – గేటుదాటి – ఒకటే పరుగు.

రోడ్డుపైకి వచ్చిన ఇద్దరూ – వస్తున్న ఆటోని ఆపేసి ఎక్కేసారు.

''ఇలా అవుతుందనుకోలేదు ఛాయ – క్షమించు '' అన్నాడు రాంబాబు.

''ఇది కూడా వొక అనుభవమే నాకు! ఇంత అడ్వెంచెర్ జరగకపోతే నీ హీరోయిజమ్ నాకెలా తెల్సేది చెప్పు ?''

ఆడదాని అభినందన కన్న మగవాడికేంకావాలి ?

రాంబాబు ధారాసింగ్ అంత పెరిగిపోయేడు ఛాయమెడచుట్టూ చేయవేసి గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

''వాడు పొమ్మనగానే నీవు బయటకి పోయుంటే అమ్మో ! నా పని ఏమయ్యేది ? '' గుండెలపై చేతులు వేసుకుంది ఛాయ.

'' ఏమయ్యేది ? అదీకూడా వొక అనుభవమయ్యేది ! ''

రాంబాబు చెంప ఛెళ్ళుమంది !

టైరు బరస్ట్ అయిందనుకుని డ్రైవరు ఆటోని వొక క్షణం ఆపి ముందుకు పోనిచ్చేడు.

అంత హీరోనూ ఛాయముందు తలవంచుకున్నాడు.

''సారీ ఛాయ ! నోరు జారింది '' అన్నాడు రాంబాబు.

''నోరు జారడంకాదు. మగాడిగా నీ బుద్ధి చూపించుకున్నావ్. నేను కొట్టింది నిన్ను కాదు. పురుషునిలో అహాన్ని నే కొట్టింది ! స్త్రీపట్ల నీచ మైన సంస్కారాన్ని నేకొట్టింది ! స్త్రీ పట్లనీకున్న చులకన అభిప్రాయాన్ని నేను కొట్టింది ! దెబ్బ అక్కడ తగిలితే సంతోషిస్తాను !'' అని

''ఏయ్ ! ఆటో ఆపు '' అంది ఛాయ ఆమె ఇల్లు తగలగానే !

## 13

ఛాయ ఇంటికి చేరేటప్పటికి టైము రాత్రి పదకుండవుతోంది. అప్పుడు ఇంట్లో పెద్ద సమావేశం జరుగుతోంది.

అది రెండు గదుల డాబా ఇల్లు.

ఆ ఇంటి సభ్యులను లెక్కవేస్తే అది చాలా చిన్న ఇల్లు అని చెప్పాలి.

ఛాయకి తల్లి వుంది. తండ్రివున్నాడు. ఇద్దరు తమ్ముళ్ళు, ఇద్దరు చెల్లెళ్ళు వున్నారు.

ఇద్దరు చెల్లెళ్ళూ పయిటలువేసి, చదువులు మాని ఇంటిదగ్గరే వున్నారు. తమ్ముళ్ళిద్దరూ చదువు వెలగబెడుతున్నారు.

ఛాయ తండ్రి రిటైరయి అయిదు సంవత్సరాలయింది.

ఛాయ తండ్రిపేరు నారాయణ.

మొన్న మొన్నటి వరకూ ఆ యింటి యజమాని నారాయణ.

మొన్న మొన్నటివరకూ ఛాయతో సహా మిగతా కుటుంబసభ్యులు అతన్ని యజమానిగా అలవాటు పడి వున్నారు. ఆ రోజుల్లో అతని ఎదుట మాటాడ్డం కాదు – నిలబడ్డానికే ధైర్యంలేదు – ఎవరికీ. అతనిమాటకి ఎదురులేదు తిరుగులేదు. ఎంతచెబితే అంత!

నారాయణ స్థానం ఇపుడు ఛాయది. ఆమెకు తెలీకుండానే క్రమ, క్రమేణా తండ్రి అధికార దండం చేజిక్కించుకుంది ఛాయ.

కుటుంబ సభ్యులు తిరుగుబాటు చేయలేక – ఆమె స్థానానికి పీఠమేసారు. ఆమెను యజమానిగా అంగీకరించేరు అనే కన్నా అంగీకరించక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి అనడం సబబు.

నారాయణ అంటే ఆ యింట్లో ఇపుడు ఎవరికీ భయంలేదు. లక్ష్యం లేదు. ఏ మాత్రంకూడా ఖాతరు లేదు. నారాయణ తన స్థానభ్రంశాన్ని భరించలేక తిరిగి అతని పీఠాన్నీ పొందడానికి, అధికార దండం అందుకోడానికి నానా యాతన పడ్డాడు. యజమానిగా తిరిగి తన స్థానాన్ని పొందడానికి విఫలయత్నం చేసేడు.

అతని మాట ఇపుడు అతని భార్యే వినదు. వెంట్రుకతో సమానంగా కొట్టిపారేస్తోంది. దాంతో అతని వొళ్ళు మండిపోయి పెళ్ళాన్ని అదేపనిగా తిడతాడు.

ఇపుడిపుడే అతని స్థానం తెల్సుకుంటున్నాడు. యజమాని పవరు ఎందుకుపోయిందీ ఇప్పుడిపుడే అర్థమవుతోంది అతనికి.

పెళ్ళాం, పిల్లలపై విరుచుకుపడి కేకలు వేయడం కాదు. ఇంట్లో సమస్యలు పరిష్కరించు ! అవసరానికి శేరు బియ్యం గింజలు తేలేనివాడి మాటకేం విలువవుంటుంది ? పిల్లల ఫీజాలకి డబ్బు అమర్చలేనివాడికి ఆ ఇంట్లో గౌరవం ఏమాత్రం వుంటుంది ?

ఆ విలువా, గౌరవం ఛాయకి దక్కక తప్పదు మరి.

ఆ యింట్లో పొయ్యి రాజుకుంటుందంటే ఛాయ తెచ్చే జీతం! వాళ్ళు ఇంటిల్లిపాది బట్ట కడుతున్నారంటే అది ఛాయ తెచ్చే జీతం! వాళ్ళకి నీడనిచ్చే కొంప చిన్నదైనా, ఇరుకైనదైనా – వుందంటే, అద్దె కడుతున్నారంటే – అది ఛాయతెచ్చే జీతం!

పప్పులూ, ఉప్పులూ, ఫీజాలూ, ఖర్చులూ, సినిమాలూ, షికార్లూ ఏదైనా ఆధారపడాల్సింది ఛాయ సంపాదనపైన!

ఛాయ వచ్చేటప్పటికి – నారాయణ మంచం మీద పడుకుని చుట్ట కాలుస్తున్నాడు.

ఇంత ఆలస్యంగా ఆడపిల్ల ఇంటికొస్తే అసలు ఒప్పుకునేవాడా !

ఎన్ని రంకెలు వేసేవాడు ! ఎన్ని బూతులు తిట్టేవాడు! కొట్టడానికి కూడా వెనుకాడేవాడు కాదు.

అది మొన్న మొన్నటి దాక!

తర్వాతది గొణుగుడుగా సాగింది.

అతడే మాత్రం గొణిగినా, వాగినా ఇప్పుడు రిటార్టు ఇచ్చేస్తోంది ఛాయ

నారాయణ ఇపుడు గొణుగుడూ చాలావరకు తగ్గించేసాడు. ఎప్పుడొచ్చినా, ఎప్పుడెళ్ళినా, ఏమిచేసినా ఏమీ అనడు. ఛాయనే కాదు. కుటుంబసభ్యులనెవర్నీ అనడు ఏదీ పట్టించుకోడు.

అతను చేస్తున్నది – సరిగ్గా టైముకి భోజనం చేయుట, చుట్టలు తాగుట, హాయిగా నిద్రపోవుట!

''నాపిల్లలు నా పిల్లలు !' అనుకున్నంతకాలమే బాధ, అనుకోకపోతే ఏ బాధాలేదు.

అంచేత అలా అనుకోడం, బాధపడ్డ మానేసాడు. మానేయడం అంత ఈజీకాదు. అందుకు సాధన చేసి జయించేడు.

ఇపుడతనికి ఏ బాధాలేదు.

మొదట్లో తండ్రి అరిస్తే భరించలేకపోయిన ఛాయ , గొణగుడుని కూడా సహించలేకపోయిన ఛాయ ఇపుడు తండ్రి నిర్లిప్తతని అసలు భరించలేకపోతోంది ఏమాత్రం సహించలేకపోతోంది.

అతను నిమ్మకు నీరెత్తినట్టుగా ఏమీ పట్టించుకోకుండా అలా వుండడం ఒక బాధ్యతగల తండ్రిగా అది సరికాదు – అని గోల పెడుతోంది. గగ్గోలు పెడుతోంది.

'ఈ సంసారం మోయాల్సింది భరించాల్సిందీ అతను – నేను కాదు. నాకేం పట్టింది బాధ? ఎందుకు చేయాలి ఈ గాడిద చాకిరి? అని పిచ్చిగా అరచిన సందర్భాలు లేకపోలేదు.

చుట్టతాగుతున్న నారాయణ – వస్తున్న ఛాయను చూసి పొలమారేడు. చుట్టను ఆర్పి దుప్పటికప్పుకు పడుకున్నాడు. ఆమెను గమనించనట్టే నటించేడు.

లోనకి వచ్చిన ఛాయకి – అప్పుడే వొక సమావేశాన్ని అర్ధాతరంగా ముగించినట్టుగా అర్ధమయింది.

చెల్లెళ్ళు ఇద్దరూ నిద్ర నటిస్తున్నారు. చిన్న తమ్ముడు నిజంగానే నిద్రపోయేడు.

ఛాయని చూసి నోరుమూసేరేగాని – తొకముడవంది అక్కడిద్దరే .

ఒకరు తల్లీ. రెండోవాడు – పెద్ద తమ్ముడు శివ!

ఛాయ రాకముందు అక్కడ పెద్ద రభస. వొకరిమీద వొకరు కేకలు, చర్చ – ఛాయ తిరుగుళ్ళ మీద! వాళ్ళలో వాళ్ళే ముసుగులో తన్నుకోవడమేగాని – ఛాయని ఎదురుగా అడిగే ధైర్యం ఎవరికీ లేదు.

వాళ్ళని చూసి విషయం కొంత గ్రహించగలిగింది ఛాయ.

వాళ్ళు ఇంతసేపూ తన గురించే చర్చించేరు.

ఏమిటి చర్చించేరు?

తెల్సుకోకుండా ఉండలేకపోయింది ఛాయ.

చివరికి రెట్టించగా తల్లి సీతమ్మ అంది –

''నీ గురించి వాడి ఫ్రెండ్సు చెడుగా మాటాడుతుంటే భరించలేక వాళ్ళతో గొడవపెట్టుకు వచ్చేడట శివ ఏ గొడవలూ పడకురా నాయినా అంటున్నాను – అంత కన్నా మరేంలేదమ్మా '' అంది సీతమ్మ.

అంతేగాని శివ అన్న మాటలు పూర్తిగా చెప్పలేదు తల్లి.

''అక్కయ్య నాపరువు తీస్తోంది. నేను తలెత్తుకు తిరగలేకపోతున్నాను. అదివాడెవడో రాంబాబుతో ఎందుకు తిరగాలి? వాడితో పబ్లిగ్గా తిరగడంకాదు – ఇంటికే తీసుకొస్తోంది వాడూ అలాగే వస్తున్నాడు. చూస్తూ అలా ఊర్కోవలసిందేనా ? నా తల కొట్టేసినట్టుగా వుంటోంది. నేనీ ఇంట్లోంచి వెళిపోతాను'' అని అరిచేడు శివ.

తమ్ముడిమాట తల్లి ఏవిధంగా కవర్‌చేస్తున్నదీ గ్రహించలేనిది కాదు ఛాయ.

''శివ అంటున్నదాంట్లో తప్పులేదు. దానికి పరిష్కారం చూడాల్సిందే '' అంది ఛాయ.

ఛాయ తిరుగుడు గురించి శివ సభలో పెట్టినపుడు – ఇంచుమించు అందరూ శివకి అనుకూలంగా మాట్లడేరు. అసలు పాయింట్‌నుంచి డీవియేట్ అయి ఛాయపై ఇంకేవేవో మాటాడుకున్నారు. ఛాయకి పొగరన్నారు, గర్వం అన్నారు. సంపాదిస్తోందని పెద్ద ఫోజు అన్నారు. చీర కొనమంటే ఎంత గీర్వాణంగా మాటాడిందో ఒక చెల్లి చెప్పింది. అది రోజూ సినిమాలకీ వెళ్తుందిగాని – సినిమాకి డబ్బులడిగితే మొన్న ఎంత వెర్రెక్కిపోయిందో – మరో చెల్లి అక్కసు వెళ్ళగక్కింది. ఎవరికి తోచింది వాళ్ళు కక్కేరు.

తల్లి అటూ, ఇటూ కాకుండా బేలన్సుడుగా మాటాడింది వాళ్ళు అన్నదల్లా ఒప్పుకుంటూనే, ఛాయది తప్పంటూనే – ఛాయని వెనకేసు కొచ్చింది. వాళ్ళని ఖండించింది.

తండ్రి మాత్రం కంప్లీట్‌గా సైలెంట్! నో ఇంటర్ ఫియరెన్స్. అతను అందరు అంటున్నదీ వినడం వరకేగాని – నోరు మెదిపిన పాపాన పోలేదు. చర్చలో పాల్గొనలేదు.

ఇపుడు ఛాయవచ్చి ఈ సమస్యకి పరిష్కారమేమిటీ అంటే ఎవరూ మాటాడ్డంలేదు.

ఛాయే పరిష్కారం చెప్పింది.

''శివకి ఇరవయ్యేళ్ళు. వాడు మేజరు అయ్యేడు. వాడికన్నీ తెలుస్తున్నాయి. వీధిలోకెళ్ళే మగాడికి అక్కలనీ, చెల్లెళ్ళనీ అంటే ఎంత బాధగా వుంటుందో నేను గ్రహించగలను. ఇకమీదట వాడు బాధపడ్డానికి వీల్లేదు! ఈ క్షణం నుంచి ఇంటి బాధ్యత వాడిది.''

''అంటే'' అంది అయోమయంగా తల్లి.

''మన శివ ఇక చేతులు ముడుచుకు కూర్చోడు. సినిమా హీరో అయిపోతాడు. అక్కని గేలిచేసే మిత్రుల మీద ప్రతీకారం తీర్చుకుంటాడు. అక్కనీ, చెల్లెళ్ళనీ మరోడూ, మరోడూ వేలెత్తి చూపకుండా పన్నెత్తి మాటాకుండా ఎంచక్కా పెళ్ళిళ్ళు జరిపించేస్తాడు. జరిపించేసి – ఈ యింటికి కళంకం తేకుండా పోండి ఆడముండల్లారా – అని అత్తవారిళ్ళకి బండెడు సారె

పెట్టి పంపించేస్తాడు. పంపించేసి తల్లినీ, తండ్రిని తమ్ముణ్ణీ మారాజులా పోషిస్తాడు – ఎలా వుంది పరిష్కారం.''

'' ఏం ? నేను పోషించలేననుకున్నావా ?'' అన్నాడు రోషంగా శివ.

''లేదమ్మా! నీవు పోషించగలవు పోషించమనే అంటున్నా(రా చిట్టి తండ్రీ. నేను చెప్పింది నీకు అర్థమయినట్టులేదు ''

''ఎందుకర్థమవలేదు. నీవా సినిమా కథలు చెప్పేబదులు హీరోతో తిరగడం మానెయ్యొచ్చు కదా!'' అన్నాడు శివ

''ఒరే శివా ! పెద్దా చిన్నా లేకుండా ఏమిటామాటలు! నోర్మూస్తావా లేదా '' అంది తల్లి

''కొడుకుని గొప్పగా నోర్మూయిస్తున్నావుగాని – నీవు కాసేపు నోరుమూస్కో'' తల్లితో అని తమ్ముడివైపు తిరిగింది ఛాయ – ''అవున్రా ! నేను తిరుగుతాను నా యిష్టం ఈ మాట నీ ఒక్కడివే అంటున్నావా ? అందరూ అంటున్నారా ? ఎవరికైనా సరే నాది ఒకటే జవాబు నా యిష్టమొచ్చినోడితో తిరుగుతాను – మీ ఇష్టమయితే వుండండి. కష్టమైతే పోండి అంతే !''

''పోతాం '' అని ఎవరూ అన్లేదు. రెండు నిముషాల భయంకర నిశ్శబ్దం!

తండ్రి అసహనంగా మంచంపై అటునుంచి ఇటు తిరిగేడు. తల్లికాళ్ళు బరువుగా చాపి – దించిన తలని ఎత్తకుంటోంది. శివ టేబుల్‌పై తల ఆన్చి చేత్తో పిచ్చి పిచ్చి గీతలు టేబుల్‌పై గీస్తున్నాడు. చెల్లెళ్ళు ఇద్దరూ గట్టిగా కళ్ళుమూసుకున్నారు.

ఛాయ కళ్ళంట నీళ్ళు తిరిగేయి.

కళ్ళు తుడుచుకుంటూ అది – ''నేనేం పాపం చేశానని మీరంతా నన్ను శత్రువులా చూస్తున్నారు? మీ అందర్నీ నా నెత్తిన పెట్టుకు చూస్తున్నానే ? అసలు ఎందుకు చూడాలినేను ? చూడకపోతే మీరు రోడ్లంబడి అడుక్కుతినాల్సి వస్తుంది అనేది మీరు గ్రహించేరా ? మిమ్మల్ని నేను చూస్తున్నానంటే – అది ఒక బాధ్యతగా తీసుకున్నాను. ఒక ధర్మంగా భావించేను. అంతేగాని మీరంటే (పేమకారిపోయికాదు. ఇష్టంతో గాదు. నాకు ఇష్టం ఏమిటో తెల్సా. పెళ్ళిచేసుకుని, పిల్లల్నికని – నాదంటూ ఒక సంసారం చూస్కోవాలని. ఒరే శివా ! నావయసెంతో తెల్సురా ! నీకు పాతికేళ్ళు రాగానే నేనో కూతుర్ని కని నీకివ్వాల్సిన వయసురా నాది. నీవుగాని, అమ్మగాని, నాన్నగాని నాగురించి ఎప్పుడైనా ఆలోచించే(రా? మీరు నా గురించి ఆలోచించనపుడు – మీ గురించి నేనెందుకాలోచించాల్రా ?''

''అంటే నీకు పెళ్ళి జరగడం, సంసారం చేయడం మాకు ఇష్టం లేదా ? నీకు మేం సంబంధాలు ఏం చూడ్డంలేదా ? ఆడదాన్ని ఒక్కర్తిని ఎంతకని చేసుకురాగల్ను ? మగాడున్నాడు. ఎందుకూ ? మంచం మీద పీనుగు ? ఏం ఉపయోగం. నీకు పెళ్ళి కాగూడదనుకుంటే నేను ఉన్నపాటున రాలిపోవాల. నీ నోటికి ఎంతొస్తే అంతనేస్తావు. అనూ, అనే నీకూడు తింటున్నామనేగా అంతేసి మాటలంటున్నావు '' కళ్ళు తుడుచుని

ముక్కు చీదుకుంది తల్లి.

''ఇందులో నాతప్పేం లేదు అని సమర్థించుకోడానికి ఎందుకంత తంటాలు పడతావు అవమ్మా! నా పెళ్ళి గురించి ఎవరెంతంత శ్రమపడ్డారో, ఎన్ని సంబంధాలు ఈడ్చుకొచ్చేరో.. అంతా నాకు తెల్సమ్మా..ఇపుడెందుకు అవన్నీ నాకు పెళ్ళి అక్కర్లేదు నేను చేసుకోను అని చెబుతున్నాను. ఎందుకోసం తెల్సా ? నాతల్లికోసం, తండ్రికోసం, నాచెల్లెళ్ళకోసం, నా తమ్ముళ్ళకోసం. అంతే!'' ఛాయ కళ్ళవెంట నీళ్ళు జలజలరాలేయి

'' మీకు చెబ్తున్నదొక్కటే. నేను వేస్తున్న ప్రతిఅడుగు తూచి తూచి వేస్తున్నాను. ఇరుగూ, పొరుగూ ఏదో అంటారని నాకు భయంలేదు. మీరంతా నా గురించి ఏమనుకుంటున్నారోనని భయంలేదు. నేను ఏం చేసినా ఎదురుగానే చేస్తున్నాను. అవసరమయ్యే చేస్తున్నాను. గత్యంతరం లేక చేస్తున్నాను. నా నెత్తిమీద మోయలేని బరువుంది. మీరు బరువు దించక్కర్లేదు ఎక్కితొక్కకుంటే చాలు. నాకు మీరంతా సాయం చేసినట్టే లెక్క'' అని శివ దగ్గర కెళ్ళి ''ఒరే! ఒకటి మాత్రం నిజం శివా! మీ అక్క ఎప్పుడూ తప్పుచేయదురా. నమ్మరా! అంతకన్నా నీకు చెప్పలేనురా. నీకు అర్థం కాదురా. పిచ్చి ఆలోచనలు మాని బాగా చదువుకో. నీ చదువుకి ఎంత సాయం చేయమంటే అంత సాయం చేస్తాను. బాగా చదువుకో.'' అంది ఛాయ.

ఛాయ అక్కడనుంచి నిష్క్రమించేక '' అది చూశేవా ? అన్ని కబుర్లాడిందిగాని రాంబాబుతో తిరగనని ఒక్కముక్క అందా. రంకు నేర్చినమ్మ బొంకు నేర్చినట్టు. వెధవ తిరుగుళ్ళు తిరిగేస్తూ 'మీ అక్క ఎప్పుడూ తప్పు చేయదురా' అని నంగనాచి కబుర్లు '' అని ఇద్దరు చెల్లెళ్ళు చెవులు కొరుక్కున్నారు.

ఆమాటలు ఆమె ఎదుట అనే ధైర్యం లేదు.

''అవును. నాయిష్టం. నేను రాంబాబుతో తిరుగుతాను. ఒకడుకాదు. పదిమంది రాంబాబులతో తిరుగుతాను. నా యిష్టం. నేను తిరిగితే మీ కొచ్చిన కష్టమేవిటి ? నష్టమేవిటి ? మీనోటి దగ్గర కూడుపోతోందా ? సరదాలు చల్లారి పోతాయా ? మీక్కావలసింది మీకిస్తున్నాను. సంతోషించండి. నాక్కావలసింది నేను తీసుకుంటున్నాను. ఏడవకండేవడవకండి. మీకు చేస్తున్న చాకిరీలో నాకు తృప్తిలేదు. అతని వెచ్చని ఊపిరిలో నాకు సుఖముంది. తృప్తి కావల్సినంత వుంది. నేను చేస్తున్నది. మీకు అనవసరం నాకు అవసరం'' అంటుంది ఛాయ.

ఛాయ ఆ ఇంట్లో వున్న నల్గురికీ అక్కకాదు. ఇద్దరికి కూతురు కాదు. మొత్తం అందరికీ ఏడుగడ!

ఆ విషయం ఆ యింట అందరికీ తెల్సు.

తెల్సే ఇదంతా ఏమిటంటే – అదేమరి జీవితంలో గమ్మత్తు!

# 14

రాంబాబుకీ, ఛాయకీ అసలు పరిచయం ఎలా ఏర్పడింది!

అదొక చిత్రమయిన సంఘటన!

ఆరోజు –

సాయంత్రం కంపెనీ బస్ – మిగతా బస్‌లను ఓవర్‌టేక్‌చేస్తూ స్పీడుగా పోతోంది

డ్యూటీలు చేసి అలసిన శరీరాలను సీట్లలో కూలవేసి వేగిరంతీసుకుపోతోంది బస్. రాంబాబు, ఛాయ ఇద్దరూ ఆ బస్‌లో వున్నారు

సాయంకాలపు చల్లగాలి బస్ ఎంత స్పీడుగా వెళ్తే – అంతగా వీస్తోంది. అలసిన శరీరాలను సేదతీరుస్తోంది.

కంపెనీనుంచి బస్ అరగంట ప్రయాణం చేస్తేగాని ఉద్యోగులు ఇళ్ళకి చేరలేని దూరంలో వుంది మహానగరం విశాఖపట్నం.

కంపెనీ నుంచి నగరానికి 10 బస్సులుపైగా వెళ్తున్నా – రాంబాబుదీ ఛాయదీ మాత్రం ఒకటే బస్సు. బస్సు ఒకటే అయినా ఇద్దరి స్టేజా ఒకటికాదు.

ఇద్దరూ బస్సులో చాన్నాళ్లుగా ట్రావెల్ చేస్తున్నప్పటికీ ఛాయ రాంబాబుతోగాని రాంబాబు ఛాయతోగాని ఏ ఒక్కసారీ మాటాడుకునే అవకాశం రాలేదు.

అందుకోసం ఎవరికెవరూ ఎదురుచూడ లేదు కూడాను!

కాని ఆ రోజు –

బస్ నగరంవేపు వేగంగా పోతుండగా –

జరిగిన ఇన్సిడెంటు వాళ్ళిద్దర్నీ కలిపింది.

ఉద్యోగస్తుల్లో ఆ బస్సు ఎక్కేది ఇద్దరే ఇద్దరు ఆడవాళ్ళు. మిగతా వాళ్ళంతా మగవాళ్ళు. ఆడవాళ్ళిద్దరూ ఛాయ, రూపా. వెనుక రెండో వరసలో టూసీటర్‌లో కూర్చుంటారు. ఆ రోజు రూప సెలవులో ఉండడంచేత – ఇద్దరిలో ఛాయ ఒక్కతే ఆ బస్సులో ప్రయాణం చేస్తోంది.

ఛాయ టూసీటర్‌లో కిటికీకి ఆనుకుని కూర్చుని వుంది.

వారపత్రిక తిరగేస్తోంది.

ఛాయ వెనుకసీటు రాంబాబుది.

రాంబాబు డ్యూటీ చేసి బాగా అలసివున్నాడేమో – చదువుతున్న పుస్తకం మూసేసి – కళ్ళు మూసుకున్నాడు.

నిద్రపోతూ జోగుతున్నాడు.

జోగుతూ పక్కవాడిపై తూలిపోతూ ఇబ్బంది కలిగిస్తున్నాడు.

బస్ తన డ్యూటీ తను నిర్వర్తిస్తూ – నగరం వేపు ముందుకి పోతోంది.

చల్లగా వీస్తోంది – సాయంకాలపుగాలి.

అంతలో –

కయ్‌మని బీభత్సమైన, హృదయ విదారకమైన కేక.

ఆక్సిడెంట్ కాలేదు కదా !

తుళ్ళిపడిలేచాడు రాంబాబు

బస్ మామూలుగానే ముందుకి పోతోంది

అది ఛాయ వేసిన పెను కేక!

అతని నిద్రని అమాంతం ఎగర గొట్టేయడంకాదు - అందరి దృష్టి ఆమెవైపే మళ్ళేటట్టుచేసింది ఆ కేకలో తీవ్రత

కేకవేసిన ఛాయ పూనకంవచ్చినట్టుగా మనిషి నిలువునా ఎగిసి పడుతోంది మనిషి వూగిపోతోంది. ఆకులా అల్లాడిపోతోంది

రాంబాబు నిద్రమత్తు పూర్తిగా వదిలిపోయింది

బస్ ఆగలేదుగాని స్లో అయింది

అంతా ఆమె స్థితిని నోరు వెళ్ళబెట్టి చూస్తున్నారే తప్ప ఏ ఒక్కరూ ముందుకు రాలేదు.

రాంబాబుకి ఛాయ అందుబాటులో ఉన్నప్పటికీ ఏం చేయాలో తోచడంలేదు అదేస్థితిలో ఏ మగాడో అయివుంటే తప్పక పట్టుకు ఆదుకునేవాడు రాంబాబు. వయసులో వున్న ఆడదని తటపటాయిస్తున్నాడు.

ఛాయ నుదురు – ఎదురుగా వున్న సీటు హాండల్ తగిలి గాయమవడంతో రాంబాబు ఆమెను పట్టుకోకుండా వుండలేకపోయేడు

ఆమె సీటు పక్కకి వెళ్ళి గట్టిగా పట్టుకున్నాడు.

ఎంతగట్టిగా పట్టుకున్నా మనిషిని ఎత్తి కుదిపేస్తోంది

అంత కండలుదేరివున్న రాంబాబు చేతులు రివటలా వున్న ఛాయని ఆపలేకపోతున్నాయి.

ఎదురు సీటుకి వున్న కడ్డీకి ఆమె తలని కొట్టేసుకోబోతుంటే – కడ్డీకి అతని చేయి అడ్డు పెట్టేడు. అతని చేతికి ఆమె నుదురు కొట్టుకుంటోంది. అతని చేయి అంతా రక్తమయింది

అప్పటికే ఆమె నుదురికి దెబ్బతగిలింది.

రుమాలు తీసి ఆమెనుదుటికి అద్ది గట్టిగా కదలకుండా పట్టుకున్నాడు. ఆమె కాళ్ళు కొట్టుకోకుండా తన కాళ్ళతో బస్ బాడీకి గట్టిగా అదిమి పట్టేడు.

బస్ స్లోగా సాగుతూనే వుంది.

ఇంజన్ కోసమని బకెట్‌లో నీళ్ళు ఒక వారని వున్నాయి.

నీళ్ళు ఒకతను తెచ్చి ముఖం మీద జల్లేడు.

క్రమక్రమేణ రాంబాబు బలం పెద్దగా ప్రయోగించాల్సిన అవసరం లేకపోయింది.

నెమ్మది, నెమ్మదిగా ఛాయ తేరుకుంది.

స్పృహలోకి వచ్చింది.

జరిగింది గ్రహించి ఛాయ సిగ్గుపడుతుండగా– రాంబాబు లేచి తన సీట్లోకి వెళిపోయేడు. కాని–

అతని రుమాలు ఆమెవద్దనే వుంది.

నుదుటిపై తగిలిన దెబ్బకి రక్తం కట్టడంలేదు

రుమాలు అలా నుదుటికి అద్దుకుని నీరసంగా సీటుకి వేలాడిపోయింది ఆమె

బస్‌ని కింగ్‌జార్జ్ హాస్పటల్ వైపు మళ్ళించేరు

ఛాయ ఆస్పత్రి దగ్గర బస్ దిగింది

ఛాయకి సహాయంగా రాంబాబు దిగేడు

బస్సు కదిలింది బస్‌లో వాళ్ళంతా రాంబాబుని చూసి అసూయ పడ్డారు. గురుడు కొట్టేడు ఛాన్సు అనుకున్నారు. రేపు తెల్లారే ఈ వార్త కంపెనీ అంతా ప్రాకిపోతుందంటే ఆశ్చర్యపోనక్కర్లేదు

బస్సు దిగిన ఛాయ కళ్ళు తిరుగుతున్నాయంది.

ఆమెను పట్టుకున్నాడు రాంబాబు.

కిళ్ళీ బడ్డీ వద్దకు తీసుకెళ్ళాడు.

పూర్తిగా ఒకసోడా తాగింది ఛాయ.

మరోసోడా ముఖంపై జల్లుకుంది

ఆమె నుదుటిపై రక్తం ఇంకా చిమ్ముతూనే వుంది.

ఆస్పత్రి కాజువాలిటీ వార్డుకి వెళ్ళేరు

డాక్టరుతో – బస్సులో ఆమెకొచ్చిన ఫిట్స్ గురించి ఆమె చెప్పలేదు. రాంబాబుని చెప్పనీయలేదు. బస్సుకి సడన్ బ్రేక్ వేయడంవల్ల ఎదుటి సీటుకి నుదురు కొట్టుకుందవి బొంకింది ఛాయ.

ఆమె నిజం ఎందుకు చెప్పలేదో అర్థంగాక ఆశ్చర్యపోయేడు రాంబాబు. ఆస్పత్రినుంచి బయటకొచ్చేరు.

కాఫీ హోటల్లో కూర్చున్నారు.

డబుల్ స్ట్రాంగ్ వేడి, వేడి కాఫీ రెండు ఆర్డరు చేసేడు రాంబాబు.

''చాలా థాంక్స్'' అంది ఛాయ.

''దేనికి ? కాఫీకా ?'' అన్నాడు రాంబాబు.

నవ్వింది ఛాయ.

''మీకు చాలా ట్రబులిచ్చాను. మీరు చేసిన సాయానికి థాంక్స్ అనే రెండక్షరాలు సరిపోవనే నేననుకుంటున్నాను.''

''అయితే ఏమిస్తారు ?''

''ఏవిటి కావాలో అడగండి – ఇస్తాను. ''

''అడిగేయమంటారా ?''

''అడిగండి''

''నా రుమాలు మీ దగ్గరుంది – ఇచ్చేయండి''

నవ్వేసారు ఇద్దరూ

''రుమాలు ఉతికి రేపు మీకిస్తాను అంతా రక్తం''

''వద్దులెండి ఊర్కోనే అన్నాను. మీ దగ్గరే వుండనీయండి రుమాలు నాకిచ్చేస్తే - మీరు నన్ను మర్చిపోవచ్చు''

''మర్చిపోతే మీ కొచ్చే నష్టమేమిటీ ?''

''నష్టం, లాభం అంటున్నారు మీరు ? ఏదో లాభం ఆశించి మిమ్మల్ని ఆదుకోలేదు. నమ్ముతారా''

''ముమ్మాటికీ''

''కొన్ని సంఘటనలు మనుషుల్ని దగ్గర చేస్తాయి. అందులో లాభనష్టాల ప్రశ్నేలేదు''

''లాభ నష్టాలు లెక్కలు ఆపేయండి. మీ రుమాలు మీకు ఇవ్వబడదు. నా దగ్గరే వుంటుంది''

''అంటే నేను మీ దగ్గర వున్నట్టు లెక్క''

''మళ్ళీ ఇదేం లెక్క !''

నవ్వేసారు ఇద్దరూ.

కాఫీలు వచ్చేయి.

తాగేరు ఇద్దరూ.

తాగుతూ రాంబాబు అన్నాడు - ''నేనొకటి తెలుసుకోవచ్చా ''

''ఏవిటీ ?''

''ఇందాక మీరు డాక్టరుతో వున్న విషయం చెప్పకుండా ఇంకేదో చెప్పారేం ?''

ఛాయ వెంటనే మాట్లాడలేదు.

''అయామ్ సారీ ! మిమ్మల్ని ఇబ్బంది పెట్టినట్టున్నాను.. ఫిట్స్ సంగతి చెబితే మందులు రాసేవాడు గదా ''

''మందులు ఇంతకు ముందు వాడేనండి''

''అంటే మీకు తరచూ ఫిట్స్ వస్తుంటాయా. మందులకి తగ్గడంలేదా ?''

''లేదు''

అంతకన్నా వివరంగా చెప్పడం ఛాయకి ఇష్టంలేదు.

''మీరలా నెగ్లక్టు చేయకండి. మంచి స్పెషలిస్టుకి చూపించండి''

స్పెషలిస్టులను చూడడం జరిగింది. ఖరీదైన మందులు మింగడం జరిగింది.

ఏ మందులకీ తగ్గలేదు. ఏ మాత్రం తగ్గలేదు. అయితే

ఆ రోజు మొదలై రాంబాబు, ఛాయల స్నేహం దినదినాభివృద్ధి చెంది - గాఢంగా, బలంగా- ప్రాణానికి ప్రాణంగా స్నేహం నిలిచిపోయేక - రాంబాబు ఇచ్చిన మందుతో ఆమెకొచ్చే ఫిట్స్ రోగం ఎగిరిపోయింది.

## 15

మధ్యతరగతి స్త్రీకి వివాహం ఒక విషమ సమస్య.

పెళ్ళీడు వయసులో - కోరుకున్న వరుడితో స్త్రీకి వివాహం జరిగితే - అది నిజం గా గొప్ప అదృష్టం.

ఛాయ పెళ్ళీడు వయసురాగానే పెళ్ళి కోసం కలలు కన్నది - అందరి ఆడపిల్లలు లానే.

పయిట వేసిన పదినెలల కాణ్ణించే ఆమెకి పెళ్ళిచూపులు ఆరంభమయ్యేయి.

పెళ్ళి చూపులకి ఎలిజిబిలిటీ రాగానే - ఆడపిల్లకి చదువెందుకన్నారు.

ఎందుకన్నప్పటికీ - బలవంతంగా చదివింది ఆడపిల్ల ఛాయ.

చదవాలని చదివిందంతే.

చదివి ఏదో ఉద్యోగం చేద్దామని అనుకోలేదు.

పెళ్ళి చేసుకుని అత్తవారింటికి కాపురానికి వెళ్తాననుకుంది.

డిగ్రీ పరీక్షలకి వెళ్ళింది పాసయింది.

ఈలోగా పెళ్లి చూపులలో చాలాసార్లు కూర్చుంది. పాస్ కాలేదు.

ఈ ఏడు కాకపోతే - వచ్చే ఏడు అవుతుంది పెళ్ళి - ఆశతో ఏళ్ళు తరబడి ఛాయ ఎదురుతెన్నులు.

ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజ్‌లో రిజిష్టర్ చేయించుకుని వూరుకుంది.

ఉద్యోగం కోసం ఎదులుతెన్నులు చూడలేదు.

పెళ్ళికి పయిటేసిన కాణ్ణించి ఎదురుచూస్తే - పెళ్ళి ఇంతవరకు కాలేదు.

ఎదురు చూడని ఉద్యోగం నాలుగేళ్ళలో వచ్చింది!

లంచం లేకుండా ఉద్యోగం రాదు.

కట్నం లేకుండా పెళ్ళికాదు.

లంచం లేకుండా ఉద్యోగం వచ్చినట్లే - కట్నంలేకుండా ఎవడైనా చేసుకుంటాడేమోనని ఛాయ ఎదురు చూడలేదు.

ఛీ! కట్నం పుచ్చుకునేవాడిని నేను చేసుకోను - అనిగూడా శపథాలు చేయలేదు ఛాయ.

ఆమెకి పాతికేళ్లు దాటినా తరవాత - ఇక పెళ్ళి అవుతుందనే నమ్మకం సడలిపోసాగింది.

పదహారేళ్ళ పడుచుదనం - పాతికేళ్ళ పరువంగా మారిన ఛాయకి స్పష్టాస్పష్టంగా అన్ని విషయాలు అర్థమవసాగేయి.

తనకి పెళ్ళికాకపోవడానికి అదృష్ట దేవత కరుణించకపోవడమో , వరకట్న పిశాచి వికటాట్టహాసం చేయడమో కారణంగా ఆమెకి అంతకు ముందు అనిపించేవి.

ఇపుడామెకు అవే కాకుండా వేరే కారణాలు కూడా కన్పిస్తున్నాయి.

ఇంట్లో పిల్లవుందని ఎవరెవరో చూడడానికి రావడమే తప్ప తండ్రిగాని, తల్లిగాని

బంధువులు గాని పనిగట్టుకు వరుడిని తెచ్చే ప్రయత్నాలు చేయలేదు. వచ్చే సంబంధాన్ని హృదయ పూర్వకంగా ఎంత వరకూ ఆహ్వానించారనేది అనుమానమే ! రాయబారాలు, బేరసారాలు, సంప్రదింపులూ, నచ్చజెప్పడాలూ, తెగింపులూ, అప్పులూ – వీటితో సిన్సియర్‌గా దిగితే కూతురి పెళ్ళి ఎందుకు చేయలేరు ?

ఛాయలో ఒక విరక్తి. ఒక నిరాశ. ఒక నిస్పృహ.

పెళ్ళి మీద ఆమె ఇచ్ఛ దాదాపు నశించిందనే చెప్పాలి.

కాని

ఛాయది ఉప్పూకారం తింటున్న శరీరం !

పురుషుడు అవసరం! స్త్రీకి పురుషుడు లభించేది పెళ్ళి అయేకే.

అంతవరకూ ఆమె ఆగవలసిందే ! తప్పదు !

పురుషుడికి స్త్రీ కావాలంటే పెళ్ళివరకూ ఆగనక్కర్లేదు. పురుషుడికి పెళ్ళి కూడా ప్రాబ్లెమ్ కాదు.

ఎంత నిగ్రహిద్దామన్నా కళ్ళెంపడని వయసు.

రోకటిపోటులా వయసుపై పుస్తకాలు, సినిమాలు, పరిసరాల ప్రభావం.

ఆమె శరీరాన్ని ఆమె అదుపు చేయడం ఆమెకు చేతకాలేదు. బలవంతపు నిగ్రహం ఆమెను హిస్టీరిక్‌గా మార్చింది.

ఫిట్స్‌లోకి దించింది.

మూలశంక మనిషిలా ఎప్పుడుబడితే అప్పుడు – ఎవరిని బడితే వాళ్ళ మీద విరుచుకుపడేది. కోప్పడేది. తిట్టేది. ఏడ్చేది.

ఒక్కోసారి చచ్చిపోవాలనిపించేది.

ఎమోషనల్‌గా ఆమె వివేకం కోల్పోయినా – అలవర్చుకున్న సంస్కారం, నేర్చుకున్న జ్ఞానం, చూస్తున్న లోకానుభవం – ఆమెను ఆపేవి.

నీతి, శీలం అనే పదాలు ఆమెను చంపుకు తినేస్తున్న సమయంలో సరిగ్గా ఆమెకి రాంబాబు తగిలేడు – బస్ ఇన్సిడెంట్ ద్వారా !

అప్పటినుంచీ రాంబాబు స్నేహం ఆమె వదుల్కోలేదు.

అతనితో ఒక సాయంత్రం కూర్చొని ఆమె సమస్యలూ, బాధలూ, చెప్పుకుంటే చాలు – ఆమె కెంతో రిలీఫ్‌గా వుండేది. మనసెంతో తేలికయ్యేది.

ఛాయ అతనికి ఇంట్లో అందరి వ్యక్తిత్వాలు, అన్ని సమస్యలూ దాపరికం లేకుండా చెప్పేది గాని – తన ఫిట్స్ గురించి మాత్రం చెప్పేది కాదు. దాటవేసేది.

రాంబాబు ఎంత స్నేహితుడైన పురుషుడు ! అతనితో తన ప్రాబ్లెమ్ ఏం చెబుతుంది ?

అయితే –

ఛాయ విరహాగ్నితో వేగిపోతున్నప్పుడల్లా – అపుడామెను బస్సులో పొదవిపట్టుకున్న

అతని చేతులే గుర్తుకొచ్చేవి. అతని బలమైన విశాలమైన బాహువులే ఆమెను బంధించి దహించేసేవి ఏ అర్ధరాత్రప్పుడో లేచి రాంబాబు దగ్గరికి పరిగెట్టుకు పోవాలనిపించేది.

పురుషుడు స్పర్శ మొదటిసారిగా అదే! అతనిదే!

రాంబాబుని తను ప్రేమిస్తున్నదా ?

లేదు అలాంటిదేమీ లేదు.

ఆమెకి కావలసింది పురుషుడు.

పురుషుడికి ఒక ఆకృతి, రూపం లేకుండా ఊహలో నిలవడుగాబట్టి, పురుషుని స్పర్శ రాంబాబు చేతుల ద్వారా ఒకసారి పొందివున్నది గాబట్టి – ఆమె కలల పురుషుడు రాంబాబు అయ్యేడు. అంతే!

అదృష్టవశాత్తు రేపు ఏ సోంబాంబో ఆమెను పెళ్ళాడితే – ఆమె పురుషుడు సోంబాబే అవుతాడు గాని రాంబాబుకాడు. అది స్పష్టం.

ఇంకా పచ్చినిజం చెప్పుకోవాలంటే ఛాయ శివ పక్కన పడుకుంది!

ఆ రోజు రాత్రి –

ఛాయకి నిద్రపట్టలేదు. ఆ రోజేకాదు. ఏ రోజూ నిద్ర పట్టడంలేదు. మంచంపై అటూ ఇటూ దొర్లింది నిద్ర పట్టలేదు.

ఆమె శరీరం పురుష వాంఛతో దహించుకుపోతోంది. ఆ సమయంలో తలుపుతోసుకు రాంబాబు రాగూడదా ?

రాంబాబు కాకపోతే రోడ్డుపై పోయేవాడెవడో పెరటి తలుపులు తోసుకురాగూడదా

తను రోజూ చిన్న చెల్లెలు పక్కన పడుకునేది. దాన్ని రాత్రులు తనకి తెలీకుండానే కౌగలించుకు హింసించేది. అది భరించలేక పక్కన పడుకోడం మానేసింది చెల్లెలు. తన పక్కన ఎందుకు పడుకోడం మానేసిందీ – ఛాయకి ఇప్పటికీ అర్థంకాదు!

ఛాయకి నిద్రపట్టక, తలగోక్కుంటూ లేచింది.

మంచంమీంచి లేచిన ఛాయకి తన వక్షం రెండు కొండలంత బరువు ఫీలయ్యింది. ఆ బరువుకి ముందుకి తూలిపడబోయింది.

తూలుతూ, పెరటి గుమ్మం తెరచుకు బయటకు వచ్చింది.

వెన్నెల పుచ్చపువ్వులా కాసివుంది.

గాలి చల్లగా వీస్తూ చలిపెడుతోంది.

పెరట్లో మంచం పరుచుకుని ఆమె తమ్ముడు శివ నిద్రపోతున్నాడు.

అతని తొడలపై పంచె తొలగివుంది.

ఛాయ దృష్టి అక్కడపడింది.

ఆమె ఒళ్ళంతా వేడివేడి సెగలతో పొగలు కక్కుతోంది. సలసలమరిగిపోతోంది.

ఛాయ దృష్టి ఇంకా అక్కడే వుంది. రెప్పకూడా వేయలేదు

అలా ఎంతసేపు ?

నెమ్మది, నెమ్మదిగా అడుగులో అడుగేసుకుంటూ మంచం వరకూ వెళ్ళింది

మంచం పైకి చేరింది. చేరకుండా ఉండలేకపోయింది.

శివని కౌగలించుకు పడుకుంది. పడుకోకుండా వుండలేకపోయింది.

అక్కడ –

ఆమెకు శివ తమ్ముడా ?

కాదు . పురుషుడు.

పురుషుణ్ణి కౌగలించుకు పడుకుంది స్త్రీ

అలా పడకోడం ఆమెకప్పుడు తప్పుగా తోచలేదు భయం వేయలేదు. అసహ్యం కలగలేదు.

ఆమె గిజగిజలాడిపోతున్నది వాంఛతో

సరిగ్గా అంతలో –

అంతలోనే ఏదో అలికిడి!

ఛాయ తలెత్తి చూస్తే – గుమ్మం దగ్గర తల్లి!

ఛాయ చివాల్న మంచంమీంచి లేచింది. గబగబా నుయ్యి దగ్గరికి పరిగెట్టింది.

"నిద్ర పట్టడంలేదా ఛాయ! " అంటూ దగ్గర కొచ్చింది తల్లి.

కాళ్ళులో శక్తి సడలిపోయినట్టు చప్పున చతికిల బడిపోయింది ఛాయ.

ఇద్దరి మధ్య కాసేపు భయంకర నిశ్శబ్దం!

అంతసేపూ తల్లి ఒక్క దెబ్బవేయకుండా, పల్లెత్తుమాట అనకుండా అలా నిష్ఠూరంగా మౌనంగా ఉండిపోవడం భరించలేకపోయింది ఛాయ. మండిపోయింది ఛాయ.

నెత్తిమీద డబ్బాడు కిరసనాయలు పోసి ఒక్క అగ్గిపుల్ల వెలిగిస్తే ఎలామండిపోతుందో అలా మండిపోతోంది ఛాయ ఒళ్ళు.

ఛాయ చప్న నిలబడి ఇటూ, అటూ చూసి – పెద్ద బకెట్ ఒకటి నిండుగా నీళ్లతో కనిపిస్తే – అమాంతం ఎత్తి నెత్తిమీద ఒంపుకుంది.

మంటలు ఇంకా పూర్తిగా దిగలేదులా వుంది. చేదకోసం వెదుకుతూ వుంటే – నూతికి ఆటుకేసి వున్న చేద అందుకుంది సీతమ్మ.

ఒకటీ....రెండూ....మూడు.

తల్లే నాలుగు బకెట్లుతోడి ఛాయ తలపై గుమ్మరించింది.

ఇంక చాలన్నట్టు లేచి ఛాయ వెళిపోతుంటే – ఆ చేద అక్కడ వేసి కూతుర్ని పొదివి పట్టుకుంది సీతమ్మ.

తల్లిని కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది ఛాయ.

''అమ్మా ! నీకు దండం పెడతాను నాకీ నరకబాధనుంచి విరగడ కల్పించు. లేకుంటే నన్నిలా ఆ బావిలోకి తోసి చంపేయి'' అంటూ తల్లి కాళ్ళపై పడిపోయింది ఛాయ.

కళ్ళనీళ్ళతోనే ఛాయను లేవదీసింది సీతమ్మ.

మరుసటిరోజు సీతమ్మ తెల్లారే బయల్దేరింది తను బయల్దేరడమే కాదు మొగుడితో రాత్రంతాపోరి – అతను బయల్దేరేలా చేసింది

నారాయణ ఒకవైపు సీతమ్మ ఒకవైపు బయల్దేరారు పోయిన వస్తువేదో వెదుకుతున్నట్టు బంధువుల ఇళ్ళకీ, స్నేహితుల ఇళ్ళకీ కాళ్ళు అరిగేలా తిరిగేరు.

తిరిగినందుకు శ్రమ ఫలించింది మూడు సంబంధాలు దొరికేయి.

ఒక సంబంధం వీళ్ళకి నచ్చలేదు రెండోది వాళ్ళకి నచ్చలేదు.

మూడో సంబంధం మాత్రం వీళ్ళకీ, వాళ్ళకీ మొత్తం అందరికీ నచ్చిపోయింది.

పెళ్ళికొడుకు పేరు సుబ్బారావు.

రెండో పెళ్ళి ! అయినప్పటికీ – అతను వయసులో ఛాయ కంటే మరీ పెద్దవాడేమీ కాదు పెళ్లయి ఏడాదిలోగానే పెళ్ళాం పోయింది పిల్లా, పాపా లేరు.

ఇకనేం? ఛాయ అదృష్టవంతురాలన్నారు అంతా !

కట్నం పేరుకి ఐదువేలు ఇస్తే చాలట ! ముక్కుమీద వేలేసుకు ఒప్పుకున్నారు ఛాయ తల్లిదండ్రులు.

ఛాయ తన పెళ్ళి సెటిలయిపోయినట్టు అందరికిబాజాల్తో చెప్పింది.

రాంబాబుకి చెప్పింది.

కంగ్రాచ్యులేషన్స్ అన్నాడు. పెళ్ళికి ముందే అడ్వాన్సు పార్టీ కావాలన్నాడు.

''అలాగే తప్పకుండా ఇస్తారామ్ ! ఏమిటికావాలో చెప్పు '' అంది ఛాయ

''మనం మొదట కలుసుకున్న హోటల్ గుర్తుందా ? అక్కడ మళ్ళీ డబుల్ స్ట్రాంగ్ వేడివేడి కాఫీ నీతో తాగాలనుంది ''

విస్తుపోయింది ఛాయ.

''రామ్ ! నీవు నిజంగా సెంటిమెంటల్ ఫూల్‌వి ! పద – అలాగే కానియ్ '' అన్నది.

ఇద్దరూ ఆ హోటల్‌కి వెళ్ళి డబుల్ స్ట్రాంగ్ కాఫీ తాగేరు.

''పెళ్ళయ్యేక ఈ ఫూల్‌ని మర్చిపోవద్దు '' అన్నాడు రాంబాబు.

''మర్చిపోడం ఏవిటీ ? ఎప్పటిలానే స్నేహంగా వుంటాం''

''కబుర్లు ! పెళ్ళయ్యేక మొగుడే ప్రపంచం, మేమిక కనిపించం !''

''అప్పటి నీ రుమాలు ఇదిగో – నా దగ్గరే వుంది ! రుమాలు నాదగ్గరుంటే నీవు నా దగ్గరున్నట్టే అన్నావు ఆరోజు. – ఇదే హోటల్లో గుర్తుందా ? అంచేత నీ రుమాలు నా దగ్గరుండగా నిన్ను మర్చిపోడం ఎలా సంభవం ?''

''చాలా థాంక్స్''

''దేనికి కాఫీకా !''

అప్పటి అతని మాటలు ఇప్పుడు అతనికే అప్పజెప్పింది.

ఇద్దరూ నవ్వుకున్నారు.

''రాం! నీవు నా పెళ్ళికి సతీసమేతంగా రావాలి. అర్థమయిందా !''

''రావడానికి అభ్యంతరం లేదు. కాని ఆవిడలేదు గతవారమే పురుడుకి పుట్టింటికెళ్ళింది. ఆమెలేకుంటేనేం? నేను మటుకు తప్పక వస్తాను. ముహూర్తానికో, పప్పుభోజనానికో కాదు మూడురోజులు ముందుగా మీ ఇంటికొచ్చేసి – ఒళ్ళు దాచుకోకుండా సాయం చేస్తాను. సరేనా ''

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి. ఆమె హృదయం పులకించిపోయింది. థాంక్స్ చెప్పింది రాంబాబు నుంచి శలవు తీసుకుంది.

పెళ్ళి పట్టున పదిహేను రోజులు గూడా లేదు.

మళ్ళీ మహూర్తాలులేవని వెంటనే పెళ్ళి జరిగిపోవాలని అవతల వాళ్ళ తొందర.

తన ఇంట్లో వాళ్ళ జిడ్డు ఛాయకి తెలియన్దేమీకాదు.

ఏమీ ఆలోచించకుండా – వెంటనే ఒప్పేసుకుని – మీన మేషాలు ఇంట్లో లెక్క పెట్టడం ఛాయకి చిరాకు వేసింది. పెళ్ళికి ముందుగానే కట్నం ఇస్తామని పెద్దల ముందు ఒప్పుకుని – ఇపుడు తెల్లమొగం వేస్తే ఎట్లా ?

తల్లి అప్పుకోసం తిరుగుతున్నానన్నది– అప్పుచేయడం కూడా చేతకాదు వాళ్ళకి.

ఛాయే మేల్కొని –పి.యఫ్. లోను పెట్టి, ఇన్ఫ్లూయెన్సు చేసి, చెక్ తీసుకొచ్చింది – నాలుగురోజుల్లో!

మరిక నో ప్రోబ్లెమ్. పెళ్ళి సవ్యంగా జరిగిపోవాలి !

ఇంకెంత పదిరోజులు !

పదిరోజులంటూ రోజులు లెక్కపెడుతూ – పెళ్ళి కోసం కలలు కనకుండా – పెళ్ళి పెద్ద, మధ్యవర్తి వచ్చి – పిడుగులాంటి వార్త పేల్చి వెళ్లిపోయేడు.

గదిలోంచి వింటున్న ఛాయ హతాశురాలైంది.

పెళ్ళి కాన్సిల్ అవడానికి అవకాశాలు అంతో, ఇంతో వున్నాయని భావించి వుండడం చేత – ఇంట్లో వాళ్ళు ఛాయంత షాక్ తినలేదు.

ఛాయకి తెలీకుండా వారంరోజులుగా మగ పెళ్ళివారు – ఆడపెళ్ళి వారు మధ్య తర్జన భర్జనలు జరుగుతూనే ఉన్నాయి ఏవో.

చాలా జాగర్తగా వ్యవహరించడం చేత – ఛాయకి తెల్సే అవకాశం లేకుండా పోయింది.

పెళ్ళి కాన్సిల్ అయిన తర్వాతగూడా – ఎందుకు కాన్సిలయిందనేది ఛాయకి చెప్పలేదు తల్లిదండ్రులు.

''విచారించకమ్మా. దాని బాబులాంటి సంబంధం చూసి చేస్తాను. అన్నీ మన మంచికే.

వెధవ సంబంధం పెళ్ళికొడుక్కి తాగుడూ, ముండా దరిద్రపు అలవాట్లన్నీ వున్నాయట. నీవు బాధపడ్తావని చెప్పలేదు '' అంది తల్లి.

తల్లి వేపు అనుమానంగా చూసింది ఛాయ.

పెళ్ళి ఎందుకు కాన్సిల్ అయిందనే దానికి కారణం చెప్పకుండా – చేతులు తిప్పుకు ఇంకేదో చెప్పడం ఛాయ గ్రహించింది.

ఇంత కాలం నిర్లిప్తంగా వుండే తండ్రి కూడా పెళ్ళికొడుకుని బూతులు తిడుతూ కుర్చున్నాడంటే సమ్‌థింగ్ ఏదో జరిగిందనేది ఛాయకి అర్థమయింది.

వీళ్ళు దాయాలని దాస్తున్నారు గాబట్టి అసలు కారణం ఏవిఁటో తెల్సుకోడానికి – ఎవరికీ చెప్పకుండా పెద్దమనిషి ఇంటికి వెళ్ళింది.

అతను కుండబద్దల కొట్టినట్టుగా అంతా చెప్పేసాడు.

''మీ అమ్మా, బాబు నాకు బాగానే బుద్ధి చెప్పేరమ్మా ! మళ్ళీనేను ఏ పెళ్ళికయినా, మరిదేనికైనా మధ్యవర్తిత్వం నెరిపితే ఒట్టు. పెద్ద మనిషనంటూనే నాకు గొప్ప గౌరవమిచ్చారు తల్లీ !

అసలు నీవా ఇంట్లో పుట్టవల్సిన దానివి కాదు తల్లీ, నీ మొహం చూసి ఇంతకాలం ఈ వ్యవహారం నడిపాను గాని – మీ అమ్మా బాబుని చూసి కాదు.

ఒక్కమాటలో చెప్పాలంటే – నీ పెళ్ళి చెడిపోడానికి కారణం మగ పెళ్ళివారు కాదమ్మా – మీ వాళ్ళే !

అవునమ్మా ! ఏదైనా సరే మొదటే వివరంగా అన్నీ చర్చించుకోవాలి. రోజుకో పేచీ పెడితే ఎట్లా ?

పేచీలేమైనా మగపెళ్ళివారు పెట్టడం చూశాంగాని – ఆడపెళ్ళి వారు పెట్టడం మీ కేసులోనే చూశాను – నా అనుభవంలో ! నిజంతల్లీ, వాళ్ళని ఎక్కడికక్కడ నెమ్మదిగా సర్దుకు చెప్పుకు వస్తున్నాను. నాకెందుకమ్మా అంత బాధ. చెప్పమ్మా. దాని వల్లనాకు ఒక్కపైసా అయినా ఒరుగుతుందా?

ఏ పదేళ్ళ కిందటో పెళ్ళికావల్సిన ఆడపిల్లవి – ఇన్నాళ్లకయినా నా చేతుల మీదుగా పెళ్ళి జరిపించేనన్న తృప్తికోసం అటూ ఇటూ అందరు చెప్పింది వింటూ, నచ్చజెప్పుతూ వ్యవహారం ఇప్పటిదాకా ఈడ్చుకొచ్చేను. మరొకరూ, మరొకరూ అయితే పెళ్ళి చూపులప్పుడే క్లోజ్ అయిపోయేది !

ఇప్పుడు నాకు అర్థమవుతుందమ్మా, నీకొచ్చే సంబంధాలన్నీ చెడిపోయేయంటే కారణం మీ వాళ్లేనమ్మా మీ వాళ్లే!

నీవేవీ అనుకోనంటే ఒకమాట చెప్తానమ్మా – నీకు పెళ్ళికావడం మీ ఇంట్లో వాళ్ళకి ఎంత మాత్రం ఇష్టంలేదు. అలా అంటున్నానని మరేం అనుకోకు. మీ అమ్మా నాన్నతో నాకేం విరోధం లేదు. వాళ్ళగురించి చెడుగా చెబితే నాకు పైసా రాదు.

నేనే నీ తండ్రినయితే – ఇంతకాలం నీకు పెళ్ళి జరపకపోతే – ఆ పాపానికి రైలుకింద బుర్రపెట్టి చద్దునమ్మా ఎప్పుడో!

మీ వాళ్ళకా సిగ్గులేదు బాధలేదు. పౌరుషంలేదు సంఘ భయం అంతకన్నా లేదు

కట్నం ఇచ్చి, బంగారంపెట్టి, సారె పెట్టి అత్తవారింటికి పంపే బదులు ఆడకూతురి చేత ఉద్యోగం చేయించి – నీ చేతి కూడు తింటున్నారంటే వాళ్ళ నేమనుకోవాలి?

ఇన్నాళ్ళూ నీ కూడు తిన్నారు చాలదూ! పెళ్లయ్యేక కూడా నీ జీతం మీద అధికారం చెలాయిస్తామంటే ఎట్లా? నీవు అత్తగారింటికి వెళ్లిపోయినా – నీ జీతం అమ్మ వారింటికి చెందాలట.

నా చేత అడిగించేరు.

ఆ కుర్రాడి అమ్మా, బాబైతే అందుకు ఏమాత్రం ఒప్పుకోరు. కోరి, కోరి ఉద్యోగం చేస్తున్న అమ్మాయిని కోడలు చేసుకోడం కోడలు ఆదాయం వదిలేయడానికేటమ్మా! వాళ్ళతో కదిపితే బెడిసి కొడుతుందని నెమ్మదిగా కుర్రాడితోనే కదిపా.

ఏమాటకామాటే చెప్పుకోవాలి. కుర్రాడు చాలా మంచోడు. నెమ్మదస్తుడు.

అతను నా పెళ్ళాం జీతం నా యిష్టం అన్లేదు తల్లీ.

ఆమె జీతం ఆమె ఇష్టం. మధ్యలో నేనేంటీ? ఆమె జీతం ఏం చేసుకుంటే అది చేసుకోమను. నా కభ్యతరంలేదన్నాడు.

అంతకన్నా ఎవరుంటారమ్మా!

ఆ కుర్రాడు అతని ఉద్దేశంకూడా చెప్పేడు. నిజానికి భార్య చేత ఉద్యోగం చేయించడం ఇష్టంలేదట – ఇపుడు కాకపోయినా ఆమె తల్లి అయేక ఉద్యోగం మాన్పించేయాలనే అనుకుంటున్నాను. ఆమె కుటుంబం ఆమె జీతం మీద ఆధారపడుతున్నదంటున్నారు గనుక, ఆ యింట్లో ఎవరో సంపాదించేవరకూ ఆమె ఉద్యోగం కొనసాగనిస్తా – నన్నాడు అదీ ఆమె డబ్బు లివ్వడానికి అంగీకరించే పక్షంలో! అన్నాడు.

అంతకన్నా ఇంకేవింటమ్మా!

కుర్రవాడు అంత ఈజీగా ఒప్పేసుకున్నాడంటే మీ వాళ్ళు నమ్మలేదు.

అనుమానం, భయం! ఇప్పుడు అనే మాటలు రేపు వుంటాయో వుండవో అనే శంక!

అలాంటిదేం లేదు భయపడొద్దని చెప్పేను.

అక్కడితో వూర్కోవాలా?

లేదు. రెండ్రోజులు పోయేక మళ్ళీవచ్చేరు.

అదేదో నోటిమాట కాకుండా – వ్రాసుకుంటే బాగుంటుందని బాండ్‌పేపరు తెచ్చేరు.

బాగోదేమో ఆలోచించమన్నాను.

ఆలోచించాం. తప్పదన్నారు – మీ వాళ్ళు

'వ్రాసుకుందాం' అనే మాటకి పెళ్ళికొడుకు ముఖం మాడిపోయింది. తర్వాత ఆ

విషయం వాళ్ళ బంధువర్గం మధ్యకి వెళ్ళిపోయింది.

రెండ్రోజుల్లో ఆలోచించి చెప్తామన్నారు.

రెండ్రోజుల్లో ఆలోచించి చెప్పిందేమిటంటే -

'ఈ ముదనష్టపు సంబంధం మాకక్కర్లేదు. ఆ ముహూర్తానికే రాజమండ్రి సంబంధం చూసుకున్నాం' అనే చావు కబురు.

ఆ పరిస్థితిలో నేనేం చేయగల్ను చెప్పమ్మా ! మరో సంబంధం చూసుకోకుండా వుంటే ఏదో రాజీ ప్రయత్నం చేద్దును. ఈ పెళ్ళికూడా చెడగూడదని ఎంతో ప్రయత్నం చేసాను.

లాభం లేకపోయిందమ్మా. లాభం లేకపోయింది.

అవతల వాళ్ళు మగపెళ్ళివాళ్ళు. వాళ్ళతో సున్నితంగా పోకుండా రోజు, రోజుకీ ఇదంటూ, అదంటూ మీ వాళ్ళే మగపెళ్ళివారిలా డిమాండు చేస్తే - ఎక్కడ పనులవుతాయమ్మా !

ఏది ఏమైనా నీరోజులు బాగులేవు తల్లీ . అలాంటి తల్లిదండ్రులకి నీవు కూతురువి కావడమే పెద్ద దౌర్భాగ్యమమ్మా ! అంతా ఖర్మ ! ఏం చేస్తాం'' అని ముగించేడు పెద్దమనిషి.

ఛాయ ఆ పెద్దమనిషి దగ్గర ఒక్క నిమిషం వుండలేక ఇంటికి పరుగు, పరుగున వచ్చేసింది.

ఆమెకి తన తలిదండ్రులమీద ఎక్కడలేని అసహ్యం వేసింది. చెప్పరాని కోపం వచ్చింది.

వచ్చీరాగానే తలిదండ్రుల మీద విరుచుకు పడింది.

''ముష్టి జీతం కోసం నాకు పెళ్ళేకాకుండా చేస్తారా ? నన్నడిగితే నేనే పడేద్దును గదా నెలనెలా ముష్టి. ఛీ మీరింత స్వార్థపరులనుకోలేదు. మీక్కావల్సింది మీ బాగే గాని - మీ కూతురి బాగుకాదు. నాకు పెళ్ళి చేయకుండా నా సంపాదన తినడానికి సిగ్గులేదూ ! ఛీ ఛీ ! మీరు మనుషులుకాదు. మీరు అమ్మా, బాబుకాదు. మీరు నన్ను కనలేదు. ఇప్పుడే చెబుతున్నాను. ఇక మీకూ నాకూ సంబంధంలేదు. ఈ రోజునుంచి మీరెవరో నేనెవరో ! ఎవరిదారి వారిది. అంతే ! మీరే గోదారిలో కలుస్తారో మీ ఇష్టం. చిప్పెట్టుకు ఏ రోడ్డు మీద అడుక్కు తింటారో మీ ఇష్టం. నన్ను పెంచి పెద్ద చేశామంటారా నేను ఇన్నాళ్ళు మిమ్మల్ని పెంచాను. మీ ఋణం తీరిపోయింది. అంతే ! ఇక మీచావు మీరు చావండి'' అనేసి నెత్తికొట్టుకు ఏడ్చింది ఛాయ.

ఆమె తల్లీ తండ్రీ ఏదే చెప్పబోయే ప్రయత్నం చేసేరు.

వాళ్ళని మాటాడ నివ్వలేదు ఛాయ.

దాంతో వాళ్ళు రెచ్చి పోయేరు. మాటకిమాట. తిట్టుకి తిట్టు.

ఇల్లంతా కేకలు. అరుపులు... తర్వాత ఏడుపులు.

ఛాయ ఏడుపు, తల్లి ఏడుపు, చెల్లెల్లు, చిన్న తమ్ముడు వెక్కి వెక్కి ఏడుపు.

ఛాయకి యింట్లో ఒక్క క్షణం వుండబుద్ధికాలేదు.

రోడ్డుకి వచ్చింది.

తన దుఃఖాన్ని పంచుకునేవాడు కాకాపోయినా ఆమె హితుడు రాంబాబు!

ఆమె కాళ్ళు అతనింటివేపు దారితీసేయి

అపుడు సమయం రాత్రి ఏడు గంటలు.

రాంబాబు ఇంట్లోనే వున్నాడు.

పెళ్ళాం పుట్టింటి కెళ్ళింది కాబట్టి ఆ కొంపలో తను ఒక్కడే వున్నాడు

చెప్పా చేయకుండా అర్ధాంతరంగా వచ్చిన ఛాయని చూసి ఆశ్చర్య పోయేడు.

ఆమె ఆ ఇంటికి అంతకుముందు నాలుగైదుసార్లు రాకపోలేదు.

కూర్చోమన్నాడు.

కూర్చుంది.

అంతే!

ఆమె కళ్ళంట నీళ్ళు జలజల రాలేయి.

రాంబాబు కంగారు పడ్డాడు

''ఏం జరిగింది ఛాయా! ఏం జరిగింది''

కన్నీళ్ళతోనే జరిగిందంతా ఛాయ చెప్పింది.

చెప్పి ఏడ్వసాగింది.

ఆమెను ఎలా ఓదార్చాలో తెలీడంలేదు రాంబాబుకి

ఆమె చేయి పట్టుకున్నాడు. ఆమె విదిలించుకోలేదు.

చేయి పట్టుకు నొక్కుతూ ప్లీజ్! ప్లీజ్! అనసాగేడు.

ఆమె దుఃఖం ఆగడంలేదు.

ఆమె చెంతకి లేచి వెళ్ళి కన్నీళ్ళు తుడిచేడు. తుడిచి భుజం నొక్కుతూ సముదాయించసాగేడు. ఆమె వీపు నిమరసాగేడు.

అతని చేయిని సుతారంగా విడిపించుకుని – కుర్చీలోంచి లేచింది.

''వస్తాను'' అంది కళ్ళు తుడుచుకుని ఛాయ.

వెళ్ళనివ్వలేదు రాంబాబు.

ఆమె చుట్టూ చేతులు వేసేడు.

''రామ్! ప్లీజ్! వదలండి. నన్ను పోనివ్వండి''

అన్నదే గాని అతని చేతులునుంచి విడిపించుకుపోవాలని ఆమెకి వున్నట్టులేదు. ఏమంటే అందుకామె ఏ ప్రయత్నం చేయడంలేదు.

ఈ ప్రపంచం నుంచి పారిపోయి అతని బాహువుల్లోనే బందీ అయిపోవాలని కోరుకున్నట్టుగా వుందామె.

''నీవు ఏడిస్తే నేను చచ్చిపోతాను'' అంటున్నాడు రాంబాబు.

అతని చేతులు రెండూ గట్టిగా బిగుసుకున్నాయి.

అతని పెదాలు ఆమె నుదురుని ముద్దాడేయి. కనురెప్పలని ముద్దాడేయి. ఉప్పుప్పగా

వున్న బుగ్గలను ముద్దాడేయి. మెడను ముద్దాడేయి. గెడ్డాన్ని ముద్దాడేయి.

అలా పైకి అతని పెదాలు ఆమె పెదాలపైకి వెళ్ళేయి !

పెదాలు, పెదాలు కలుసుకోగానే . ఆమె దుఃఖానికీ తెరపడినట్టయింది.

అతను పెదాలతో దుఃఖానంతా పీల్చిపారేస్తూ - అమర సుఖం ఇస్తున్నట్టుగావుంది ఆమెకి.

గట్టిగా హత్తుకున్న రాంబాబుని బలహీనంగా వారిస్తున్న ఛాయ చేతులు అతని మెడ చుట్టూ బలంగా చుట్టుకుపోయి అతని పెదాల్ని ఆమె వదల్లేని స్థితిలోకి వచ్చేసింది.

అతని చేష్టలు ద్వారా ఆమె ఒళ్ళు తిమ్మిరి పట్టేసినట్టయింది. ఆ తిమ్మిరిలో అతను ఆమె చీరను లాగేసిన సంగతే ఆమెకి తెలీలేదు.

అతను చేస్తున్న పనేమిటో ఆమెకి అర్థమయి ''ప్లీజ్! రామ్ వద్దు, వద్దు ఇది మంచిపని కాదు '' అంటోంది.

అప్పటికే ఆమె నగ్నంగా మంచంమీద వుంది.

అతను ఆమెపైకి రాగానే ''తప్పు, తప్పు, వద్దు ప్లీజ్ రామ్! నా మాటిను'' అంది ఛాయ

మళ్ళీ ఆమె అలా అనే అవకాశం ఇవ్వకుండా ఆమెను పూర్తిగా ఆక్రమించేడు.

ఛాయ స్వర్గసుఖాల్లో తేలియాడుతోంది. ఆమె ఆనందం ఎగిసి రోదసిలోకి రాకెట్‌లా దూసుకు పోతోంది. చుక్కల్ని అంటుకుంటోంది.

తను ! ఎంత పిచ్చిది ! ఇంతటి తీయతీయ సుఖాన్నా మంచి పని కాదన్నది ?

ఇంత గొప్ప సుఖాన్నా తప్పు తప్పు, వద్దన్నది ?

అలా అనడం ఎంత తప్పో ఆమెకి అర్థం చెప్పింది అనుభవం. !

అనుభవంలోకి వస్తేగాని తెలియని ఈ అమరసుఖం - ఇన్నాళ్ళు దూరం చేసుకున్న తను ఎంత దుర్భృష్టవంతురాలు ?

తన 29 ఏళ్ళ కష్టాన్నీ, బాధల్నీ, బరువుల్నీ, దుఃఖాన్నీ , చికాకుల్నీ, కోపాల్నీ, తాపాల్నీ - ఈ ఒక్క సుఖం జయించ గల్గింది.

తను 29 ఏళ్ళుగా చూస్తున్న అందాల్నీ, ఆనందాల్నీ, తీయని ఊహల్నీ, కమ్మని కలల్నీ - ఈ ఒక్క సుఖంతో సమస్తం చవిచూడగలిగింది.

ఏ రాత్రికో -

ఆ సుఖాన్ని, వదల్లేక వదిలింది ఛాయ.

''వెళ్ళొస్తాను '' అంటూ వెళ్ళలేక వెళ్ళింది ఛాయ.

ఛాయ శరీరం తేలిగ్గా, హాయిగా వుంది.

ఛాయ ఇంటికెళ్లేటప్పటికి అర్ధరాత్రయింది.

ఇంట్లోవాళ్ళంతా నిద్రపోకుండా కళ్ళల్లో ఒత్తులు పెట్టుకుని కూతురికోసం - అక్క కోసం ఎదురు తెన్నులు పడిగాపులు ఆందోళనలు, భయాలు, గాభరాలు.

''వీళ్ళంతా నేను చచ్చిపోతాననుకున్నారు గబోలు !

నేను చావను. మిమ్మల్ని చంపను'' అనుకుంది ఛాయ.

మర్నాడు నిద్రలేచిన ఛాయకి మబ్బులు విడిన స్వచ్ఛమైన ఆకాశంలా - ఆమెకి జీవితమంతా స్పష్టంగా అనుతోంది. అర్థమవుతోంది!

బతుకుమీద విసుగూ, విరక్తి, చిరాకు, పరాకు పోయి వాటి స్థానంలో మమతా, మమకారం, అనురాగం, ఆపేక్ష చోటుచేసుకున్నాయి. బతుకుపై ఆశ, బతికేయగలననే ధైర్యం, ధీమా, సాహసం అంతర్గతంగా తనలో వున్నాయనే సత్యం గ్రహించగల్గింది.

అన్ని టెన్షన్‌ల నుంచీ రిలీఫ్ పొందిన ఛాయకి, తన స్వార్థచింతన, పెళ్ళి అని సంకుచితంగా ఇన్నాళ్ళుగా చేసిన ఆలోచనలకి తిలోదకాలు ఇచ్చిన ఛాయ ప్రపంచంలో వాస్తవమేమిటో స్పష్టంగా చూడగల్గుతోంది. జీవిత సత్యాలు అర్థమవుతున్నాయి.

మంచవనీ, చెడవనీ మనుషుల ప్రవర్తన వెనుక కారణాలు అర్థమవుతున్నాయి.

ఇపుడామెకి తలిదండ్రుల ప్రవర్తన-తప్పుగా ఏ మాత్రం అనిపించడంలేదు.

ఏ తలిదండ్రులు కూతురికి పెళ్ళంటే ఆనందించరు ? కోరుకోరు ?

ఒకవేళ నిజంగా కూతురి పెళ్ళి కాగూడదను కున్నారంటే అంతకుమించి బలవత్తరమైన కారణం ఏదో వుంటుంది కదా ?

ఈ విధంగా ఆలోచిస్తోంది ఆమె మనసు ఇపుడు!

ఆమె తలిదండ్రులకూ, తమ్ముళ్ళకూ, అన్యాయం చేయదు. వాళ్ళని అసహ్యించుకోదు. కోపగించుకోదు. అధికారం చెలాయించదు. తనువాళ్ళకోసమే బతుకుతుంది.

ఆమె ఇక పెళ్లి చేసుకోదు.

పెళ్లి అక్కర్లేదు. ఎన్నో త్యాగాలు, ఎన్నో అప్పూలూ చేస్తేగాని కానిపెళ్ళి తనకి అక్కర్లేదు.

పురుషుడు కోసం పెళ్ళి చేసుకోవాలనుకుంది.

పెళ్ళికాకుండానే పురుషుణ్ణి పొందింది. సుఖం అనుభవంలోకి వచ్చింది.

పెళ్ళి అవసరం అంతకన్నా ఆమెకి కనిపించలేదు.

ఈ శరీరం ఆకలేసినపుడు తిండి తింటున్నట్టే సెక్సు కావల్సిన్నప్పుడు రాంబాబు దగ్గర కెళ్తుంది. సెక్సు ఆమెకు సరదా కాదు. రోజూ అక్కర్లేదు. ఖచ్చితంగా అవసరంగా తోచినప్పుడు మాత్రమే కావాలి .

ఈ జీవితానికిది చాలు. ఈ మాత్రం చాలు.

తృప్తిగా అనుకుంది ఛాయ.

ఆమె జీవితాన్ని ఆమె దిద్దుకుంటోంది.

ఆమె బతుకుబాట ఆమే ఏర్పర్చుకుంటోంది.

ఎవరో ఏదో అంటారని భయాలు లేవు ఛాయకిపుడు.

ఎవరో వచ్చి ఏదో చేస్తారని భ్రమలు లేవు ఛాయకిపుడు

ఛాయకి ఫిట్స్ పూర్తిగా రావడం మానేసాయి!

ఆరోజునుంచీ రాంబాబు, ఛాయ వారం పదిరోజులకోసారి ఏ లాడ్జిలోనో కల్సుకోవడం జరుగుతోంది!

కాని –

ఈ మధ్య కల్సుకోవడమనేది ప్రాబ్లెమ్ అయింది.

లాడ్జిలో దొరికిపోయిన తర్వాత మళ్ళీ అలాంటి రిస్కు తను తీసుకోలేదు. మొన్న రాంబాబు ఏదో గెస్టుహౌస్ చూసేడనుకుంటే – అదొక బాడ్ ఇన్సిడెంట్‌గా మారింది. !

ఏదొక రూమ్‌ని చూసుకోక తప్పదు.

వెదకాలి. వెదికితే దొరక్కుండా పోదు.

## 16

రవికి క్షణం తీరికలేదు – ఆ నెలరోజులూ.

చెలం ఇచ్చిన లే – అవుట్ జేబులో పెట్టుకు తిరగడమే పని.

ఆ లేఅవుట్‌లోని ముప్ఫయి ప్లాట్లు అమ్మేస్తే – చెలం ఇస్తానన్న స్కూటర్ కోసం – తెల్సినవాళ్ళు, తెలియని వాళ్ళు అని కాకుండా అందరి వద్దకి తిరిగేడు.

అందులోపడి –

వారంరోజుల్లో సుజాతకి రాస్తానన్న ఉత్తరం సంగతి మరిచేడు.

పదిరోజులు దాటేక గుర్తుకొచ్చింది.

అరెరెరె!

అనుకున్నాడు అంతే!

అంత కన్నా ఆ సమస్యను పెద్ద సీరియస్‌గా తీసుకోలేదు.

ఎలాగూ వచ్చే నెల – పెళ్ళిరోజు.

అప్పుడే మాట్లాడవచ్చు అనుకున్నాడు – ఆమాటే ఉత్తరం ముక్క వ్రాసి పోస్టుబాక్సులో పడేయలేక పోయేడు.

సుజాత ఉద్యోగంమానేయాలా ? లేదా ? అనేదానికి ఇప్పటికీ అతనివద్ద సమాధానం లేదు రఢీగా.

అతను ఆలోచిస్తున్నది ఒకటే –

సుజాత పెళ్ళి రోజుకి ఇక్కడికి వస్తుంది.

ఈలోగా స్కూటర్ కొట్టేయాలి. స్కూటర్‌పై సుజాతని వేసుకు నగరమంతా తిప్పేయాలి.

ఒక్కోప్లాటు గజం పాతిక రూపాయలకి అమ్మమన్నాడు చెలం.

తను అయిదారు ప్లాట్లు 30 రూపాయలకి కూడా అమ్మేడు.

చెలంకి లెక్క గజం 25 రూపాయలకే అప్పజెప్పేడు. గజం దగ్గర మిగిలిన అయిదు

రూపాయల లాభం చెలంకి చెప్పలేదు.

చెప్పాలను కున్నాడు గాని – ఎందుకో చెప్పలేకపోయేడు.

డబ్బు పాపిష్టిది మరి!

చెలంతో అబద్ధం ఆడినందుకు తనకి తాను ఆత్మవంచన చేసుకున్నాడు.

చెలం తనని గజం 25 రూపాయలకి అమ్మమన్నాడు. అంత మాత్రాన తను అదేరేటుకి అమ్మాలని ఎక్కడుంది ?

గజం ముప్పయిక్కాపోతే వందకి అమ్ముతాను. అది నా రిస్కు. నా ఘనత. నా కష్టం, నాయిష్టం. మధ్యలో అతనికేం ? గజం పాతిక చొప్పున అతనికిచ్చేస్తున్నాను కదా !

ఆ మాట కొస్తే ఇంత కష్టపడి అమ్మితే వచ్చేది ముష్టి స్కూటర్. తను లాభం పొందేది వేలకి వేలు! దీనికెవడు చెప్తాడు జవాబు ?

ఏది ఏమైనా స్నేహితునికి నిజం చెప్పకపోవడం – మోసం కింద రాదా ? రాదు – ఏమంటే వ్యాపారమంటేనే మోసం !

ఇక్కడ స్నేహం ప్రశ్న ఏవిఁటి ?

నిజంగా స్నేహమే కోరుకున్నవాడు నన్ను ఉపయోగించుకో గూడదు. ఈ రొంపిలో దింపకూడదు. అంతే కదా ! అయితే –

స్కూటర్ ఎరపెడితే లొంగిపోడం తప్పుకాదా !

ఎంతైనా మానవుడు ప్రలోభపడకుండా వుంటాడా ? అందులో తప్పేం వుంది ?

అయినా దీనివల్ల స్నేహానికొచ్చిన నష్టంలేదు.

పేకాట పేకాటే – బామ్మర్ది బామ్మర్దే ! –

చెలంకి చెప్పిన అబద్ధాన్ని ఆ విధంగా సమర్థించుకున్నాడు రవి.

మొత్తంమీద 28 ప్లాట్లు అమ్మేసాడు రవి.

మరి రెండు మిగిలిపోయేయి.

పదిరోజులుగా ఆ రెండూ చెల్లకుండా – అతనికి స్కూటర్ రానీయకుండా చేస్తున్నాయి.

మిగిలిన ఆ రెండు ప్లాట్లనూ పూరించడానికే అన్నట్టు – రవి ఇంటికి రాంబాబు, ఛాయ వేంచేసారు.

''రండి , రండి – ఏవిటి సంగతులూ '' అంటూ ఇద్దరికీ కుర్చీలు వేసేడు రవి.

''ఎనీ ప్రాబ్లెమ్ ?'' అన్నాడు రవి.

''ప్రాబ్లెమ్ అంటే ప్రాబ్లెమ్ కాదుగాని, చిన్న సాయంకావాలి ''

''చెప్పండి – నాకు చేతనయితే తప్పక చేస్తాను ''

'' ఆరోజు లాడ్జిలో దొరికిపోయిన లగాయితూ రూమ్ అన్వేషణలోనే గడిపేస్తున్నాం. ఎక్కడా అద్దెకి రూమ్ దొరకడంలేదు. ఏదైనా ఒకటి దొరికిందంటే భరించలేని అద్దె. ..అంచేత ...'' పూర్తిగా చెప్పలేక నసిగేడు రాంబాబు.

''ఈ ఏరియాలో గదులెక్కడా ఖాళీవున్నట్టులేవే.. ప్రయత్నిద్దాం'' అన్నాడు రవి.

''అలాగే.. కాని నాదో చిన్న రిక్వెస్టు''

''చెప్పు.''

''నీవు మిగతావాళ్ళలా మాపై బురదజల్లకుండా – అల్లరిపాలు మేంకాకుండా ఏదోక సాయం చేస్తునే వున్నావు... మళ్ళీ నిన్ను ఇబ్బంది పెట్టిన వాళ్ళమవుతామేమోనని.''

''అదేం లేదు.. చెప్పు. ఫర్వాలేదు''

''నీకు అభ్యంతరం కాకపోతే, ఇన్‌కన్వీనియన్స్ కాకపోతే ..మరేంలేదు.. వారానికొకరోజు... ఇక్కడికొస్తాం!''

''అరే! దానిదేముంది. వెల్‌కమ్. ఆల్వేజ్ వెల్‌కమ్. వారాని కొకరోజు ఏం? రోజూ రండి''

''రోజూ ఆహ్వానించడం నీ మంచితనం.. కాని మాకు వారానికో రోజు చాలు.''

''అలాగే !''

''మరేంలేదు. ఇక్కడయితే రైడింగ్, పోలీసుల బెడద వుండదు.. ఎప్పటికప్పుడు మమ్మల్ని ఇబ్బందుల నుంచి రక్షిస్తున్నందుకు నీవు చేస్తున్న మేలు లైఫ్‌లో మర్చిపోలేం.''

అప్పుడర్థమయింది రవికి ! – ఎందుకు రూమ్ అడుగుతున్నది.

ఒప్పేసుకున్నాడు గనక దానిపై నిలబడిపోకతప్పదు.

''ఇరుగుపొరుగుకి తెలిస్తే...'' భయం వెలిబుచ్చేడు.

''అలాంటి అనుమానాలు రాకుండా జాగర్త పడతాం. వారానికోరోజైనా – రోజంతా అక్కర్లేదు – వో గంట, రెండు గంటలు . దాట్సాల్. నీకు ఇబ్బంది లేకుండా – ఏ రోజు – ఏటైము అనేదికూడా చెప్పేస్తున్నాను. శనివారం, శనివారం వస్తాం – సాయంత్రం ఆ ప్రాంతంలో... సరేనా''

''సరే''

''థాంక్యూ''

ప్రోబ్లెమ్ సాల్వ్ అయినందుకు, కల్సుకునే మార్గం దొరికినందుకు రాంబాబు, ఛాయలు – నెత్తి మీద బరువు దిగినట్టు తృప్తిగా నిట్టూర్చేరు.

ఇంతలో –

''మీ ఇద్దరూ, నాకు చిన్న సాయం చేయాలి ''అన్నాడు రవి.

''తప్పకుండా'' అన్నారిద్దరూ.

రవి లేఅవుట్ తీసి చూపించి – ''మీరు రెండు ప్లాట్లు తీసుకోవాలి. మంచి లేండు. స్టీల్‌ప్లాంటు వస్తోంది గనక ఆ ఏరియాలో ముందుముందుకి మంచి డిమాండ్. మళ్ళీ కొనుక్కోవాలంటే కష్టం''

''తీసుకోడానికి అభ్యంతరంలేదు. కాని డబ్బే !.. ప్లాటు ఎంతవుతుంది ?''

''రిజిస్ట్రేషన్ చార్జీలన్నీ కలుపుకుంటే ... ఒక్కో ప్లాటు ఎనిమిది వేలుకన్నా దాటదు.''

''నీ మాట కొట్టేయలేంగాని.. డబ్బు సంగతే''

''మీరు ఊఁ అనండి. నేను ఆ సంగతి చూసుకుంటాను ''

''ఎలాగ?''

'' మీ చేత పియఫ్‌లోన్లు పెట్టిస్తాను. నాన్ రిఫండబల్ లోన్ కింద సేంక్షన్ చేయించే పూచీనాది. వారంరోజుల్లో చెక్ వచ్చేస్తుంది''

''నేను ఇంతకు ముందు తీసుకున్న లోను కటింగ్ యింకా పూర్తి కాలేదు. ఎలా ?'' అంది ఛాయ.

''నో ప్రోబ్లెమ్! పియఫ్ బాలెన్సు వుంది కదా ''

వుందని తలాడించింది.

''వుంటేచాలు. మిగతాది నేను చూసుకుంటాను '' అన్నాడు రవి.

మొత్తం ముప్ఫయిప్లాట్లు సేల్ అయిపోయినట్టేలెక్క! అతని కళ్ళ చుట్టూ స్కూటర్ గిర్రున తిరిగింది.

''రవీ ! సాయం అన్నావు ఇదేనా ? ఇది సాయం ఎలా అవుతుంది ? మాకు మరో ఉపకారమే చేసినట్టయింది. మాచేతిది పైసా క్యాష్‌పడకుండా పియఫ్ ఎడ్జెస్టుచేసి మహానగరంలో మాకూ ఒక స్థలముందనిపిస్తున్నావు. రేపు ఎనిమిదివేల ప్లాటు ఎనభైవేలు కాకపోదు. అంచేత నీవుమాకు ఉపకారం చేసినట్టే అవుతుంది గాని. నీకు మేం సాయం చేసినట్టు ఎలా అవుతుంది ?'' అని చిన్న సుత్తి వేశాడు రాంబాబు.

అలా సుత్తి వేయడానికి కారణం వుంది.

రాంబాబు జేబులోంచి చిన్న కాగితం తీసి ఇచ్చేడు రవికి!

ఏవిఁటిది ?

సినిమా టికెట్.

శంకరాభరణం సినిమాకి చేసిన రిజర్వేషన్ కూపన్.

''నీకోసమే తెచ్చేను''

శంకరాభరణంకి టిక్కెట్లు దొరకడంలేదు. రవి రెండు మూడు సార్లు ప్రయత్నించి వూరుకున్నాడు. రష్ తగ్గేక వెళ్ళవచ్చుని. రోజులు గడుస్తున్నాయే తప్ప రష్ తగ్గట్లేదు. టిక్కెట్లు దొరకడంలేదు.

ఇప్పుడు తిన్నగా ఇంటికేవచ్చింది టికెట్!

థాంక్స్ చెప్పేడు రవి.

''టైమవుతోంది కదా.. సినిమాకి''

''అవును''

''మరి బయల్దేరుదామా – '' రవి.

''ఆ టికెట్ మీ ఒక్కరికే – ముగ్గురికి కాదు ''

''అదేం ? మీరు టికెట్లు తీసుకోలేదా ?''

''లేదు - మీ ఒక్కరికే తీసాం''

''అదేం ?''

''ఏం లేదు ! నీవు వెళ్ళు ''

''నీవు వచ్చేవరుకూ ఇక్కడే వుంటాం! - ఇంటికి కాపలాకాస్తూ''

అర్థమయింది రవికి!

తననిలా సెకండుషోకి తగిలేసి -

వాళ్ళిక్కడ నైట్‌షో!

రవి అలా బొమ్మలా వుండిపోతే -

'ఈ రోజు శనివారం' అని గుర్తుచేశాడు రాంబాబు నవ్వుతూ నెమ్మదిగా.

''ఔనౌను..శనివారం''

ప్రతి శనివారమూ ఇక్కడ లైవ్‌షో వేయబడును. ఒరే రవీ! నీవు మటుకు సెకండుషోకి పొమ్ము.

నీకా సెకండుషోలే గతి.

అందమైన, ఆరోగ్యమైన భార్య వుండికూడా నీకీ గతి!

సుజాతతో నీవు అనుభవించాల్సిన గదిలో - నీగదిలో - మరో జంట. నీవు రోడ్డుమీదికి ! ఏవిఁటి స్వామీ ఇది!

సుజాత రిజైను చేసి వచ్చేస్తాను మొర్రో అంటే - వారం, వారం పొడిగించేవేగాని ఉత్తరం వేసావుకావు.

అవునుమరి, నీకు టైమ్ లేదు - వస్తోందిగా స్కూటర్. దాన్నే ఎక్కి తొక్కి ఆనందించు.

## 17

సంగమ్ శరత్‌లో శంకరాభరణం.

సినిమా చూస్తూ తన్మయత్వంలో విజయ.

చెలంతో కలసి సినిమా చూస్తున్న విజయకి గొప్ప రిలీఫ్‌గా వుంది.

చెత్త చెత్త సినిమాలు చూసివుందేమో - ఒక మంచి సినిమా రాగానే అదే గొప్ప సినిమాగా అనుభూతి, పారవశ్యం.

విజయ కుర్చీకి చేరగిలబడికాకుండా - నిటారుగా కూర్చొని కళ్ళింత చేసి కళ్ళార్పకుండా ఇంట్రెస్టుగా చూస్తోంది సినిమా.

'' ఆ రాజ్యలక్ష్మి కళ్ళు నీ కళ్ళ దగ్గర బలాదూర్ '' అన్నాడు చెలం.

అతని చేయి ఆమెని పొదివిచుట్టూ పాకుతోంది.

తెరపై అన్నవరం కొండపై చంద్రమోహన్, రాజ్యలక్ష్మిల ప్రేమకథ.

వాళ్ళ ప్రేమని ఎంజాయ్ చేస్తున్న విజయకి ఆమె ప్రేమకథ గుర్తుకి వస్తోంది.

విజయ, చెలంది ప్రేమవివాహం.

ఆ మధురమైన రోజులు విజయకి ఇప్పటికీ గుర్తే.

విజయ కాలేజీలో చదువుతున్న రోజులు!

ఇద్దరు మిత్రురాళ్ళతో కలిసి చెంగల్రావు పేటలో అద్దెకు వుంటూ చదువుకుంటున్న రోజులు.

బుద్ధిగా తన చదువేదో చదువుతూ ఆమె రోజులు సాగనీయకుండా తగిలేడు చెలం.

ఎదురింటి మేడమీద గది ఎవరో ఖాళీ చేయగా – ఆగదిలో రవితోబాటు చెలం అద్దెకి దిగిన రోజే చెలం ఆమెను ఆకర్షించేడు.

ఇద్దరు మిత్రులూ ఉదయం డ్యూటికి వెళ్ళి సాయంత్రం వస్తూండేవాళ్ళు.

చెలం డ్యూటినుంచి దిగి అయిదు గంటలకి ఇంటికి వచ్చిరాగానే కిటికీ లోంచో, డాబా మీద నుంచో – విజయని అలా చూస్తూ వుండిపోవడమే ఒక డ్యూటీగా పెట్టుకున్నాడు.

అది గమనించిన విజయ మొదట 'ఛీ! రౌడీ కుర్రాడు' అనుకుంది.

తర్వాత పాపం పిచ్చోడు అనుకుంది.

అనుకుందేగాని –

అతను ఏ రోజైనా ఆ టైముకి తనని చూస్తూ ఉండకపోతే ఆమెకి కూడా పిచ్చెక్కుతోందనేది గ్రహించింది.

ఆ పిచ్చి ఎంతవరకూ వెళ్ళిందంటే కేవలం మూగచూపులకోసం ఆమె కాలేజీ, అతను డ్యూటీ ఎగనామం పెట్టి తీరుబడిగా – గంటల తరబడి అలా ఒకర్నొకరు చూసుకుంటూ గడిపేయడం వరకూ వెళ్ళింది.

కేవలం చూపులతోనే ఆగిపోదు ప్రేమ.

ఆగని ప్రేమ కొన్ని రోజులకి సముద్రపు వొడ్డుకి లాక్కెళ్ళింది

రామకృష్ణా బీచ్‌లో గంటల, గంటల తరబడి కూర్చోపెమంది.

ప్రేమ బాగా ముదిరింది.

ముదిరిన ప్రేమ నిద్రాహారాలు లేవంది.

విరహాలతో వేగిపొమ్మంది. కాగిపొమ్మంది.

స్నేహితులకు దొరికిపోయి అల్లరి కమ్మంది.

ప్రేమ సాగిసాగి ముద్దుల్లోకి వెళ్ళింది.

ముద్దుల్లోంచి కౌగిలివరకూ వెళ్ళింది.

ఇంకా లోతులకు, ఆనందపు అంచులకు వెళబోతుంటే...

ఊఁ ఊఁ అక్కడ మళ్ళీ హద్దులంది.

హద్దు మీరగూడదంది.

లాభం లేదు – హద్దుమీరక తప్పదంది.

హద్దుమీరక తప్పదంటే – పెళ్ళి తప్పదంది.

పెళ్ళి ఫీల్డులోకి దిగింది.

నేను ప్రేమంత సులువు కానంది.

పెళ్ళి కులం, కులం అంది.

ప్రేమ కులాన్ని కూలదోసింది..

పెళ్ళి తలిదండ్రులు అడ్డుగా నిలిచారంది.

ప్రేమ ఎదుర్కొంది.

పెళ్ళికి కావల్సిన సాంప్రదాయాలు, ఆచారాలు, పద్ధతులు – అన్నింటినీ ప్రేమ తూర్పార బెట్టింది. ప్రేమ జయించింది.

అతడు ఆమెను తప్ప, ఆమె అతణ్ణితప్ప అన్నీ వదుల్కుంది ప్రేమ.

మిత్రుల్ని తప్ప అందర్నీ వదుల్కున్నారు ప్రేయసీ ప్రియులు.

మిత్రులే ముందుకి వచ్చేరు.

మిత్రులే పెళ్ళి పెద్దలయ్యేరు.

ప్రేమికులకు కావల్సిన మనోధైర్యం, గుండె నిబ్బరం, సహాయ, సహకారాలు అందించేరు.

మిత్రుల్లో రవి ముఖ్యుడు.

మిత్రులందరిలో ముందు నిలిచేడు.

రిజిస్ట్రార్ ముందు పెళ్ళి జరిపించేరు.

పెళ్ళయేక ప్రేమ ఓడిపోలేదు. వాడిపోలేదు.

ఎంతగానో వికసించింది.

మరెంతగానో విచ్చుకుంది. విప్పారింది.

గుప్మని గుభాళించింది.

రెండు మనసులూ ఒక్కటే అంది.

రెండు శరీరాలూ ఒక్కటంటే ఒక్కటే అంది.

శరీరాలు స్వర్గం అంటే ఇదే ఇదే అన్నాయి.

పండించు, పండించు కమ్మని పంట అంది.

ఆమె కడుపు పండింది.

పండంటి బిడ్డను కంది.

అందమైన ఇల్లు అమిరింది.

అదృష్టం ఆమెకి ఉద్యోగాన్నిచ్చింది.

పచ్చని కాపురం ఆమెదయింది.

అంతలోనే

పచ్చని కాపురంలో చిచ్చు !

వచ్చింది ఇంటికేదో ముప్పు.

అతనిలో మార్పు.

పెద్ద మార్పు. పెనుమార్పు.

ఆమెపై ప్రేమకుసుమాలు విసిరిన చేతులిపుడు –

ఆమెపై ధనరాసులు జల్లుతున్నాయి.

ప్రేమను కురిపించే అతడు ఆమెపై పట్టుచీరలు విసిరేడు. నగలు నగలు అందుకో అన్నాడు. ఇదిగో చూడు మన బ్యాంక్ అకౌంటు అన్నాడు.

ఫ్రిజ్ , ఫోన్ అమిరేయి. అప్పర్‌క్లాస్ ఇళ్లల్లో ఉండే విలాస వస్తువులు తన ఇంటిలో ఒకటీ, ఒకటీ చేరుస్తూ, స్టాటస్ పెంచుతూ ఆమెను సంభ్రమాశ్చర్యాల్లో ముంచేశాడు.

బెడ్ రూమ్ ఎయిర్ కండిషన్ చేయించేడు. కారుకొంటే ఎలావుంటుందని అడిగేడు.

ఏదికావాలో అడుగు, అడుగు అన్నాడు.

అతని జేబులనిండా రూపాయలనోట్లు, మెళ్ళో రూపాయల దండలపై దండలు.

నోట్లు ఆమెపై విసిరేడు. గుమ్మరించేడు. ముంచెత్తేడు.

అందులో ఆమెనిండా మునిగిపోయింది.

డబ్బు సుఖం ఆమెని ప్రేమ మరిచేలా చేసింది.

డబ్బు సుఖంలో తేలియాడుతున్న ఆమె – ప్రేమ దూరమవుతున్న సంగతి గ్రహించింది.

డబ్బు సుఖమూ, భర్త ప్రేమా రెండూ కావాలని కోరుకుంది. అయితే – రెండూ అసాధ్యమని గ్రహించి – భర్త ప్రేమకే ప్రథమ స్థానమిచ్చింది. కొండెక్కి కూర్చున్న ప్రేమని కిందకి దింపాలని ప్రయత్నం చేస్తోంది.

డబ్బు దయ్యం పట్టుకున్న భర్తని మార్చాలని యత్నిస్తోంది.

పూర్వపు ప్రేమరోజులు పొందాలని ఆశిస్తోంది.

తన ప్రేమ కథ సుఖాంతం కావాలని కోరుకుంటోంది.

ఇంటర్వెల్ అయింది.

విజయ కళ్ళల్లో నీళ్ళు!

''ఏడుస్తున్నావా ?''

''లేదు. మీరు ఏడిపిస్తున్నారు '' అనాలనిపించింది.

ఆమె కళ్ళల్లో నీళ్ళు – సినిమా ప్రభావమే తప్ప, తన ప్రభావం కాదనుకున్నాడు చెలం.

''డ్రింక్సు తాగివద్దాం – పద''

''వద్దు '' అంది విజయ.

లైట్లు ఆరేయి.

భర్తతో సినిమాకి వచ్చిన విజయ ఎంతో సరదాగా, సంతోషంగా గడపాలని అనుకుంది.

కాని–

సరదాగా, సంతోషంగా ఉండలేకపోతోంది.

చెలం తనని ఇంతకుముందులా ప్రేమించడంలేదనే బాధ!

భర్తని నెమ్మదిగా ప్రసన్నం చేసుకుని – ఆమె జీవితాన్ని నందనవనం చేసుకోవాలని ఆరాటపడుతోంది.

చెలం ఏరోజూ సరిగా ఇంటిదగ్గర ఉండడంలేదు. ఏ అర్ధరాత్రో ఇంటికొస్తాడు. రావడం పూర్తిగా తాగి వస్తాడు.

ఆదివారాలు, పండుగరోజులూ తనవే అన్నాడు . నిజమే అనుకుంది.

ఏ రోజుకారోజు తాగుడు మానేస్తాననడం ఎంత నిజమో – ఆదివారాలు పండుగరోజులూ ఆమెకి ధారాదత్తం చేయడం గూడా అంతే నిజం అయింది.

మొదటి రెండు ఆదివారాలే – తనతో గడిపేడు. గడపడం అంటే ఏదో జైల్లో వున్నట్టు ఉన్నాడు. విజయ మనసు చివుక్కుమంది. అయినా అతనితో సరదాగా గడపడానికే ప్రయత్నించింది.

తర్వాత ఇక నాటకాలు ఆడటం మొదలెట్టేడు.

''విజ్జీ ! ఈ ఆదివారం నీది.. కాదనడంలేదు. ఒక అర్జెంటు పని వుంది. గంటలో వచ్చేస్తాను.. వెళ్ళమంటావా ? నీవు పంపిస్తేనే వెళ్తాను. ''

అలా అంటే తను ఏం అంటుందీ ?

ఏం వనుంటుందీ ?

ఆదివారాలు తనకి పూర్తిగా ఇచ్చేసిన తర్వాత – ఇచ్చేసినట్టు వుండాలి ఆ ఇంగితం, ఆ బుద్ధీ, అతనికి వున్నట్టు లేదు.

ఎంతో గాయపడిన మనసుతో – సరే వెళ్ళండి, ఒక గంటలో అంటున్నారు, గంటలోనే వచ్చేయాలి – అనక తప్పదు.

''నా విజ్జీది బంగారు మనసు '' అని ముద్దులాడి బయటకు పరుగు !

ఉదయం ఎనిమిది గంటలకి వెళ్ళినమనిషి ఒక గంటలో వస్తానన్న మనిషి – ఏ మధ్యాహ్నమో, సాయంత్రమో వస్తాడు.

అవుడామె మనసు ఎలా వుంటుంది? ఎంత దెబ్బతింటుంది.

మాట తప్పిన మనిషితో దెబ్బలాట పెట్టుకుంటుందా ? అలుగుతుందా ? ఏడుస్తుందా?

తను నమ్ముతుందా ?

విజయ సాధించాననుకున్న ఆదివారాలు అలా వుండగా –

ఈ రోజు –

విజయ పుట్టిన రోజు.

ఈరోజు అంతేనా ?

కాదు.

గతరాత్రే విజయకి వాగ్దానం చేసేడు చెలం – నీ పుట్టినరోజంతా ప్రమాణపూర్తిగా నీతోనే గడుపుతానని!

నిజమని నమ్మింది విజయ.

ఉత్సాహంగా లేచింది విజయ.

తలంటి స్నానం చేసి – పట్టుచీర కట్టుకుంది.

అందంగావుండే విజయ ఈ రోజు మరింత అందంగా కనిపించింది చెలంకి.

దగ్గరికి తీసుకున్నాడు

''నా అందాల పాప ఎవరికోసం పుట్టిందమ్మా ? ''

''నా బుజ్జికోసం'' అంది నవ్వుతూ.

టేబుల్‌పై ప్లేటునిండా స్వీట్సు వున్నాయి.

పుట్టినరోజునాడు భర్తచేత స్వీటు పెట్టించుకు తినడం చేస్తుంది ఎప్పుడూ. చెలం ప్లేటులో లడ్డూ తీసేడు.

లడ్డూ ఆమె నోటివరకూ వెళ్ళింది. ఆమె నోరు చాపింది. తన్మయంతో కళ్ళు మూసుకుంది.

ఆమె నోట్లకి లడ్డూ చేరేబదులూ – బలంగా అతని పెదాలు ఆమె పెదాలని ఆక్రమించేయి.

ఆమె ఊపిరిసల్పనట్టు ఊఁ ఊఁ అంటున్నా అతని పెదాలు ఆమెని ఒకంతట వదల్లేదు.

వదిలేక – ''అబ్బ! ఏంటండి – ఇంత మోటుగా ! '' అంది.

''మోటుగా కాదు ఘాటుగా ''

''చాల్లెండి – పెట్టండి స్వీటు''

''ఇంతవరకూ పెట్టిన స్వీటు చాల్లేదా ?''

''ఏమిఁటి ? నాకు స్వీటు పెట్టేరా ?

''అన్యాయం ! ఇంతవరకూ పెట్టించుకుని లేదంటావేం ? కావాలిస్తే మళ్ళీ అడుగు. పెడతా'' – మరోసారి ముద్దు పెట్టబోయేడు.

విజయ తప్పించుకుని – ''ఇదా స్వీటు !'' అంది కోపం నటిస్తూ

''కాదా ! '' అన్నాడు చెలం.

''కాదు. మీచేతిలో లడ్డూ స్వీటు '' అంటూ తెలియజేసింది విజయ.

''ఇది కల్తీ స్వీటు. నాది స్వచ్ఛమైన స్వీటు ''

''ముద్దు స్వీట్ ఎలా అవుతుంది ?''

''ఇలా అవుతుంది '' అని ఆమెను గట్టిగా ముద్దుపెట్టేడు మళ్ళీ.

ముద్దుకి ఏస్వీటూ సరికాదని ఆ విధంగా ఆమెకి గుర్తుచేసి, ఒప్పించి, అప్పుడు –

ఆమె నోటినిండా లడ్డూ కుక్కేడు. ఆ నేతి మిఠాయి అధరామృతం ముందు చాలా చప్పగా అనిపించింది. 'మా ముద్దుల పాప' అంటూ ఎత్తుకు గిరగిరా తిప్పేడు చెలం.

''కళ్ళు తిరుగుతున్నాయి బాబోయ్'' అని గోలపెట్టినా వినిపించుకోకుండా – గిరగిరా తిప్పేడు.

గిరగిరా తిప్పితిప్పి ఆమెని చప్న నించోబెట్టి వదిలేసాడు వదిలేసి పకపకా నవ్వేడు.

విజయకి భూమి గి(ర్రున తిరుగుతోంది తమాయించుకోలేక కళ్ళు మూసుకుంది – రెండు చేతులతో.

తాగినదానిలా తూలిపోతూ పడిపోబోయింది. నవ్వుతూ పట్టుకున్నాడు అంతలోనే-

ఇంకా ఏడిపించాలని వదిలేయబోయేడు – విజయ పట్టుకు వదిలిందికాదు.

చెలం చేసిన పనికి కోపం నటించినా – ఆమెకీ ఉదయం ఎంతో సంతోషంగా, పట్టరాని ఆనందంగా ఉంది

''కళ్ళుమూసుకో'' అన్నాడు చెలం.

''వద్దుబాబు'' అంది విజయ.

మళ్ళీ ఏ ముద్దుల జడివాన కురిపిస్తాడో! ఎక్కడ ఎత్తుకు గిరగిరా తిప్పేస్తాడో!

వద్దుబాబూ వద్దు అంది.

''అదేం కాదు. నిన్ను అంటనూ ముట్టను. సరేనా! ఒక నిమిషంపాటు కళ్ళుమూస్తే చాలు''

సరేనంటూ కళ్ళుమూసుకుంది.

కళ్ళు తెరవమన్నాడు.

తెరిచిన విజయ కళ్ల జిగ్‌జిగ్‌మన్నాయి! జిగేల్ మన్నాయి!

ధగధగ మెరుస్తూ బంగారు నెక్లెస్! రవ్వల నెక్లెస్!

ఆమె గుండెలు అద్భుతానందంతో గణగణమ్రోగాయి.

కళ్ళు మిలమిలా మెరిసేయి.

విజయ ఒక వంటిపేట గొలుసుతప్పా ఏ బంగారు వస్తువులూ ధరించదు – ఏ వివాహ శుభకార్యాలకో, పండగలకో తప్ప!

ఆమెకి ఇప్పటికే ఇటువంటి ఖరీదైన నాలుగైదు నెక్లెసులూ, గొలుసులూ, ముత్యాలదండలూ చెవులకి పెట్టుకునేవైతే చెప్పక్కర్లేదు. ఎన్నో రకరకాల జతల దుద్దులూ, రింగులు!

కొన్ని బీరువాలోను, మరికొన్ని బేంక్ లాకర్‌లోను పడివుండడం తప్పా సింగారించుకు తిరగడం లేకపోయినప్పటికీ – అదొకమోజు! నెక్లెస్ ఎంతో బాగుందని సంబరపడింది విజయ.

విజయ కళ్ళల్లో వెలుగు చూసి తృప్తిగా నిట్టూర్చేడు చెలం.

నెక్లెస్‌ని ఆమె మెడలో అలంకరిస్తూ అన్నాడు – ''అలా చూస్తుండు డాళింగ్! వచ్చే

ఏడాది నీ పుట్టినరోజుకి ఇలాంటిది కాదు - డైమండ్ - డైమండ్ నక్లెసు నీ మెళ్ళో వేళాడకపోతే నాపేరు చెలంకాదు''

ఆ మాటకి విజయ ముఖం మతాబాలా వెలిగిపోలేదు.

డైమండ్‌నక్లెస్ అనేమాట ఆమెకి డైనమైట్‌లా పేలింది

అత్యంత ఆనందాన్ని కలగజేసిన పుట్టిన రోజు కానుక రవ్వల నక్లెస్ - ఆమెకిపుడు ఉరితాడులా తోచింది. ఉరితాడుని అతను ఆమె మెడకి తగిలించినట్టుగా ఫీలయింది

ఆమె గుండెలు గుబగుబలాడేయి. చెప్పరాని భయం ఆమెలో ఆవహించింది.

చప్న చెలం గుండెలపై బల్లిలా కరుచుకుపోయి - గట్టిగా పట్టేసుకుంది.

''చెలం ! నాకు ఏ డైమండ్ నక్లెసులూ, ఏ రవ్వల నక్లెస్‌లూ వద్దు. ఏ పగడాలూ పట్టుచీరలూ వద్దు వద్దు. నాక్కావల్సింది నీ ప్రేమ, నీ అనురాగం. నాకవిచాలు చెలం. నాకు కావల్సినవి అవే చెలం! నీ ప్రేమే నాకు వజ్రాలహారం ! ప్రేమతో నా చుట్టూ వేసిన చేతులే నామెళ్ళో ముత్యాలదండ! అవును చెలం నేను అడుగుతున్నది ఒకటే. పుట్టినరోజు కానుకగా ఏడైమండ్ నెక్లెస్‌కాదు. నీ ప్రేమ నాకు కావాలి. ''

ఒక్కసారిగా ఉన్మాదిలా విజయ ప్రవర్తించిన తీరుకి విస్తుపోయేడు. ఆశ్చర్యపోయేడు చెలం. అప్యాయంగా ఆమె వీపు నిమురుతూ అన్నాడు ''విజయా ! నీకేమైనా పిచ్చా ! నీపై ప్రేమ లేకుండా అసలు నేను బతకగల్నా ! నీపై ప్రేమలేకుండా ఇంత ఖరీదైన వస్తువు నీకు కానుకగా ఎలా ఇవ్వగలను ?''

''నేను చెప్పింది అర్థం చేసుకోకుండా పిచ్చా ! అంటారేమిటి ? అవును మరి ఇద్దరు పెళ్ళాలు వున్నవాడికి నేను పిచ్చిదానిలానే కనిపిస్తాను. ''

''నాకు ఇద్దరు పెళ్ళాలా ? మళ్ళీ ఇదొక నిందా ?''

''అబద్ధాలాడకండి. మీకు మొదటి పెళ్ళం పైనున్న మోజు ఈ రెండో పెళ్ళం పైలేదు''

''ఇదిగో రెండో పెళ్ళంగారూ ! ఎవరండీ నా మొదటి పెళ్ళం ?''

''బాగుంది. మీకు తెలీనట్టు నన్ను అడుగుతారేం ? దాన్ని ప్రేమించిన ప్రేమలో పదో వంతయినా నన్ను ప్రేమిస్తున్నారా ?''

''నీ కన్నా ప్రేమగా నేను ప్రేమిస్తున్న ఆ పెళ్ళం ముండ ఎవర్తి?''

''నీ సంపాదన!''

విజయ అతని సంపాదనని మొదటి పెళ్ళంగా పోల్చినందుకు పకపకా నవ్వేడు చెలం.

''నవ్వుతారేం ? కాదా ?''

''సరే ! మొదటి పెళ్ళాన్ని కాదని నీతోనే వుండిపోతాను సరేనా ''

''మీరు నాతో వుంటానన్నా అది వుండనిస్తుందా ?''

''అది నా చేతిలో వుంది ''

''లేదు. మీరు దానిచేతిలోకి ఎపుడో వెళిపోయేరనుకుంటున్నాను. అదిమీకు ఏ

పెట్టుమందో పెట్టేసింది! మిమ్మల్ని నాకు దక్కనీయకుండా చేస్తోంది''

చెలంకి నవ్వు వస్తోంది!

''నాకు ప్రియమైన సాయంత్రాలను లాక్కుంది. అర్ధరాత్రుల వరకూ నిన్ను వుంచేసుకుంటోంది. నాకేదో మీరు మిగిల్చారనుకున్న ఆదివారాలని కూడా లాగేసు కుంటోంది. ఈ పుట్టినరోజు నయినా, పూర్తిగా నాతో వుండనిస్తుందా అని నా అనుమానం. నీవు వుండవేమోనని భయం. పుట్టినరోజు కానుకగా ఇచ్చిన నక్లెస్‌ని చూసుకు మురిసిపో, మరేవస్తా అని నీ మొదటి పెళ్ళం దగ్గరికి జారుకుంటావేమోనని భయం''

నీది అర్ధంలేని భయం. ఈరోజంతా నావిజయదే''

''నమ్మమంటారా ?''

''నమ్మమని నీకు నిన్న రాత్రే మాటిచ్చాను. నమ్మకపోతే ఏం చేస్తాను''

''సారీ చెలం! నా భయాలునావి''

''భయంతో కాలాన్ని ఎందుకు వృధా చేస్తావు ?

అనవసరభయాలతో కొన్ని క్షణాలని అపుడే పోగొట్టుకున్నావు! అవునా ?''

''నిజమే చెలం!'' ఒప్పుకుంది విజయ.

షస్ట్‌షోకి శంకరాభరణం సినిమాకి వెళ్దామంది విజయ.

''ఆల్‌రైట్! కానియ్'' అన్నాడు చెలం.

అతనికి చికెన్ బిరియానీ ఇష్టం. సందీప్‌కి గులాబ్‌జామ్ ఇష్టం. ఆమెకి నేతిగారెలు ఇష్టం. అవేకాకుండా ఆమెకి ఇష్టమైన, నచ్చిన ఏవేవో వంటకాలు చేస్తానంది విజయ.

''ఆల్‌రైట్! అలాగేకానియ్'' అన్నాడు చెలం.

అనడవేఁగాదు, వంటగదిలో ఎప్పుడూ దూరని చెలం ఆరోజు వంటగదిలో విజయపక్కకి చేరేడు. సాయం చేయబోయి చేయికాల్చుకున్నాడు. అక్కడే పార్వతమ్మ, రంగంమామ్మా, సందీప్ తచ్చాడుతున్నప్పటికీ – విజయను గిలిగింతలు పెట్టేడు, పొట్టమీద గిల్లేడు, జబ్బను కొరికేడు. ఇంకెన్నో చిలిపిపనులు చేసేడు.

ఛీ! ఏమిటీ మనిషి! సిగ్గులేకుండా!

విజయ కోపం నటించి 'బయట పొండి' అంది.

చెలం నిజంగానే బయటకి పోవాల్సివచ్చింది!

చెలం కోసం ఎవరో వచ్చేరు.

''మీ మొదటి పెళ్ళం కబురు పెట్టినట్టుందండీ'' అన్లేదు విజయ.

ఎంతో ఉత్సాహంగా వంట చేస్తున్న విజయ గుండెల్లో రాయిపడింది. ఆమె ముఖం చిన్నబోయింది.

మొగుణ్ణి వంటగదిలో దాచేసి – లేడని చెప్పేస్తానంది విజయ.

''ముందు వాళ్ళెవరో చూడాలి కదా'' అన్నాడు చెలం.

విజయ మనసు స్టౌపై ఎసరులా కుతకుతలాడిపోతోంది.

రంగంమామ్మ వెళ్ళి – వచ్చినవాళ్ళెవరో తెల్సుకుని వచ్చింది.

''కనకరాజట బాబూ ''

కనకరాజా !

పెరుగుతున్న తన బిజినెస్‌లో తగిలిన కొత్త స్నేహితుడు కనకరాజా.

వంటగదిలోంచి – బయటకు వచ్చేడు.

ఒక్క నిమిషం – మాటాడి పంపించేస్తానన్న చెలం అతనితో హాలులో గంటలతరబడి హస్కుకొట్టేడు.

అక్కడితో ఆగలేదు చెలం !

విజయని పిలిచి కనకరాజాని పరిచయం చేసి – ఈరోజు మనతోనే భోంచేస్తాడని ఆమెకి తెలియజేసేడు. ఆమెకి ఒళ్ళు మండిపోయింది.

విజయ వాళ్ళిద్దరికీ వడ్డించి భోజనం పెట్టింది.

భోజనం పెడుతూ వస్తున్న దుఃఖం ఆపుకోలేక – బర్స్ట్ అవక ముందే విజయ అక్కణ్ణించి వెళ్ళిపోయింది. రంగంమామ్మని వడ్డించమంది.

విజయ బెడ్‌రూమ్‌కి పోయి – మంచంమీద పడిపోయి తలగడలో ముఖం దాచుకుంది.

పుట్టినరోజు – ఎలాంటి పరిస్థితిలోనయినా ఏడ్వగూడదనే సెంటిమెంటు ఆమెకి బలంగావుంది. అయినా, ఎంత ప్రయత్నించినా విజయ దుఃఖం ఆపుకోలేకపోయింది.

తను ఇంతకష్టపడి వండింది ఎవరో కనకరాజాని మేపడానికా !

ఎంతో ఉత్సాహంగా, ఇష్టంగా సరదాగా చేసుకున్న వంటలు డైనింగ్ టేబిల్‌పై – భర్తతో, కొడుకుతో అదే ఉత్సాహంగా, ఇష్టంగా, సరదాగా తనీ పుట్టినరోజుని ఎంజాయ్ చేస్తాననుకుంది.

తన మనసుని చెలం ఎందుకు గ్రహించడూ ? ఎందుకు అర్థం చేసుకోడూ ?

''మమ్మీ! డాడీ పిలుస్తున్నాడు''

మేడపైకి సందీప్‌ని పంపించేడు. ఆమె దగ్గరికి వెళ్ళే ధైర్యం లేదు చెలంకి !

గెస్టుగాడు ! అతిథి మర్యాద ! లేవక తప్పిందికాదు.

''వస్తానండీ'' – అంటూ విజయకి నమస్కారం పెట్టేడు కనకరాజా.

''బాబూ ! నీకోనమస్కారం. వెళ్ళెళ్ళు'' అన్నట్టు విజయ ప్రతి నమస్కారం చేసింది.

కనకరాజా సెలవుపుచ్చుకు బయల్దేరాడు.

చెలం అక్కడితో ఆగితే బాగుణ్ణు!

అతనితోబాటు బయటికి వెళ్ళేడు.

ఒక గంటలో తిరిగి వచ్చేస్తానన్నాడు.

విజయ మనసు విరిగిపోయింది. కుతకుత లాడిపోయింది.

ఏవిటీ మనిషి!

లోపం ఎక్కడ ?

తనదా ?

అతనిదా ?

బిజినెస్‌దా ?

భర్తని ఆడది ఆదివారాలు, పండగలూ, పుట్టినరోజులంటూ – కట్టిపడేసినట్టు పూర్తిగా తన దగ్గరే గడపాలనుకోడం, బలవంతంగా వుంచేసుకోడం తప్పుకింద వస్తుందా ? స్వార్థంలోకి చేరుతుందా?

ఒకటి మాత్రం ఆమెకి అర్థమవుతోంది.

''భర్త ప్రేమని డిమాండ్లతో సాధించలేం ! బలవంతంగా పొందలేం ! సాధించిన డిమాండ్లను కోల్పోయాననే బాధకన్నా – భర్త తనకి రోజురోజుకీ దూరమవుతున్నాడనేది – ఆమెను ఎక్కువగా బాధిస్తోంది.

గంటలోగా వెళ్ళివస్తానన్న చెలం అరగంటలోనే తిరిగి వచ్చేసాడు. అయినా ఆనందించ లేకపోయింది విజయ. ముఖం మాడ్చుకున్న విజయని చూసి అతనికి చిరాకు వేసినప్పటికీ – ఆమెను బతిమాలి, బతిమాలి భోజనంముందు కూర్చోబెట్టేడు చెలం. ఏవో రెండు ముద్దలు గెలికి లేచింది విజయ.

శంకరాభరణం సినిమాకి కూడా చెలం బలవంతంమీదే బయల్దేరింది.

విజయకి సినిమా ఎంతగానో నచ్చుతున్నప్పటికీ – భర్త ప్రవర్తనకి సంబంధించిన ఆలోచనలు ఆమెనొక పక్క కుదిపేస్తునే వున్నాయి. భయాందోళనలు కలుగజేస్తూనే వున్నాయి.

ఏడుకొండలవాడా ! వెంకటరమణమూర్తీ ! నా భర్త ప్రేమను నాకు తిరిగి ప్రసాదించు. ఐశ్వర్యం ఏదో ఇంత వరకూ ఇచ్చేవు. చాలు. ఇంకా సంపాదన వద్దు. నా భర్తని నాకు దక్కించు తండ్రీ ! – అని భగవంతుని ప్రార్థించింది విజయ.

సినిమా ముగిసింది.



విజయ, చెలం హాలులోంచి బయట కొస్తున్నారు.

కిక్కిరిసిన జనం. సినిమాకి వచ్చేటప్పుడు తొందర, వెళ్ళేటప్పుడూ తొందరే !

జన ప్రవాహంలో అడుగుతీసి అడుగువేయడానికి అరనిమిషం పడుతోంది.

చెలం భుజంపై చేయిపడింది.

చెలం వెనక్కి తిరిగిచూసేడు.

రవి !

రవిపక్కన ఆకుపచ్చని చీరలో మిలమిలా మెరిసిపోతూ సుజాత!

రవి రెండోసారి ఈ సినిమా చూడ్డం. ఒకసారి ఛాయ, రాంబాబు ఇచ్చిన టికెట్‌తో

వచ్చేడు. ఇపుడు భార్యతో వచ్చేడు. ఈ టికెట్లు మాత్రం అతని సొంతడబ్బులే!

''ఎప్పుడొచ్చేరు ?'' పలకరించింది విజయ.

'' ఈరోజే – గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి.''

''బాగున్నారా !''

''బాగున్నాం''

వెనుక జనం తోసుకొస్తున్నారు.

నడుస్తూనే మాటలు.

''సినిమాకి వచ్చేరన్నమాట. బాగుంది !'' చెలం.

''మీరు రావడం నేను చూసేను – '' రవి.

''మరి. పలకరించలేదేం ?''

''ఇపుడదే చేస్తున్నాం కదా !''

జనం నుంచి తప్పుకుని గేటు పక్కన నిలబడ్డారు.

రవి భుజం మీద మూడేళ్ళ సురేష్! చేయిపట్టుకుని అయిదేళ్ళపాప శిరీష.

''సందీప్‌ని తీసుకురాలేదా ?'' అడిగింది సుజాత.

''వాడిని తెస్తే సినిమా చూడనిస్తాడా ? టాప్ లేపేస్తాడు ''అన్నాడు చెలం.

''మీరిలా వదిలేసి వచ్చేస్తే బాబు ఏడ్వడా ?''

''లేదు. మా అమ్మ చూసుకుంటుంది ''

''అదృష్టవంతులు ! చిలకాగోరింకల్లా హాయిగా ఎక్కడికైనా తిరగొచ్చు.''

''తిరగొచ్చు ! కాని తిరగడంలేదు. దానికీ అదృష్టముండాలి'' అంది విజయ.

''నీ అదృష్టానికేం ? పెద్ద భవంతి. పండంటి బిడ్డ. నీవు ఎన్నో జన్మలెత్తితేగాని దొరకని మా అన్నయ్య.. నీఅదృష్టానికేమిటమ్మా ?''

''ఔనౌను ! ఎన్నో జన్మలపుణ్యఫలం – మీ అన్నయ్య!..'' అని విజయ ఇంకేదో అనబోతుంటే – టాపిక్ కట్ చేశాడు చెలం.

''సినిమా చాలా బాగుందికదూ '' అంటూ.

''బాగోడవా ! బ్రహ్మాండం! ఓ రెండు గంటల సేపు వూటీలో కూర్చున్నట్టుంది'' – రవి.

''నాకైతే దేవాలయంలో కూర్చున్నట్టుంది '' – సుజాత.

''వెధవ సినిమాలు చూసి, చూసి విసిగిపోయి వున్నామేమో – గొప్ప రిలీఫ్! అంతేగాని గొప్పసినిమా కాదు. మంచి సినిమా అనడానికి నాకు అభ్యంతరంలేదు '' – విజయ.

రవి కొడుకు సురేష్‌కి సినిమాయేకాదు. వీళ్ళ టాపిక్ కూడా బోర్‌గా వుంది – 'ఇంటికిపోదాం డాడీ ' అని గోలపెట్టేడు.

సురేష్ చెలంకి ముద్దొచ్చేడు. బాబు బొద్దుగా వున్నాడు . ఇంతేసి బుగ్గలు !

చెలం సురేష్ బుగ్గలమీద ముద్దుపెట్టబోయేడు.

''బుగ్గమీద కాదు – ఇక్కడ ! '' అని పెదాలు చూపించేడు సురేష్!

అంతా ఒక క్షణం ఆశ్చర్యపోయి – మరుక్షణం పకపకా నవ్వేరు.

చెలం సురేష్‌కోరిక తీర్చేడు. పెదాలపై ముద్దుపెట్టేడు.

సురేష్ థ్రిల్ అయిపోయి చప్పట్లు చరిచేడు

''పెంకి రాస్కెల్'' బుగ్గలు గిల్లేడు రవి

''ఏం సుజాత – మీ ఆయన ఏం తిరుగుళ్ళు తిరుగుతున్నాడో అని యిన్స్పెక్షన్‌కి వచ్చేసావా?'' అన్నాడు చెలం

''లేదు అంకుల్! ఇయ్యాల మా మమ్మీకి, డాడీకి పెళ్ళంట! '' అంది శిరీష.

సుజాత సిగ్గుపడిపోయింది

రవి వెర్రినవ్వు నవ్వేసాడు.

''విజయా ! ఈ రోజు నీ పుట్టినరోజు ! అవునా ?'' అంది సుజాత

''నీకెలా తెల్సు ?''

''ఆడవాళ్ళు వాళ్ళ పెళ్ళిరోజు, పుట్టిన రోజులేగాక –స్నేహితులవీ, బంధువలవీ, టకేల్‌మని చెప్పేస్తారు. గొప్పగుర్తు!'' – రవి.

''మా పెళ్ళిరోజునాడే నీ పుట్టిన రోజని నాకుబాగా గుర్తు!..సో విష్‌యూ హాపీ బర్త్‌డే'' అని శుభాకాంక్షలు తెలియచేసింది సుజాత.

సురేష్, శిరీషలుగూడా 'విషయూ హాపీ బర్త్‌డే' అని పెద్దగా అరిచేరు. పిల్లలకి అదొక గొప్ప సరదా!

విజయ చాక్లెట్లు కొని పిల్లల చేతిలో పెట్టింది.

మరోసారి చెప్పేరు – శుభాకాంక్షలు.

''మరింక ఇవ్వను చాక్లెట్లు '' అంది విజయ నవ్వుతూ

రెండుమూరల మల్లెపూల దండ విజయ అక్కడేకొని సుజాతకి ఇచ్చింది.

''మీ పెళ్ళిరోజుకి ఇవే మా శుభాకాంక్ష'' లంది విజయ.

''విష్‌యూమెనీ, మెనీ రిటర్న్సు ఆఫ్ హేపీ ఏనవర్సరీ '' అన్నాడు చెలం.

మరసటి దినం ఆదివారం.

లంచ్‌కి ఆహ్వానించింది దంపతులను విజయ.

''వున్న రెండురోజులూ మమ్మల్ని ఇంట్లో వుండనివ్వరా '' అన్నాడు రవి.

''వుండనివ్వగూడదనుకుంటే – ఇప్పుడే డిన్నర్‌కి ఈడ్చుకెళ్ళొచ్చు''

''అమ్మో ! అంతపని చేయకండి '' – రవి.

నవ్వులు !

''రేపు తప్పక రావాలి.''

''నేనుమటుకు రానబ్బాయ్'' బెట్టుచేశాడు రవి.

''నేను మటుకు వస్తానన్నయ్యా'' అంది సుజాత

''నీవు వస్తే చాలమ్మా'' అన్నాడు చెలం.

''మరి రవి?''

''సుజాత వస్తోంది కదా వాడు కొంగుముడిలో దొరుకుతాడు''

నవ్వులు.

చెలం స్కూటర్ తీసేడు. విజయ వెనక కూర్చుంది.

రవి స్కూటర్ తీసేడు, సుజాత ఒడిలో సురేష్, సుజాత రవిల మధ్య శిరిష.

''ఎలా వుంది బండి రన్నింగ్?'' అన్నాడు చెలం.

ముప్ఫయిప్లాట్లు అమ్మినందుకుగాను చెలం రవికి బహుకరించిన స్కూటర్ అది

చెలం అన్నదాంట్లో 'నేను ఇచ్చిన బండి తెల్సా' అని గుర్తుచేస్తునట్లనిపించింది.

''బానే వుంది'' అన్నాడు రవి పొడిగా.

రెండు స్కూటర్లు కదిలేయి.

రేపు లంచ్‌కి రావడం మర్చిపోవద్దని మరోసారి గుర్తుచేశారు.

రవి సుజాతల పెళ్ళి రోజుకి మరోసారి శుభాకాంక్షలు తెలిపేరు.

## 18

రవికి ఈరోజు పెళ్ళిరోజులా లేదు.

మొదటి రాత్రిలా వుంది.

సుజాత ఉదయం గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి వచ్చింది.

సుజాతకి కొన్ని సెంటిమెంట్స్ వున్నాయి. పిల్లల పుట్టినరోజు, ఆమె పుట్టినరోజు, భర్త సన్నిధిలో జరుపుకోడం ఆమెకోసరదా. ఎంతో తృప్తి.

తను వుండేది అక్కడా, అతను ఇక్కడా కావడంచేత ఒక్కోసారి అతను లేకుండానే పుట్టినరోజులు జరుపుకోడం జరుగుతోంది ఈ మధ్య.

అయితే –

పెళ్ళిరోజు విషయంలో మటుకూ ఆమె 'రాజీ' కిఏమాత్రం రాదు. అతను అక్కడికో, తను ఇక్కడికో వచ్చేయాల్సిందే! తప్పదు!

సుజాత పిల్లలతో బయల్దేరివచ్చేసింది.

ఆమె వచ్చీరాగానే మొగుడిమీద పడిపోలేదు.

ఇంటిని శుభ్రంచేయడానికి పూనుకుంది. పూర్తిగా నిమగ్నమయింది. గోడలకున్న బూజు దులిపింది. ఇల్లాంతా కడిగి ముగ్గులు వేసింది. టేబులు పైనున్న సామానులన్నీ తీసి – ఎక్కడివక్కడ సర్దింది. వంటగదిని నీటుగా తయారు చేసింది.

ఇది నిజంగా నేను ఇన్నాళ్ళు వుంటున్న గదేనా ?– అని రవి ఆశ్చర్య పోయేటంతగా గదిని ముస్తాబుచేసింది.

అతణ్ణి బజారుకి పంపించి కావల్సిన సామానులన్నీ తెప్పించింది.

అతనికి ఇష్టమైన వంటకాలు, విజిటబుల్ బిరియానీ చేసింది.

పిల్లలిద్దరికీ, అతనికీ వడ్డించి తినమంది.

ఆమెనుకూడా వడ్డించుకోమన్నాడు రవి.

పెళ్ళం, పిల్లలతో కలిసి తృప్తిగా తింటున్న రవికి – తను ఒక్కడూ తినే నీరుపట్టిన చల్లటి అన్నం – పచ్చడి మెతుకులూ గుర్తుకొచ్చేయి.

రవికీరోజు మహానందంగా వుంది.

రైలుదిగి ఇంట్లో అడుగు పెట్టి నప్పటినుంచీ సుజాతని వదల్లేదు రవి.

ఇల్లు శుభ్రం చేస్తున్నా ఆమెను మంచంమీదికి లాగే ప్రయత్నం చేసేవాడు. ఆమె ముద్దుముద్దుగా మందలించినా – వదిలేవాడు కాదు. ఏ జెబ్బో, జాకెట్‌కీ చీరకీ మధ్య నున్న తెల్లటి, నున్నటి ప్రదేశమో కొరికేవాడు. గిల్లేవాడు. గిలిగింతలు పెట్టేవాడు. ఆమె నవ్వేది. కోపం నటించేది. తియ్యని తిట్లు తిట్టేది – ఈ చేష్టలన్నీ వాళ్ళ మూడేళ్ళ కొడుకు సురేష్ చూస్తున్నాడనేది వాళ్ళకి తెలీదు!

వంటగదిలో వెనగ్గా వెళ్ళి ఆమె గుండెలమీద గట్టిగా చేతులేసుకు పట్టుకోడం, ఆమెనలా బంధించేసి మెడమీద కొరికేయడం, చెవలను నాలుకతో నాకడం మెడపైన ముద్దులు కురిపించేయడం, మనిషిని నిలువునా నలిపేయడం , కుదిపేయడం అంతా – తండ్రి చేస్తున్నదంతా సురేష్‌చూసేడు.

పెద్దకూతురు శిరీషని పక్కింటి పిల్లల దగ్గరకి ఆటకి రవి పంపేయ గలిగేడు. సురేష్‌కి మటుకు పరాయి ఇంటికి వెళ్ళి ఆడే ధైర్యం లేదు. పక్కింటి కెళ్ళి పిల్లలతోనూ, అక్కయ్యతోనూ ఆడాలని సరాదావాడికి లేదు. మమ్మీతో డాడీ ఆడుతున్న ఆటలు వాడికెంతో సరదాగావున్నాయి.

రవికూడా ఆ కుర్రగుంటణ్ణి గుర్తించలేదు.

సుజాత కూడా 'ఛ! ఏమిటండి పిల్లలముందు' అనడంలేదు.

మధ్యాహ్నం భోజనాలయేక రవి తలుపులు లోనగడియ పెట్టేశాడు.

పిల్లలు పడుకోమని ఎంత బతిమాలినా పడుకోలేదు. సాయంత్రం సినిమాకి తీసుకువెళ్తామన్నా నిద్రపోలేదు.

శిరిష పక్కింటినుంచి తెచ్చిన చింతపిక్కలు నేలమీద పరచి ఆడుకుంటోంది.

సురేష్‌కూడా అక్కడే అక్కదగ్గర కూర్చున్నాడు గాని – వాడి కళ్ళన్నీ ఆ మంచం మీద ఉన్నాయి!

మంచంపై రవి కౌగిట్లో సుజాత వుంది. అతని కుడిచేయి, కుడికాలు ఆమె మీద

వున్నాయి.

అతను చేస్తున్న చిలిపిచేష్టలు చూసి 'అబ్బబ్బ! చంపేస్తున్నారు కదా!' అని ఆమె చిరుకోపం ప్రదర్శించేటప్పుడు – చంపుతున్న డాడీని, చంపించుకుంటున్న మమ్మీని పిల్లలు చూస్తున్నారు.

శిరీష దొంగచాటుగా చూస్తుంటే, సురేష్ కళ్ళార్పకుండా చూస్తున్నాడు.

ఒక్కోసారి 'ఇదిగో అవతల పిల్లలు' అంటోంది సుజాత. అనడంలో ఏ మాత్రం సీరియస్‌నెస్ లేదు. అతనూ సీరియస్‌గా తీసుకోలేదు.

చివరికతను క్లయిమాక్స్ కెళిపోతుంటే – 'ఇప్పుడుకాదు' అని ఆమె చప్న మంచం మీంచి లేచిపోయింది. దగ్గరిగా కుర్చీలాక్కుంది.

ఆమె సంసారం గురించి ఎన్నో విషయాలు మాట్లడుదామనుకుంటోంది.

ఏది! మాట్లాడనిస్తేనా ? చెప్పనిస్తేనా ?

''చెప్పు'' అన్నాడు మొత్తానికి.

''ఏమి చెప్పడమండీ! మీరు నన్ను బొత్తిగా లక్ష్య పెట్టడంలేదు.''

''ఏం చేశాను ?''

''ఏం చేశారా ? నా ఉత్తరానికి సమాధానం రాసారా ?''

''ఎందుకు రాయలేదూ ?''

''ఎక్కడ రాసేరు ? నేను ఉద్యోగానికి రిజైన్ చేయాలా, వద్దా అని అడిగితే మీరేంరాసేరు ? వారం రోజులు గడువుకావాలని వ్రాసేరు. నిజమేకాబోలని నమ్మి వారందాక ఎదురుచూసేను. ఏదీ? ఇంతవరకూ రాయలేదు ఉత్తరం!''

ఆమె సీరియస్‌గా అంటుంటే – అతను కాలుచాపి చిలిపిగా ఆమె తొడలపై వేశాడు.

ఆమె విసిరి కొట్టింది.

నవ్వుతూ మళ్ళీవేసేడు.

విసిరి కొట్టడం – వేయడం – అలా నాలుగైదు సార్లు రిపీట్‌కావడం – చూస్తున్న సురేష్‌కి ఎంతో సరదావేసింది.

చివరికి అతనికాలు ఆమె తొడలపై వుంది.

డాడీ గెల్చాడనుకున్నాడు సురేష్.

ఆమె అతని కాళ్ళ వేళ్ళకి మెటికలు విరుస్తూ అంది – ''నన్నిలా చంపుకుతినేస్తున్నారు కదా! రోజూ మీరు ఆడదిలేకుండా పడుకుంటున్నారంటే ఎలా నమ్మడం ?'

గతుక్కుమన్నాడు రవి.

అతని కప్పుడు వెంటనే పనిమనిషి లచ్చిమి గుర్తుకొచ్చింది.

లచ్చిమిని సుజాత స్థానంలో ఊహించుకోడానికి అతనికే మాత్రం ఇష్టంలేదు.

''ఈ ఆడది తప్ప మనకే ఆడదీ పడదుగాక పడదు. అందుకే ఇంత ఆకలి. అంచేతనే నిన్ను తినేయాలనుకోడం!'' అన్నాడు. నిజం సుజీ! నీవు నా చెంతలేకుంటే నాకు అసలు

సెక్సు తలంపే వుండదు నమ్మా, నమ్మకపో ''

''మా బుజ్జి శ్రీవారి మీద నాకా నమ్మకముంది '' అంది సుజాత. అతని అరచేయి ముద్దుపెట్టుకుని ''నాకు అంతేనండీ. మీరు అప్పుడప్పుడు వచ్చి నన్నురేపుతారు. అయ్యో! రేపెలా అనుకుంటాను. కానప్పుడు ఆ తలంపేరాదు.''

ఆమె చెప్పిన మాట ఎందుకో నమ్మాలనిపించలేదు రవికి.

సెక్సులేకుండా ఎలా వుంటున్నావ్ ? అని ఆమెని అడగకుండానే ఎందుకు చెప్పినట్టు ?

ఆ విషయమై ఎన్నో ప్రశ్నలు వేద్దామనుకున్నాడు గాని వేయలేకపోయేడు.

ఒకరోజు చెప్పా చేయకుండా, ఉత్తరం పత్తరం లేకుండా హైద్రాబాద్‌లో దిగి అర్ధరాత్రి సడన్ చెక్ చేయాలనిపించింది. తన నీచపు ఆలోచనలకి నవ్వుకున్నాడు రవి.

''ఏమిటి మీలో మీరే నవ్వేసుకుంటున్నారు ? ఇంతకీ మీరు నా ఉత్తరానికి జవాబు ఎందుకురాయలేదో చెప్పలేదు ''

''చెప్పడానికేం లేకే వ్రాయలేదు''

''ఏం లేకపోవడం ఏమిటీ ? రిజైన్ చేయాలా, లేదా ? అనే సమస్య మీకు చీమకుట్టినట్టయినా లేదా ?''

''అది కాదు – స్పష్టంగా , ఖచ్చితంగా ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాను. ''

''రాలేకపోడం కాదు – దాటేయడం అంతే! మనకిది ఎందుకొచ్చిన బాధ చెప్పండి. కొన్ని బాధలు సమాజంతో ముడిపడి వుంటాయి. మనకేసు అది మాత్రం కాదు. మెడకి ఉచ్చు మనచేతులతోనే వేసుకుంటున్నాం. ముడి విప్పడమా బిగించుకు చావడమా అనేది మనచేతుల్లోనే ఉంది. చిత్రమేమిటంటే ఇన్నాళ్ళూ ముడి విప్పుతున్నామనే భ్రమలో వుంచారు నన్ను. నిజానికి ఉచ్చు బిగుసుకుంటోంది. ఊపిరి సల్పని స్థితికి వచ్చేశాను. ముడి మీరు విప్పరనీ విప్పలేరనీ నాకు అర్థమయింది. గమ్మత్తేమిటంటే ఆ ముడి మీరు విప్పాలను కున్నానుగాని, ఆముడి నేనే – నాయంతట నేనే విప్పుకోవచ్చని తట్టకపోవడం ?''

''అంటే ''

''నా సమస్యకు ఒక పరిష్కారం తేల్చేశాను''

''ఏమిటి?''

''రాత్రికి చెబుతాను ''

''అంతవరకూ సస్పెన్సా !''

''కాదు. అప్పడయితే సరిగ్గా వాతావరణం అమరుతుంది. విషయం స్పష్టంగా అర్థమవుతుంది.''

''ఆల్రైట్ మాడమ్,'' అన్నాడు.

తర్వాత–

శంకరాభరణం సినిమాకి పెళ్ళం, పిల్లలతో వెళ్ళివచ్చిన రవి టైము చూసేడు.

పదినిమిషాల తక్కువపది !

అయ్యబాబోయ్! ఇంకా ఎప్పుడు భోంచేయడం ?

ఎప్పుడు పిల్లలు పడుకోడం ?

ఎప్పుడు పెళ్ళాం పక్కలోకి వెళ్ళడం ?

పావుగంటలో –

భోజనాలు ముగిసేయి.

పిల్లల్ని మంచంపై పడుకోబెట్టి వాళ్ళ పక్క నేలమీద వేసారు.

సుజాత తెల్లచీర కట్టుకుంది.

మల్లెపూలు పెట్టుకుంది.

ఎంతలో, ఎంతలో అని తొందరపెడుతోంది అతని శరీరం.

ఆగలేని అతని శరీరం ఆమెశరీరంపై పడిబోతే వారించింది

ఆగమంది.

''నా ఉద్యోగం రాజీనామా విషయంలో –నేను చెబ్తానన్న సస్పెన్సు గురించి అడగరేం?''

''ఎక్కడ ! నా శరీరపు టెన్షను ఆ సమస్య సస్పెన్సుని డామినేట్ చేసి వెనక్కి నెట్టుతోంది. ఏంచేయడం ?''

''అబ్బాయిగారు ఆగాలి. ముందు సస్పెన్సు ముడి విప్పనీయండి''

'' ముందు చీరముడి విప్పనీయ్''

'' ఛీ ! పాడు '' ముడివిప్పబోతున్న అతనిచేతిని విసిరికొట్టింది..

నవ్వేడు సురేష్!

మంచం మీంచి అంతా గమనిస్తున్నాడు సురేష్.

ఆ పసి వాడికి సినిమా బోర్‌గా వుంది. మమ్మీ డాడీ ఆటబాగుంది. అంచేత సినిమాహాల్లో నిద్రపోయేడు. ఈ సినిమా నిద్రపోకుండా చూస్తున్నాడు.

శిరిష నిద్రపోతోంది.

సురేష్ నిద్రపోడం లేదనే సంగతి ఆ దంపతులు గమనించే స్థితిలోలేరు.

''సరే చెప్పు '' అన్నాడు రవి – ఆమె ఒడిలో పడుకుని.

అతని చేతివ్రేళ్ళు మాత్రం – ఆమె శరీరంలో అతనికి ఇష్టమైన చోట మీటుతూ సితార వాయిస్తున్నాయి.

గదంతా మల్లెలవాసన మత్తెక్కిస్తోంది.

గదిలో జీరో ఓల్టు బల్బు నీలంగా వెలుగుతోంది.

మంచం మీదున్న సురేష్‌కి – నేలపై పరుపుపై పడుకున్న మమ్మీ డాడీ స్పష్టంగా కనిపిస్తున్నారు.

''చెప్పు, సుజా '' అన్నాడు.

''చెప్పేముదు – మీరు నాకో ప్రామిస్ చేయాలి ''

''ఏమిటి ?''

''మీరు కోప్పడకూడదు. ''

''ఇంకా''

''నన్ను తిట్టకూడదు''

''ఇంకా ''

''మీరు బాధపడకూడదు''

''అంతేనా ?''

''అంతే ''

''సరే – చెప్పు ''

'' నేను జాబ్‌కి రిజైన్ చేసేసాను '' అంది సుజాత నెమ్మదిగా

చివాల్న కూర్చున్నాడు రవి !

''వేళాకోళమా ''

''కాదు. నిజంగానే. పిల్లలమీద ఒట్టు ''

రెండునిమిషాల నిశ్శబ్దం!

వేడెక్కిన అతని శరీరం చల్లబడిపోయింది. సుజాత ఉద్యోగానికి రాజీనామా చేసిందంటే అతనికి నమ్మబుద్ధికావడంలేదు, నమ్మక తప్పని తర్వాత –

''తొందర పడ్డావు సుజా !''

సుజాత వెంటనే సమాధానం ఇచ్చింది – ''నేనేం తొందరపడలేదు. చెప్పాలంటే నిజానికి చాలా ఆలాస్యం చేశాను. ఈ పని ఎప్పుడో చేసి ఉండాలి''

''కొంపలేం మునిగాయి – నాకు చెప్పి చెయొచ్చుగా !''

''మీరు మళ్ళీ పాతపాటే పాడుతున్నారు. నేను మనకు పెళ్ళయిన కాణ్నించి చెబుతున్న విషయమే ఇది. చివరికి మీకు రిజిష్టర్డు లెటర్ వ్రాశాను. వారంలోపుగా మీ నిర్ణయం తెలపకపోతే రాజీనామా చేసినట్టే అని వ్రాసాను. మీరు వారం గడువు అడిగేరు. మీనుంచి ఎలాంటి రెస్పాన్స్ లేదు. మీరు మరోసారి నా ఉత్తరం చదవండి. నే చేసింది తప్పనిపించదు. తొందరపాటు చర్య అనరు.''

''అదికాదు సుజీ. ఎంతో మంది ఉద్యోగాలు లేక అల్లాడుతుంటే – వున్న బంగారంలాంటి ఉద్యోగం వదుల్కోడం మూర్ఖత్వం కాదూ.''

''బంగారంలాంటి ఉద్యోగం మీకన్నా నాకు ఎక్కువ కాదు. నాక్కావల్సింది పచ్చని సంసారం. పండంటి కాపురం. నేను ఉద్యోగం మానేయడం బొత్తిగా మీ కిష్టం లేనట్లుంది. ఒకటి అడుగుతాను చెప్పండి. మీ జీతంతో నన్నూ, నా పిల్లల్నీ పోషించలేరా ?''

''పోషించడం ప్రశ్న కాదు – సుజీ. జరగకపోతే ఒకపూట తిని, ఇంకో పూట మానేస్తాం.

అదికాదు నేననేది. చూస్తూ, చూస్తూ వెయ్యి రూపాయల జీతం నీకు ఎలా వదుల్కోబుద్ధి వేసింది ? అక్కడ నీవు, ఇక్కడ నేను వుండడంవల్ల ఎంతఖర్చయినా కొంతలో కొంత మిగులుతుందనేది వాస్తవం కదా ''

''దానికి మించిన వాస్తవాలు గమనించరేమిటండీ. ఇక్కడ మీ బతుకు బతుకులావుందా? మీ ఆరోగ్యం చెడిందా లేదా ? టైముకి తిండా ? నిద్రా ? ఏం సుఖం బావుకుంటున్నారిక్కడ?.. ఇక నా సంగతంటారా. నాదక్కడొక వెధవజీవితంలా వుంది ''

''ఛ.ఛ. అవేం మాటలు సుజీ ''

''అసలు నేను ఇక్కడకు రావడం మీకు ఇష్టంలేదండీ. పెళ్ళాం, పిల్లలూ వస్తే మీ ఆటాపాటా సాగవు. మేం మీకు సంకెళ్ళు! అంతేకదా ?''

''నాపై నీవు నిజంగానే ఈ ఆరోపణలు చేస్తున్నావా ?''

''నిజం కాకపోతే ఏమిటి ? ఆడాళ్ళతో మీరు తిరుగుతున్నారో లేదో నేను చూళ్ళేదు. కాని బీరువాలో మందుసీసాలు చూసేను. అది చాలదా మీ నడవడి, వ్యవహారం తెల్సుకోడానికి – అన్నీ ఆలోచించే నా సంసారం సరిదిద్దుకోడానికి ఉద్యోగం వదుల్కోడానికి సిద్ధపడ్డాను ''

అరె! మందు సీసాలు చూసేసిందా ! జాగర్త పడకపోవడం ఎంత పొరపాటు! – అనుకున్నాడు రవి. సుజాత అన్నమాట ఏదీ ఖండించలేకపోతున్నాడు.

సరె! రిజైన్ చేసిన తర్వాత – దాని గురించి తప్పుకుని బాధపడ్డంలో అర్ధంలేదు. సుజాత ఏ పనైనా జాగర్తగా ఆలోచించి చేస్తుందనే నమ్మకం తనకుంది. జరిగిందంతా మనమంచికే అనుకోవడంలో దొరక్కపోదు తృప్తి. ఇక్కడ గట్టిగా ప్రయత్నిస్తే ఉద్యోగం దొరక్కపోదు.

''సుజీ ! ఒకవిధంగా ఆలోచిస్తే నీవు మంచిపనే చేశావనిపిస్తోంది. నీవిలా డేరింగ్ స్టెప్ తీసుకోకుండా – నా నిర్ణయం మీదే నిలబడితే ఎప్పటికీ తేల్చేవాడిని కానేమో.'' అని రవి అనేటప్పటికి సుజాత ముఖం వెలిగి పోయింది.

''మరి మూటాముల్లె అంతా సర్దుకు వచ్చేయలేక పోయేవా ?'' అన్నాడు.

''అది నా తరంకాదుబాబు. మీరావలిసిందే ... అయినా అప్పుడే ఎక్కడలెండి. నిన్నే కాగితం పెట్టేను. గవర్నమెంటు కంపెనీ గనక మూణ్ణెళ్ళు దాకా రిలీవ్ చేయరు. అప్పుడు చూడొచ్చు ఆ తతంగం. ''

''నీ రిజగ్నేషన్ చూసి మీ బాస్ ఏమంటాడు ?''

''ఒకటే ఏడుపు. వద్దనిగోల. నా పేపరింకా అతని టేబిల్ మీదే వుంది. బాగా ఆలోచించు అంటాడు.''

''వాడి మొహం! వాడి బాధమేమిటో చెప్పమంటావా ? ఉద్యోగుల్లో ఎక్కువగా స్త్రీలే సిన్సియర్‌గా, గొడ్డులా కష్టపడి పనిచేస్తారు. నీవు ఎలా పనిచేస్తావో వాడికి తెల్సు. మళ్ళీ నీలాంటి కాండిడేట్ దొరకదని ఏడుపు..ఛఛ. పెళ్ళి రోజప్పుడు వాడి ఏడుపు సంగతెందుకు మనకి ? వదిలెయ్!''

''మీరే ఎత్తేరు వాడి సంగతి'' అంది నవ్వుతూ.

''అబ్బా! వాణ్ణి మరింక వదిలేయ్! తియ్యని హాయిహాయి రాత్రిని వృధా చేయకు'' – దగ్గరికి తీసుకున్నాడు సుజాతని రవి.

ఇంటర్‌వెల్ తర్వాత సినిమా స్టార్టయినంత ఉత్సాహం వచ్చింది. సురేష్ కి మళ్ళీ మమ్మీపై డాడీ చేతులు పడగానే!

సుజాత అతని గుండెలపై తలవాల్చింది. ఆమెకెంతో ఆనందంగా వుంది.

''నేను రిజైన్ చేసేసి వచ్చేసానే గాని – గుండెల్లో దడదడ! మీరు ఏమంటారోనని ఒకటే భయం. మీరింతవేగంగా, తేలిగ్గా – నేను చేసినపనికి ఆమోదిస్తారని అనుకోలేదు. మీరెంత మంచివారండి.''

''మంచివాణ్ణంటూ నాకు మేకతోలు కప్పేస్తే సరిపోద్దనుకుంటున్నావా ?''

''మరి ఎలా సరిపోద్దనుకుంటున్నారు ?''

''నేను అడిగింది ఇస్తే''

'' మీరు అడిగితే ఇవ్వంది నా దగ్గరేముంది ? అడగండి ''

''ముద్దు''

''సరిపోయింది! ఏదో సామెత జెప్పినట్టు ఇపుడు మనకి అదేం లోటండీ!''

''ఇన్నాళ్ళుగా అది లోటేగా ? ఇంతకీ ఇస్తావా లేదా ?''

''తీసుకోండి – ఎప్పుడైనా నేను అభ్యంతరం చెప్పేనా ?''

''అభ్యంతరం పెట్టినా బలవంతంగా పెట్టేయగల్రు!''

''మరేం''

''ముద్దు నేను పెట్టడం కాదు – నీవు పెట్టాలి. ''

''నేనా'' సిగ్గుపడిపోయింది సుజాత – ''నాకు చేతకాదు బాబు '' అంది.

ఎప్పుడూ ముద్దుల మీద ముద్దులు తను పెట్టడమే గాని ఆమె పెట్టినట్టు గుర్తులేదు రవికి. ఒకవేళ పెట్టినా గుర్తులేనన్ని పెట్టి ఉంటుంది. సుజాత ముద్దు పెట్టడం అనే ఊహే థ్రిల్లింగ్‌గా, తీయతీయగా వుంది ఆ ముద్దే అనుభవంలోకివస్తే ఇంకెలా వుంటుందో!

సుజాత ''నాకు చేతకాదు బాబు'', ''ఛీపాడు'', ''నాకు తెలీదు బాబు '' అంటూ రెండు నిమిషాలు ఏడిపించి ఎలాగైతేనేం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది.

రవికి ఎక్కడలేని హుషారు వచ్చింది.

ఆమె ఇస్తానన్న ముద్దు ముందు ఆమె వదుల్కున్న వెయ్యి జీతం వెలవెలబోయింది. పోనియ్. వెయ్యి. ఒకముద్దు ఇయ్యి!

పెడతానన్న ముద్దు పెట్టడంలేదు సుజాత. కొద్దికొద్దిగా ముందుకి వంగి సిగ్గుపడిపోయి తలతిప్పేసుకుంటోంది.

రవి 'కమాన్, కమాన్ ' అంటూ మూతి ముందుకు చాస్తున్నాడు.

సురేష్ ఈ ఆటని కళ్ళప్పగించి హుషారుగా చూస్తున్నాడు.

ముద్దుకోసం రవి ఎంత ఎంకరేజ్ చేస్తున్నాడో – సుజాత అంత సిగ్గుపడిపోతోంది.

చాలాసార్లు భర్తకి తను ముద్దు పెట్టేనన్న సంగతి ఆమెకి గుర్తుంది – రవికి లేకపోయినా ! అయినా ఇదే మొదటిసారి ముద్దుపెట్టడంలా సిగ్గుపడిపోతోంది.

రవి బ్రతిమిలాట కోపంగా మారుతోంది.

ఆమె అతని ముఖం మీదకి వంగుతోంది. ఆమె పెదాలు అతని పెదాలు దగ్గరికి తాబేలు నడకతో సాగుతున్నాయి.

రవి పెదాలు ఆత్రం ఆత్రంగా, దప్పిక దప్పికగా చూస్తున్నాయి. ఆవురావురుమంటున్నాయి.

సురేష్ తల ఎత్తి హుషారుగా, నవ్వుతూ, కళ్ళు మిలమిలలాడిస్తూ చూస్తున్నాడు.

రవి ఒళ్ళు వాంఛతో పరవళ్ళు తొక్కుతోంది. అనుభవం ఎప్పుడా, ఎక్కడా అని వుంది. ఆమె ముద్దు పెట్టింతర్వాత మరిక వదలడు. కరెంటులా అంటుకుపోతాడు. లతలా చుట్టుకుపోతాడు. కౌగిల్లో కరిగిపోతాడు. ఆనందపు అంచులు చూస్తాడు. స్వర్గపు లోతుల కెళ్తాడు. అతనిలో వేడి చల్లబడే వరకూ సుజాతను వదిలే ప్రశ్నలేదు.

సుజాత పెదాలు పయినించి పయినించి అతని పెదాలని తాకేయి.

సుతారంగా చప్పుడు చేసేయి.

ముద్దు పెట్టడం అయిపోయిందనట్టు ఆమె పెదాలు తప్పుకుంటుంటే – వదల్లేదు రవి.

''నో! ముద్దు అంటే అదికాదు. మళ్ళీ పెట్టు '' అని డిమాండ్ చేశాడు.

''నాకు తెల్సినంతమటుకు ముద్దు అంటే అదే '' అంది.

''కాదు '' అన్నాడు రవి – ''నేను చూపిస్తాను చూడు '' అన్నాడు రవి.

డాడీ ఎలా చూపిస్తాడో చూస్తున్నాడు సురేష్.

సుజాతకి ముద్దు పెట్టి చూపించేడు రవి.

చప్పట్లు!

ఆనందంతో సుజాత కాదు !

సురేష్!

సురేష్ చప్పట్లు!

సుజాత సిగ్గుతో చితికిపోయేలా సురేష్ చప్పట్లు !

ఎగిసిన రవి ఉద్రేక తరంగాలు అణగారి పోయేలా సురేష్ చప్పట్లు! వేడి చప్పున చల్లారిపోయేలా చప్పట్లు !

సురేష్ చప్పట్లతో ఆగలేను.

బాంబు విసిరేడు.

గది దద్దరిల్లిపోయింది!

''అంకుల్ ఇలాగే అచ్చం ఇలాగే ముద్దు పెట్టుకున్నాడు కదు మమ్మీ''

అంతే!

షాక్ తినేసి దంపతులిద్దరూ అలా నిశ్చేష్టులైపోయేరు. నిర్ఘాంత పోయేరు.

గదిలో భయంకర నిశ్శబ్దం!

సురేష్ బిత్తరపోయేడు.

చింతనిప్పులా వున్న తల్లికళ్ళుచూసి దద్దరిల్లిపోయేడు. జడొట్టిపోయేడు.

అంతలోనే –

సురేష్ చెంపలు రెండూ ఎర్రగా కందిపోయి, తల్లివేళ్ళు అయిదూ అంటుకుపోయేయి. ఏడుపు గట్టిగా అందుకున్నాడు సురేష్!

''వెధవ! వేలుడంతలేవు ఏమిట్రామాటలు! ఎప్పుడైనా కూస్తావా, కూస్తావా ?'' అదేపనిగా సురేష్‌ని బాదుతున్న సుజాతని రెండు లెంపలు వేసేడు రవి.

ఏడుస్తున్న బాబుని అతని చేతుల్లోకి తీసుకున్నాడు.

''ఎందుకలా కొడ్తావ్ పసివాణ్ణి! నీ రంకువేషాలు బయటపడేసాడనా ?''

కొయ్యబారిపోయింది సుజాత.

చాలా సేపటివరకూ ఆమె నోరు పెగల్లేదు.

ఆవిడ కళ్ళుంట ధారలు, ధారలుగా కన్నీళ్ళు!

''ఏవండి..మీరేనా ఆ మాట అంటున్నదీ ? మీరు నిజంగా నమ్ముతున్నారా ?

''పసిబిడ్డ మాట దైవవాక్కు. పిల్లలు అబద్ధమాడరు''

''పిల్లలమాట మీకు లెక్క! పిల్లలు ఏమిటి మాటాడుతారో ఆ పిల్లలకే తెలియదు. మనకేం తెలుస్తుంది?..పిల్లలూ, పెద్దలూ, దేవుడు వాళ్ళనందర్నీ పక్కన పెట్టండి. నేను ఒకటే మిమ్మల్ని అడుగుతాను. సూటిగా జవాబు చెప్పండి.. మీకు నా మీద అనుమానమా! ''

రవి మాటాడకుండా ఎటో చూస్తూవుండిపోయేడు.

సుజాతకి దుఃఖం ఆగక రెండుచేతుల్లో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.''నాపై మీకు అనుమానమని ఎప్పుడూ అనుకోలేదండీ, నా భర్త ఇలా ఆలోచిస్తాడని నేను కల్లో కూడా ఊహించలేదండీ''

''అవును మరి. అనుమానం పడననే ధైర్యంతోనే వ్యవహారాలు నడుపుతున్నావక్కడ. ఇంతకీ ఎవడా అంకుల్!''

''షటప్!''

''లంజాముండా!'' అంటూ రవి ఆమెపై చేయిచేసుకోబోయేడు.

ఆగండి! ఆ పెనుకేకకి, ఆ కేకలో తీవ్రతకి అతనిచేయి గాలిలోనే ఆగిపోయింది.

''ఆగండి! చేయిచేసుకున్నారా వూర్కోనేదిలేదు. హుఁ! మీకా పశుబలం తప్ప మరింకే

బలంలేదు. శుద్ధ బలహీనులు! ఇన్నాళ్ళుగా మీతో కాపురం చేస్తున్నా నేను ఎలాంటిదాన్నో, మిమ్మల్ని ఎంతగా ప్రేమిస్తున్నానో, ఎంతగా ఆరాధిస్తున్నానో తెల్సుకోలేని మూర్ఖుడివి. చదువుకున్న మూర్ఖుడివి. చెప్పుడు మాటలూ, చిన్నపిల్లలమాటలూ నమ్మే బలహీనుడివి. మీకు పెళ్ళం సంపాదించే డబ్బేకాని పెళ్ళం అక్కర్లేదు. నేను వచ్చినపుడు నా ఒళ్ళుతో ఆనందిస్తావు. రానప్పుడు అనుమానాలతో ఆనందిస్తావు. వూహల్లో నీ పెళ్ళాన్ని ఎవడిపక్కనో పడుకోబెట్టి నీవిక్కడ ఇంకేదో చేసుకుని ? ఛీ! నీవొక మగాడివా ?''

''లంజాముండా! నోర్మూస్తావా. బయటికి గెంటమన్నావా ?''

''మాటాడితే లంజా లంజా అంటున్నారు. మీకు మంచిభాష వచ్చన్నమాట. నాకిన్నాళ్ళూ తెలీదు. ఆ భాషవాడే ఆడవాళ్ళు మగాళ్ళను తిట్టే తిట్లన్నీ నాకు తెల్సు కాని నాకు నోరురావడంలేదు. ఎంచేతంటే నేను ఆ రకం ఆడదాన్ని కాదు గనుక. సంస్కారం వున్నదాన్ని గనుక! మరినీవు ? నీకు సంస్కారమంటే తెల్సా ? నీకెలా తెలుస్తుంది ? నీవేమిటో నాకీరోజు పూర్తిగా అర్ధమయింది. నీ అసలు రూపం ఈరోజే చూసాను. నీవు నన్ను బయటకి గెంటేస్తావా ? అంత మగాడివన్నమాట. రవిగారూ మీరు నన్ను బయటికీ గెంటేయక్కర్లేదు. నేనే వెళ్తాను. ఇల్లునీకేకాదు. నాకూవుంది వస్తాను – వస్తాను కాదు పోతాను''

''ఫో! పోయి ఎవడ్తోనో కులుకు ''

''కులుతాను. నా ఇష్టం వచ్చినట్టు తిరుగుతాను. ఒక్క అంకుల్‌తో కాదు – పదిమంది వందమందితో కులుకుతాను. తిరుగుతాను. ముద్దులు పదికాదు. వందకాదు – లక్షల్లక్షల ముద్దులు అడ్డమైన వాడిచేతా పెట్టించుకుంటాను. దుకాణం పెట్టి ముద్దుని పైసపైసాకి చవగ్గా అమ్ముతాను. ఆ పైసలు నీకు మనిఆర్డరు చేస్తాను. లంజనినేను కాదు – నీవు డబ్బుకి పడుచుకునే మగలంజవి.''

''నీయమ్మ..రంకులంజకానా ఏమిటేకూసేవు. నేను మగలంజనా ''

రవి ఆమె జుత్తుపట్టుకుని కొట్టడానికి చేయెత్తేడు.

''ఊ! కొట్టు కొట్టరా కొట్టు! నీవు ఆడదాన్ని కొట్టే మగాడ్వికదరా! కొట్టు ''

కొట్టేడు! సుజాతని ఎడాపిడా కొట్టేడు.

సురేష్, శిరీష.. పిల్లలిద్దరూ ఏడుపు.

సుజాతని వదిలేసి.. టేబుల్‌పై సిగరెట్టు తీసి వెలిగించేడు. బీరువా దగ్గరికి వెళ్ళి గ్లాసులోకి మందు ఒంపుకుని నీళ్ళు కలుపుకోకుండానే ఒక్క గుటకలో మింగేసాడు. అతనికి గొంతుక మండలేదు.

గుండెలు మండిపోతున్నాయి.

పరిస్థితి ఇంత భయంకరంగా, అసహ్యంగా తయారవుతుందని అతను ఊహించలేదు.

దొరికిపోయిన రంకుది బిక్కచచ్చిపోయి వూర్కోవాలి. క్షమాపణలు అడగాలి. తప్పును ఒప్పుకోవాలి. పైగా తప్పునాదికాదు, నీది అన్నట్టు ఏమిటా కేకలు!

రవి పెరటి గది తలుపులు తెరుచుకుని సిగరెట్ తాగుతూ బయట నించున్నాడు.

అయిదు నిమిషాలు అలా నించొని –

లోపలికి రాబోయేటప్పటికి –

సుజాత పెట్టె సర్దుకుని – పిల్లల్ని తయారుచేస్తోంది!

సుజాత వెళిపోతోంది. హైద్రాబాద్ వెళిపోతోంది.

ఆమె వెళ్ళిపోడం అతనికి ఇష్టం లేదు.

వెళ్ళొద్దు అనడానికి అహం, అభిమానం అడ్డొచ్చేయి– అయినా,

ఆపినా ఆగదని అతనికి తెల్సు.

సుజాత ద్వారం వద్ద నుంచొని – ఖాళీగా వెళిపోతున్న ఆటోని చప్పట్లు కొట్టి ఆపింది.

ఆగిన ఆటో – రెండు నిమిషాల్లో బయల్దేరింది.

ఇంట్లో ఒక్కడే మిగిలేడు రవి.

అతను ఒక్కక్షణంకూడా ఆ ఇంట్లో ఒక్కడూ – ఒంటిపిల్లి రాకాసిలా వుండలేకపోయేడు. ఇంటికి తాళంవేసి, స్కూటర్ తీసేడు. ఆటోని ఫాలో అయేడు.

వాల్తేరు స్టేషన్

ఆటో ఆగింది సుజాత దిగింది.

పిల్లలు దిగేటప్పుడూ, సూట్‌కేసు పట్టుకోడంలోనూ – రవి వచ్చి కలుగజేసుకున్నాడు.

సుజాత రవి ముఖంలోకి సీరియస్‌గా చూసింది.

రవి సీరియస్‌గా తీసుకోలేదు – ఆ చూపుల్ని. సూట్‌కేసుని చేతుల్లోకి తీసుకున్నాడు.

సుజాత కౌంటర్ దగ్గరకెళ్ళి కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌కి టికెట్లు తీసుకుంది.

కోణార్క్ ఎక్స్‌ప్రెస్ రెండుగంటలకిపైగా లేటట!

బండి వచ్చేటప్పటికి ఇంచుమించు తెల్లారిపోతుంది.

అంతవరకూ జాగరణ!

సుజాత సిమెంటు బల్లపై కూర్చుంది.

ఆమె ఒడిలో శిరీష నిద్రపోతోంది.

సురేష్ రవి భుజం మీద వున్నాడు. సురేష్ నిద్రపోడంలేదు.

రవి సురేష్‌ని ఎత్తుకుని అటూ, ఇటూ పచార్లు చేస్తున్నాడు.

స్టేషను పూర్తిగా కునుకుతోంది. ఫేన్‌లు నీరసంగా తిరుగుతున్నాయి.

ఫేనులు క్రింద ప్రయాణీకులు పక్కలు పరుచుకు పడుకున్నారు.

దోమలు ఈగలంత సైజుతో స్టేషనంతా విపరీతంగా వున్నాయి ; వుండి పాసెంజర్లని హింసిస్తున్నాయి.

దోమలు కుడుతున్న కాళ్ళని సుజాత మఠం వేసుకుని, నిండుగా చీర కప్పుకుంది. నిద్రపోతున్న శిరీషపై దోమలు వాలకుండా కాసేపు పేపరు వూపింది. కాసేపటికి చేయిపీకి –

సూట్‌కేస్‌లోంచి ఒక దుప్పటితీసి శిరీషపై కప్పింది.

రవి భుజంపై నున్న సురేష్ నిద్రపోడంలేదు.

తండ్రిని అదేమిటి, ఇదేమిటని – కనిపించిందల్లా చూపిస్తూ యక్ష ప్రశ్నలు వేస్తున్నాడు.

తను విసిరిన బాంబు ఎంత బీభత్సం సృష్టించిందో ఆ చిన్న ప్రాణికి తెలీదు.

రవి ఓపిగ్గా సమాధానాలు చెబుతున్నాడు.

సురేష్ ప్రశ్నలకి తను జవాబు చెప్పడం కాదు – తనొక ప్రశ్నవేసి ఆ పసివాడిచేత నిజం తెల్సుకోవాలి.

సుజాతతో సంబంధం పెట్టుకొన్న వ్యక్తి ఎవరు ?

సురేష్‌కి కేక్ కొనిపెట్టి – ప్లాట్‌ఫారం చివరకి తీసుకుపోయేడు.

''నాన్నా !'' అప్యాయంగా పిలిచేడు రవి.

''ఏం డాడీ ?''

రవి చుట్టూ చూసి నెమ్మదిగా అన్నాడు – ''మమ్మీ రోజూ పడుకుంటుంది గదా. మమ్మీ పక్కన ఎవరైనా పడుకుంటున్నారా ?''

''ఓ'' అన్నాడు.

''ఎవరూ ?'' ఆతృతగా అడిగేడు రవి.

''ఎవరంటే...నేను, అక్క, మరొొచ్చి నువ్వు...''

''నువ్వూ,నేను, అక్కా సరే..మన ముగ్గురం కాక ఇంకెవ్వరైనా పడుకుంటున్నారా ?''

''ఊఁ మరేమో ...'' అని ఆగిపోయేడు సురేష్

''చెప్పమ్మా ! నీకు బోల్డు చాక్లెట్లూ, కోన్ ఐస్‌క్రీములు కొనిపెడతాను. సరేనా ?''

''ఇక్కడున్నాయా ?''

'' వున్నాయి ''

''ఉప్పుడే కొంతావా ?''

''ఇప్పుడే కొంటాను''

''కొను డాడీ'' మారాం చేసేడు సురేష్.

''కొంటాను ముందు ఇది చెప్పుమరి.''

''ఏటి?'' సురేష్‌కి ఒకప్రక్క నిద్రముంచుకొస్తోంది. పెద్ద ఆవలింత తీసేడు.

''మమ్మీ దగ్గరికి అంకుల్ రోజూ వస్తాడా ?''

తన వూయించేడు సురేష్ –''చాక్లెట్ కొనుడాడీ '' అన్నాడు వెంటనే. ''కొందాం..అంకుల్ పేరు ఏమిటమ్మా ! చెప్పు నాన్నా !''

''అంకుల్ పేరు అంకులే డాడీ ''

తర్వాత ఎన్ని ప్రశ్నలు వేసినా రవి సరైన సమాధానాం రాబట్ట లేకపోయేడు.

సురేష్ మటుకు చాక్లెట్లు సంపాయించేడు.

అయితే –

చాక్లెట్లు తినకుండానే ...తండ్రి భుజం మీద కాసేపట్లో నిద్రపోయేడు సురేష్!

ఏ చీకూ, చింతా లేకుండా – ఎప్పుడుబడితే అప్పుడు నిద్రపోయే పిల్లలు ఎంత అదృష్టవంతులు!

ఇపుడు –

రవిలోగాని, సుజాతలోగాని అప్పటి స్థాయిలో ఉద్రేకాలు లేవు. బాధమాత్రం వుంది.

జరిగినదంతా ఒక కల – అయితే ఎంతబాగుణ్ణు!

ఈ న్యూసెన్సు స్టేషను వరకూ ఎందుకురావాలి ?

ఎవర్ని ఎవరు రెచ్చగొట్టేరు ?

సుజాత ''నాది తప్పే క్షమించండి '' అంటే తను క్షమించకుండా వుండేవాడా ?

అలాగే నాది తప్పుకాదండి – అని భర్తకి నచ్చజెప్పేరీతుల్లో నచ్చజెప్పుకుంటే అదెలా వుండేది?

సుజాత ఎందుకలా ప్రవర్తించింది ?

తనేదో కోపంలో ఏదో అంటే ఒక మాట – ఏమగాడైనా అంటాడు. ఆమాత్రానికి ఏమిటేమిటో అరిచి, ఏడ్చి సమస్యని స్టేషను వర్కూ ఈడ్చుకు రావడం ఒక సంసార స్త్రీ చేయాల్సిన పనేనా ?

సుజాత అలా దురుసుగా, పొగరుగా ప్రవర్తించిందంటే ఏం చూసుకొని ?

ఉద్యోగం చూసుకొనే కదా !

ఇదే గొడవ జరిగితే, ఉద్యోగం చేయని ఆడది సుజాతలా బిహేవ్ చేస్తుందా ? చేయదు. రాజీకి వస్తుంది. సర్దుకుపోతుంది. తను ఆలూ మగలమధ్య ఇంతకన్నా పెద్ద పెద్ద గొడవలే చూసేడు. వాటి దగ్గర ఇదీ ఒక గొడవేనా ?

ఏ ఇంట్లో మొగుడూ పెళ్ళాలమధ్య కలతలు లేవు ? అంతా ఆమె లానే ప్రవర్తిస్తే ఇంకేం కాపురాలు?

వెయ్యి రూపాయల ఆదాయం దృష్టిలో పెట్టుకున్నాను గాని – భార్యనీ, భార్య నీతినీ, భార్య శీలాన్నీ పోగొట్టుకోవల్సిన పరిస్థితులొస్తాయని అనుకోలేకపోయేను.

ఇప్పటికైనా మించిపోయిందిలేదు. అయిందేదో అయింది. ఆమె అలా తయారవడంలో తన తప్పు వుంది. ఇన్నాళ్ళు ఆమె ఉద్యోగం వదుల్కుంటానంటే వద్దన్నాడు.

ఉద్యోగానికి రాజీనామా చేసి వచ్చేసాను అంది.

మరెందుకు హైద్రాబాద్ వెళ్తోంది.

అంకుల్ గాడి దగ్గరికా ? ఎందుకైతేనేం –

సుజాత హైద్రాబాద్ వెళ్ళడానికి వీల్లేదు – అనుకున్నాడు రవి.

సుజాతను క్షమించి ఇంటికి తీసుకోపోవాలి అనే నిర్ణయం తీసుకునేటప్పటికి – కోణార్క్

ఎక్స్‌ప్రెస్ మరో అయిదునిమిషాల్లో వస్తున్నట్టు అనౌన్సుమెంటు.

సుజాత లేచింది.

శిరీషను లేపింది. శిరీషకు కప్పిన దుప్పటి మడత పెట్టి సూట్ కేసులో పెడ్తోంది.

రవి ఆమె దగ్గరికి రావడం గమనించింది.

పిలిచేడు అతను

పలకలేదు ఆమె.

''సుజీ ! ఆ సూట్‌కేస్ ఇలా ఇవ్వు – ఇంటికి పోదాం పద''

వంగి, పెట్టిసర్దుతున్నదల్లా – చివాల్న నించుంది సుజాత.

నిశితంగా, తీక్షణంగా అతని ముఖంలోకి చూసింది.

''ఏ ఉద్యోగమూ వద్దు. ఎలాగూ రిజైను చేసేసావు కదా. మరింకెందుకు. ఇంటికి పద. పాస్ట్ ఈజ్ పాస్ట్ ! అయిందేదో అయింది. పద ఇంటికి ''

ఆమె మాటాడలేదు.

అతనూ బతిమాలలేదు.

రైలు వచ్చింది.

సుజాత రైలు ఎక్కింది.

రైలు ఖాళీగా ఉండటం చేత రిజర్వేషను ఈజీగా దొరికింది.

పిల్లల్ని పడుకోబెట్టి, లగేజ్ సర్దుకుని కిటికీ వార కూర్చొంది సుజాత.

రవి ఆమెకెదురుగా నిల్చున్నాడు.

పిల్లలకి టిఫిన్ కొనితెచ్చేడు – తెల్లారుతోంది కదా!

రైలు కదుల్తోందని అనౌన్సుమెంట్ !

రైలు మరో నిమిషంలోనో, అరనిమిషంలోనో కదలబోతోంది.

సుజాత మనసులో ఎంతో సంఘర్షణ.

'ఇంటికి పద' అనే అతని రిక్వెస్టు ఆమె చెవిలో గింగుర్లు పెడుతోంది.

కలవరపెడుతోంది.

అతనికి సమాధానం చెప్పాలి.

''నేనొక విషయం నీకు చెప్పదలుచుకున్నాను''

ఏమిటన్నట్టు చూసేడు రవి.

''నేను ఉద్యోగం రిజైను చేసినమాట నిజమే ! కాని ఇపుడది ఉపసంహరణ చేసుకోబోతున్నాను. మాబాస్ కాగితం ఫార్వార్డు చేయకుండా మరోసారి బాగా ఆలోచించు అని ఎందుకన్నాడో ఇప్పుడు నాకు అర్థమయింది. ఉద్యోగానికి ఈ జన్మలో రిజైన్ చేసే ప్రసక్తిలేదని తెలియజేస్తున్నాను. నాకీ ఉద్యోగమే లేకుంటే – మీరునన్ను బయటికి గెంటితే ఏమైపోవాలి ? ఎక్కడికి పోవాలి. ?

ఆడది తనకాళ్ళపై నిలబడాల్సిన అవసరం ఎంతుందో మీరు నాకు చక్కని లెసన్ నేర్పేరు, ఉద్యోగం వదుల్కొంటా నన్నందుకు మంచి గుణపాఠమే నేర్పారు, చాలా థాంక్స్!''

అతను మాటాడలేదు.

రైలు కదలబోతోంది.

''మరోవిషయం. ఈ దేశపు స్త్రీకున్న వెధవ సెంటిమెంటు ఏమిటో గాని – ఇప్పటికీ ఇంత జరిగేక కూడా మిమ్మల్ని భర్తగానే గౌరవించడానికి ప్రయత్నిస్తున్నాను. కాని ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యం తర్వాతే భర్తైనా! మరేదైనా! సెలవ్''

చేయెత్తి నమస్కారం పెట్టింది సుజాత.

అతను ప్లాట్ఫారం మీద పాతేసినట్టు వంటరిగా మిగిలేడు.

అతనెన్నో కలలు కన్న పెళ్ళిరోజు అలా తెల్లవారింది.

## 19

రామకృష్ణా బీచ్ సందడిగా వుంది. తీర్థంలా వుంది.

ఫస్ట్షో సినిమా టిక్కెట్లు దొరక్కపోవడంతో బీచ్కి దిగబడ్డారు రాంబాబు, ఛాయ!

బీచ్లో జనం చూస్తుంటే – వీళ్ళంతా తమలానే సినిమా టికెట్లు దొరక్క ఇక్కడికి పరిగెత్తు కొచ్చిన బాపతులా తోచేరు. ఇక్కడ కూడా హౌస్ఫుల్ అయినట్టు జనం కిటకిట!

అసలీరోజు తాము రవిగదిలో గడపాల్సినరోజు, శనివారం!

సుజాత వైజాగు రాకుంటే ఆ గదిలో ఈ పాటికి ఒకరి కౌగిల్లో ఒకరు... స్వర్గసుఖాల్లో తేలియాడాల్సిన సమయం! ఈ వారం ఇలా అయింది.

వచ్చే శనివారం ఇంకేం అవాంతరమో!

''ఇదేం బాగాలేదు. అయినా రవిని ఎన్నాళ్ళు ఇలా ఇబ్బంది పెడతాం. మనదంటూ ఒక ఇల్లు ఎంత వేగంగా చూసుకుంటే అంత మంచిది'' అన్నాడు రాంబాబు.

''అవును. నిజమే'' అంది ఛాయ.

''ఏమిటో ఎంత వెదికినా ఇల్లు మనకి దొరుకుతుందనే నమ్మకం నాకు కలగకుంటోంది.''

''ఏం''

'' మన వ్యవహారం చూసి ఎవరిస్తారు చెప్పు అద్దెకి ఇల్లు ? ఇచ్చినా ఎన్నాళ్ళు ఉండనిస్తారు?''

''నీది పిచ్చిగాని పట్టణ ప్రజలు ఎదుటివాళ్ళ గురించి పట్టించుకునే దెప్పుడు ? ఇల్లు అద్దెకిచ్చేవాడికి – ఎంత అద్దె అన్నది లెక్కగాని – దిగేవాళ్ళు ఎవరన్నది కాదు!''

''ప్రపంచాన్ని చూస్తూ అలా మాటాడతావేం ఛాయా ?'' కాస్త చిరాగ్గా అన్నాడు.

''పోనీ మనం భార్యాభర్తలమని చిన్న నాటకం ఆడితేసరి. ఇల్లు దొరికేవరకూ ?''

పవిత్రమైన భార్యాభర్తల సంబంధాన్ని ఒక నాటకంగా ఆడుదామన్న ఛాయమాటలకి రాంబాబు చాలా బాధపడ్డాడు.

నాటకం కాదు - నిజంగానే తను భర్తగా, ఆమె భార్యగా వుండాలని తను తీవ్రంగా కోరుకుంటున్నాడు!

ఏరోజైతే బస్ ఇన్సిడెంట్ ద్వారా ఛాయతనకి పరిచయం అయిందో ఆరోజు నుంచే తనకి తెలీకుండా ఆమె తన జీవితంలో ఒక భాగమైపోయింది.

కాలక్రమేణా ఆమెతో బలపడిన స్నేహం - ఆ రోజు ఇంట్లో శ్రీమతి లేని సమయాన ఛాయని వశపర్చుకుని అనుభవించే వరకూ - అంతర్గతంగా తను ఆమెను శారీరకంగా కోరుకుంటున్నాడనే సంగతి అతను గ్రహించలేకపోయేడు.

అయితే కోరిక తీరిపోయింది గదాని మోజుతీరిపోలేదు. స్నేహం తగ్గిపోనూలేదు. పైగా ఆమెని చూడనిరోజు ఒక వెలితిగా వుండటం! ఆమెతో మాటాడక పోయినా, కలవకపోయినా, శరీరాన్ని పొందకపోయినా - విలువైనదేదో పోగొట్టుకున్నట్టు ఫీలింగ్! ఆ రోజంతా అదోలా చిరాగ్గా, డల్‌గా వుండటం!

ఛాయ లేకపోతే తన జీవితంలో సారంలేదనీ, సుఖంలేదని భావన!

ఛాయని నలుగురూ నాలుగురకాలుగా అనుకోడం, నవ్వుకోడం చూసి బాధపడకుండా వుండలేని స్థితి!

తను ఆమెకి ఏమీ కాకపోడంచేత కదా కొందరు చాటుగానే కాకుండా తన ఎదుటే ఆమె గురించి తేలిగ్గా మాటాడ్డం! ఎలా భరించగలడుతను ?

ఛాయ తన సొత్తు, తన సొంతం.

ఆమెను ఎవరైనా ఏదైనా అంటే వాళ్ళమూతిమీద తన్నాలనిపిస్తోంది.

కాని తనకా అధికారం ఏది ?

ఆ హక్కు ఎక్కడిదీ ?

ఛాయని వాడుకున్నంతకాలం వాడుకుని వదిలేద్దాం అనే ఆలోచన అతనికి రాకపోలేదు. వెంటనే ఆ ఆలోచన దుర్మార్గంగా, అన్యాయంగా తోచేది.

ఆమెకి సాంఘికంగా రక్షణ కల్పించాల్సిన నైతిక బాధ్యత తనకు లేదా ?

ఆమెను తను భరించడంవల్ల ఆర్థికంగా తనకెలాంటి ఇబ్బంది లేదు. నాలుగంకెల జీతమే కాదు - ఇరవై ఎకరాల మాగాణి వుంది. ఐనా ఛాయ ఉద్యోగం చేస్తున్న ఆడది! ఆర్థికంగా ఇబ్బందనే క్వశ్చనేలేదు.

ఛాయ తన సొంతం, తన ఆడది అని ప్రపంచానికి తెలియజేయాలి. ఎలా ?

'ఉంచుకోడం' అనేది వుంది. అది పరమ నాన్సెన్స్‌గా అభిప్రాయపడ్డాడు. ఆ ఆలోచనే నీచంగా కనిపించింది.

'పెళ్ళి' అనేది అన్ని విధాలసముచిత నిర్ణయంగా తోచింది

ఛాయని పెళ్ళిచేసుకోడం తన ధర్మంగా, న్యాయంగా భావించేడు. పెళ్ళితో భర్తగా ఆమెకి రక్షణ ఇచ్చినవాడు అవుతాడు. ఆమెకి పుట్టే సంతానానికి తండ్రి అవుతాడు.

అవును – ఛాయని పెళ్ళిచేసుకోవడంవల్ల తనకి పండంటి కొడుకుని కని ఇస్తుంది. (సంతానం అంతా ఆడపిల్లలే. ట్యూబెక్టమీ చేసుకోడంవల్ల భార్య మరిక సంతానవతి అయ్యే అవకాశంలేదు). యిటీవల తీవ్రంగా బాధిస్తున్న కొడుకులేని లోటును ఛాయ తీర్చగలదు. వంశోద్ధారకుణ్ణి కని ఇవ్వగలదు.

మొత్తంమీద ఎన్నో కారణాలుగా ఛాయని పెళ్ళిచేసుకోవాలనే నిర్ణయానికి వచ్చేడు.

చివరికి ఆ నిర్ణయం ఎంతగా బలపడిందంటే అవసరమైతే భార్యకు విడాకులు ఇవ్వడానికి కూడా సిద్ధం! పరిస్థితిని అంతవరకు వెళ్ళకుండా మానేజ్ చేయగలననే ధీమా, ఆత్మ విశ్వాసం అతనికి వుంది.

పెళ్ళి చేసుకుంటాననే విషయం ఛాయకి తెలియజేసి ఆమెను సంతోష పరచాలనుకున్నాడు. ఇంతవరకూ ఆమె తనని ఏమీ కోరలేదు. పెళ్ళిచేసుకోమని అడగనూ లేదు. అడగని వరం ఆమెకి ప్రసాదించబోతున్నాడు.



ఆ మరుసటిరోజే ఏకాంతంలో రాంబాబు తన నిర్ణయాన్ని ఛాయకి తెలియజేసాడు.

ఎవరో కొత్త వ్యక్తి ఏదో కొత్తసంగతి చెబుతున్నట్లు కొయ్య బారిపోయింది ఛాయ.

రాంబాబు తన నిర్ణయానికి తనే గర్వపడుతూ, నవ్వుతూ ఛాయని దగ్గరికి తీసుకుని అన్నాడు – ''మనం నిరాడంబరంగా వివాహం చేసుకుందాం. లీగల్ ఇబ్బందులు లేనివిధంగా పకడ్బందీగా ప్లాన్ చేసాను''

ఛాయకెందుకో ఒక్కసారిగా దుఃఖం కట్టలు తెంచుకువచ్చింది.

అతని గుండెలపై తలవాల్చి ఏడ్చింది.

అతను ఆమె తలను నిమిరేడు. గెడ్డం పట్టుకు ముఖాన్ని ఎత్తేడు. కన్నీళ్ళు తుడిచేడు. నుదురు ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె కన్నీళ్ళని – తన త్యాగాన్ని తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరై విడిచిన ఆనంద భాష్పాలుగా భావించేడు రాంబాబు!

''ఏమిటి రామ్ ఇది! ఒక్కసారిగా నీకెందుకు పుట్టింది విపరీతబుద్ధి! '' అంది ఛాయ – తేరుకుని.

''విపరీతంకాదు. అది నా ధర్మం! అసలీ బుద్ధి ఎప్పుడో పుట్టాలి! నీ మెడలో తాళి ఏనాడో కట్టాలి!''

''నీవిలాంటి ప్రపోజలుతో వస్తావని నేను ఎన్నడూ అనుకోలేదు రామ్! ..'' అంది. ఆమెకి బుర్ర తిరిగిపోతోంది.

''నాకో రెండ్రోజులు టైమివ్వు రామ్. ప్లీజ్! '' అని అక్కణ్నించి వెళ్ళిపోయింది ఛాయ.

తెల్లబోయేడు రాంబాబు!

పెళ్ళి గురించి ఇన్నాళ్ళు ఆలోచిస్తేగాని ఒక నిర్ణయానికి రాలేని తను – రెండురోజులు ఆమె ఆలోచించడానికి టైము తీసుకుంటాననంటే అత్యంత ఆశ్చర్యపోయేడు రాంబాబు.

పెళ్ళిమాట ఆమె చెవిలో వేయగానే ఆమె నుంచి రియాక్షన్ ఆ విధంగా తను ఊహించలేదు. ఎగిరిగంతేస్తుందనుకున్నాడు. కృతజ్ఞతా, పారవశ్యాలతో, ఆమెకళ్ళు తడితో మెరుస్తాయనుకున్నాడు. తన అసమాన త్యాగాన్ని, అపూర్వ ధైర్యాన్ని, నిండు ప్రేమనీ అభినందిస్తుందనుకున్నాడు.

అలాంటిది ఛాయ రెండురోజులుల తర్వాత ఆమె నిర్ణయం రాంబాబుకి తెలియజేసింది–

''రామ్ ! ఏ పెళ్ళీ వద్దు ! దయచేసి ఆమాట తలపెట్టకు !''

అప్రతిభుడయ్యేడు రాంబాబు.

పెళ్ళికోసం ఆవురావుమని ఒకప్పుడు పరితపించిపోయిన ఛాయ – పెళ్ళిని ఇపుడు ఆహ్వానించక నిరాకరిస్తోంది !

''ఎందుకంటున్నావలా ?''

''నా భయాలు నాకున్నాయి ''

విస్తుపోయేడు.

''ఇందులో భయాలు ఏమిటీ. శుభమా అని పెళ్ళి చేస్కోడానికి !''

''లేదు రామ్ ! నేను ఎంత ఆలోచించినా తాళివల్ల ఒనగూడే ప్రయోజనాలు నాకేమీ కనబడలేదు. పెళ్ళంటే కోరి కష్టాలు తెచ్చుకోవడమే అనిపిస్తోంది నాకు ''

''విచిత్రంగా మాటాడుతున్నావు ఛాయా! దేశంలో స్త్రీలంతా నీలాగే ఆలోచిస్తే వివాహ వ్యవస్థ ఏంకావాలి ?''

''నేను నాగురించే మాటాడుతున్నాను ! భారత స్త్రీల ప్రతినిధిగా కాదు '' అని స్పష్టం చేసింది ఛాయ – '' నాకు స్వేచ్ఛ కావాలి రామ్. స్వేచ్ఛ! పెళ్లికాదు''

''అంటే పెళ్ళి నీ స్వేచ్ఛని హరిస్తుందనా భయం !''

అవునన్నట్టు తలవూయించింది ఛాయ.

రాంబాబు విస్మయంగా చూసేడు. పెళ్ళి స్త్రీ స్వేచ్ఛని ఎలా హరిస్తుందో అతనికి అర్థంకాలేదు. అదే ఆమెతో అన్నాడు.

''చూడు రామ్ ! ఇంతవరకూ నా బతుకునాది. ఎలాకావాలంటే అలా నా జీవితాన్ని దిద్దుకునేది నేను. ఆర్థికంగా సర్వ స్వతంత్రురాలిని! నేను అనేదానికి, చేసేదానికి అడిగేవాళ్ళుగాని, అడ్డుతగిలే వాళ్ళుగానిలేరు. పెళ్ళితో ఇవన్నీ నేను ఖచ్చితంగా కోల్పోతానని భయం ....నీకు తెల్సు కదా నా నెత్తిమీదున్న బాధ్యతలూ, పరిస్థితులూ ''

రాంబాబు ఒక క్షణం ఆగి ఒక్కమారుగా నవ్వేసాడు.

''నీవన్నీ అర్థంలేని భయాలు. నీ స్వేచ్ఛకి నేనెందుకు అడ్డొస్తాను''

''లేదు రామ్! ఆ కబుర్లు అప్పుడు వుండవు. మంగళసూత్రానికి ఆ మహత్తు వుంది. మంత్రించినట్టుగా మనిద్దరం మారిపోతాం! నీకు తెలీకుండానే నీవు నాపై అధికారం అజమాయిషీ చెలాయిస్తావు. నేను సబ్‌కాన్సెస్‌గా తప్పక లొంగిపోతాను. కాన్సస్‌గా కూడా లొంగిపోక తప్పదు. నా వ్యక్తిత్వం పూర్తిగా కోల్పోతాను. అది నేను భరించలేను రామ్! నాపై పెత్తనం, అధికారం ఎవరూ చెలాయించడానికి వీల్లేదు! ఆ పరిస్థితులకి అవకాశం ఎలా ఇవ్వను? నన్ను అర్థంచేసుకో – ప్లీజ్!''

''నీవు చాలా చిత్రంగా మాట్లాడుతున్నావుస్మీ! నీపై నేనెందుకు పెత్తనం చేస్తాను. నిన్ను పెళ్ళిచేసుకోవాలనే నా నిర్ణయం నీపై పెత్తనానికి కాదు. అధికారం చెలాయించడానికి కాదు. నీకు సంఘంలో గౌరవ స్థానం కల్పించాలనీ, సాంఘికంగా నీకు రక్షణ ఇవ్వాలనీ నేను ముందుకి వస్తే నీవింకేదో మాట్లాడుతున్నావు!'' అని ముఖం మాడ్చుకున్నాడు.

రాంబాబు కళ్ళల్లోకి నిశితంగా చూసింది ఛాయ. ఆమెకి ఒక్కసారిగా ఆవేశం వచ్చింది – ''మరి ముందే ఆ సంగతి చెప్పవేం? థాంక్స్ రామ్! నీవాశ్రమ తీసుకోకు. నీకు తెల్సోలేదో – నేనెప్పుడో సంఘ నీతికి వెరవడం మానేశాను. ఆనీతిని ధిక్కరించి బతగ్గల ఆత్మస్థయిర్యం పుష్కలంగా నాకువుందనే అనుకుంటున్నాను'' అని ఒక క్షణం ఆగి రాంబాబు చేతులు పట్టుకుని – ''సంఘమంటే గౌరవంలేనిదాన్ని – సంఘంకోసం నన్ను పెళ్ళాడుతానంటే నవ్వొస్తోంది రామ్ నవ్వొస్తోంది'' అంది.

అతను ఆమె పెదాలపై నవ్వుకాదు, ఆమెకళ్ళల్లో నీళ్ళు చూసేడు.

ఆ కన్నీళ్ళు అతనికి చికాకు కలిగించేయి.

ఛాయ ఏమిటిలా మాటాడుతోంది! పెళ్ళి ఆమెకి ఇన్నాళ్ళుగా కాకపోవడంతో మొత్తం సమాజం మీద, వివాహవ్యవస్థమీద కసిపెంచుకుని వితండవాదం చేస్తున్నట్టుగా రాంబాబుకి కన్పించింది.

ఛాయ పెళ్ళికి ఒప్పుకోకపోవడం అతనికి బాధ కల్గించింది. ఆమె కాదంటుందని కలలో కూడా అనుకోలేకపోయేడు.

మరోసారి ఆమెకి నచ్చచెప్పే ప్రయత్నం చేసాడు.

''ఛాయా! సరిగా నీకు చెప్పలేకపోతున్నాను. నీవునాకు కావాలి. నీవు నాదానివి. సంఘం నీపై బురద జల్లుతుంటే – నీవు లక్ష్య పెట్టకపోవచ్చుగాక – కాని నేను మాత్రం భరించలేకపోతున్నాను. నీపై ఈగవాలినా సహించలేను. సామాజిక నీతిని సాంప్రదాయాన్ని అగౌరవిస్తే అశాంతే మిగులుతుంది ఛాయా! ప్రేమకి పరిపూర్ణత ఒక పెళ్ళిలోనే సిద్ధిస్తుందని నా నమ్మకం''

''నాకా నమ్మకంలేదు'' తెలియజేసింది ఛాయ – ''నా దృష్టిలో ప్రేమకీ, పెళ్ళికీ ఏమాత్రం సంబంధంలేదు. పెళ్ళి సామాజిక కట్టుబాటుకి సంబంధించినదైతే ప్రేమ మనసుకి సంబంధించినది. నాకూ మనసువుంది. అంచేత ప్రేమవుంది. ప్రేమపై నమ్మకం వుంది. నీవు

నిజంగా ప్రేమ కోరుకున్నవాడివైతే పెళ్ళికోసం పట్టుపట్టకూడదు. వివాహచట్రంలో ప్రేమ గిలగిలా కొట్టుకు చస్తుందిరామ్ ! అందుకే నేను అనేది ఏవిటంటే ప్రేమబంధాన్ని ఇంకేబంధానికి లింకు చేయకూడదు. ప్రేమను ప్రేమలా వుంచుతేనే ప్రేమకి బతుకు''

అవును – అందుకే అతనిపై ఎటువంటి వత్తిడులూ లేవు. ఏ సమస్యలోనూ ఇరికించదు. ఏ బాధల్లోనో బంధించదు. ఏ రకమైన బరువు బాధ్యతల కావిడినీ అతను ఎత్తుకుమోసే అవకాశం ఇవ్వదు. అతనిపై ఆర్థికపరమైన ఉచ్చులు లేవు. అలగడాలు లేవు. ఆదేశాలు లేవు అతన్ని ఏ చిన్న సాయమూ అడగదు. ఎలాంటి ఇబ్బందీ పెట్టదు. అతను ఆమె సన్నిధిలో ఉన్న సమయానికి అయ్యే ఖర్చు తనే భరిస్తుందితప్ప రాంబాబుకి అవకాశం ఇవ్వదు. ఎప్పుడూ ఏ బిల్లుకీ అతని జేబులో డబ్బులు తీయనీయదు. అతణ్ణించి ఆమె ఆశించేది కేవలం ప్రేమ. ఇంకా క్లియర్‌గా చెప్పాలంటే శారీరక సుఖం! అంతే! ఆమె కోరుకున్నదంతే!

అంతుకుమించి ఏమీ అక్కర్లేదు.

ఏ పెళ్ళీ అక్కర్లేదు... రోజులిలాసాగితే అదే చాలు!

రాంబాబు ఆమెను పెళ్ళికి ఒప్పించే ప్రయత్నంలో ఇలా అన్నాడు – ''నీదంటూ ఒక సంసారం ఏర్పర్చుకోవాలని లేదా ? పిల్లా పాపా కావాలని లేదా ? అందుకైనా అవసరమే కదా పెళ్ళి.''

''నాకిపుడున్న సంసారం చాలు రామ్ ! పిల్లలంటావా ? ...నేను మాతృత్వం చంపుకోగలను. అయినా నాకు పిల్లలు లేకపోవడం ఏవిటీ ?... నాకు ఆరుగురుపిల్లలు రామ్ ! నా తండ్రీ, తల్లీ, తమ్ముళ్ళు, చెల్లెళ్ళు – వీళ్ళంతా నా పిల్లలే ! నా సంసారం అదే ! ఇకదేనికి పెళ్ళి ?'' – ఛాయ.

రాంబాబుకి చిరాకువేసింది. అది సంసారం ఎలా అవుతుంది ? వాళ్ళు కన్న పిల్లలసాటి ఎలా అవుతారు ?

పెళ్ళికి ఆమెను ఎలా ఒప్పించాలో అర్థం కావడంలేదు. అసలామె ఒప్పుకోదేమో అనే ప్రశ్నే తనకి ఉదయించలేదు. ఇపుడేం చేయడం!

''ఛాయా ! ప్లీజ్ నన్ను పెళ్ళి చేసుకో. నాకు పుత్రబిక్ష పెట్టు. నాకో వంశోద్ధారకుడు, ముత్యంలాంటి మగ బిడ్డని కని ఇవ్వు! తరతరాలుగా వస్తున్న మా ఇంటిపేరు అంతమైపోకుండా అందాల బాబుని కని ఇవ్వు !'' అని అడగడానికి అతని అభిమానం అడ్డొచ్చింది.

అభిమానం చంపుకుని అడిగినా ఆమె ఒప్పుకునే స్థితిలో లేదని అతను గ్రహించేడు.

అయితే ఏదో ఒకరోజున ఛాయ పెళ్ళికి తప్పక ఒప్పుకునే రోజు వస్తుందనీ, తనకి పండంటి బిడ్డని కని ఇస్తుందని అతనికి ఇంకా ఆశ, నమ్మకం వున్నాయి.

''ఈ క్షణం వరకూ మనం ప్రేమజీవులం. స్వేచ్ఛా జీవులం ! – ఇక మీదట అలానే వుందాం. ఏ లంపటం వద్దు. అది ఎంత పవిత్రమైనదైన, బంగారమైనామనకొద్దు. ఎప్పటిలానే – ఇలానే వుందాం'' అంది. అంటూ అతని గుండెలకి బలంగా హత్తుకుపోయింది.



''ఏవిఁటి ఆలోచిస్తున్నావ్'' అంది కుదుపుతూ ఛాయ

రాంబాబు గతం నుంచి తేరుకుని ''అబ్బే ఏంలేదు'' అన్నాడు.

''లేదు - ఏదో వుంది'' అంది ఛాయ.

''అవును. వుంది. అది నాకు కావల్సింది. నీకు అక్కర్లేనిది''

''ఏవిఁటి?''

''పెళ్ళి''

''పెళ్ళా ! దాని గురించి ఆలోచించవద్దని చెప్పేను కదా ''

''చెప్పేవు.రైటే ! కాని దాని గురించి ఆలోచించకుండా వుండలేను! నీవు కూడా ! ఆ రోజు అద్దె ఇల్లుకోసం మొగుడూ పెళ్ళాల నాటకం ఆడడానికి ఒప్పుకున్న దానివి - రేపు నిజంగానే మొగుడూ పెళ్ళాలు కావడానికి పెళ్ళికీ తప్పక ఒప్పుకుంటావని నాకెందుకో ఆశ!''

''అది అడియాశ!''

''కాదు. నా ఆశ నెరవేరుతుంది. పెళ్ళికి నీవు ఒప్పుకుంటావు. ఆరోజు తప్పక వస్తుంది.''

''అది భ్రమ !''

''కాదు''

''అవును''

చూద్దాం అంటే చూద్దాం అనుకున్నారిద్దరూ.

## 20

ఆదివారం ఉదయం.

అప్పుడే టిఫిన్ చేసి, హాల్లో కూర్చొని పేపరు చూస్తున్న చెలం. ఎవరో వస్తున్న అలికిడై తలెత్తాడు.

రవి !

''అదేమిటి రవీ ! ఒక్కడివే వస్తున్నావ్ ? సుజాత, పిల్లలూ ఏరీ ?''

''అది చెబుదామనే వచ్చేను – లంచ్ కాన్సిల్ చేయండి''

''అదేం ?''

''సుజాతా, పిల్లలూ కోణార్క్ కి వెళ్ళిపోయేరు ''

''నిజవాఁ జోక్ చేస్తున్నావా ?'' అంటూ వచ్చింది విజయ.

''జోక్ కాదు. నిజమే ''

'' ఏమిటి జరిగింది ?''

ఆ స్నేహితుల మధ్య అరమరకలు లేవు. దాపరికాలులేవు. సెక్స్ విషయాలు కూడా నిస్సంకోచంగా ముగ్గురూ గంటల తరబడి చర్చించిన రోజులున్నాయి.

ఏం జరిగినదీ మొత్తమంతా రవి పూసగుచ్చినట్లు వివరించి చెప్పాడు

రవి చెప్పిందంతా చెలం, విజయలు సావధానంగా, కుతూహలంగా వినగలిగేరు గాని – పసివాడు సురేష్ పేల్చిన బాంబు విషయం ప్రస్తావించినపుడు ఆ బాంబేదో వాళ్ళ పక్కనే పడ్డట్టుగా త్రుళ్ళిపడ్డారు.

దురదృష్టకరమైన సంఘటన – జరగకూడనిది జరిగినందుకు బాధపడ్డాడు చెలం

వాళ్ళ పెళ్ళిరోజు ఎంతో సరదాగా గడవ్వల్సింది – అలా విషాదంగా ముగిసినందుకు బరువుగా నిట్టూర్చింది విజయ.

విజయ లేచి వెళ్ళి టీలు తీసుకుని వచ్చింది

ముగ్గురూ నెమ్మది, నెమ్మదిగా టీని సిప్ చేయడం తప్ప – ఎవరినోటి నుంచీ ఏ మాటాలేదు.

టీలు తాగేక కూడా నిశ్శబ్దం !

'మమ్మీ ' అంటూ సందీప్ ఎక్కడినుంచో పరుగున వచ్చి తల్లిని చుట్టేసాడు.

సందీప్‌ని చూడగానే అందరికీ సురేష్ గుర్తుకొచ్చేడు. పిల్లలిద్దరిదీ ఇంచుమించు ఒకే వయసు.

'వీళ్ళు పసి పిల్లలు కాదు – పిడుగులు '– అనుకుంది విజయ.

పిల్ల పిడుగు ఆ వాతావరణంలో వుండడం విజయకెందుకో ఇష్టం కాలేదు. బాబుని నెమ్మదిగా బుజ్జగించి పార్వతమ్మ దగ్గరికి పంపించేసింది.

రవి ఇక వస్తానని లేవబోయేడు.

''వెళ్దువుగానిలే – కాసేపు కూర్చో '' అన్నాడు చెలం.

లేవబోతున్న రవి కూర్చున్నాడు.

చెలం రవికొక సిగరెట్ ఇచ్చి తనొకటి వెలిగించేడు.

''రవీ! నేనొకటి అడుగుతాను – ఏమీ అనుకోవు కదా '' అంది విజయ.

రవి చిన్నగా నవ్వేసి – ''అడుగు విజయా ' అన్నాడు.

''నీవు నిజంగా సుజాతను అనుమానిస్తున్నావా ?''

''కథంతావిని అదేం ప్రశ్న ! '' అన్నాడు రవి.

''అవును. అది కథేకాని నిజంకాదు. సుజాతపై నీకు నమ్మకమున్ననాడు పసివాడుకాదుకదా, ఆ బ్రహ్మదేవుడొచ్చి చెప్పినా నమ్మవు''

''ఇంతకీ నీవనేదేమిటి ?''

''నీవు సురేష్ అన్నది నమ్మేవు అంటే – అప్పటికే సుజాతపై నీకు అనుమానం వుండి వుండాలి. ఆ అనుమానాన్ని కన్‌ఫర్మ్ చేసింది నిన్నటి ఇన్సిడెంటు. అంతే, సుజాతని దారుణంగా అమానుషంగా అవమానించేవు.''

విజయ ధోరణకి విస్తుపోయేడు రవి.

''చాలా అన్యాయంగా మాటాడుతున్నావు విజయా '' అన్నాడు రవి

చెలం కూడా అదేమాట అన్నాడు

ఇద్దరూ అలా అనడంతో విజయకి ఈ మగవాళ్ళంతా ఒకటే అనిపించింది కాస్త కోపం కూడా వచ్చింది

''నీవే కాదు రవీ! ఆడదాన్ని అనుమానించడమనేది ప్రతి మధ్య తరగతి మగాడినీ పీడిస్తున్న మాయదారి రోగం అని నా అనుమానం ''

''ఏ బేస్ మీద అనగల్గుతున్నావు ఆ మాట ?'' అన్నాడు చెలం

''ఆడది ఒకప్పుడు కేవలం భోగవస్తువు సుందర, సుకుమార విగ్రహం శృంగారయంత్రం, తైతక్కలాడే బొమ్మ కవిగాళ్ళ అంగాంగ వర్ణనికి ఆలంబన ! ఆడదాని స్థానం నూతిలో కప్పలా నాలుగ్గోడలమధ్య ఆ గోడలున్న గది అయితే వంటగది లేకుంటే పడక గది''

''ఆడదాని స్థానం ఇప్పుడూ అంతే !'' అన్నాడు హేళనగా చెలం నవ్వుతూ

విజయకి కోపం వచ్చింది

''ఇప్పుడూ అంతేనా ?''

''అంతే ! మహా అయితే ఉద్యోగాలు చేస్తోంది''

''ఉద్యోగాలు చేయడమేకాదు రాజ్యాలు ఏలుతోంది చదువులు చదువుతోంది ఇంజనీరింగ్, మెడిసన్, రోదసీ – ఒక్కటేమిటి ? మగాడితో సమానంగా అన్ని రంగాల్లో దూసుకుపోతోంది అవి గమనించడానికి ఇష్టపడక అంతే, అంతే అని వెటకారం !''

విజయ కోపం చెలంకి నవ్వు రప్పించింది నవ్వేడు చిలిపిగా

''మగావాడి సంస్కారం ఎదగకపోవడమంటే అదే! అతని పాత భావాల ప్రకారం తన ఆడది అప్పటి సీతలానో, అనసూయలానో వుండాలనుకుంటాడు వుండటంలేదేమో అని ఆందోళన చెందుతాడు అనుమానంతో చస్తాడు

గత సంస్కృతిని వదుల్కోలేని మగాడికి ఈ తరంస్త్రీ ఏం చేసినా చిన్న చూపే వేళాకోళమే వెకిలితనమే తేలిక తనమే ఆమె అడుగు ఎటువేసినా అనుమానమే మగాడితో పోటీపడి సమానంగా ఎదుగుతున్న స్త్రీని గుర్తించడానికి ఇష్టపడని మగవాడు ఇదిగో – మీలానే నవ్వుతాడు '' అంది కసిగా విజయ

చెలం పకపకమన్నాడు

చెలం ఎంత తేలిగ్గా తీసుకున్నాడో – విజయ అంత సీరియస్‌గా తీసుకుంది

''మగాడంటే నీకింత కసి వుందనుకోలేదుస్మీ '' అని చెలం ఇంకా నవ్వుతూనే వున్నాడు

రవి మాత్రం నవ్వలేదు

ఇలా అన్నాడు – మగాడివన్నీ అర్థంలేని అనుమానాలైతే – మనం తరచూ పేపర్లో చదువుతున్న అక్రమ సంబంధాల వార్తల మాటేమిటీ ? రంకుతనాలు ఎన్నో చెవులారా

వింటున్నాం, కళ్ళారా చూస్తున్నాం. కాదంటే ఎట్లా ?''

''కాదన్ను. మగాళ్ళకొచ్చే అనుమానాలన్నీ నిజాలే అయిన పక్షంలో ప్రపంచంలో దాదాపు ఏ స్త్రీకీ శీలంలేనట్టే లెక్క! ఏ ఒక్క అనుమానమో నిజం కావొచ్చు. కానీ అనుమానపు కేసులన్నీ నిజాలు మాత్రం కావు''

''మగాళ్ళంతా ఒకటన్నావు గాని -నీవు పూర్తిగా స్త్రీ పక్షపాతంతో మాట్లాడుతున్నావు.''

''లేదు రవీ! నిజమే మాటాడుతున్నాను. నీ అనుమానమే గాని సుజాత అలాంటిది కాదు. నమ్ము. నిన్న జరిగింది ఒక పీడకలగా మర్చిపోయి – సుజాతని తీసుకురా ''

''అది అయ్యేపనికాదు. ఆమెను క్షమించి – ఒక అవకాశం ఇచ్చేను స్టేషల్లో! అంతే – మరో ఛాన్సు ఇచ్చే ప్రశ్న లేదు.''

''అలాగంటే ఎలా ? పట్టు విడుపులుండాలి''

''తప్పుచేసిన ఆడదే అంత బెట్టు చేస్తున్నప్పుడు – మగాడు ఇంకెంత ఇదిగా వుండాలి ?..పోతే ఆమె దగ్గరికి వెళ్ళాల్సి వచ్చేది – ఒకే ఒక్క విషయమై''

'' ఏవిఁటది?''

''విడాకుల కోసం!''

చెలం విజయలు ఆ మాటవిని నిటారు అయ్యేరు. బాధపడ్డారు.

''తొందరపడకు రవీ! టేకిట్ ఈజీ'' అన్నాడు భుజంపై చేయేస్తూ చెలం.

రవి కళ్ళంట నీళ్ళు!

రవిది తొందరపడే స్వభావం కాదు. ఏదైనా 'ఈజీ' గా తీసుకునే మనిషే. విడాకులు అనే మాట ఇపుడు అప్రయత్నంగా అన్నదే గాని – ఆలోచించి తీసుకున్న నిర్ణయంగాదు.

పరిస్థితులు విడాకులు దాక వెళ్ళకుండా – జరిగిందంతా నిజంగా ఒక పీడకలే అయితే ఎంత బాగుణ్ను!

రవి కళ్ళు తుడుచుకున్నాడు రుమాలుతో.

''పసి పిల్లాడు సురేష్ ఏదో అన్నమాటకి విడాకులదాక వెళ్తాననడం బాగాలేదు రవీ'' అంది విజయ.

''పసిపిల్లాడని తీసి పారేస్తావేం ? పసిపిల్లలు దేవుని ప్రతిరూపాలు. అబద్ధాలాడరు.''

''అబద్ధాలాడరని నేను నమ్ముతాను. కాని పసివాడు దేనిని ఉద్దేశించి ఎందుకన్నదీ మనకేం తెలుస్తుంది ? పసివాడు అన్నదాన్ని మనం పసివాడి దృష్టితో చూళ్ళేం కదా ! సురేష్ ఏదో అన్నదాన్ని నీ దృష్టితో చూసి నీ అనుమానాన్ని బలపర్చుకుంటున్నావేమో ఎవరికి తెల్సు?''

రవికి చిరాకు వేసింది.

''విజయా! నీ ధోరణి నీదేగాని - ఇందులో చిన్నా, పెద్దా అంటూ దృష్టిభేదాలు ఏవిటీ? సురేష్ అన్నది నాకే కాదు అందర్కీ స్పష్టంగా అర్థమవుతుంది 'అంకుల్ అచ్చం ఇలాగే ముద్దు

పెట్టుకున్నాడు' అని వాడు కుండబద్దల కొట్టినట్టు స్పష్టంగా అన్నదాంట్లో ఎవరైనా వేరే అర్థాలు ఏం తీయగలరు ?''

'' అసలు పిల్లల ముందు శృంగారం, సెక్సు ఏమిటిరా ? నాన్సెన్సు ! అది పిల్లల భవిష్యత్తునే పాడుచేస్తుందనే కామన్ సెన్సుకూడా లేదా నీకు ?'' అన్నాడు చెలం.

''కామన్ సెన్సు మీద భవంతుల్లో వున్నవాళ్ళు ఎన్ని కబుర్లయినా ఆడుతార్రా బాబూ ! ప్రపంచాన్ని చూడు ! పట్నాల్లో 70 శాతం సింగల్ గది కాపురాలే ! పిల్లకి ఒక గది. భార్యాభర్తలకి ఒకగది. చాలామందికి అందుబాటులో లేనిది. తప్పదు మరి ''

చెలం తల బకురుకుని 'నీవన్నది రైటే' అని ఒప్పేసుకున్నాడు. అసలు ప్రపంచమే అలాగుందిలే అన్నాడు. ఈ కాలమే అలాగవున్ననాడు ఈ కాలపు పిల్లలు అలాగ వుండక ఏం చేస్తారు అన్నాడు.

''కుటుంబమంతా కలిసి వెళ్ళి చూడగలిగే సినిమా వుందా ఈ రోజుల్లో

కుటుంబమంతా కలిసి కూర్చొని చదవగలిగే పత్రిక వుందా ఈ రోజుల్లో !

రోడ్డుకి వెళితే గోడలపై అశ్లీల పోస్టర్లు ! రేడియోల్లో బూతు, బూతు పాటలు!

ఎంత జాగర్త పడినా వీటి ప్రభావం నుంచి ఎదుగుతున్న పిల్లల్ని దూరంగా వుంచడం కష్టమే ?

మొన్న ఏమి జరిగిందో తెల్సా ?

నేను ఇక్కడే కూర్చుని పేపరు తిరగేస్తున్నాను. సందీప్ ఇంగ్లీషు మాగజేన్‌లో బొమ్మలు తిరగేస్తున్నాడు. వాడిని చూద్దును కదా ! సెంటర్ పేజీలో వున్న న్యూడ్ ఫిగర్‌ని చూస్తున్నాడు. నన్ను చూసి వాడు పేజీలు గబగబా తిప్పేసాడు. అంటే బూతు బొమ్మని చూడ్డం తప్పని వాడికి అర్థమవుతున్నట్టే కదా ! నేను ఎందుకో లేచి వెళ్ళి అయిదు నిమిషాలు పోయేక వస్తే ఆశ్చర్యం ! సందీప్ మళ్ళీ ఆ పత్రిక తీసి న్యూడ్ ఫిగర్ చూస్తున్నాడు. వెధవకి రెండంటించాను. వేలెడంతలేడు. వయసు చూస్తే నాలుగేళ్ళు నిండలేదు. వాడికీ నగ్న సుందరి కావల్సి వచ్చింది. '' అన్నాడు నవ్వుతూ చెలం.

విజయ నవ్వలేకపోయింది. చెలం అన్నదానితో ఏకీభవించలేకపోయింది.

''చాల్లే! వూర్కోండి'' అని ఖండించింది. ''వాడు బొమ్మల్లో కెల్లా పెద్దబొమ్మ రంగులతో ఏదో గమ్మత్తుగా కనిపిస్తే చూస్తూ వుండొచ్చుగాక! వెధవ వాడికి సెక్సు ఏం తెలుస్తుంది ? నగ్న సుందరిలు కావల్సింది. వాడిక్కాదు నీకు ! మీ దృష్టిని ఆ పసివాడికి అంటగడుతున్నారు.''

''అలాగనేయకు. మొన్న చినవాల్తేరులో ఒక ఫ్రెండు ఇంటికి వెళ్ళేను. ఇంట్లో పెద్దవాళ్ళు ఎవరూ లేరు. గదిలో ఆడా, మగ ఇద్దరు పిల్లలు ! ఆ పిల్లలిద్దరి వయసూ ఏ ఒక్కరికీ ఆరేళ్ళు దాటి వుండదు. మంచంపై ఒకరొపై ఒకరు ! నన్ను చూసి మంచంమీంచి గభాల్న లేచేరు. ఇంకా ఆశ్చర్యం ఏమిటంటే ఆ పసివాడి అంగం స్తంభించి వుంది! నేను తెల్లబోయేను. ఆ వయసు పిల్లలకి కోరికా, టెన్షను వుండడం సాధ్యమా''

''నాకేం తెల్సు ! సమరంగారి నడగండి ఈ ప్రశ్న'' అంది విజయ నవ్వుతూ ''పిల్లల ఎదుట తలిదండ్రులు సెక్సులో పాల్గొనడం తాలూకు దుష్పరిణామమే అది ! పిల్లలు అలా తయారు కాకుండా చూసుకోవల్సిన బాధ్యత తల్లిదండ్రులకుంది ...సురేష్ విషయం తీసుకుందాం. సురేష్ ముద్దు విషయంలో అంత ఉత్సాహం చూపించాడంటే బహుశా ముద్దుల వర్షాలు రవి వాడి ఎదుటే సుజాతపై కురిపించేస్తూ వుండాలి. ''

''గుర్తులేదు..అయితే అయుండొచ్చు '' అన్నాడు రవి.

''ఏమైతేనేం – సురేష్‌ని ఆ ముద్దు ఆకర్షించింది. వాడు దాన్నొక ఆటగా, గమ్మత్తయిన ఆటగా తీసుకుని వుంటాడు. అందుకే నిన్న సినిమాలో సురేష్‌ని చెలం ముద్దుపెట్టుకోబోతుంటే సురేష్ ఏమన్నాడు ? బుగ్గమీదకాదు – పెదాలపై ..'' విజయకి తళుక్కుమని ఏదో మెరిసినట్టయి ఆగిపోయింది.

రవివైపు తిరిగింది.

''రవీ సురేష్ అన్న డైలాగ్ ఏవిఁటీ ?'' అనడిగింది.

''అంకుల్ ఇలాగే అచ్చం ఇలాగే ముద్దెట్టుకున్నాడు '' అని చెప్పేడు రవి

మళ్ళీ చెప్పమంది విజయ.

చెప్పేడు మళ్ళీ!

విజయకి క్లూ ఏదో దొరికినట్టు ఉత్సాహంగా చప్పట్లు చరిచింది.

సీక్రెట్ ఏదో కనిపెట్టేసినట్టు సంబరపడిపోయింది.

''రవీ ! నేను చెప్పేనా , పసివాడు అన్నదాన్ని నీవు వేరే విధంగా అర్థం చేసుకుని – అనుమాన పడ్డావని''.

విజయలో ఒక్కసారిగా వచ్చిన ఉత్సాహం, మార్పు రవికి అర్థంకాలేదు. చెలంకి కూడా!

''ఇంతకీ ఏమిటంటావ్ ?''

''సురేష్ ఏమీ అనలేదండీ బాబూ ! సుజాతపై అన్యాయంగా అభాండం వేసేవు. అనుమానించేవు. అవమానించేవు. సురేష్ అన్నది ఏవిఁటో తెల్సా ! నీవు సుజాతని ముద్దు పెట్టుకున్నట్టే – వాడిని అంకుల్ కూడా అలాగే ముద్దు పెట్టుకున్నాడని. అర్థమయిందా ''

రవికి సరిగా అర్థం కాలేదు.

చెలంకి అర్థమయీ అర్థమవనట్టుగా వుంది.

''చెలం ! నీకు గుర్తుందా ! నిన్న సినిమాహాలు దగ్గర –సురేష్‌ని మీరు బుగ్గపై ముద్దు పెట్టబోతుంటే – వాడు అక్కడగాదు – 'ఇక్కడ' అని పెదాలు చూపించేడు. గుర్తుందా ! అప్పుడు మనమంతా నవ్వేం. మీరు ముద్దు పెట్టగానే వాడెంతో సంబరపడిపోయేడు. చప్పట్లు కొట్టేడు. వాళ్ళ డాడీ మమ్మీకి ముద్దు పెట్టినట్టుగా – మీతో పెట్టించుకున్నందుకు ఆ పసివాడి సంబరం ! చప్పట్లు! మరేంలేదు వాడకది మంచి గేమ్‌లా తోచివుంటుంది'' అంది విజయ.

''యస్. విజయా యసెస్ ! నీవన్నది డామ్ కరెక్టు!'' – అని చెలం విజయని మెచ్చుకుని

రవి వైపు తిరిగేడు – ''ఒరే రవీ! విజయ అన్నది అక్షరాలా కరెక్టు. ందుకు తిరుగు లేదు అంకుల్ అచ్చం ఇలాగే ముద్దు పెట్టేడు అన్న పసివాడి ఉద్దేశం అదే అదే! అంతేగాని సుజాతనెవరో ముద్దు పెట్టారని కాదు సుజాతపై నీది అపోహేగాని నిజంకాదు. అవునా ? –'' చెలం రవి భుజంపై చేయివేసి నొక్కేడు

అవునన్నట్టు రవి తల ఊపి చెలం చేయిపై తన చేయివేసేడు.

రవి కళ్ళల్లో నీళ్ళు ఊరేయి.

దట్టంగా అలముకున్న అనుమానపు మేఘాలు విడిపోతున్నట్టు అతని గుండె తేలికయింది.

రవి పెదాలపై వెలసిన చిరునవ్వు చూసి ఆ దంపతులిద్దరూ సంతోషించేరు

''విడాకులదాకా వెళ్తానన్న నీ అనుమానపు మబ్బుల్ని ఉఫ్‌మని ఊదేసి – నీ మనసు తేట తెల్లం చేశాను కదా – మరి నీవు నాకు ఏవిటిస్తావు ?'' అంది విజయా.

''ఏం కావాలో అడుగు '' అన్నాడు రవి. ఏదైనా ఇవ్వడానికి అతను సిద్ధం.

విజయ నవ్వేసి – ''ఏం వద్దు. మీ ఇద్దరూ కలిసి భోజనానికి ఇక్కడకి రావాలి. ఈ రోజు మిస్ అయినట్టు మరోసారి కాకూడదు. తప్పక రావాలి'' అంది

'అలాగే' అన్నాడు రవి.

''అంతేకాదు. నీవు ఈ రోజే గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి వెళ్ళు. వెళ్ళిన వెంటనే నీవు ఇమీడియట్‌గా చేయాల్సిన పని సుజాతకి క్షమాపణలు చెప్పాలి. ఏ మాత్రం ఆలస్యం చేసినా నీవు మళ్ళీ తప్పు మీద తప్పు చేసిన వాడివవుతావు. వెళ్ళు.'' అంది విజయ.

## 21

రవి వెళ్ళిన అరగంటకే చెలం ఇల్లు విడచి స్కూటర్ ఎక్కేడు.

చెలం ఇప్పుడు పెద్ద ప్రాజెక్టు మీద వున్నాడు. అదేమిటంటే ఒక ప్రభుత్వ రంగ సంస్థ యొక్క హౌస్ బిల్డింగ్ సొసైటీకి ముప్ఫయి – నలభై ఎకరాల స్థలం అమ్మబోతున్నాడు. అందుకోసం రైతులనుంచి స్థలం సేకరిస్తునాడు. గత నెలరోజులుగా ఇదే పనిమీద వున్నాడు. చాలా మంది రైతులకి అడ్వాన్సు ఇచ్చి ఎగ్రిమెంట్లు చేయాలి. తర్వాత ఉడా క్లియరెన్సులూ, అర్బన్ లాండ్ సీలింగ్ క్లియరెన్సులూ – మొత్తం తతంగమంతా ఆ ఏడుకొండలవాడి దయవల్ల సవ్యంగా సాగిపోతే – ఓహ్! ఎంత లేదన్నా తన కొచ్చే లాభం పాతిక లక్షలు! అది తలచుకుంచే చాలు చెలం ఒళ్ళు జలజలమని జలదరిస్తుంది.

ఆ పనిమీద తిరిగి తిరిగి –

ఇంటికి రాబోయేటప్పటికి టైము రెండుదాటింది.

భోంచేసి కాసేపు నిద్రపోయేడు.

సాయంత్రం విజయతో ఏ సినిమాకో, బీచ్‌కో వెళ్దామనుకున్నాడు విజయ తృప్తి కోసం!

తనకైతే క్లబ్‌కి వెళ్లాలని వుంది.

నిమిషం..నిమిషం గడుస్తున్నకొలదీ – క్లబ్‌కి వెళ్ళాలనే కోరిక అతనిలో బలపడి కుదుపేయసాగింది.

తను డబ్బు సంపాదించడమే తెల్సుకున్నాడు. – సంపాదించిన డబ్బుతో ఎలాంటెలాంటి సుఖాల్ని, మజాల్ని పొందొచ్చో – కనకరాజు స్నేహంతో – అనుభవ పూర్వకంగా తెల్సుకుంటున్నాడు.

తన స్థితి పెరగ్గానే – స్నేహం రవినుంచి దూరమవుతోంది. ఎడం పెరుగుతోంది. కనకరాజుతో స్నేహం దగ్గరవుతోంది. పెరుగుతోంది.

కనకరాజుకి రెండు మూడు పెద్ద పెద్ద వ్యాపారాలున్నాయి. పట్నంలోవున్న పెద్ద పెద్ద వాళ్ల జాబితాలోకి చేరతాడు అతను. పెద్ద పెద్ద వాళ్ళుండే ఒక క్లబ్బుకి ప్రెసిడెంటు కూడా!

కనకరాజుతో స్నేహం అయేక చెలంది కొత్త జీవితం.

ఆ క్లబ్బులూ, ఆ ఆడవాళ్ళూ, ఆ కల్చరూ, ఆ సుఖాలూ, జూదాలూ చెలంకి కొత్తగా, వింతగా, హాయిగా, థ్రిల్లింగ్‌గా, ఎక్స్‌యిటింగ్‌గా, వదుల్కోలేనంత తీవ్రంగా, ఆబగా ఎప్పుడూ ఆ సర్కిల్‌లోనే మునిగిపోవాలన్నంత బలంగా తపన.

గబగబా డ్రెస్సప్పై బయల్దేరేడు చెలం!

''మీకిది న్యాయంగా వుందా '' అన్నట్టు చూసింది విజయ.

''ఆదివారాలు నావి అన్నావు. ఆ మాటమీద ఏనాడు నిలబడలేకపోయేవు. ఈరోజు వుదయం వెళ్ళి ఏ రెండు గంటలకో వచ్చేవు. తినేసి గుర్రుపెట్టి నిద్రపోయేవు. నిద్రలేచి మళ్ళీ ఇప్పుడు వెళ్ళిపోతున్నావు. తాగితందానాలు ఆడి – నీ సరదాలు తీర్చుకుని ఏ అర్థరాత్రికోవస్తావు..మరి నా సంగతి ఆలోచించవేం ? నేనూ నీలాంటి ప్రాణినే ! నాకూ సరదాలు కావాలి. నాకూ బోర్ నుంచి రిలీఫ్‌కావాలి. నీ ఇష్టమొచ్చినట్టుగా రోజూ తిరుగుతూ – నన్నీ నాలుగుగోడల మధ్య ఒక ఖైదీగా బంధించేయడం నీకు భావ్యంగావుందా , న్యాయంగా వుందా –'' అని నిలదీసి అడిగినట్టుగా వుంది – ఆమె చూసిన చూపు.

చెలం ఆమె ముఖంలోకి చూడలేక తలగోక్కున్నాడు.

''అదికాదు విజయా !'' అంటూ ఏదో చెప్పబోయేడు సాకు !

విజయకి చిర్రెక్కింది.

''నాకు హరికథలు చెప్పకండి – వెళ్ళండి. '' అంది నిర్లక్ష్యంగా. అనేసి – అక్కడ హాలులో నించోలేక, అతని ముఖం చూడబుద్ధికాక – చరచరా మెట్లెక్కి బెడ్‌రూమ్‌కి వెళిపోయింది.

వెళిపోయిన విజయ – చెలం తన వెనుక వస్తాడనుకుంది.

రాలేదు చెలం!

మెట్లెక్కి వెళ్ళి విజయని ప్రాధేయపడ్డానికి చెలం అహం అడ్డొచ్చింది.

చెలంకి కోపం వచ్చింది.

ఆడది బయటకెళితే మగాడి అనుమతి కావాలి తప్ప – మగాడు బయటకు వెళితే ఆడదాని అనుమతి అక్కర్లేదు. వెళ్తున పని ఏవిఁటో మగాడు చెప్పక్కర్లేదు. అయితే వెళ్తున్న పని చెప్పకపోయినా– పనిమీద వెళ్తున్న సంగతి చెప్పడం ధర్మం. ఆ మాత్రం మర్యాద ఆడది నిలబెట్టుకోనప్పుడు – వెళ్తున్నట్టు చెప్పాల్సిన పని కూడా లేదు – అనుకున్నాడు చెలం.

విజయను తను నెగ్లెక్టు చేస్తున్నాడా ?

లేదే !

విజయను అమితంగా ప్రేమిస్తున్నాడు. ఆరాధిస్తున్నాడు అలా అన్చెప్పి ఆడది చంకనెక్కేసి– 'ఎక్కడికీ వెళడానికి వీల్లేదు – నా దగ్గర వుండిపో' అంటే ఎట్లా ? అంతకు మించిన పరమ బోర్ ఇంకేమైనా వుందా ?

అంత స్వార్ధంగా శాసించే ఆడదాన్ని ఏ మగాడు భరిస్తాడు ? ఎంతకాలం భరిస్తాడు. ?

'హరికథలు చెప్పకండి – వెళ్ళండి' కసిరినట్టుగా అని విసురుగా వెళిపోయిన విజయను చూసి మండిపడ్డాడు చెలం.

'నీకిస్తున్న స్థానాన్ని నీవు పోగొట్టుకొంటున్నావంతే ' అనుకున్నాడు విసురుగా వెళిపోయేడు.

అలా వెళిపోతాడనుకోని చెలం వెళిపోవడంతో విజయకి దుఃఖం ముంచుకొచ్చింది. కళ్ళుంట నీళ్ళు బిలబిల జారేయి.

స్కూటర్‌పై పోతున్న చెలంని – బాల్కనీ పైనుంచి చూస్తూ అక్కడే అలా చాలా సేపు వుండిపోయింది.

విజయకి రోషం, అభిమానం పొడుచుకొచ్చేయి.

జారిన కన్నీళ్ళు తుడుచుకుంది.

గబగబా ముస్తాబై బయల్దేరింది విజయ.

అలా బయటకు వెళ్ళి వస్తానని చెప్పింది అత్త పార్వతమ్మతో

అలా వెళ్ళిరావడం అంటే – ఎక్కడికి ?

ప్రశ్నించలేదు పార్వతమ్మ.

అసలు తను ఎక్కడికి వెళ్తున్నదీ విజయకే తెలీదు. పార్వతమ్మకేం చెబుతుంది?

కొడుక్కి పోటీగా కోడలు ఇంటినుంచి బయటకి వెళ్ళడం బొత్తిగా నచ్చలేదు పార్వతమ్మకి.

ఆ పార్వతమ్మే వెళ్తానన్న విజయని 'వెళ్ళిరామ్మా ' అంది సాదరంగా.

## 22

రోడ్డుపై నడుస్తున్న విజయని – గోడకి అంటించి వున్న ఎర్రటి పోస్టరు ఆకర్షించింది.

సాయంత్రం ఆరుగంటలకి టౌన్ హాల్లో విప్లవ మహిళా సంఘం సభ!

విజయ మరేం ఆలోచించలేదు. ఆటో ఎక్కి టౌన్‌హాల్ చేరుకుంది.

టైము అయిదుంపావు అయింది.

జనం అలికిడి పెద్దగా లేదు ఆరైనా జనం చేరుతారంటే అనుమానమే.

విజయ అక్కడ పిట్టగోడకి ఆనుకుని సముద్రాన్ని చూస్తోంది తనకి ఆ పరిసరాలన్నీ కొత్తగా కనిపిస్తున్నాయి. ఫిషింగ్‌బోట్సు కలకలం ఔటరు హార్బరు డెవలెప్‌మెంటు వైజాగ్ లోవుండి తనింతవరకూ చూడలేకపోయినందుకు ఆశ్చర్యపోయింది.

ఆడది వంటింటి కుందేలు అని ఇందుకే అంటారు - అని నవ్వుకుంది. మునుపటి బీచ్ సౌందర్యం ఆమెకిపుడు కనబడలేదు. పెరిగే పట్నాల్లో ప్రకృతి సహజ సౌందర్యాలకి తావులేదు.

'హలో విజయా ! అంటూ ఆమెపై చేయిపడింది.

విజయ తలతిప్పి చూసింది.

నవ్వుతూ ఛాయ!

''మీటింగ్‌కి వచ్చేవా '' అడిగింది ఛాయ.

తల ఊపింది విజయ.

''ఇక్కడ నిన్ను కలుస్తానని ఏమాత్రం ఊహిచలేదు. - అబ్బ ! ఎన్నాళ్ళకి కనిపించేవు. నాకు చాలా ఆనందంగా వుందే '' అంది ఛాయ.

విజయకి కూడా ఆనందమే అనిపించింది. ఛాయపై అసహ్యం కలగలేదు. అసలు ఒకొ్కక్కప్పుడు ఆమెను ఎంతగా అసహ్యించుకున్నదీ ఆమెకు గుర్తురాలేదు.

చెలం ఒక ఇంప్రెషన్ ఇచ్చిన ఛాయని ఈ ఛాయలో ఆమె చూడలేకపోతోంది.

మహిళా సభకి ఇంకా టైము వుండటంచేత ఇద్దరూ అలా బీచ్ వైపు వెళ్ళి ఇసుకలో కూర్చున్నారు.

''ఎంతమాటాడినా నేనే తప్పా - నీవు నోరు మెదపడంలేదు. ఏవమ్మా నామీద కోపమా?'' అంది ఛాయ.

''అబ్బే ! అదేంలేదు. '' అంది విజయ.

''నేను నమ్మను. నాపై లేనిపోనివి మీ ఆయన చెప్పి వుంటాడు అవునా?.. నీవు నేను చెప్పిందీ వినాలి. అప్పుడు నీవు నాపై ఎలాంటి అభిప్రాయంకి వచ్చినా బాధపడను. '' అని ఛాయ తన చరిత్ర అంతా నిస్సంకోచంగా జరిగింది జరిగినట్టుగా చెప్పింది.

అంతా విన్నాక విజయ, రాంబాబుతో ఛాయ పెట్టుకున్న కాంటాక్ట్సు, కాంట్రాక్ట్సు - తప్పు పట్టలేకపోయింది. అంతేకాదు అభినందించకుండా వుండలేకపోయింది ఆమె సాహసాన్ని.

చెలం ఇచ్చిన ఇంప్రెషన్ ఎంత తప్పో విజయకిపుడు స్పష్టంగా అర్ధమయింది. ఆ వెంటనే - అవును మగవాడు అంతకన్నా విశాలంగా ఏమి ఆలోచిస్తాడులే - అనుకుంది విజయ. ఆమాటే అంది

ఇద్దరూ లేచి టౌనుహాలు వైపు నడిచేరు. సభ ప్రారంభమవడంతో

''విజ్జీ! సభలో నీవు మాటాడకూడదూ'' అంది ఛాయ.

''నాకన్నా మరెవరూ దొరకలేదా నీకు ?''

''నీకేం ? స్త్రీ సమస్యలమీద కాలేజీలో బల్లగుద్ది వాదించే దానివి కదే. 'వరకట్నం' మీద డిబేటులో ప్రైజు కొట్టిన సంగతి మర్చిపోయేవా''

'' ఆరోజులు వేరు. ఆ విజయ వేరు. నేనేం మాటాడలేను. నాకు భయంబాబు'' అంది విజయ.

సభ పెద్ద అట్టహాసంగా లేదు. సభలాకాకుండా ఒక ఇష్టాగోష్టిలా వుంది. అక్కడ వేరుగా వేదిక అంటూ లేదు. చుట్టూ వలయంలా కూర్చున్నారు.

వాతావరణం ఉద్వేగంగా, ఉత్సాహంగా వుంది.

చాలామంది అనేక స్త్రీ సమస్యలపై మాటాడేరు. హైద్రాబాదు నుంచి వచ్చిన ముగ్గురు డెలిగేట్సు స్త్రీ సమస్యలకి మూల కారణం చూపించి దీనికి పరిష్కారం విప్లవమే అన్నారు.

ఉద్యోగం, విద్యా సౌకర్యాలు మొదలగు ప్రజాతంత్ర హక్కులు సాధించుకోవాలంటే ఆర్థిక వ్యవస్థలో సమూలమైన మార్పులు రావాలన్నారు.

వరకట్నం మొదలగు దురాచారాలు ఈ వ్యవస్థ అంతమైతే గాని రూపుమాపడం కష్టమన్నారు.

నేటి వ్యవస్థమారి సోషలిస్టు వ్యవస్థవస్తేగాని స్త్రీ జాతికి విముక్తి లేదన్నారు.

అందర్నీ మాటాడమని ఎంకరేజ్ చేస్తున్నారు.

విజయకి 'బోల్డు అనుమానాలు. సోషలిస్టు వ్యవస్థ వస్తే ఎంత వరకూ స్త్రీకి న్యాయం జరుగుతుంది? దానిపై చాలా విషయాలు ఆమె స్ఫురణకి వస్తున్నాయి. ఆ విషయాలన్నీ చెప్పాలని వుంది కాని ఏదో బిడియం.

''కమాన్. విజయా! మాటాడు'' అంది ఛాయ.

అంతా తనవైపు చూసేరు.

''ఫర్వాలేదు. మాట్లాడమ్మా'' అన్నారు.

లేచి నించోక తప్పలేదు విజయకి.

విజయ గొంతు సవరించుకుని చెప్పడం మొదలెట్టింది.

ఈ వ్యవస్థ మారి దాని స్థానంలో సోషలిస్టు వ్యవస్థవస్తే గాని స్త్రీ సమస్యలకి ముగింపులేదని, విముక్తిలేదని పెద్దలు అంటున్నారు. సోషలిజమ్ ఈజ్ ది ఓన్లీ ఆన్సర్ ఫర్ ఉమెన్స్ లిబరేషన్ అంటున్నారు.

నేను దానికి ఒప్పుకుంటున్నాను.

దానివల్ల స్త్రీ సమస్యలకి తెరపడవచ్చుగాని పురుషుడు స్త్రీని చూసే దృష్టినుంచి మార్పు వస్తుందని నేను అనుకోలేక పోతున్నాను.

పురుషాధిక్యత, పురుషాహంకారం పురుషుడ్ని సోషలిస్టు వ్యవస్థలో కూడా పట్టుకు

పీడిస్తాయనే అనుకుంటున్నాను.

మాతృస్వామ్య వ్యవస్థ, పితృస్వామ్య వ్యవస్థగా మారేక ఈ పురుష ప్రపంచంలో స్త్రీ పరిస్థితి బానిస కన్నా హీనంగా వుంది. అనేక అనుమానాలకూ, అవమానాలకూ, అసమానతలకూ గురి అవుతోంది.

చిన్నప్పుడు తండ్రి నుంచీ, తర్వాత భర్త నుంచీ స్త్రీ పొందే హింస టార్చర్ – నాకే కాదు ఇక్కడ అందరి స్త్రీలకూ అంతో ఇంతో అనుభవమని నేను అనుకుంటున్నాను''

చప్పట్లు!

''నేటి స్త్రీ తండ్రితోను, భర్తతోను సున్నితమైన సమస్యలను సైతం ఎదుర్కోలేని దీనపరిస్థితిలో వుంది. ఎన్నో కాంప్లెక్సు ప్రాబ్లమ్స్ అధిగమించలేని అశక్తురాలు ఈ స్త్రీ !

ఈ సమాజంలో – ఒక ప్రధాన మంత్రి స్త్రీ అయినంత మాత్రాన స్త్రీ ఒక హైస్టేటస్ ఎంజాయ్ చేస్తున్నదనుకోడం భ్రమ. మగవాడే సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ఆధిపత్యం వహిస్తున్నాడు ఈ సమాజంపై, ఈ ప్రపంచంపై చివరికి కుటుంబంలో కూడా అతడే నిర్ణయాలు చేస్తాడు !

ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యం ఎంత వరకూ వుంది ? తెచ్చిన జీతము అతని చేతిలో పెట్టాలి. ఏ వస్తువైనా భర్త అనుమతీ, అంగీకారం లేకుండా కొనలేని ఆడది, ఒక వంద రూపాయలతో చీర కొనుక్కోలేని ఆడది ఉద్యోగం చేస్తున్నంత మాత్రాన ఏదీ ఆర్థిక స్వాతంత్ర్యం? ఆడది ఏ నిర్బంధాలకూ ఏ భయాలకూ గురి కాకుండా స్వేచ్ఛ నివ్వగలదా ఏ సమాజమైనా ? అనడుగుతున్నాను.

ఎంతోమంది భార్యలు భర్తలవల్ల కష్టాలకీ, అవమానాలకీ గురి అవుతున్నారు. మగాడు పైకి ఎంత ప్రోగ్రసివ్ అయినప్పటికీ – అతను ఇంటికి వచ్చే టైముకి భోజనం రడీగా వుంచాలి. అతన్ని అన్ని విధాల సేద తీర్చాలి. మగాడు ఏ పాత సంప్రదాయాల్లో పెరిగాడో – ఆ సంప్రదాయాలను అధిగమించడానికి ఇష్టపడడు. హి డజ్ నాట్ వాంట్ హిజ్ లైఫ్ డిస్టర్బ్‌డ్ బై ఛేంజ్స్ ! ఈ మగాడు చేసేదానికి చెప్పే దానికి అక్కడే వైరుధ్యం వుంది. దాని నుంచి ఈ మగాడు బైటపడకుండా సోషలిస్టు కబుర్లు చెబితే – రేపు ఆ వ్యవస్థ వచ్చినా ఈ స్త్రీ కి విముక్తి లేదనే నా అభిప్రాయం !''

చప్పట్లు !

''అవును – ఆడది ఇంకా డిపెండెంటుగానే వుంది. ఇంకాడిఫెన్సివ్ స్టేజ్ లోనే వుంది.

ఆడవాళ్ళ ప్రాబ్లెమ్స్ సైంటిఫిక్‌గా ఎవరాలోచిస్తున్నారు ?

మన ఆడవాళ్ళ కి చాలినంత సెల్ఫ్‌కాన్ఫిడెన్సూ, వుండాల్సిన సెల్ఫ్ రెస్పెక్టూ కొరవడ్డాయనే నేను అనుకుంటున్నాను.

కారణం– మనం పురుష ప్రపంచంలో పుట్టి పెరిగాం. తల్లిదండ్రుల పెంపకం కొడుక్కోరీతి, కూతురికో రీతిగా వుండగా పెరిగాం మనం నాలుగ్గోడలకే పరిమితమయ్యాం.

పెళ్ళి అయేక ఆ గోడలు కాక మరో గోడలు! అంతే చాలామంది స్త్రీల ప్రపంచం. అదే మగాడైతే ప్రొఫెషనల్‌గా, డాషింగ్‌గా – ఎక్కడైనా బతికేయగలరీతిలో పెరుగుతాడు. సెల్ఫ్‌సఫీషియంట్‌గా పెరుగుతాడు.

స్త్రీ అలా పెరగకపోవడంచేత ఇన్‌ఫీరియార్టీ కాంప్లెక్సుకి గురి అవుతోంది.

ఇంతకీ నేను అనేదేమిటంటే లిబరేషన్‌కి మనం కమిట్ కావడం కాదు – మగవాళ్ళు కమిట్ అయ్యేలా చూడాలి! మేన్ మస్ట్ బి కమిటెడ్ టు ఉమెన్స్ లిబరేషన్. ఆ కమిట్‌మెంట్ ఏదో స్త్రీలని ఉద్ధరించడానికి కాదని – అది మానవత్వపు సమస్యగా గుర్తించేలా చేయాలి.

వ్యవస్థలు మారొచ్చుగాక – కాని పురుషుడు మారడు. రాముడు సీతని అగ్ని ప్రవేశం చేసి శీలాన్ని రుజావు చేస్కోమన్నాడు.. అదే ప్రశ్న సీత రాముణ్ణి వేసే రోజు వచ్చేవరకూ ఈ స్త్రీకి విముక్తిలేదు.

అప్పటిదాకా ఈ మగవాళ్ళే అన్నట్టు స్త్రీ అయి పుట్టేకన్నా అడవిలో మానై పుట్టడం బెటరు! –''

ఉద్రేకంతో ఏకబిగిని మాటాడింది విజయ.

హాలంతా చప్పట్లతో మార్మోగిపోయింది.

'అదరగొట్టేశావ్' అని ఛాయ విజయని కౌగలించుకుని ఊపేసింది.

పెద్దలు ఆమె ప్రసంగాన్ని మెచ్చుకుంటూనే – ఆమె లేవదీసిన అనుమానాలకి సైంటిఫిక్‌గా సమాధానాలు చెప్పే ప్రయత్నం చేసేరు.

సభ ఎడ్యుకేటెడ్‌గా, ఉత్సాహంగా విజయవంతంగా ముగిసింది.



సభనుంచి ఛాయ, విజయ హోటల్‌కి దారితీసేరు.

రెండుటీలకి ఆర్డరిచ్చి కబుర్లలో పడ్డారు.

''నీ ఉపన్యాసం బాగుంది. అయితే ఈ వ్యవస్థ మారడం ముఖ్యం. ఆ తర్వాత అంటావా – ఈ వ్యవస్థమారేక ఈ మగాళ్ళు మారడం ఎంత ? '' అంది ఛాయ.

''నీ వెన్ని చెప్పు – నాకా నమ్మకంలేదు –'' విజయ

''ఈ తరం పురుషుల్లో వున్న ఫ్యూడల్ బుద్ధులు రాబోయే తరం వాళ్లకి సోకకుండా సోషలిస్టు సమాజం తీర్చిదిద్ద గలదనుకుంటున్నాను... అది సరే, ఏమిటమ్మా మగాళ్ళ మీద అంత కసి. కొంపదీసి మీ ఆయన నిన్ను హింసించడంలేదు కదా! ''

విజయ సమాధానంగా ఏమీ అనలేదు. ఆమె ముఖం పాలిపోయింది. ఆమె కళ్ళంట నీళ్ళు తిరిగేయి.

కన్నీళ్ళు చూసి ఛాయ నివ్వెరపోయింది. నిటారు అయింది.

''చెలం నిన్ను హింసిస్తున్నాడా విజ్జీ! ''– ఆందోళన చెందింది ఛాయ.

విజయ దుఃఖం మరీ ఎక్కువయింది.

హోటల్‌లో అది స్త్రీలకి ప్రత్యేకించిన కేబిను. ఆ ఇద్దరూ తప్ప అక్కడ ఎవరూలేరు

సభలో పురుష ప్రపంచంపై దాడిచేసిన విజయా ఏడుస్తున్న విజయా, ఒక్కరేనా అనిపించింది. ఛాయకి ఎలా సముదాయించాలో తెలీలేదు.

ఎదురుసీట్లోంచి, లేచి వెళ్ళి ఆమె పక్కన కూర్చుంది. ఆమెపై చేయి వేసింది. అంతలో టీలు వచ్చేయి

టీ తాగమంది ఛాయ.

విజయ లేచి వెళ్ళి ముఖం కడుక్కుని వచ్చింది.

ఇద్దరూ టీలు తాగేరు.

చెలం తననెంత నిర్లక్ష్యం చేస్తున్నదీ, మనిషిఎంత దారుణంగా మారిపోతున్నదీ వివరంగా చెప్పింది విజయ.

చెప్పింది విన్నాక విజయ ఏడ్వవలసినంత కారణం అంతగా కనిపించలేదు ఛాయకి.

''ఎంతోమంది మొగుళ్ళకన్నా నీ మొగుడు నయం. ఇన్ని కబుర్లు చెప్పేదానివి – నీ జీవితాన్ని నీవు దిద్దుకోలేవు ?''

''చెలాన్ని తోవలో పెట్టడానికి నా శాయశక్తులా ప్రయత్నించానే ! లాభం లేకపోయింది.''

''పోనీ సర్దుకు పోవచ్చుకదా ''

''అదీ ప్రయత్నించాను సాధ్యం కాలేదు. ఎంతకని సర్దుకుపోడం? అసలు ఎందుకు సర్దుకుపోవాలి ? – అని తిరగబడుతోంది మనసొక పక్క?''

''మరి ఏం చేద్దామనుకుంటున్నావే ''

''అదే తోచటం లేదు!''

''ఏడ్వటంతప్పు – అవునా!'' అంది నవ్వుతూ ఛాయ – ''నీ లీజర్ టైమంతా చెలంతో గడపాలనుకుంటావు. ఆ మహానుభావుడికి నీతో గడిపే లీజర్ లేదు. సో. నీవొక పని చేయి.''

''ఏమిటి?''

'' నీవు తీరిక లేకుండా – ఏపనో కలుగజేసుకుని బిజీగా వుండు ''

తనని పీడిస్తున్న సమస్యకి అంత తేలికగా ఛాయ ఒక పరిష్కారం సూచించేయడంతో తెల్లబోయింది విజయ. ఆ లైన్లో తనెప్పుడూ ఆలోచించనేలేదు. తన ఆలోచనలు అనుక్షణం చెలంనీ, చెలం ప్రేమనీ ఎలా పొందాలనే !

''నీకెలా చెప్పాలో తెలీడంలేదు. తీరిక సమయమే కాదు. చెలంతో గడపడానికి రోజుకి ఇరవైనాలుగ్గంటలు చాలవునాకు – కాని నేనతనికి రాక్షసిలా కనిపిస్తున్నాను.''

అంటే విజయక్కావలసింది చెలమేగాని లిబరేషన్ కాదాన్నమాట. అయినా ఛాయ ఆ విషయం బయటకనలేదు.

''అందుకే నామాటవిని ఏదైనా పని కల్పించుకో. ఏ బాధా వుండదు. మనశ్శాంతి

దొరుకుతుంది'' అంది.

''ఇంకా పనేమిటి తల్లీ! చేస్తున్న ఉద్యోగం చాలదా?''

''అదికాదు నేననేది. నీకు ఇంట్లో ఏం తోచడంలేదు. ముగ్గరు నలుగురు పిల్లలున్న చిన్న సంసారమైతే ఈ ప్రాబ్లెమ్మే రాదు! నీకు కావల్సినంత తీరికున్న పరిస్థితి, ఆ తీరక సమయంలో ఏదో ఏక్టివిటీ కల్పించుకో – ఏ ప్రాబ్లెమ్ వుండదు''

''ఏం చేయమంటావు..''

''అది నీ టేస్టు బట్టి వుంటుంది. ఈ నగర జీవితంలో నీకు ఏది కావలిస్తే అది అందుబాటులో వుంటుంది. సాహిత్యం, చిత్రలేఖనం, సంగీతం, నృత్యం, సినిమా, కల్చరల్ ఏక్టివిటీలు, యూనివర్సిటీ చదువులూ, మహిళా సంఘాలూ.. ఎన్నిలేవు? – ఏదోక దానిపై నీ మనసు డైవర్టు చేయి.. అన్నీ సర్దుకుంటాయి. ఏమంటావు?''

ఛాయ చెప్పింది బాగున్నట్టే తోచింది విజయకి.

## 23

సమయం రాత్రి పావుతక్కువ పన్నెండు. ప్రదేశం – క్లబ్ ఆవరణ.

''టైమయింది. మరినే వెళ్తాను'' అన్నాడు చెలం.

''దేనికి టైమయింది. ఎక్కడికెళ్తావ్?'' అడిగేడు కనకరాజు.

''ఇంటికెళ్లే టైమయింది. ఇంటికి వెళ్తాను.''

''నాన్సెన్స్! ఇంటికి వెళ్ళడానికి టైమేమిటోయ్! ఎవడైనా నవ్వుతాడు.''

''విజయ నాకోసం వెయిట్ చేస్తుంది రాజూ!''

ఫకాల్న నవ్వేడు కనకరాజు. నవ్వు ఆపుకోలేనంతగా ఎంతసేపో నవ్వేడు. నవ్వి –

''చెలం నీవు ఏమీ అనుకోనంటే – ఒకటంటాను'' అన్నాడు.

''ఏమిటి?''

''నీవు పెళ్ళానికి జడుస్తావు. అవునా? నిన్ను ఆమె అదుపాజ్ఞలో పెడుతోందని నా అనుమానం. కాదంటావా?''

కాదన్లేదు, ఔనన్లేదు చెలం!

''చూడు చెలం! పెళ్ళానికెపుడైతే నీవు విధేయుడివయ్యావో – బస్! నీపని అయిపోయిందన్నమాట! నీ చాప్టరు క్లోజ్! నీ టాలెంట్సూ, నీ సరదాలూ, నీ కోరికలూ, నీ ఆశయాలూ, లక్ష్యాలూ – అన్నీ గుడ్డుగుడుసుకుపోతాయి. కావాలంటే చరిత్ర తిరగేసి చూడు! మహా మహా మేధావులంతా, నల్గురిచేత కొనియాడబడ్డ వాళ్ళంతా పెళ్ళాలపట్ల చాలా క్రూయల్‌గా, ఇన్ హ్యూమన్‌గా బిహేవ్ చేశారు. అన్యాయంగా, దారుణంగా హింసించేరు''

''విజయపట్ల నేనలా ప్రవర్తించలేను. ఆమెను బాధ పెట్టి నేను బతకలేను''

''సరేనోయ్! నేనేదో మీ ఆవిణ్ణి బాధ పెట్టేయమన్నట్టూ – నీకు బాధ పెట్టడమంటేనే

తెలియనట్టూ కబుర్లు! నీవు నీభార్యని ప్రేమించి పువ్వుల్లో పెట్టి పూజించు. నా కభ్యంతరంలేదు. కాని నేను అనేదేమిటంటే ఆమెను ఆమె స్థానంలో వుంచు. నెత్తిన పెట్టుకు ఊరేగకు. అప్పర్‌హేండ్‌కి అవకాశం ఇవ్వకు. ఇచ్చేవా నమిలి మింగేస్తుంది ఆడది. నంగిరి పింగిరి వెధవగా మార్చేస్తుంది ఆడది. ఒక పెంపుడు కుక్క కన్నా హీనంగా చేసేస్తుంది ఆడది. నీవందుకు సిద్ధపడతానంటే – నేనేం చేయలేను. కాని నాకు మాత్రం భార్యా విధేయులంటే పరమపరమ రోత! హెన్‌పెక్‌డు గాళ్ళని చూడగానేనాకు హైద్రాబాద్ కొజ్జాలు గుర్తుకొస్తారు...సారీ అలా అంటున్నానని ఏమీ అనుకోకు మైడియర్ ఫ్రెండ్. నీవలాకాగూడదనే నా కోరిక.''

''నీకా బెంగ అక్కర్లేదు. ఆ పరిస్థితి ఎప్పుడూరాదు'' అన్నాడు చెలం. ''అయితే నీవునాకు ఇలాంటి స్పీచ్‌లు ఇచ్చేబదులు ప్రాక్టికల్ అడ్వయిజు ఇస్తే సంతోషిస్తాను''

''యస్! డియర్ ఫ్రెండ్! ఐయామ్ రడీ ఫర్ దట్! చెప్పు. నీకు సలహా ఏమిటి కావాలో''

• విజయతో వున్న ప్రాబ్లెమ్ చెప్పేడు.

కనకలాజు విని – ''ఇటీజ్ నాటే ప్రాబ్లెమ్'' అని తేల్చేశాడు.

''చెలం! యూనో మై వైఫ్ హైమ! ఆమెవల్లనాకు, నావల్ల ఆమెకి ఎలాంటి ప్రాబ్లెమ్స్ లేవు. అయామ్ నాట్ ఫేసింగ్ ఎనీ హెడేక్ విత్‌హెర్! ఎంచేత ? రీజన్ ఈజ్ సింపుల్! నాకు ఆమె అడ్డురాదు. ఆమెకి నేను అడ్డుచెప్పను. దట్సాల్. యూఫాలో దిసేమ్! యువర్ మిసెస్ ఈజ్ వెరీ ఛార్మింగ్ అండ్ బ్యూటిఫుల్ ఉమెన్. మోర్ ఓవర్ షియీజ్ ఎడ్యుకేటెడ్. షీ సూట్స్ టు అవర్ సొసైటీ. బ్రింగ్ హెర్ విత్‌యూ. నీతో ఆమెను మన క్లబ్‌కి పార్టీలకీ తీసుకువస్తుండు. దెన్ షి వోంట్ ఫీల్ ఎనీ బోర్. అలా నాలుగైదుసార్లు తీసుకువస్తే చాలు – తనే లైన్లో పడిపోతుంది. నా మొగుడు అనే నారోమైండ్‌నెస్ నుంచి బయటపడి – మన ఫ్రీ సొసైటీలో మింగిల్ అయిపోతుంది. వాట్‌డూయూసే ? నేను అన్నది ఎలావుంది?''

''థాంక్యు! సలహా బాగుంది. అయితే విజయ ఇందులోకి దిగదు'' అన్నాడు నెమ్మదిగా చెలం!

''ఏం?''

''విజయ చదువుకున్నదైనప్పటికీ ఈ అల్ట్రా మోడరన్ కల్చర్‌కి, హైసొసైటీకి ఆమె దూరం. రివల్యూషనరీ మనిషి! ఇటువంటి చోటికి రాదు. అలాంటి లైఫ్ పార్టనర్ దొరకడం న్యాదురదృష్టం'' అన్నాడు చెలం.

అదంతా అబద్ధం.

అతనెప్పుడూ విజయని క్లబ్‌లకీ, పార్టీలకీ తీసుకు వెళ్ళలేదు. ఆమెకి రాడానికి అభ్యంతరం లేదు. చెలమే తీసుకురాడు.

పైగా సొసైటీలో తన భార్యని ప్రదర్శించడం చెలంకి ఏమాత్రం ఇష్టం వుండదు.

తను పై తరగతి మెట్లు ఎక్కుతున్నప్పటికీ భార్య విషయంలో మధ్యతరగతి బుద్ధినుంచి ఎదగలేని స్థితిలో వున్నాడు. అందుకు తను బాధపడ్డంలేదు. పెద్దవాళ్ళ కల్చరూ, ఆ సొసైటీలో

ఆడవాళ్ళు తనకి కావాలి. ఎంతో ఇష్టం. కాని భార్యకి ఆగాలి ఏమాత్రం తగలడానికి వీల్లేదు. ఏమంటే –

ఒకసారి తనకు అనుభవం అయింది.

అది తను ఎన్నడూ మర్చిపోలేడు.

కంపెనీ మానేజింగ్ డైరక్టరు కొత్తగా వచ్చిన సందర్భంగా – ఎగ్జిక్యూటివ్స్ అందరికీ పార్క్ హోటల్లో పార్టీ ఇచ్చేడు.

ఆ పార్టీకి తప్పక భార్యలతో రావాలి. పిల్లలని ఎట్టి పరిస్థితిలో తీసుకు రాడానికి వీల్లేదు. అదీ కండిషన్!

యండీ. గారు ఇస్తున్నపార్టీ కదా ఉత్సాహంగా తను వెళ్ళేడు విజయతో!

వెళ్లేడుగాని యం. డీ. గారి విన్నపం విన్నాక షాక్ తిన్నట్టయిపోయేడు.

అయ్యగారు అనేదేమిటంటే ఇక్కడకొచ్చిన భార్యాభర్తలందర్నీ కాసేపు భార్యాభర్తలనే సంగతి మర్చి పోమ్మన్నాడు. రొటీన్ నుంచి రిలీఫ్ పొందమన్నాడు. ఎవరికి వారిని ఫ్రీగా మూవ్ అవమన్నాడు. అందులో థ్రిల్లు ఎంజాయ్ చేయమన్నాడు.

తనకి ఒళ్ళు మండిపోయింది.

వీడికి రొటీన్‌నుంచి థ్రిల్లు కావాలనుకుంటే వాడి పెళ్ళాన్ని పదిమందితో తిరగమను. అంతేగాని, మా పెళ్ళాలమీద వీడి అధికారం ఏమిటి?

ఆ యమ్. డీ దరిద్రుడు రెండున్నర గంటలసేపూ ఏ పెళ్ళాం ముండనీ సదరు మొగుడు పక్కకి చేరనీయకుండా చేసేసాడు. తన దగ్గరికి ఇంకెవరో ఆడవాళ్ళు చేరినప్పటికీ దృష్టి అంతా విజయ వైపే వుండేది. విజయ నవ్వుతూ ఎవరితోనైనా మాటాడుతుంటే చూసి భరించలేక పోయేడు. విజయతో నవ్వుతూ ఏరాస్కెల్ అయినా మాటాడితే ఒళ్ళు భుగభుగలాడిపోయేది.

విజయ సుధాకర్‌తో మాటాడటం, రాజేష్‌తో కలిసి బఫే డిన్నరు నవ్వుతూ తినడం, అయ్యగారి ఉపన్యాసం ఇంకే వెధవ పక్కనో కూర్చుని వినడం – ఏదీ భరించలేకపోయేడు.

అక్కడ పెళ్ళాం మొగుడుతోగాని, మొగుడు పెళ్ళాంతో గాని మాటాడితే మూవ్ అయితే మైనస్ పాయింట్! దే డునాట్ ఫిట్ ఫర్ హైక్లాస్ సొసైటీ అట.

హైసొసైటీకి నీవు ఫిట్ కావు – అని ఎవరనేస్తారనో – మొగుళ్ళందరూ పెళ్ళాల్ని పడ్డల్లా అంబోతుల మధ్య తోసేసారు. వీళ్ళకి సిగ్గుల్లేవు అనుకున్నాడు ! మరి తనో! విజయని రెక్కపట్టుకు ఈడ్చుకు వచ్చేయాలనిపించింది అక్కడనుంచి. అయ్యగారి ముందు అంత సాహసం చేయగల దమ్ము ఎక్కడిది ?

ఆ రోజే తను ఒక నిర్ణయానికి వచ్చేసాడు. ఇలాంటి వాటికి విజయని మరెప్పుడూ తీసుకురాగూడదని! పెద్ద పెద్దవాళ్ళ ఫంక్షన్లకీ, పార్టీలకీ, క్లబ్బులకీ ఏ పరిస్థితిలోను తీసుకెళ్ళ గూడదనుకున్నాడు. మిత్రుడు రాజశేఖర్ పార్టీకి తప్పనిసరై వెళ్ళాల్సివచ్చిందిగాని. లేకుంటే దానికీ తీసుకువెళ్ళకపోను.

ఆ మాటకొస్తే విజయని ఉద్యోగం చేయించడం తనకి ఏ మాత్రం ఇష్టం లేదు. మాన్పించేస్తే- ఇంటి దగ్గర అసలు తోచక తనని మరీ హింసిస్తుంది. అంచేత వూర్కున్నాడు.

విజయని దూరంగా వుంచాలకున్న ఆ హైక్లాస్ సొసైటీ తనకు మాత్రం కావాలి. పెద్ద పెద్దవాళ్ళతో - వాళ్ళ ఆడవాళ్ళతో సుఖాలు సరదాలూ తప్పక కావాలి. కావాలి!

''ఏమిటి ఆలోచిస్తున్నావ్ - మీ మిసెస్ గురించేనా ?''

''లేదు - ఏం లేదు '' అన్నాడు చెలం.

సిగరట్ వెలిగించి - 'పద' అని క్లబ్బులోకి దారితీసేడు.

''అటు వెళ్తున్నా వేంటీ ? ఇటు! ఇంటికెళ్తానన్నావుగా ''

''అప్పుడే ఇంటికేవిఁటి ? నాన్సెన్స్! ఇంటికి టైమూ, పెళ్ళామంటే భయమూ మనకి లేవు బ్రదర్!...పద...ఒక పెగ్ వేసుకుని - కాసేపు బిలియర్డ్సు ఆడుదాం, కమాన్'' అన్నాడు హుషారుగా, నవ్వుతూ చెలం!

## 24

క్షమాపణలు చెప్పి సుజాతను ఎలగైనా తీసుకొచ్చేయడానికి రవి హైద్రాబాదు బయల్దేరాడు.

ఆరోజు గోదావరి ఎక్స్‌ప్రెస్‌కే వెళ్దామనుకున్నాడు. రిజర్వేషను దొరక్కపోవడంతో కోణార్క్ కేచ్ చేశాడు.

రైలు లేటుగా - సాయంత్రం ఆరుగంటలకి చేరింది.

అతను ఏడు గంటలకి సుజాత ఇంటికి చేరేడు.

క్లోజ్‌డు వరండా తలుపులు దగ్గరికి వేసివున్నాయి.

అది అతని భార్య ఇల్లే అయినప్పటికీ తలుపు టాప్ చేయడం మర్యాదగా భావించేడు.

''ఎవరూ ?''

అది సుజాత గొంతే!

కాని సుజాత రాలేదు.

పాప శిరీష వచ్చింది. చదువుకుంటున్నది లేచి.

శిరీష తండ్రిని చూసి ఒక్క గంతువేసింది -

''మమ్మీ - డాడీ వచ్చాడు '' గట్టిగా అరిచింది.

శిరీష వచ్చి తండ్రిని చుట్టుకుపోయింది. సురేష్ ముఖం వెలిగిపోయింది. ''డాడీ' అని పరిగెట్టేడు. అక్కకన్నా ముందే తండ్రిని చేరుదామని పరిగెట్టి - దబ్బున పడ్డాడు.

పడిపోయిన బాబుని రవి ఎత్తుకొని, మరోచేత్తో శిరీషని దగ్గరకి లాక్కుని గది లోపలకి వస్తుండగా - సుజాత ఎదురొచ్చింది. ఆమె వెనక ఒక పురుషుడు వున్నాడు.

తెల్లగా, పొడవుగా, స్మార్టుగా వున్నాడు. వయసు ముప్ఫయి రెండు వుంటుంది.

అతణ్ణి చూసి రవి ముఖం నల్లగా అయిపోయింది

సుజాత ఆ వ్యక్తికి రవిని పరిచయంచేసింది.

రవికి ఆ వ్యక్తిని పరిచయం చేసింది – ''వీరు రాజారావుగారు – మా సెక్షన్ కొలీగ్.''

మీ సెక్షన్ కొలీగ్‌కి మీ సెక్షన్‌లోపని – ఇక్కడేం పని ? – అనుకున్నాడు.

''నమస్తే '' అన్నాడు రాజారావు.

''నమస్తే '' – రవి.

''కూర్చోండి'' అన్నాడు రాజారావు.

నాయింట్లో నాకే మర్యాద చేస్తున్నాడు వెధవ! కొంపదీసి ఈ ఇల్లు, సుజాత వాడి సొత్తు అనుకున్నాడా ? – రవికి విజయ గుర్తుకొచ్చింది. విజయ ఈ పరిస్థితిని ఏమనుకోమంటుంది ? భార్యపై అనుమానపు ఆలోచన రాగూడదంటే అది సాధ్యమయ్యేపనా ?

సుజాత మంచంపై కూర్చుంది.

రవి, రాజారావు ఎదురెదురుగా చెరో కుర్చీలో కూర్చున్నారు.

ఇంటికి భర్త వచ్చినట్టుగాక – ఎవరో తగుమాత్రం పరిచయమున్న వ్యక్తికి కుర్చీవేసి కూర్చోబెట్టినట్టుగా ఫీలయ్యేడు రవి!

''ఏ బండి కొచ్చేరు ?''

ఆ ప్రశ్న సుజాత అడిగితే తను చాలా సంతోషించి వుండేవాడు.

అడిగింది రాజారావు.

వాడికి నిజం చెప్పాలనిపించలేదు.

బస్‌లో వచ్చానన్నాడు.

''బస్ బోర్ కదండీ – లాంగ్ జర్నీ ! ట్రైన్‌లో రావల్సింది.ఎంచక్కా గోదావరి వుంది కదా''

''ఏదోలా వచ్చేసాను కదండీ''

రవి అసహనం, చిరాకు బయటపడిపోయింది.

కాసేపు నిశ్శబ్దం!

పిల్లలిద్దరూ అంతవరకూ తండ్రి ఒడిలోనే వున్నారు. పిల్లలిద్దరికీ రెండు క్యాడ్‌బరీ చాక్లెట్లు ఇచ్చేడు. అవి పట్టుకుని పిల్లలు తుర్రుమన్నారు.

''వస్తానండీ '' అని లేచేడు రాజారావు.

నయం ! మీరెప్పుడెళిపోతారు ? – అనడగలేదు వెధవ.

వస్తానని లేచేటప్పుడు షేక్‌హేండుకి చేయిముందుకి చాచేడు రాజారావు.

రవి సీట్లోంచి లేవలేదు. అన్యమనస్కంగా వుండటంచేత అతను చాచిన చేయికి రవి చేయి వెంటనే కలపలేకపోయేడు.

రాజారావు ఒకసారి రవి ముఖంలోకి చూసి చేయి దించేస్తున్నప్పుడు – రవి తన మిస్టేక్

తెల్సుకుని గభాల్న చేయి ముందుకి చాచేడు. ముందుకొచ్చిన రవిచేయిని వెనక్కి వెళిపోయిన రాజారావు చేయి సర్‌మని ముందుకొచ్చి గభాల్న అందుకుంది.

ఆ విధంగా షేక్‌హాండు వ్యవహారంముగిసేక – రాజారావు నిష్క్రమించేడు.

సుజాత గేటు వరకూ వెళ్ళి వాడిని దిగబెట్టడం నచ్చలేదు రవికి. పోతున్నవాడితో – రోడ్డు ఎదురుగా – తలుపుకి ఆనుకుని రెండు నిమిషాలు మాటాడ్డంకూడా హర్షించలేకపోయేడు.

అసహనంగా సీట్లో అటూ, ఇటూ కదిలేడు.

వెళిపోతున్న ఆ వెధవని సురేష్ ''అంకుల్ టాటా !'' అన్నాడు.

మళ్ళీ బాంబుపడ్డట్టు తుళ్ళిపడ్డాడు రవి.

ఒరే గుంట వెధవా ! ఎంతమందిరా నీకు అంకుల్లు ! అనుకున్నాడు.

సుజాత లోనికి వచ్చింది.

ఆ గెస్టుని పంపించేసినట్టే – ఈ గెస్టునీ ''ఏం పనిమీదొచ్చేరు?'' అనడిగి పంపించే యాలనిపించింది సుజాతకి.

అతను భర్త – తను భార్య ! – అనే తరతరాలదాస్యం ఆమె నోరు నొక్కేసింది.

రాగానే క్షమించమని అడుగుదామని వచ్చిన రవి – ఆసంగతి మర్చిపోయి ముందుగా నేనెందుకు మాటాడాలనే అహం!

అతను మాటాడలేదు.

ఆమె మాటాడలేదు.

సుజాత వంటగదిలోకి వెళ్ళి – అక్కడనుంచి కేకవేసింది.

''శిరీషా ! మీ డాడీ స్నానం చేస్తారేమో అడుగు''

ఆమె తనని డైరెక్టుగా అడగని కారణాన ''చేయను'' అందామనుకున్నాడు. ఒళ్ళంతా బాగా అలసి చిరాగ్గా వుందేమో – శిరీషకి గ్రీన్ సిగ్నెల్ ఇచ్చేడు.

''మమ్మీ ! డాడీ స్నానం చేస్తారంట.''

శిరీషకి ఇంతవరకూ చదువుతున్న చదువు బోర్ కొట్టింది మమ్మీకి డాడీకి మధ్య ఒకరి మాటలు ఒకరికి అందించటం మంచి సరదాగా వుంది.

శిరీష తీసుకున్న పాత్ర సురేష్‌కి నచ్చింది.

అంచేత వాడూ శిరీష మాటను రిపీట్ చేయడం మొదలెట్టాడు.

పిల్లల ఇద్దరి భోజనాలు అప్పటికే అయ్యేయి.

''డాడీ ! మమ్మీ భోజనానికి రమ్మంటోంది '' – శిరీష.

''డాడీ ! మమ్మీ భోజనానికి రమ్మంటోంది '' – సురేష్.

రవి దగ్గర వార్త అందుకున్నారు.

''మమ్మీ డాడీకి ఆకలిగా లేదంట '' – శిరీష.

'' '' '' – సురేష్

''ఎందుకాకలిగాలేదు. ఏ హోటల్లోనో తినొస్తే ఆ సంగతి ముందే చెప్పాలి. ఇపుడు వండిందంతా ఏం చేయాలి ? పారేయమంటారేమో అడగండి''

అడిగేరు పిల్లలు.

నిజానికి అతనికి ఆకలిగానే వుంది. ట్రైన్‌లో మధ్యాహ్నం కూడా భోజనంచేయలేదు.

''అన్నం పెట్టాను రమ్మను''

భర్త సంగతి భార్య కనిపెట్టలేనిదా !

''డాడీ ! మమ్మీ అన్నం పెట్టింది'' – కోరస్‌గా పిల్లలు ఇద్దరూ అనడమేకాదు – డాడీని లాక్కొచ్చేరు.

ఒక కంచంలోనే వడ్డించబడివుంది.

''మమ్మీని అన్నం పెట్టుకోమను. ''

పిల్లలిద్దరూ అందుకున్నారు.

''ఏవిఁటి గోల !'' పిల్లలని కసురుకుని – ''నాకు ఆకలిగాలేదు,'' అంది.

పిల్లలు గోలమానలేదు ''మమ్మీకి ఆకలిగా లేదంట'' టాపు ఎగిరి పోయేలా అరిచేరు.

కంచం దగ్గర కూర్చున్న రవి సుజాత ముఖంలోకి చూసేడు.

ఆమె కళ్ళల్లో నీళ్ళు!

అదిరి పడ్డాడు రవి.

పిల్లలిద్దర్నీ –''బొమ్మల పుస్తకం తెచ్చాను – వెళ్ళి చూస్కోండమ్మా'' అని పంపించేసాడు.

రవి పచ్చడితో అన్నం కలిపేడు.

కలిపి అన్నం ముద్దను ఆమె నోటి దగ్గర పెట్టేడు!

సుజాతకి కన్నీళ్లు జలజల రాలిపోతున్నాయి.

తినకుండా – ముఖం పక్కకి తిప్పేసింది.

''తిను సుజీ '' మొదట తనే మాటాడాల్సి వచ్చిందనే అహం ఇప్పుడు లేదు.

ఆమె దూరంగా జరగబోతుంటే పోనీయకుండా ఆమె చేయి గట్టిగా పట్టుకున్నాడు.

ఆమె మరింతగా దుఃఖిస్తూ, మరింతగా చేయి విడిపించుకోడానికి చేసిన ప్రయత్నం అతనిది ఎడమచేయే అయినప్పటికీ – విడిపించుకోలేకపోయింది. తర్వాత ఆమెంతట ఆమె ఆ ప్రయత్నం విరమించుకుంది. ఎక్కిళ్ళు పడుతూ ఏడ్వసాగింది.

రవి కూర్చున్న వాడల్లా లేచి బలవంతంగా ఆమెను దగ్గరకి తీసుకుని, 'ప్లీజ్ ! ప్లీజ్ !' అంటూ బతిమాలుతూ, ఒకపక్క కన్నీళ్లు తుడుస్తూ 'జరిగింది మర్చిపో – నాదే తప్పు' అని ఒప్పుకుంటూ, క్షమించమంటూ మొత్తానికి ఆమెకి ముద్ద మింగించడంలో విజయం పొందేడు.

మళ్ళీ ఆమెకి తినిపించబోతుంటే 'మీరు తినండి నేను పెట్టుకుంటాను' అని ఆమె వేరే కంచం పెట్టుకుంది.

ఇద్దరు తినడమేగాని ఎవరూ ఏదీ మాటాడే సాహసం చేయలేదు. సుజాత దుఃఖం మాత్రం ఆగలేదు. ముక్కు ఎగబీలుస్తునే భోంచేసింది!

అతనికి మంచం వేసి ఆమె కింద పరుచుకు పడుకుంది.

ఇద్దరూ ఒకే దగ్గర వుండగా రెండు పడకల అనుభవం అతనికిదే మొదటిసారి.

అతని కిరువైపులా పిల్లలిద్దరూ పడుకున్నారు. పిల్లలిద్దరికీ కథేదో చెప్పి నిద్ర పుచ్చేసాడు.

అతనికి నిద్ర పట్టలేదు.

అయిదునిమిషాల్లో –

అతను ఆమె పక్కమీదున్నాడు.

నెమ్మదిగా ఆమెపై చేయి వేశాడు.

''దయచేసి తీయండి''

ఆ గొంతులో కరుకుదనం తనెప్పుడూ వినలేదు.

దెబ్బతిన్నట్టు చేయితీసేసాడు. ఆమె పక్కనే మంచం దండెకి చేరగిలబడి కూర్చున్నాడు.

''ఎందుకొచ్చేరు ?'' అదే కరుకు గొంతు!

''ఎక్కడికీ ? పక్కమీదికా? పట్టణానికా ?''

అతని సరసాన్ని ఆమె రిసీవ్ చేసుకునే స్థితిలో లేదు.

''ఏ అంకుల్‌తో పడుకుందోనని పట్టుకోడానికొచ్చేరా ?''

అతనికి కొరడాతో ఛెళ్ళుమన్నట్టనిపించింది.

తన మెతకతనమే ఆమెనలా మాటాడేటట్టు చేస్తోందా ? ఇందాక భోజనం దగ్గర అంత బతిమాలించుకుందే! మళ్ళీ ఏవిటి ?

''జరిగిందంతా మరిచి పొమ్మని చెప్పానుగా''

''మగవాళ్ళు! మీరు లంజవి అంటే చిత్తం లంజనని ఒప్పేసుకోవాలి. లేదు, లేదు. నీవు పతివ్రతవి. క్షమించేసాను – అంటే చిత్తం తథాస్తు అనేయాలి. అంతేనా ?''

రవికి కోపం వచ్చింది. తమాయించుకున్నాడు. ఆ ప్రయత్నంలోనే వెంటనే మాటాడలేక పోయేడు.

తనూ రెచ్చిపోతే లాభం లేదు – నెమ్మదిగా, ఎలాగోలా ఆమెను ప్రసన్నం చేసుకోవాలి అనుకున్నాడు.

''సుజా! నీకు మరోసారి విన్నవించుకుంటున్నాను. నేను పొరబడ్డాను. నీతప్పేంలేదు. ఆ భయంకరరాత్రి – జరగగూడని సంఘటన – మన జీవితంలో మళ్ళీరాదనే నా నమ్మకం. నీపట్ల ఆరోజు దుర్మార్గంగా ప్రవర్తించాననుకుంటాను. ఎందుకలా ప్రవర్తించాల్సి వచ్చిందో సమర్థించుకునే ప్రయత్నం చేయదల్చుకోలేదు – జరిగినదానికి నన్ను క్షమించు ''

అతని చేతులు ఆమె కాళ్ళు పట్టుకున్నాయి.

కాళ్ళు భర్త పట్టుకోగానే సుజాత సిగ్గుతో చితికిపోయింది. గభాల్న కాళ్ళు లాక్కొని

లేచి కూర్చుంది.

''ఛ! కాళ్ళు పట్టుకోడం ఏమిటండీ! ఎప్పుడూ ఇలా విపరీతంగానే ప్రవర్తిస్తారు మీరు''

''నీవు నన్ను క్షమించే వరకూ – ఇలా విపరీతంగానే ప్రవర్తిస్తాను'' అన్నాడు నవ్వుతూ.

''క్షమాపణలు, క్షమాపణలు అంటారు మాటమాటకి. మరిక ఆ మాట ఎత్తకండి ప్లీజ్!''

రవి ఆమెను ఒడిలోకి తీసుకున్నాడు. ఆమె కాదనకుండా అతని ఒడిలో పడుకుంది.

పడుకునే – ఆరోజు అతను అన్నమాటలల్లా గెలికింది. గుర్తు చేయకన్నాడు. ఏడ్చింది, కన్నీళ్ళు తుడిచి – ఏడిస్తే నాపై ఒట్టే అన్నాడు.

అంకుల్ ముద్దు అనే బాంబు కథ – సురేష్ ఎవర్ని ఉద్దేశించి అన్నదీ ఆమెకి రవి విశదీకరించేడు.

గతం అంతా కన్నీళ్ళ మధ్య కరిగిపోయింది. మనసులు తేట తెల్లమయ్యేయి. తేలికయ్యేయి. పేరుకున్న మంచుగోడలు కరిగి విచ్చిపోయేయి.

రవి ఆమెను కౌగిల్లోకి తీసుకుని అన్నాడు – ''సుజీ! ఇక నీవూ నేనూ విడిగావుండే ప్రశ్న లేదు. నేను ప్రయత్నిస్తున్న జాబు నీకు తప్పక వస్తుంది. రాకుంటే పోతుంది! పోనీయ్! నాకు జీతం వుంది. మూడు నెలల్లో నాకు ప్రమోషను వస్తోంది. జీతం రెండువేలుదాటుతుంది. నీవూ నేనూ విడివిడిగా వుండి – ఎన్నో తీవ్రాతి తీవ్రంగా నష్టపోతున్నాం. ఒక అర్థం లేకుండా వ్యర్థమైన బతుకు బతుకుతున్నాం. అంచేత నీవూ, పిల్లలూ రేపు నాతో వచ్చేస్తున్నారు – ఇక ఒకరోజుకూడా మీరు లేకుండా బతకలేను. సుజా బతకలేను''

సుజాత అతని కౌగిలి విడిపించుకులేచి కూర్చుంది.

''నేను మీతో తప్పక వస్తానండి. అయితే రేపు కాదు. మీరు ఉద్యోగం నాకు అక్కడ చూసేక తప్పక వస్తాను.''

''నాపై కోపం ఇంకా పోలేదా ?''

''మీపై నాకు ఎలాంటి కోపం లేదండి. కానీ నా నిర్ణయంలో మార్పులేదు. ఉద్యోగం నేను వదిలిరానేను.''

''అంతేనా ?''

''అంతే! మీరు అక్కడ ఏ చిన్న ఉద్యోగమైనా చూడండి – తప్పక వచ్చేస్తాను. ఎలాగూ ఉద్యోగం వచ్చే అవకాసం వుందంటున్నారు కదా –''

''నా కర్థమయింది సుజా ! ఎక్కడ నేను గెటౌట్ అని ఏక్షణం అంటానో అని నీ భయంకదూ! – అలాగే కానియ్ సుజా! ఉద్యోగం వచ్చేకేరా – నా అవస్థలు నేను పడతాను'' రవి కళ్లల్లో నీళ్లు!

అది చూసి చలించిపోయింది సుజాత. అతని తలని తన గుండెలకి అదుముకుంది.

ఆమె గుండెల మధ్య రవికెంతో ఓదార్పు. జుట్టులోకి వేలుపోనిచ్చి ఆమె నిమురుతుంటే

ఎంతో సుఖం!

ఆ మెత్తని సుఖానికి మంగళసూత్రాలు, జాకెట్టు అతనికి అవరోధం తోచేయి. ఆమెను దగ్గరికి తీసుకోగా –

ధన్‌మని సురేష్ పేల్చిన బాంబు గుర్తుకొచ్చింది!

మంచం వైపు చూసేడు.

సురేష్ నిద్రపోతున్నాడు! అమాయకంగా.

అమాయకుడా! కాదు వాడి సురేష్‌బాబు కాదు! సురేష్ బాంబు!

''ఏమిటండీ?'' అంది

''పిల్లలు'' అన్నాడు నవ్వుతూ.

అవును పిల్లలు!

పిల్లలు పడుకున్నారులే అనుకోలేకపోయేరు దంపతులు!

ఇద్దరి పక్క వంటగదిలోకి మారిపోయింది. ఉక్కబెట్టకుండా టేబుల్ ఫాను అమర్చేడు.

నేలమీద పరిచిన బొంత మీద – రెండు నగ్న శరీరాలు.

ఇక వాళ్ళ ఇష్టం!

వాళ్ళున్న స్థితిలో – ఎవరే బాంబు విసిరినా 'టుస్' మనిపోతుంది గాని పనిచేయదు.

''ఓహ్! ఎంత సుఖం. ఎంత సుఖం!.. ఎన్నాళ్ళయిందండీ ఈ సుఖంపొంది...మీదగ్గర ఇంత సుఖానిచ్చే శక్తివుంచుకుని..నన్నెందుకండీ ఇక్కడ జైల్లో పడేశారు. ఎన్ని రాత్రులు..అయ్యో! ఎన్నెన్ని రాత్రులు వృధా అయిపోయాయండీ...మిమ్మల్ని క్షమించగూడదండీ..మిమ్మల్ని చంపేయాలి. మీరు ఇన్నాళ్ళూ నా పట్ల ఎంత దారుణంగా, ఎంత అమానుషంగా ప్రవర్తిస్తున్నారో.. ఈ సుఖం చెబుతోందండీ... వదల్నండీ.. ఈ సుఖాన్ని వదల్ను. మిమ్మల్ని వదలను...మీరెక్కడ వుంటే– నేనూ అక్కడే...నాకే ఉద్యోగం వద్దండీ..మీతోనే వుంటానండి..మీతో వచ్చేస్తానండి..నన్నొదిలించకండీ..నన్ను మీతో తీసుకెళ్ళిపొండి.''

''నిన్ను తీసుకువెళ్లిపోతాను సుజీ! తీసుకు వెళ్లిపోతాను''

రెండు శరీరాలు తృప్తి చెందేయి. అలిసిపోయేయి.

ఆతర్వాత కూడా – ఒకరినొకరు దగ్గరకి తీసుకొని హాయిగా నిద్రపోయేరు.

దబ్ దబ్ దబదబ దబ్ దబ్!

నెత్తిమీద ఎవరో సుతిమెత్తని సుత్తితో కొడుతున్నట్టు చప్పుడు సుజాతకి.

తలనొప్పా?

కాదు.

కలా?

కాదు.

కాదని ఆమెకి తెలుస్తోంది. అది తలుపు చప్పుడులావుంది.

రవినిలేపి ఆదేవిఁటో చూడమందామనుకుంది. అతని నిద్రని భంగపరచడం ఆమెకి ఇష్టం లేకపోయింది.

మళ్ళీ తలుపు చప్పుడు.

సుజాత కళ్ళు బరువుగా వున్నాయి.

లేచి వెళ్ళింది. ఒళ్ళు తూలుతోంది.

నెమ్మదిగా ద్వారం వద్దకి వెళ్ళింది.

''ఎవరూ?'' అంది తలుపు వెంటనే తీసేయకుండా.

''నేను!''

''నేనంటే?''

''అయ్యో నేను సుజాతా ! తలుపుతీయ్!''

సుజాత ఆ కంఠం రఘుదని గుర్తు పట్టింది. అంతే! ఆమె నిద్ర మత్తు ఒక్కసారిగా వదిలిపోయింది. ఏదో కంగారు! భయం!

''తలుపు తెరు''

నెమ్మదిగా తలుపు తెరిచింది. తల మాత్రమే బయటకి జొనిపి మాటాడి పంపించేసే వీలుగా– ఆమాత్రమే తలుపు తెరిచింది.

''రఘు! ఏవిఁటిదీ ? ఏంకావాలి?''

''నన్ను ముందు లోనికి రానీయ్''

''దేనికి..వద్దు. రేపు డ్యూటీలో కలుద్దాం'' అని తలుపువేసేయ బోతుంటే లోనకి తోసుకు వచ్చేసాడు రఘు!

రఘు ఎత్తుగా, బలంగా, తెల్లగా వున్నాడు. వయస్సు ముప్పయి వుంటుంది.

''చెప్తేనీక్కాదు.ఏవిఁటీ దౌర్జన్యం '' అంది నెమ్మదిగా.

''ఏంచేయ మంటావుమరి!''

''ఉష్‌నెమ్మదిగా ! మీకు మతిపోయిందా ఏవిఁటి ఇంతరాత్రప్పుడు ప్లీజ్ వెళ్ళు రఘు! ప్లీజ్!''

''వెళ్ళడానికి రాలేదు – లోనకి పద''

'' చెప్తుంటే నీక్కాదు '' నెమ్మదిగా అన్నప్పటికీ తీవ్రంగా, కోపంగా అంది – ''అవతల సురేష్‌నాన్నగారున్నారు తెల్సా?''

''అబద్ధం! అతనెందుకొస్తాడు ''

''వచ్చేడు రఘు! వచ్చేడు ! నన్నెందుకిలా ఏడిపిస్తావ్. నీకు పుణ్యముంటుంది – వెళ్ళు బాబు వెళ్ళు'' ఆమె చేతులు జోడించింది.

''రవి నిజంగా వచ్చేడా ?''

''నిజంగా – నా పిల్లల మీద ఒట్టు ''

ఆ బలమైన మనిషినుంచి తప్పించుకోడం ఆమెకి అసాధ్యం! అమాంతంగా, బలంగా ఒక ముద్దు పెట్టి మాయమయ్యేడు రఘు!

సుజాత గబగబా తలుపులు వేసి, గెడ బిగించి – వెను తిరిగింది.

ఎదురుగా రవి!

దద్దరిల్లిపోయి ''కయ్'' మంది సుజాత!

గుండె దడ్‌దడ్ దడదడ దడ్‌దడ దడదడ్!

ఆమెకి మూర్ఛవచ్చినంత పనయింది.

రవికళ్ళు చింతనిప్పులు!

పళ్ళు పటపట!

నిలదొక్కుకొని ఏదో చెప్పబోయింది సుజాత.

''చప్ ! దొంగలంజా! ''

ఆమె రెండు చెంపలకీ అతని వేళ్ళు అంటుకుపోయేయి.

''నీ రంకు వేషాలు నా అంతరాత్మ చెబితే వినలేదు. చంటిపిల్లాడుచెబితే పట్టించుకోలేదు. నీ వగలు ఏడుపులు నమ్మి మోసపోయేను. రంకు నేర్చినమ్మ బొంకు నేర్చిందనేదానికి నీవు కరెక్టుగా ఎగ్జాంపుల్! అమ్మ లంజా ! ఎంత జాణవే! ఎలా నాటకం ఆడి బోల్తా కొట్టించావే ! నిన్ను.... నిన్ను చంపేసినా పాపంలేదు! ముక్కలు ముక్కలు చేసి కాకులకీ గెద్దలకీ వేసినా తప్పుకాదే ''

ఆమెను గోడకేసి బాదేడు.

అక్కడితో కసితీరక చేతులు పీకమీదకి వెళ్ళేయి.

వెళ్ళేయేగాని – చేతులు బిగుసుకోలేదు

'ఛ' అని వదిలేసాడు.

ఫేంటూ, షర్టూ వేసుకుని, సూట్‌కేస్ సర్దుకుని – విసురుగా విసవిసా ఇంటి నుండి బయటికి వచ్చేశాడు రవి!

సుజాత నిర్జీవ ప్రతిమలా అలా వుండిపోయింది.

★★★

ఆ సంఘటన జరిగిన రెండు, మూడు వారాలు అయినప్పటికీ ఆరోజే జరిగినట్టు కళ్లకి కనిపిస్తోంది. మనిషిని పిచ్చెక్కించేస్తోంది.

విపరీతంగా తాగడం తప్పించి మరేం చేయాలనిపించలేదు

అంతా నిరామయంగా వుందతనికి.

అంతా నిరాసక్తంగా వుందతనికి.

అతనికి మనశ్శాంతి కావాలి.

వైజాగ్ నుంచి ఒక యాత్రా స్పెషల్ బయల్దేరుతోంది.

అటు కాశ్మీర్ నుంచి ఇటు కన్యాకుమారి వరకూ. రెండునెలల ప్రోగ్రామ్ అది!

యాత్రకి బయల్దేరాలని నిశ్చయించుకున్నాడు.

ఇంటి తాళాలు రాంబాబు, ఛాయలకి ఇచ్చేడు!

''విష్‌యూ హేపీ జర్నీ !'' అన్నారు మిత్రులు.

అదోలా నవ్వేడు రవి!

## 25

''నాకిప్పుడు నాలుగో నెల'' అంది ఛాయ.

ఉలిక్కిపడింది విజయ.

బీచ్‌లో సాయంసమయం. వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. వీస్తున్న చల్లనిగాలి ప్రాణాలకి సుఖాన్నిస్తోంది. అలలు అలలుగా ఎక్కడనుంచో మధురంగా పాట వినబడుతూ – తెగి సముద్రపు హోరులో కలిసిపోతోంది.

ఛాయకు నాలుగోనెల కడుపు అంటే అది ఆందోళన చెందాల్సిన విషయమో, సంతోషపడి అభినందించాల్సిన విషయమో ఆమెకి చప్పున అర్థం కాలేదు.

ఛాయ ముఖంలోకి చూసింది విజయ!

మామూలుగానే వుంది! ఎలాంటి టెన్షన్ లేదు.

ఎలాంటి సమయాల్లోనైనా చెక్కు చెదరని ఆమె ఆత్మ విశ్వాసం, దృఢత్వం విజయకెప్పుడూ అబ్బురంగానే వుంటాయి!

''ఏం చేద్దామనుకుంటున్నావు''

''అబార్షన్ చేయించుకుందామనుకుంటున్నాను.''

''అబార్షనా ! ఇన్ని నెలలు నిండేక ! ప్రమాదం కాదూ !''

''రేపీ కడుపువల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు అంతకన్నా ప్రమాదం!''

''ఇన్ని నెలలదాక ఏం చేస్తున్నావ్ ? ఏ నెల తప్పినపుడో తీసుకోవాల్సింది కదే ఈ నిర్ణయం!''

''నిజమే ! కాని ఏం చేయనూ ! నాది ఇర్రెగ్యులర్ మెన్సెస్ ! కానుకోలేకపోయేను. ఇది చూసేవుకాదు – కడుపొస్తే వచ్చే వికారాలు నాకు ఇప్పటికీ లేవంటే నమ్ము !.. ఇంకా ముట్టు కాలేదేమని అనుమానంతో లేడీ డాక్టరు దగ్గర కెళితే – తేలిన విషయం ఇది !'' అని నవ్వింది.

''అసలు కడుపురాకుండా – ముందే జాగర్తలు తీసుకోవచ్చుగా ''

''అన్ని జాగర్తలూ తీసుకోవడం జరిగిందే !''

''తీసుకుంటే కడుపెలా వచ్చినట్టు ?''

''అదే చిత్రం ! ఎక్కడో ...ఏ తొందరపాటో..ఎలా అయిందో నాకు తెలీడంలేదు''

తను బద్ధకించకుండా కడుపు రాకుండా జాగర్తలు తీసుకుంటున్న సంగతి అక్షరాలా నిజం! మొదట్లో ఓరల్ మాత్రల కోర్సు ప్రతినెలా తీసుకునేది. దానివల్ల గర్భం నిరోధింపబడడమే కాకుండా – మెన్సెస్ ప్రాబ్లమ్ కూడా వుండేది కాదు. అయితే ఆ మాత్రలు తన శరీర తత్వానికి పడలేదు. డాక్టరు కొన్నాళ్ళుబాటు ఆమాత్రలు వాడటం మానేయమని సలహా ఇచ్చేడు. నిరోధ్ బెస్టు అని సజెస్టు చేసేడు. రెండు డజన్ల నిరోధ్ పేకెట్లు రాంబాబు మొహం మీద కొట్టింది. రాంబాబుకి నిరోధ్ బెస్టుగా తోచలేదు ! నిరోధ్ వాడటం వల్ల నిరోధే ఎంజాయ్‌చేసి సుఖపడుతోంది గాని తనకి ఏ మాత్రం సుఖం లేదుగాక లేదన్నాడు. నిరోధ్ కట్టలన్నీ బుడగల కింద ఊది పారేసి – తనే ఏవో మాత్రలు తేవడం మొదలెట్టేడు! అప్పణ్నించీ అతను తెచ్చిన మాత్రలే వాడుతోంది. ఆ మాత్రలు టైముకి వేసుకోవడం మర్చిపోయినట్టు కూడా గుర్తులేదు..మరెలా మాయదారి కడుపు వచ్చేసిందో ఆమెకి అర్థంకాలేదు!

''నిన్నెందుకు రమ్మని పిలిచానంటే – నీవు నాకు సాయం చేయాలి'' అంది ఛాయ.

''ఏమిటి?''

''డబ్బు... ఓ నాలుగొందలు సర్దాలి.. అవుతుందా. జీతాలకి ఇచ్చేస్తాను''

''ఇస్తాను.. జీతాలకే అక్కర్లేదు... వీలుచూసుకుని ఇవ్వు... ఫర్వాలేదు ''

థాంక్స్ చెప్పింది ఛాయ.

''లేడీ డాక్టర్ని కన్సల్టు చేశాను. చేస్తానంది.. ఫీజు నాలుగు వందలు అడిగింది అందుకోసం''

''ఎప్పుడు చేస్తానంది ?''

''వచ్చే బుధవారం''

''ఫీజు అంతా నీవు భరించడమేవిఁటీ !... రాంబాబు ముందుకి రావొచ్చుగా''

''నేను నీకు ఇంతకుమందే చెప్పాను. గుర్తుందా– నాకు సంబంధించి అతణ్ని ఒక్క పైసా కూడా ఖర్చు పెట్టనీయను''

''దానివల్ల మగాడికే లాభం మదుపు పెట్టిన ముండ దొరికిందనుకుంటాడు '' – అన్లేదు విజయ.

''నీదంతా పిచ్చి!.. ఇంతకీ ఏవంటాడు రాంబాబు!'' అంది విజయ.

''ఊహించు చూద్దాం''

''గుటకలు మింగి చెమటలు కక్కి – కడుపు తీయించుకో తల్లీ లేకుంటే కొంపలు మునుగతాయి – మరిక వస్తాను నాకు పనుంది – అని పరిగెట్టి వుంటాడు''

''రాంబాబుని ఈ కాలం కుర్రాళ్ళతో జమకట్టి చాలా తక్కువ అంచనా వేశావు ? అతనేం అన్నాడో తెల్సా ! ... కడుపు తీయించుకోవద్దన్నాడు. ఇమిడియట్‌గా పెళ్ళి చేసుకుందామన్నాడు. ఇపుడే మంటావు ?''

ఆశ్చర్యపోయింది విజయ.

''పెళ్ళిచేసుకుని నన్ను తల్లి కమ్మంటాడు''

''మోసం, దగా .చేయకుండా నిన్ను పెళ్ళి చేసుకుంటానని ముందుకు రావడం చిత్రమే గొప్ప విషయమే! నీ ప్రియుడు ఈ కాలంలో వుండవల్సినవాడు కాదనీ, గొప్పవాడనీ ఒప్పుకుంటాను అతన్ని తక్కువ అంచనా వేయడం నాదే పొరపాటు!'' అని – ''అంత వరకూ బాగానే వుంది... మరి నీవేమిటీ అతనికి వ్యతిరేకంగా నిర్ణయం తీసుకున్నావ్! పెళ్ళి చేసుకోవచ్చు కదా'' అంది విజయ.

ఛాయ వెంటనే సమాధానం చెప్పలేదు

''నీకు తెల్సు – నేనున్న పరిస్థితులూ, పెళ్ళిపై నాకున్న అభిప్రాయాలూ, రాంబాబు బంధంతో నేను పెట్టుకున్న లిమిట్సూ! ఆ పరిధిని దాటి ముందుకెళ్ళలేను విజయా !''

ఛాయ అబార్షన్ చేస్కోడానికే ఎందుకు నిర్ణయం తీసుకున్నదీ విజయకి అర్థం కాని విషయం కాదు.

''అన్నీ తెల్సి కూడా రాంబాబు అర్థం చేసుకోడంలేదే ! ఎట్టి పరిస్థితుల్లోనూ అబార్షన్ చేస్కోడానికి వీల్లేదంటాడు. నేను ఎంత చెప్పినా వినిపించుకోడే! నాకు గొప్ప కోపం వచ్చిందిస్మీ ! పెళ్ళయితేనే పెత్తనం చెలాయిస్తాడు మగాడు అనుకున్నాను నాకొచ్చిన కడుపుని వుంచాలో తుంచాలో అది నాయిష్టం. అతనికేం సంబంధం! నేనతని దగ్గరకి పరిగెట్టి – ఇదిగో ! నీ ప్రతిరూపం నాలో పెరుగుతోంది. దీనికి సమాధానం ఏమిటి ? అని నేనడగలేదే ? చివరికి కోపంగా వెళ్ళిపోతూ ఏవఁటన్నాడో తెల్సా ? నేను కిరాతకురాలినట! బిడ్డ కడుపులోనుండగనే పీక నులిమేసే హంతకినట!''

ఛాయ కళ్ళు అశ్రుపూరితాయ్యేయి.

''రాంబాబు నన్నంత మాటలనడానికి ఏం అధికారం? నాకు కడుపొచ్చిన సంగతి తనకి చెప్పడం నేను చేసిన పెద్ద పొరపాటు! అతను మిత్రుడు అనుకొని చెప్పాను గాని – పురుషుడన్న సంగతి మర్చిపోయేను'' అంది ఛాయ.

## 26

సమయం రాత్రి పావు తక్కువ పదకొండు.

పోర్టికోలో కారు ఆగిన చప్పుడు !

ఆ భవంతి ' విజయనిలయం' లో గత పదిరోజుల్నించి కారు అలికిడి.

చెలం అనుకోకుండా కొన్న కారు అది. సింహం క్లబ్ మెంబరు ఒకరు బొంబాయి ట్రాన్సఫర్ మీద వెళిపోతుంటే – అతని దగ్గర చెలం కారు కొనడం జరిగింది. కొన్నాడేగాని ఆ కారు ఫలానావాడిది. సెకండ్ హాండుది అనిపించుకోడం చెలంకి కష్టంగావుంది. తన వ్యాపారం పండితే దీన్ని అమ్మి పారేసి లేటెస్ట్ మోడల్ – ఏదైనా కొత్త కారు ఒకటి తీసుకోవాలని అతని ఆలోచన!

ఇంటి తలుపులు తెరుస్తూ – ఎదురుగా విజయ!

ఇద్దరూ ఉదయం ఎవరి డ్యూటీలకి వాళ్ళు వెళిపోయేక – ఇంత రాత్రప్పుడు మళ్ళీ ఒకరి మొఖాలు ఒకరు చూసుకోడం ఇదే!

విజయ మొగుణ్ణి చూడగానే కళ్ళల్లో కోటికాంతులు విరజిమ్మేయలేదు. ఎక్కడలేని వుత్సాహం వుబికి గుండెలు గణగణ గంటలై మ్రోగలేదు.

అలాగే ఎక్కడెక్కడో తిరిగి తిరిగి వచ్చిన చెలంకి విజయ మెరుపుతీగలాగ, దిగొచ్చిన దేవతలాగ కానరాలేదు. ఆమెను చూడగానే కన్ను గీటుతూ, చిర్నవ్వు చిందిస్తూ పలకరించలేదు. ఆమెను దగ్గరకు తీసుకుని భుజంపై చేయివేసి, హాలుదాటి, మెట్లెక్కుతూ – బెడ్‌రూమ్‌లో ముద్దుపెట్టి ఆమెనుదురు తన నుదుటితో ఢీకొట్టలేదు.

తలుపు తీసింది విజయ అయినా, పార్వతమ్మయినా, రంగంమామ్మ అయినా పెద్దతేడా లేదన్నట్టు అతను ఇంట్లోకి ప్రవేశించేడు.

స్నానం చేసి బట్టలు మార్చుకున్నాడు చెలం.

''భోజనం చేయరా '' అడిగింది విజయ.

గబగబా నాలుగు మెతుకులు ఎంగిలిపడిలేచేడు చెలం.

బెడ్‌రూంలో మంచంపై ఆమె ఆ చివర, అతను ఈ చివర.

ఆ దంపతులిద్దరూ కొన్ని రోజులుగా అలానే పడుకుంటున్నారు. అంత ఎడంగాపడుకోడానికి ప్రత్యేకంగా కారణం అంటూ ఏదీలేదు.

ఎవరైనా అలిగేరా ? ఒకరిమీద ఒకరికి కోపమా ? అంటే అలాంటిదేమీ లేదు.

కౌగిలించుకు పడుకునేకన్నా – అలా ఎడంగా పడుకుంటేనే ప్రాణాలు సుఖంగా వున్నట్టున్నాయి – ఆ దంపతులకి!

లైంగిక వాంఛ ఇద్దరిలో సన్నగిల్లిందా?

సెక్సుపై ఇష్టం ఇద్దరికీ తక్కువ స్థాయికి చేరుకుందా ?

అయితే వాళ్ళు సెక్సులో పాల్గొనడంలేదా ?

పాల్గొంటున్నారు. ముభావంగా, మొక్కుబడిగా, మామూలుగా ...సిగరెట్ కాల్చినట్టు...ఏదో అన్నం తిన్నట్టు ...తామర గోక్కున్నట్టు – సాగిపోతోంది సెక్సు!

సెక్సులేకుండా, కనీసం చెలంచేయి తన గుండెలపై పడకుండా, అతని భుజం దిండుగా చేసుకుని అతని మెడ్పని ఊపిరి తగలకుండా ... నిద్ర పట్టేదా విజయకి!

అలాంటి విజయ ఇపుడు భోంచేసి హాయిగా నిద్రపో గల్గుతోంది. ఒక ఇష్టమైన మగశరీరం తన పక్కనే వున్నప్పటికి, అతని ఊపిరి తగుల్తున్నప్పటికీ – ఆమెలో కోరిక పడగవిప్పడంలేదు.

తను కల్చరల్ ఏక్టివిటీస్‌ని కంపెనీలో ఒక బాధ్యతగా, సవాల్‌గా, తీసుకున్నాక అందులో పూర్తిగా తలమునకలయి అలసిపోతోంది! శరీరానికి విశ్రాంతి ఇవ్వనంత బిజీ!

యజమాన్యం ఆమె శ్రమనీ, కమ్యూనిటీ సెంటర్ ని తీర్చిదిద్దుతున్న తీరునీ మెచ్చుకుంది.

ఆమె ట్రాన్సుపోర్టు ఇన్ కన్వీయన్సుని గుర్తించేరు. ఆమె సర్వీస్ – టౌన్‌షిప్పులో నివాసం దూరంగా టౌన్లో! ఇబ్బందే.

ఆమెని క్వార్టర్స్‌కి వచ్చేయమన్నారు.

చెలం దగ్గర ఆ ప్రస్తావన తీసుకురాలేదు విజయ. అందుకు అతను ఒప్పుకోడని తెల్సు! బంగారం లాంటి భవంతిని వదిలివెళ్ళడం కాదు – పెళ్ళాంద్వారా వచ్చిన క్వార్టరులో వుండటం మొగుడికి చిన్నతనం కదూ!

అసలు తన నేచర్ ఆఫ్ వర్క్ మారిన సంగతి చెలంకి తొలుత చెప్పలేదు విజయ. కావాలనే చెప్పలేదు.

రోజూ ఆలస్యంగా వస్తుంటే ''ఏమిటి'' అని అడిగేడు చెలం.

వున్న విషయం చెప్పింది.

విస్తుపోయేడు చెలం ''నాకీ సంగతి ఎందుకు చెప్పలేదు...? ఆ బాధ్యత తీసుకోకుండా వుండాల్సింది విజయా''

''ఉద్యోగం! వాళ్ళు ఏది చెబితే అది చేయాలి కదా ''

''రాత్రి ఆరేడుదాకా ఎందుకాశ్రమ....వాళ్ళు ఒప్పుకోనంటే వుద్యోగంమానేయ్. ఇంటిదగ్గర హాయిగా వుండు''

''ఇంటి దగ్గర ఎంత హాయిగా వుంటున్నానో, మీరెంతగా ఉండనిస్తున్నారో మీకు తెలీదా?'' అన్నట్టు తలెత్తి అతని కళ్ళల్లోకి చూసింది.

అతను చూపు మరల్చేడు.

''పూర్తి ఇష్టంతోటే ఆ బాధ్యతలు తీసుకున్నాను చెలం! నాకు చాలా ఇంట్రెస్టింగ్‌గా వుంది. చెప్పాలంటే నాకిప్పుడే ఎంతో ఉత్సాహంగా, తృప్తిగా వుంటోంది''

''నీ యిష్టం'' అని వూర్కున్నాడు చెలం.

''సాధ్యమైనంత మేరకు – సాయంత్రాలు వేగంగా యింటికి వచ్చేయి'' అన్నాడు చెలం.

''అలాగే'' అంది విజయ.

ఆ మాటలు అతని తృప్తికోసం అంది. అమలుచేద్దామనికాదు.

ఈ మధ్య తన జీవన విధానంలో పెనుమార్పులు వచ్చినప్పటికీ విజయపై ప్రేమ అణుమాత్రం తగ్గలేదనే అతను అనుకుంటాడు.

చెలంకి నిద్ర పట్టడంలేదు.

సిగరెట్‌పై సిగరెట్ కాలుస్తున్నాడు.

అతని ఆలోచనలు పక్కమీదనున్న ప్రియతమ భార్యపై కాకుండా తను కలలు గంటున్న నలభై ఎకరాల ప్రాజెక్టుమీద. అది లాభిస్తే తనకొచ్చే లాభం పాతిక లక్షలమీద !

ప్రాజెక్టు అనుకున్న ప్లాన్ ప్రకారం వెళ్ళడంలేదు. ఇంతకు ముందు ఎలా చెబితే అలా వినే అమాయకరైతులు – ఇప్పుడు తెలివిమీరిపోయేరు. ఇచ్చింది పుచ్చుకోకుండా – ఇంత

కావాలని డిమాండ్ చేస్తున్నారు. ఎగ్రిమెంటు చేసినవాళ్ళుకూడా పేచీ పెడుతున్నారు. ఈ ప్రాబ్లెమ్స్ అన్నిటికీ కారకుడు ఆ వూరి కరణం! వాడికీ తనకీ కమీషన్ దగ్గర పేచీ వచ్చింది. అంతే. వాడు ప్రాజెక్టునంతా పెంటచేసి పారేస్తున్నాడు. ఇలాంటి గొడవల్లో వుంటే సొసైటీ మాకా సైటువద్దని ఎక్కడ అనేస్తుందో అనే భయం!

కరణంతో, రైతులతో గొడవలకి సంబంధించిన ఆలోచనలు అతణ్ణి పిచ్చివాణ్ని చేస్తున్నాయి.

అతని ఆందోళన, అతని ఆరాటం, అతని మానసిక వత్తిడిని విజయ అర్థం చేసుకోడానికి ప్రయత్నించకపోవడం అతన్ని బాధిస్తుంది!

ఆమె ఒడిలో సేదతీరాలనీ, ఆమె గుండెలమధ్య తలపెట్టుకు ఉపశమనం పొందాలని అతనికి వుంటుంది. దానికి తగిన రియాక్షన్ ఆమె నుంచి లేకపోడంచేతో, మరెంచేతో తను వేరేచోట ఉపశమనాన్ని వెదుక్కుంటున్నట్టు అనుకుంటాడు. అది నిజంగా నిజమో, ఆత్మవంచనో అతనికే తెలీదు!

అతని టెన్షన్స్ నుంచి రిలీఫ్ తాగుడూ, జూదం కాక స్త్రీవాంఛ! స్త్రీవాంఛకి విజయ వుంది. కాని ఎందుకో వైముఖ్యం! అనాసక్తి! ఏవిఁటో నిసత్తువగా, నీర్సంగా వుంటుంది ఆమెను దగ్గరకు తీసుకోవాలనే వుత్సాహం, హుషారు వుద్రేకం చాలా తక్కువ స్థాయిలో వుంటున్నట్టు భావన!

ఇతర స్త్రీలు ఆకర్షించగలుగుతున్నారు! తను ఆ అనుభవాలను కూడా ఎంజాయ్ చేస్తున్నాడు. కనకరాజు భార్య హైమ! అపురూపవతి. గొప్ప సెక్సీగా వుంటుంది. తన దృష్టి, ఆలోచనలు ఆమెవైపు మళ్ళుతున్నాయి. మిత్రుడు కనకరాజుకి ద్రోహం చేసినవాడినవుతానని పాపభీతి! తను దూరంగా జరుగుతుంటే – జరుగుతున్నకొలదీ ఆమె దగ్గర కొచ్చి రెచ్చ గొడుతోంది. ఈ మధ్య మరీను!

తనని ఎందుకిలా విజయ హైమలా ఆకర్షించడంలేదు ?

పెళ్ళయిన కొత్తలో విజయతో గడిపినంతయిదిగా ఇపుడు తను ఎందుకు గడపలేకపోతున్నాడు? చెప్పాలంటే బోర్‌గా వుంటోంది ఎంచేత ?

తన పరిస్థితిని గమనించకుండా, అర్థంలేకుండా – ఆదివారాలు నావి, సాయంత్రాలు నావి– నీవు ఎక్కడికీ కదల్డానికి వీల్లేదు అంటూ మూర్ఖంగా బలవంతం చేసి చికాకు కల్గించి, బోర్‌డమ్ ఫీలయ్యేలా చేసిందనుకుంటే –

ఇప్పుడలా లేదు కదా ? మరి ఎందుకు బోర్ కంటిన్యూ అవుతోంది.

ఆమె తనకోసం ఇప్పుడు ఏ మాత్రం ఎదురుచూడ్డంలేదు. ఆలస్యాన్ని ప్రశ్నించడంలేదు. ఎక్కడికి వెళ్తున్నా అడ్డుతగలడంలేదు.

అంతా బాగానే వుందిగాని తనఉనికిని గుర్తించకపోడం అతనికి మళ్ళీ బాధ కల్గిస్తోంది. ఏమిటీ? తనలో శాడిస్టు వున్నాడా ?

ఆమె ఒకప్పుడు తనకోసం ఎదురుచూడ్డం భరించలేకపోయేడు. ఇపుడు ఎదురుచూడకపోడం కూడా బాధగానే వుంటోంది.

అంటే ఆమె తనని గుర్తించాలి. తనకోసం ఎదురుతెన్నులు, పడిగాపులు పడాలి. అదే సమయంలో తన స్వేచ్ఛకి ఆమె అడ్డుతగలరాదు.

నవ్వుకున్నాడు చెలం.

పాత విజయకన్నా కొత్త విజయ చైతన్యవంతంగా, స్వతంత్రంగా కనిపిస్తున్న మాట నిజం. కొంత ఆకర్షింపబడుతోందికూడా !

తనకి మనసారా ఆమెపై లైంగిక వాంఛ కలిగి ఆమెవైపు తిరిగేటప్పటికి నిద్రపోతోంది ! ఒకసారికాదు. చాలాసార్లు అది అనుభవమయ్యింది.

మొదటి రోజుల్లో ఆమె నిద్రపోయినప్పటికీ తను ఒకపట్టాన వదిలేవాడు కాదు. ఆమెను అల్లరి చేసి 'నిద్రలేపి, లేపుతూనే ఆమెను సెక్సుకి సిద్ధం చేసి – ఇద్దరూ ఎంత తృప్తిగా ఆనందం పొందేవారో అతనికి ఇప్పటికీ గుర్తుంది. అలా ఇపుడు విజయనిలేపే ఓపికా. ఉత్సాహం కొరవడ్డాయని అతని భావన. ఒకవేళ ఆమెను లేపితే చిరాకుపడి డిజప్పాయింట్ చేస్తుందని భయం !

అయితే నిద్రపోతున్న ఆమెను చూసి తీవ్ర ఆశాభంగంతో నిరాశ నిస్పృహలతో అప్‌సెట్ అవ్వడంలేదు. తేలిగ్గా ఒక నిట్టూర్పు విడిచి తనూ అంతే వేగంగా నిద్రలోకి జారుకోగల్గుతున్నాడు.

ఎందుకిలా జరుగుతోంది. తమ ఇద్దరి మధ్య ఆనందానికి చివర రోజులు దాపురించాయా?

ఎక్కడా లోపం ? ఏమిటా శూన్యం!

అర్థంకాడంలేదు చెలంకి!

స్విచ్‌నొక్కితే చీకట్లుపోయి బతుకంతా వెలుగే.

కాని ఆ స్విచ్ ఎక్కడుందో తెలియాలి. నీచేతికి తగలాలి.

అంతవరకూ అంతే!

అతని ఆలోచనలకి భంగం కలిగిస్తూ చప్పుడు !

చెవులు రిక్కించి విన్నాడు చెలం.

ఆగి ఆగి... నిశ్శబ్దాన్ని చీల్చుకువస్తోంది చప్పుడు.

ఆ చప్పుడు విజయనుంచి వస్తోంది!

విజయ వెక్కిళ్ళు పడుతోంది!

విజయ నిద్రపోయివుంటుందనుకున్నాడు... కాని ఏడుస్తోంది.

విజయ ఏడిస్తే తను భరించగలడా ?

భరించలేడన్న సంగతి విజయకి తెల్సు. అందుకే చప్పుడయ్యేలా ఏడుస్తోంది. నిశ్శబ్దంగా

ఏడ్వడం ఆమెకి చేతకాక కాదు!

విజయని తనవైపు తిప్పుకున్నాడు.

విజయ అతనివైపు తిరిగింది.

విజయ దుఃఖం వాల్యూమ్ పెరిగింది.

చెలం మరీ కలవరపాటు చెందేడు.

ఆమె చెక్కిళ్లు తడిమేడు.

తడితడిగా తగిలింది.

తల్లడిల్లిపోయేడు.

దగ్గరగా తీసుకుని, హత్తుకుని – ఆమెను పూర్తిగా ఆక్రమించుకున్నాడు.

ఆమె మెత్తని గుండెలు అతని ఇనప వక్షంకి తగిలి క్రష్ అయిపోయేలా దగ్గరకి తీసుకున్నాడు.

మెడకింద నుంచి ఎడమచేయి, పైనుంచి కుడిచేయిపోనిచ్చి గట్టి గొలుసు పట్టువేసేడు – తనకుడికాలితో ఆమె కాళ్ళకి లంకెవేసేడు.

వేసి – ఊయల ఊపుతున్నట్టు ఆమెని అటూ ఇటూ కుదుపుతూ, నుదురు ముద్దు పెట్టుకుంటూ సముదాయించసాగేడు.

విజయ ఆ పట్టు విడిపించుకోకుండా, నిక్కు, నీల్గులేకుండా– అతని గుండెల్లో తలదాచుకుంది.

ఎంత సముదాయించినా ఆమె ఏడుపుమాత్రం ఆపడంలేదు.

ఆమె ఎందుకేడుస్తుందో అతనికి అందడంలేదు. అర్థం కావడంలేదు.

పదిసార్లు అడిగించుకుని చెప్పింది

''ఆకలేస్తోంది !''

చెలం క్షణం ఆగి నవ్వేసాడు. అంతేనా అనుకున్నాడు.

విజయపై జాలి వేసింది. వట్టిపిచ్చిది అనుకున్నాడు.

చెలం నవ్వు కోపం రప్పించి ఆమె దూరం జరగబోయింది. బుంగమూతి పెట్టింది.

చెలం ఆమెని దూరం జరిగే అవకాశం ఇవ్వకుండా, ముద్దుపెట్టుకుని అడిగేడు– ''ఏం ఆకలి ? సెక్సాకలా ?''

''అదొక్కటే తక్కువ !... నామొహానికి అది కూడానా !''

సెక్సులో ఆమె తీవ్ర అసంతృప్తిని, కావల్సినంత పొందకపోవడాన్ని ఆమె నిందనుంచి గ్రహించేడు. ఆ వ్యవహారం సరిచేయాలనుకున్నాడు తర్వాత.

''మరి ఆకలేవిఁటీ ... భోంచేయలేదా ?''

తలవూయించి – ఇంకా దుఃఖపడింది.

విజయ భోజనంచేయలేదంటే అతనికే ఆకలివేసినట్టు లేచి కూర్చున్నాడు.

''ఎందుకు చేయలేదు విజయా ?'' తల నిమిరుతూ అడిగేడు.

''ఎందుకు చేయలేదని ఇపుడా అడగడం''

ఆమె దుఃఖం పెరిగింది

''లేదండీ – మీరు మారిపోయేరు. పూర్తిగా మారిపోయేరు. పెళ్ళం అంటూ ఒకతి వుందనే సంగతి మర్చిపోయేరు మీరు ఇంతకుముందు చెలంకాదు – నన్ను పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్నారు మీ ఎదురుగా ఉన్నా మాటాడ్డంలేదు. ఏకబుర్లూలేవు నన్ను మీ దగ్గరికి తీసుకోవడమే మానేశారు . .నేను మీకెలా కన్పిస్తున్నానో తెలీడంలేదు. మీరు నన్ను పూర్తిగా పట్టించుకోడం మానేశారు . ''

''అంత అన్యాయంగా అభాండాలు వేయకు. నేను నిన్నెంత ప్రేమిస్తున్నానో నీ మనసునడిగి చెప్పు ఒప్పుకుంటాను''

''కాకపోతే ఏంటండీ...నన్ను ఎదురుగా పెట్టుకొని భోంచేసేసారేగాని నేను భోంచేసింది లేందీ మీరు అడిగేరా ? ప్రేమంటూ కబుర్లు చెబుతున్నారు గాని – ఒక్కసారైనా నా ముఖంలోకి ప్రేమగా చూశారా? చూసుంటే మీరు నన్ను ఖచ్చితంగా భోంచేసిందీ, లేనిదీ అడిగేవారు... అవునా?''

ఆమె కళ్ళ వెంట నీళ్ళు జలజల పడిపోతున్నాయి.

విజయ భోజనం చేసిందీ, లేనిదీ అడగడం సాధారణంగా అతనికి అలవాటు. తను ఏ రాత్రికో వస్తుండటం చేత – ఆమె భోజనంముగించేస్తున్నప్పటికీ – చేసిందీ, లేనిదీ అడగడం అడుగుతాడు. తొలిరోజుల్లో ఎంతరాత్రయినా ఆగి ఇద్దరూ కలిసే భోంచేసేవాళ్ళు! మధ్యాహ్నం పూట ఎలానూ అవ్వదు. రాత్రిళ్ళు అయినా కలిసి భోంచేయలని ఇద్దరికీ ఉండేది. కనీసం ఆ కారణంగానైనా చెలం ఇంటికి వేగంగా వస్తాడని ఆశించేది. తర్వాత ఆమెను తను వచ్చేవరకూ ఎదురుచూడనివ్వకుండా భోజనం చేసేయమని నచ్చజెప్పేడు. పేచీలకి దిగి ప్రయోజనంలేదని ఆకలి కాగానే ముందుగా తనే భోజనం చేసేస్తోంది. ఆకలిగా లేనప్పుడూ అతను వచ్చేవరకూ ఆగుతోంది. అంచేత ఆమె భోజనం ముగించినా, ముగించకపోయినా అడగడం మాత్రం అడుగుతాడు, అది అలవాటు!

''ఎప్పుడూ అడిగేవాడిని ఈ రోజు అడగలేదంటే ఏ పరధ్యానంలోనో వుండి వుంటాను. అయినా నాకోసం ఆగడం ఎందుకు విజయా – భోంచేసేయలేకపోయేవా ?''

''పెట్టుకోడం పెట్టుకున్నాను. తినబుద్ధికాలే. మీతో తినొచ్చులే అనుకున్నాను.... ఎదురుగా వున్నా అసలు నేను మీకు కనిపిస్తేగా ?''

''సారీ విజయా!'' అని తనకి పనిష్మెంటు కావాలన్నట్టు ఆమె చేయిని తీసుకుని గట్టిగా చెంపపై వాయించుకోబోయేడు.

ఆమె బలంగా చేయి వెనక్కి లాక్కుంది. లేకుంటే ఆమె అయిదు వేళ్ళు అతని చెంపలకి అంటుకుపోయేవన్న మాట!

చెలం మంచంపై నుంచి లేచేడు.

''రా! విజయా. భోంచేద్దువు'' అని బతిమాలి లేపే యత్నం చేసేడు.

''వద్దు – మీరు పడుకోండి'' అంది.

చెలం పడుకోలేదు.

ఆకలి అంటున్న విజయని అలా వదిలి ఎలా పడుకోగలడు?

తను లేచి కిందకి దిగి వంటగదికి వెళ్ళేడు.

తనే ప్లేటు తీసి, కడిగి – ప్లేటులో అన్నీ అమరుస్తుంటే వంటగదిలో చప్పుడేవిఁటా అని తల్లి వచ్చింది.

తల్లిని చూసి కొడుకు కంగారు పడ్డాడు.

కొడుకు భోంచేయలేదనుకొని – ''కూర్చోబాబు – నేను వడ్డిస్తాను'' అంది, అప్పుడే నిద్రలేచి వచ్చిన తను.

''లేదమ్మా – నేను తినేశాను'' అనేసి నాలుక్కర్చుకున్నాడు.

తినేస్తే ? మళ్ళీ ఏవిఁటి ? ఎవర్కి అనే ప్రశ్నలు వుదయించి – ఆ వెంటనే ఆమెకి అర్థమయిపోయి లోనే నవ్వుకుంటూ వెళిపోయింది.

''దానికి నీవు భోజనం పెట్టుకెళ్ళుడమేవిఁటీ? దొరసాని దిగిరాలేదూ'' అనే గయ్యాళి అత్తకాదు పార్వతమ్మ.

ప్లేటుతో భోజనం, కొన్ని పళ్ళు పట్టుకొస్తున్న భర్తను చూసి నోరెళ్ళ బెట్టింది. దుఃఖమల్లా పోయి నవ్వు వచ్చింది.

మొగుడామెకి ప్లేటు నిండా ప్రేమపట్టుకొస్తున్నట్టు పొంగిపోయింది.

''ఏవిఁటండీ ఇదీ'' అంది.

''మా అమ్మకూడా చూసి అలానే అంది'' అన్నాడు చిర్నవ్వు నవ్వుతూ

''అయ్యో!'' అని అరచేయిని నోటి దగ్గర పెట్టుకుంది. ఆమెకి నవ్వు ఆగడంలేదు.

ఆమె తిననని మారాం చేస్తే – బలవంతంగా తనే కలిపి తినిపించేడు.

ఆమె కళ్ళు తడిసి ఆనందంతో మిలమిలా మెరిసేయి.

ఆమె కెంతో తృప్తిగా వుంది. పాతరోజులు గుర్తుకొచ్చేయి.

ఆమె అతనికి పళ్ళు తినిపించింది.

తినిపించేటపుడు కొంటెగా కావాలని వేలు కొరికేడు.

''ఆఁ!'' కోపం నటించి, వేలుని గాలిలో ఆడించింది.

''ఇలా మిమ్మల్ని ఎన్నాళ్ళకి చూసానండీ'' అంది తన్మయంగా.

''రోజూ కొరకడానికి నాకభ్యంతరంలేదు – తర్వాత నీ వేళ్ళే వుండవు. '' అన్నాడు నవ్వుతూ.

విజయ హుషారుగాలేచి కంచం వంటగదిలో పెట్టేసి వచ్చింది.

ఆ రోజు రాత్రి వాళ్ళ జీవితమే ధన్యమై పోయినట్టు పారవశ్యంతో పరవశించిపోయేరు ఆ దంపతులు! మహదానందంతో పులకరించిపోయేరు ఆ దంపతులు !

మనిషికి చావుందిగాని సెక్సుకు చావులేదు!

## 27

బుధవారం వచ్చింది!

ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు ఛాయకి.

అబార్షన్ బుధవారం చేసుకోవాలని నిర్ణయం తొలుత ఎంతో ధైర్యంగా తీసుకుంది! తీరా బుధవారం దగ్గర పడుతుంటే భూతంలా ఆమెలో భయం ప్రవేశించింది!

మన భయాలకి అనుగుణంగా కాలం స్తంభించిపోదు. మంగళవారం ముగిసిపోక తప్పదు. ముగిసిపోయి కాలం బుధవారంతో బుద్ధిగా తెల్లవారక తప్పదు.

తన జీవితబాటలో నిర్భయంగా ముందుకి సాగిన ఛాయ ఇదిగో – ఈ మలుపు దగ్గర ఆగిపోయింది. ముందు కెళ్ళడానికి భయపడుతోంది!

అందుకే విజయని తోడు తీసుకెళ్తోంది. ఈ రోజు తన చెంత ఎవరూ లేకుండా ఒక అడుగు ముందుకేసే ధైర్యం ఛాయకి లేదు.

ఓ రెండురోజులు తనకోసం ఎదురుచూడొద్దనీ – పనిమీద వెళుతున్నానని ఇంట్లో చెప్పి బయల్దేరింది ఛాయ.

ఆ రెండు రోజులు నర్సింగ్‌హోమ్‌లో వుండాల్సి వస్తే వుంటుంది. లేకుంటే రవిగదిలో! రవి ఎలానూ లేడు.

ఇద్దరు స్నేహితురాళ్ళు తెల్లారి ఎనిమిదింటికి నర్సింగ్‌హోమ్‌కి బయల్దేరారు.

డాక్టరు తొమ్మిందింటికి రమ్మంది.

బస్‌దిగి నడుస్తుంటే – నర్సింగ్ హోమ్ అడుగడుక్కీ దగ్గరవడుతుంటే – ఛాయ గుండెల్లో తుపాను!

ఆమె ఒళ్ళు కంపించిపోతోంది.

మరో పదిగజాల దూరంవుందనగా – పాదం మరిక ముందుకుపడలేదు ఛాయకి.

విజయ 'ఏం' అనడిగింది.

''భయమేస్తోందే...వద్దు....ఇంటికిపోదాం'' అంది ఛాయ.

''నీకు మతిగానిపోయిందేమిటి..మరేం భయంలేదు పద...భయమెందుకూ...కళ్ళుమూసుకుంటే ఒక అరగంట.''

''నా భయం అదికాదే ..నీకెలా చెప్పేది. నాలో సంఘర్షణ. నాకూ నా మనసుకీ పోరాటం. .నేను ఓడిపోతున్నానే విజయా ఓడిపోతున్నాను'' అనేటప్పుడు ఛాయ గొంతుక పూడుకుపోయింది.

విజయ విస్మయంగా చూసింది.

''నీవేమంటున్నదీ నాకు అర్థంకాడంలేదు''

''చెప్తాను...పద ఆ హోటల్లో కూర్చుందాం ''

ఇద్దరూ వెళ్ళి ఆడవాళ్ళకి కేటాయించబడిన కేబిన్‌లో కూర్చున్నారు.

రెండు టీలు ఆర్డరు చేశారు.

అక్కడ వాళ్ళిదద్దరు తప్ప మరెవరూ లేరు.

''నీ భయమేవిఁటో చెప్పు '' అంది విజయ.

''ఎందుకో నేను అబార్షన్‌కి మనస్ఫూర్తిగా సంసిద్ధం కాలేకపోతున్నానే. చేస్కుందామన్న ఘడియలు దగ్గరపడుతున్న కొలదీ వ్యతిరేకంగా నా మనసు తిరగబడుతోంది. ''

విజయ నిట్టూర్చింది.

టీలు వచ్చేయి.

''ముందు టీతాగు'' అంది విజయ.

టీ తాగుతున్న ఛాయ చేతులు వణకడం చూసింది. విజయమనసు అదోలా అయిపోయింది.

''ఎందుకే భయం. ఇష్టంలేకపోతే మానేస్తాం. ఇందులో ఎవరి ఫోర్సూలేదుకదా. ''

ఆ మాట కొంత ధైర్యాన్నిచ్చింది ఛాయకి.

''విజయా ! రాంబాబు అన్నట్టు నాబిడ్డని నాచేతుల్తో నేనే గొంతు పిసికి చంపేస్తున్నట్టు నిజంగానే నాకనిపిస్తోంది. నాలో పెరుగుతున్న బిడ్డని కిరాతకంగా ప్రేవునుంచి లాగిపారేయడం తలుచుకుంటే నా ఒళ్ళు కంపించిపోతోందే ! నేను చచ్చేనా పోతానుగాని....ప్రాణం పోసుకుంటున్న రక్తపు ముద్దను – నారక్తంనుంచి వేరుచేయలేనే...'' ఏడ్చింది ఛాయ.

విజయ తన చేయిని ఆమె భుజంపై వేసినొక్కింది.

''ఏమో అనుకున్నానుగాని నీవూ సెంటిమెంటల్ ఫూల్‌వే''

''నన్ను నీవేమనుకో! ..తిట్టు. కాని విజయా అబార్షన్ అంటే హడలుగా వుంది! ఆ మాట తల్చుకుంటే చాలు నా గుండెల్ని పిండేసినట్లు, కడుపు దేవేసినట్టు వుంటోంది. నేను అబార్షన్ చేస్కోలేను. అది స్పష్టం''

''నాకు యింకోటి స్పష్టంగా అర్థమవుతోంది?''

''ఏవిఁటి?''

''నీకు తల్లి కావాలనే కోరిక నీలో బలంగా వుంది. అవునా ?'' విజయ కళ్ళల్లోకి చూసి తలదించేసింది ఛాయ!

కళ్ళల్లో నీళ్ళు! పెదాల వణుకు!

''తల్లికావాలనే కోరిక నీకు యింతకు ముందు లేకపోవచ్చు కానిపుడువుంది. అబార్షన్‌కి నీ పరిస్థితులు ముందుకు తీసుకెళితే – నీలో మదర్లీ యిన్‌స్టింక్ట్ నిన్ను వెనక్కి లాగింది. ఆ యిన్‌స్టింక్టు నీ పరిస్థితుల్ని డామినేట్ చేస్తోంది''

అవును, డామినేట్ చేస్తోంది! అబార్షన్ అంటేనే తనలో బీజమెత్తిన బిడ్డ చచ్చిపోతుందని దిగులు, భయం ఆవహిస్తున్నాయి. ''అమ్మా నన్ను హత్య చేయడం న్యాయమా ? అంత యిష్టంలేని దానివి నాకు ఊపిరి పోసి, ఆహారం యిచ్చి నాలుగునెలలు నన్నెందుకు పెంచావు'' అని బిడ్డ కదుల్తూ అడుగుతున్నట్టు కడుపు దేవుతోంది. కడుపుతో లేకుంటే వేరే సంగతి. తల్లి కావాలనే కోరిక యింత బలీయంగా వుండేది కాదు. అందుకే తన కుటుంబ సభ్యులే పిల్లలనుకొని – ఏ పిల్లాపాపకలగకుండా ట్యూబెక్టమీ ఆపరేషన్ చేయించుకోవాలని కూడా అనుకుంది. కానిపుడు కడుపులో బిడ్డని చంపే ధైర్యం లేదు....తల్లికాక తప్పదు అయితే –

ఆర్థిక పరిస్థితులు యింతవరకూ ఎలావున్నాయి – ఆతర్వాత ఎలా వుంటాయి అనేది ఆలోచించాల్సిన అవసరం ఏర్పడింది.

ఎంత ఆలోచించినా ఆమెలో స్త్రీత్వం తల్లి అవ్వమనే మొగ్గు చూపిస్తోంది. మదర్లీ యిన్‌స్టింక్టు ఆమె పరిస్థితులని జయించింది.

''విజయా ! నేనొకటి అడుగుతాను చెబుతావా ?''

'' అడగవే !''

''నేను...నేను తల్లికావాలనుకోడం నేరమా ?''

''కాదు. ఆడది తల్లి కావడం సహజాతి సహజం. అనివార్యం. ప్రకృతి వరప్రసాదం. ఆడది గర్వ పడాల్సిన విషయం. ఎంచేత తెల్సా ?''

''చెప్పు?''

''కార్మికుడు శ్రమించి సంపదలను ఉత్పత్తి చేసి ప్రజల అవసరాలను సమకూరుస్తాడు. అవునా? అంతటి కార్మికులు స్త్రీలేకుంటే లేరుకదా ? ఎలా పుడతారు ? స్త్రీనుంచే కదా ! శ్రామికుల్నీ, మహాత్ముల్నీ, మావోలనీ, మార్క్సులనీ ఎవరు కన్నారు ? స్త్రీ! నవమాసాలు మోసి అలాంటి వాళ్లనెందర్నో ఉత్పత్తి చేసేది స్త్రీ ! అంతటి గొప్ప గొప్ప వాళ్ళని కన్న స్త్రీ ఇంకెంత గొప్పది.?

ఆ అదృష్టం, అవకాశం ఈ సృష్టిలో ఒక్క ఆడదానికే వున్నందుకు ఆడది ఎంత గర్వపడాలి?

కాని దురదృష్టమేమిటంటే ఉత్పత్తిని పెంచే కార్మికులకీ, బిడ్డలని ఉత్పత్తిచేసే స్త్రీలకీ ఈ దేశంలో విలువాలేదు, గౌరవంలేదు. సరికదా నీచంగా, అన్యాయంగా ట్రీట్ చేయబడుతున్నారు''–

''చంపేవు కదే నీ ఉపన్యాసంతో ! నేను చేసిన నేరమేటంటే – తల్లి కావడం నేరమా అని

నిన్ను అడగడం! అంతేనా ?'' అని నవ్వింది ఛాయ.

''నా మాటలు నిన్ను నవ్వేలా మామూలు స్థితికి తీసుకొచ్చేయంటే - ఫర్లేదు'' అని నవ్వి ''అమ్మాయ్ ! ఇక ఆలోచించకు. ఏ అబార్షన్ వద్దు. పండంటి బిడ్డనే కను,'' విజయ అనగానే సిగ్గుపడిపోయింది ఛాయ.

''నీ మనసులో మాట నాతో చెప్పించి - నీవు తృప్తి చెందుతున్నావు. అంతే!' అనుకుంది విజయ.

''సో, తల్లివి కాపోతున్నందుకు నా హార్టీ కంగ్రాచ్యులేషన్సు''

ఛాయ కళ్ళు మిలమిలా మెరిసేయి.

విజయని గట్టిగా వాటేసుకుంది.

తన సంతోషాన్ని పంచుకునేది విజయకాక రాంబాబు కూడా వున్నాడు

రాంబాబు ఇపుడేమంటాడో ?

ఏమనడానికైనా రాంబాబు ప్రస్తుతం ఊళ్ళోలేడు.

సెలవు పెట్టి పొలం చూస్కోడానికి వెళ్ళేడు..ఎపుడొచ్చేది చెప్పలేదు. ?

కోపంతో వెళిపోయేడుగా మరి!

## 28

రాత్రి ఎనిమిది అవుతోంది

చెలం కారు కనకరాజు ఇంటిదగ్గర ఆగింది.

ఇంట్లో కనకరాజు లేడు.

హైమ వుంది.

హైమ కనకరాజు సతీమణి! ఆమెది పాతికేళ్ళ పరువం. ఆమెది తెల్లగా మెరిసే ఒళ్ళు! ఆమె కళ్ళుల్లో కైపుంది. కసివుంది. చెక్కిళ్ళులో మెరుపువుంది. నునుపుంది. వంకరతిరిగిన ముక్కుకై జారులా పదును వుంది. చిలిపిగ నవ్వే లిప్‌స్టిక్ పెదాలు - ఎర్రటి పెదాలు. నవ్వేటప్పుడు చక్కని పలువరస. పొడవుగా ఆకర్షించే మెడ! ఎదుటివాళ్ళ గుండెల్ని నొక్కేసే - ఎత్తైన గుండెలు! జాకిట్‌కీ- చీరకీ మధ్య - ఎండలో మెరిసే ఇసుకలా - పొట్ట! స్లీవ్‌లెస్ జాకిట్లోంచి వేలాడే మృదువైన హస్తాలు, ముద్దుపెట్టుకోవాలనిపించేటంత చిన్న పాదాలు.

ఆమెను చూస్తున్నకొలదీ చెలం మతిపోయింది.

ఆమె తనని కోరుతోందని - ఆమె చేష్టలు బట్టి గ్రహించి వున్నాడు. ఆమెని కోరడం మిత్రద్రోహం అవుతుందేమోనని భయ్యం. అలాంటి సెంటిమెంట్సు వాళ్ళకి లేవు - లేనప్పడు వాటి గురించి నేనెందుకు ఆలోచించాలి ?- అనే ఆత్మవంచన.

కనకరాజు లేకపోవడంతో - వెళ్ళిపోబోతే వుండమంది హైమ.

వెళిపోడం అతనికి ఇష్టంలేదు.

నిజానికి చెలం కనకరాజా ఇంట్లో లేకుండా – హైమ ఒక్కతే వుంటే బాగుంటుంది – అని అనుకోక పోలేదు.

అనుకున్నట్టు హైమ ఒక్కతే వుంది.

కూర్చోమంది.

కూర్చున్నాడు – రాజాకోసం ఎదురుచూస్తూ కాదు.. ఆ సెక్సీ లేడీని చూస్తూ!

అతను చూస్తున్నకొలదీ ఆమె చూపించే యత్నం చేస్తోంది.

వాళ్ళిద్దరి మధ్య సాగుతున్న మాటలు తలాతోకలేనివి.

చూపులే అసలైనవి. చూస్తూ ఆనందించడాలే నిజమైనవి.

అందమైన గ్లాసుల్లో విస్కీపోసింది. ఐస్‌క్యూబ్స్ వేసింది.

అతనికో గ్లాసు ఇచ్చి తను కూడా సిప్ చేస్తూ ఎదురుగా కూర్చుంది.

అతను నోటితో విస్కీ కళ్ళతో ఆమెను తాగుతున్నాడు.

విస్కీ అయిపోయినప్పుడల్లా ఆమె పోస్తూనేవుంది.

అరగంటయింది.

కనకరాజా రాలేదు. రాడు. రాకూడదు.

అంతసేపూ ఆమె తన అందాన్ని ఎగ్జిబిట్ చేస్తూనే వుంది. నీవు చూసినంతసేపు చూపిస్తానంటోంది.

ఆమె జాకెట్టు ఆమె వక్షాన్ని పూర్తిగా కవర్ చేయలేదు. తలుపు మాటునుంచి తొంగిచూస్తున్న కన్నెపిల్లలా ఉంది వక్షం అందం. చాలా భాగం మెత్తగా మెరుస్తోంది. పైట అనేది ఆమె వేసింది వక్షాన్ని దాచడానిక్కాదు – మాటిమాటికీ జారవిడిచేయడానికి ! మాయలోనే అందం.

అందంలోవున్న ఆకర్షణ అంతా మాయ!

అందాలు చూస్తూ ఎంతసేపు ఆనందించగలడు?

చెలం ఇపుడు రెండోస్టేజీ అవసరంలో, వున్నాడు. ఇకచూస్తూ వుండిపోడం అతని తరంకాదు. టేప్‌రికార్డర్ నుంచి మంద్ర మంద్రంగా, మధురమధురంగా సంగీతం అతని ఉద్రేకాన్ని తారస్థాయికి చేర్చేలా హాయిగా వినవస్తోంది.

నిగ్రహం ఇక తన తరంకాదు. ఆమె కవ్విస్తోంది. మరిక కవ్వింపుకి చెలం అవకాశం ఇవ్వలేదు.

తలుపులు మూసేవున్నా – కిటికీలు తెరిచివున్నవి.

తమ తమకంలో కనకరాజా భార్యగాని, విజయ భర్తగాని ఆ విషయం గుర్తించే స్థితిలో

లేరు.

ఒంటిమీద ఒకనూలుపోగైనా లేని రెండు సడలి తప్పిన శరీరాలు ఒక వుండగా వున్న స్థితిలో –

కిటికీలోంచి క్లియర్‌గా ఓ నాలుగు కళ్ళు చూసేయన్న సంగతి వాళ్ళకి తెలీదు.

రెండు కళ్ళు ఆ దృశ్యాన్ని అరనిమిషంకన్నా ఎక్కువ చూడలేక వెనుతిరిగితే – మిగిలిన రెండు కళ్ళు మాత్రం అలా చూస్తూ వుండిపోయేయి !

## 29

ఆ రాత్రి హైమ ఇంటి నుంచి విజయ నిలయంకి చెలం రాబోయే టప్పటికి టైము సరిగ్గా పదిన్నర!

ఇంటికి రాగానే ముందుగా చెలంకి కొడుకు గుర్తుకొచ్చేడు.

సందీప్ గదిలోకి వెళ్ళేడు.

సందీప్ నిద్రపోతున్నాడు.

నుదుటిపై చేయివేసి చూసేడు.

ఒళ్ళు కొద్దిగా వేడిగా వుంది.

అక్కడేవున్న పార్వతమ్మ చెప్పింది – డాక్టరు వచ్చినట్టు, చూసి ఇంజెక్షన్ ఇచ్చివెళ్ళినట్టు!

ఈ స్థితిలో బాబు దగ్గర వుండాల్సింది తన తల్లికాదు – ఆ పసివాడి తల్లి విజయ.

ఆ మహాతల్లి ఏది ?

అడిగేడు.

''ఇంకా రాలేదు బాబు '' అంది నెమ్మదిగా.

అతని భృకుటి ముడివడింది.

''ఇంకా రాలేదా ?''

'రాలేదు' – అన్నట్టుగా తల వూయించింది పార్వతమ్మ.

''ఆ డర్టీ రాస్కెల్‌కి కొద్దిగైనా బుద్ధీ బుర్రా వుందా ? పిల్లాడు జ్వరంతో పడివుంటే అర్ధరాత్రులదాకా షికార్లు ! ... ఎన్నిసార్లు చెప్పాలి దానికి ?... రానియ్. రానియ్ ఈ రోజు దాని సంగతేవిఁటో తేల్చేస్తాను.. అంతు చూసేస్తాను ''

చెలం నోరు గుప్‌మని వాసన కొట్టింది.

అంతు తేలుస్తానంటూ తూలుతూ వెళిపోతున్న కొడుక్కేసి భయంగా చూసింది పార్వతమ్మ.

కొడుకు వ్యవహారం చూస్తుంటే ఈ రోజు కోడలిపిల్లతో పెద్ద గొడవే వేసుకునేటట్టు వున్నాడని – ఆమె భయంతో నిలువెల్లా వణికిపోయింది.

''ఏడుకొండలవాడా ! వెంకట రమణా ! నాకొడుకూ, నాకోడలూ ఏ గొడవా

పడకుండా కాపాడుతండ్రీ '' అని చేతులెత్తి దేవుణ్ణి ప్రార్థించింది పార్వతమ్మ.

చెలం బాల్కనీలో నించొని విజయ వస్తోందో, లేదో చూస్తున్నాడు.

విజయ ప్రవర్తన అతనికేమీ నచ్చడంలేదు రోజూ చూస్తున్నాడు కదా. రాత్రి ఎనిమిదిలోపున ఏరోజూ వచ్చిన పాపానపోలేదు.

తొమ్మిదీ.. పదీ... అదా ! ఆ టైములోనా ఆడది ఇంటికి రావడం!

నెమ్మదిగా ఎంత చెప్పినా వినదే ?

పసివాడు సందీప్‌కి మూడు, నాలుగురోజులుగా జ్వరం!

బుద్ధివున్న మనిషైతే కొడుకు దగ్గర సెలవుపెట్టి వుండొద్దూ?

ఆఖరికి తను సెలవు పెట్టమని చెప్పాడు కూడా !

బిడ్డని చూసుకోకుండా, భర్తని లక్ష్యపెట్టకుండా – రాత్రుళ్ళు తిరిగే ఆడాదాన్ని చూసి ప్రపంచం ఏమనుకుంటుంది ?

ఆమె తిరుగుళ్ళు తనకి తీవ్ర మనస్తాపాన్ని కలుగజేస్తున సంగతి ఆమె ఎందుకు గ్రహించదూ ?

అవునుమరి, తిరుగుబోతు ఆడాళ్ళు మొగుళ్ళను ఎందుకు లక్ష్య పెడతారు?

విజయ తిరుగుబోతుగా మారిందంటే – అందుక్కారణం ఆ తిరుగుబోతు ఛాయ! – తనీ అభిప్రాయానికి వారం క్రితమొచ్చేడు –

ఆ రోజు సాయంత్రం –

హాలులో కూర్చుని టీ-సేవిస్తూ, విజయతో నవ్వుతూ ముచ్చటిస్తున్న ఛాయని చూసి అప్పుడే ఇంట్లోకి అడుగుపెట్టిన తను షాక్ తిన్నట్టు అడుగుముందుకు వేయలేక అలా వుండిపోయేడు !

– నా ఇంటికి రావడానికి దీనికెంత ధైర్యం ?

ఆ ధైర్యాన్ని ఇచ్చింది విజయకాదా ?

విజయకి సీరియస్ వార్నింగ్ ఇచ్చి – ఆ వెంటనే ఛాయని 'గెటౌట్' అని అరుద్దా మనుకున్నాడు.

అంతలోనే ఛాయ నమ్రతగా సోఫాలోంచి లేచి, చిరునవ్వుతో మర్యాద పూర్వకంగా చేతులెత్తి నమస్తే చెప్పింది.

తనూ అప్రయత్నంగా 'నమస్తే' అనేశాడు.

ఆమెను గెటౌట్ అందామనుకున్నవాడు – తను ఆ సీన్ నుంచి గెటౌట్ అయేడు! గబగబా మెట్లెక్కి బెడ్‌రూమ్‌లోకి వెళిపోయేడు.

ఛాయ వెళ్ళిపోయిన తర్వాత తను విజయతో ఘర్షణ పడ్డాడు.

''అదెందుకొచ్చింది ?''

''అదెవరు ?''

''అదే ... ఆ లంజ ముండ ''

''ఇక్కడికి అలాంటి వాళ్ళెవరూ రాలేదు. వాళ్ళు కావాలనుకుంటే లంజ కొంపలకెళ్ళండి. అక్కడ బోల్డుమంది ''

''నేనంటున్నదీ అదే... లంజ కొంపల్లో వుండాల్సింది మన కొంపకొచ్చిందేం ''

''ఎందుకలా నోటికొచ్చినట్టు అనేస్తారు ఒక ఆడకూతురు మీద . ఆమె గురించి మీకేం తెల్సు?''

''నాకేంతెల్సో నీకంతా ముందే చెప్పాను. మర్చిపోయేవా ? నీవు నమ్మేవు కూడా.''

''అవును. నన్ను నమ్మించేరు...తర్వాత నిజం తెల్సుకున్నాను. ఛాయదేం తప్పులేదు'' అంది విజయ.

విజయ ఆవేశంతో రెచ్చిపోకుండా – నెమ్మదిగా ఛాయ పరిస్థితులు అతనికి వివరించి చెప్పింది.

ఆమె ఎంత చెప్పినా, కన్విన్స్ అవడం ఇష్టపడక నెగిటివ్ క్వశ్చన్స్ కురిపించేడు. వాటికి ఓపిగ్గా ఆమె సమాధానం చెప్పింది. ఆమె సమాధానాలు అతనికి రుచించలేదు.

'' ఏది ఏమైనా నీవు ఆమెతో స్నేహం చేయడం నాకు ఇష్టంలేదు'' అని స్పష్టం చేశాడు.

''కనకరాజుతో స్నేహం మీరు వదుల్కోగలరా? అలాగే నేనూను!'' అంటూ ''ఛాయ స్నేహాన్ని నేను వదుల్కోలేను చెలం. అది నా సాధ్యంకాదు'' అని విజయకూడా స్పష్టం చేసింది.

చెలంకి చిరాకు వేసింది.

అయినా చిరాకుని అణచుకుని – నచ్చజెప్పే యత్నం చేసాడు.''అదికాదు విజయా! ఆమె స్నేహంతో నీవెక్కడ చెడిపోతావోనని నా భయం!''

''మీరు కనకరాజు స్నేహంతో చెడిపోయినట్టా ?''పొడిచినట్టుగా అంది విజయ.

''నీ బుర్రతిరుగుడు సమాధానాలేగాని – ఎందుకు చెప్తున్నానో అర్థంచేసుకోవు. దానితో కలిసి ఎలా చస్తావో చావు... నీ యిష్టం'' అని అక్కణ్ణించి లేచేడు చెలం. అంతేతప్ప ''నీవు రేపణ్ణించి ఛాయతో స్నేహం చేయడానికి వీల్లేదు. చేసేవంటే తొక్క తీసేస్తాను'' అని అనలేకపోయేడు.

ఇంతవరకూ తనని లక్ష్య పెట్టలేదు అనుకున్నాడు. ఇప్పుడు పసివాణ్ని కూడా లక్ష్య పెట్టక తిరుగుతోంది విజయ.

మెత్తగా చెప్పాల్సిన టైము దాటిపోయింది. సరైనా స్ట్రోక్ ఇవ్వాలని నిర్ణయించుకున్నాడు చెలం.

విజయ కోసం బాల్కనీలో నించొని చూస్తున్నాడు చెలం.

అతను తాగిన విస్కీ అతన్ని నిలబడనీయడంలేదు.

అంతలో –

ఆటో వచ్చి ఆగింది.

అందులోంచి విజయ దిగింది.

గేటు తెరుచుకుని లోనకి వచ్చింది.

అవతల చెలం కోపానికి గేట్లు తెరచుకున్నాయి. గబగబా మెట్లు దిగేడు.

విజయ ముందుగా కొడుకు సందీప్ దగ్గరకెళ్ళి...చూసి...వస్తుంటే

హాలులో ఎదురుగా చెలం!

ఆమె ఒక క్షణం ఆగింది.. ఆగి ... కదలబోతుంటే –

''ఇపుడు టైమెంత ?'' తీవ్రంగా అడిగేడు.

విజయ ఏం మాటాడకుండా – ముందుకి కదిలింది

''అవతల జ్వరంతో కుర్రాడిని పెట్టుకుని – అర్ధరాత్రిళ్ళు దాకా ఏమిటా తిరుగుళ్ళు?''

అడిగినది తనని కాదన్నట్టు ... మెట్లెక్క సాగింది.

''ఏమిటా పెడసరం!.....అడిగేది నిన్నే ?'' రెండు తగల్నిస్తే చెవుడూ, గిమిడూ ఎగిరిపోద్ది

ఆగింది విజయ.

మెట్లమీదున్న విజయ తల మాత్రమే తిప్పి అతని దిక్కుగా చూసింది. చూడ్డం అతని కళ్ళలోకి మాత్రం కాదు. నోటిదాకా వచ్చింది అణచుకునే యత్నంలో – కిందపెదవి ఆమె పళ్ళ కింద బిగుసుకుపోయింది.

ఒక నిట్టూర్పు విడిచింది.

గబగబా మెట్లెక్కి బెడ్‌రూమ్‌కి వెళ్ళిపోయింది.

చెలంకి ఒళ్ళు మండిపోయింది.

ఎదురుగావున్న కుర్చీని ఫడేల్మని తన్నేడు.

కుర్చీలా విజయని తన్నే కోపం అతనికి రాడంలేదు!

అంగలు వేసుకుంటూ మెట్లెక్కేడు చెలం.

పార్వతమ్మా, రంగంమామ్మ నిశ్చేష్టులై చూస్తున్నారు.

చెలం గదిలోకి వచ్చేటప్పటికి – విజయ బాత్రూమ్‌కి వెళ్ళింది.

బాత్రూమ్ తలుపులు దబదబా బాదుదామనుకుని ఆగిపోయేడు. జుట్టు బక్రుకొని...ఫేంటు జేబుల్లోకి రెండు చేతులూ పోనిచ్చి....అటూ, ఇటూ పచార్లు చేయసాగేడు.

టవల్‌తో ముఖం తుడుచుకుంటూ – బాత్రూమ్ నుంచి బయటకి వచ్చింది విజయ.

ఫ్రిజ్‌లో వాటర్ బాటిల్ తీసింది. గ్లాసులో నీళ్ళు ఒంపుకు తాగింది. గ్లాసుమీద గ్లాసు.

అంతసేపూ ఆమెనలా చూస్తునే నించున్నాడు చెలం!

అతనికి విజయతో ఎలా మాటాడాలో తెలీడంలేదు.

అనవసరంగా రెచ్చిపోకుండా – నిదానంగా మాటాడ్డం ఎలా వుంటుంది ? అనుకున్నాడు.

మంచి ఆలోచనే! రావల్సిన కోపం రానపుడు ఏంచేస్తాడు.

విజయ జడను విప్పి వదులుగా ముడివేసుకుంది.

అతనివైపు అసలు చూడనైనా చూడటంలేదు విజయ.

విజయా ! కూర్చో! నీతో ముఖ్యమైన విషయం మాటాడాలి'' అన్నాడు చెలం, ఃటువుగానే

''నాకు ఆకలేస్తోంది'' అని వెంటనే కిందికి దిగి వచ్చేసింది.

డైనింగ్ టేబిల్పై వడ్డించి పెట్టుకుంది.

పెట్టుకుందే గాని – ఆమెకి భోజనం చేయాలనిపించలేదు.

అతన్ని తప్పించుకు వచ్చేద్దామని వచ్చేసిందిగాని – ఆకలివేసి మాత్రంకాదు

కంచంతోసేసి. . టేబుల్పైన చేతులు ఆన్చి తలవాల్చుకుంది.

ఆమె తలపై చేయిపడింది.

తలెత్తి చూసింది విజయ.

అత్తయ్య ! .. పార్వతమ్మ!

విజయకెందుకో దుఃఖం ఒక్కసారిగా ముంచుకొచ్చి – లేచి, అత్తయ్యను కౌగలించుకు ఏడ్చేసింది.

బిత్తరపోయింది పార్వతమ్మ

ఆందోళన చెందింది పార్వతమ్మ.

''విజయ ఎందుకేడుస్తుందో, ఏడుస్తున్న దాన్ని ఎలా ఓదార్చాలో పార్వతమ్మకి తెలీడంలేదు.

''ఏమయింది తల్లీ'' అడిగింది.

ఏడుపే జవాబు.

''అయ్యో తల్లీ! ఏడ్వకమ్మా !...ముందు భోంచేయ్ '' అంది... కంచం ఆమె ముందు పెడుతూ.

''ఆకలిగా లేదత్తయ్యా'' అని అక్కణ్నించి కదిలి, సందీప్ గదికి నడిచింది.

సందీప్ నిద్రపోతున్నాడు.

సందీప్ బుగ్గపై ముద్దు పెట్టుకుంది.

సందీప్ని పక్కకి జరిపి – సందీప్ పక్కలో చోటుచేసుకు పడుకుంది – సందీప్ చుట్టూ చేయివేసి

విజయకి దుఃఖం వస్తోంది.

కన్నీళ్ళతో తలగడ తడిసిపోతోంది.

విజయ ప్రవర్తన అర్థంకాక వెర్రెత్తినట్టుంది చెలంకి!

ఆమె ఎంతకీ మేడపైకి రాకపోవడంతో – పైనుంచి కేకేసి పిలిచేడు.

కేకలు విజయకి వినబడుతున్నాయి. కాని కదల్లేదు మెదల్లేదు.

''అయ్యగారు – పిలుస్తున్నారమ్మా'' అంది రంగం మామ్మ.

''రానని చెప్పు'' అంది విజయ.

రంగం మామ్మ అలా చెప్పలేదు ''బాబు దగ్గర పడుకుంది'' అని చెప్పింది.

చెలం విసురుగా సందీప్ గదికి వచ్చేడు.

''పిలుస్తుంటే... ఏవిఁటి నీ నిర్లక్ష్యం ?''

ఆమె పలకలేదు.

''నిన్నే !'' గట్టిగా అరిచేడు.

''ప్లీజ్ ! ఎందుకు నన్నిలా వేధిస్తారు ? మీకు నమస్కారం పెడతాను. కాసేపు నన్ను ఒంటరిగా వదిలేయండి..వెళ్ళండి''

వెయ్యి నమస్కారాలు పెట్టినా అక్కణ్ణించి వెళ్ళేలాలేడు తను!

''పైకి రామందు నువ్వు?'' చేయిపట్టుకు లాగేడు.

''నేను రాను'' ఆమె చేయి విదిలించుకుంది.

''రావాలి .చెప్తుంది నీకే..నీతో మాటాడాలి'' గట్టిగానే అన్నాడు.

''నేను మాటాడే స్థితిలో లేను''

''ఏం? అంత అలసిపోయి వచ్చేవా ?'' వ్యంగ్యంగా అన్నాడు.

నిజంగానే ఆమె అలసిపోతోంది.

తను అంత బిజీగా వుంటోంది.

తను పనిచేస్తున్న కంపెనీ స్థాపించి సరిగ్గా పాతికేళ్ళయిన సందర్భంగా భారీ ఎత్తున ఉత్సవాలు జరుగుతున్నాయి. రోజాకొక బ్రహ్మండమైన ప్రోగ్రామ్! బాలమురళీకృష్ణ గాత్రం, చిట్టిబాబు వీణ, శోభానాయుడు నృత్యం, వేదాంతం కూచిపూడి, యస్.పి. గానకచేరీ, వేణుమాధవ్ మిమిక్రీ... రోజాకొక ప్రోగ్రాం.

ప్రోగ్రామ్సకి సంబంధించిన యాక్షన్ కమిటీలో విజయ ఒక ఆక్టివ్‌మెంబరు. ఇక ఆమెకి తీరికెక్కడ?

టైము చాలేదెక్కడ?

విజయకి విశ్రాంతి లేకపోయినప్పటికీ ఉత్సాహంగానే పాల్గొంటోంది.

సరిగ్గా ఆ సమయంలోనే బాబుకి బాగాలేకపోడం – ఆమెకి బాధ, ఇబ్బంది కల్గించింది.

గత మూడురోజాలుగా డ్యూటీకి ఉదయం వెళ్ళకుండా మధ్యాహ్నం ఏ రెండింటికో – కంపెనీ వ్యాను ఇంటికి రాగా వెళ్తోంది. ప్రోగ్రామ్స ఎరేంజ్‌మెంటుకి సంబంధించి తను వెళ్ళక తప్పని పరిస్థితి!

బాబు విషయమై తీసుకోవల్సిన జాగర్తలు అత్తయ్యకి చెప్పే వెళ్తోంది విజయ. ఆమాటకొస్తే అత్తయ్యే తనకంటా బాగా బాబుని చూసుకుంటుంది – అనే ధైర్యం విజయకి వుంది.

''ఏం, అంత అలసిపోయేదాకా తిరగకపోతేనేం?''

ఛీ ! ఏమిటీ మనిషి!

అతనితో మాట్లాడలన్నా, ముఖంలోకి చూడాలన్నా అసహ్యం పరమ అసహ్యం వేస్తోంది విజయకి

''ఇదిగో నీకిదే చెప్పడం ! నీవు రేపట్నించి డ్యూటీకి వెళ్ళడానికి వీల్లేదు ఇది నా ఆర్డరు ! అంతే సెలవే పెడతావో, రిజైన్ చేస్తావో అది నీ ఇష్టం నీవు మాత్రం బరితెగించి ఇక రాత్రిళ్ళు తిరిగితే ఒప్పుకునేది లేదు''

విజయకి ఒక్కసారిగా చిర్రెత్తుకొచ్చేసింది

''అంటే మీ ఉద్దేశం?''

''నీవిలా బరితెగించి తిరిగితే నేనొప్పుకోనంటున్నా ''

''ఒప్పుకోకపోతే మానేయ్ ! నేను మాత్రం డ్యూటీకి సెలవు పెట్టేదిలేదు. రిజైను చేసేది అంతకన్నా లేదు'' – ఆకాడికి నిగ్రహంతోనో అంది విజయ.

''అర్ధరాత్రులు తిరగడం మానేది అంతకన్నా లేదు అదీకూడా అనూ ! ... ఆడది తిరిగి చెడరుం అంటే ఇదే !''పాడిచేడు.

విజయ చివాల్న లేవకుండా వుండలేకపోయింది.

''చెడటం ఏమిటీ ? సరిగ్గా మాటాడండి''

''మొగుడు వద్దన్నా...తిరుగుళ్ళు మానడంలేదంటే . అందులోనూ రాత్రుళ్ళు!''

''తిరిగితే.... చెడిపోయినట్టా?''

''ఖచ్చితంగానూ''

''నాగురించేనా నీవంటున్నదీ''

''నీవైనా – ఎవరైనా అంతే !''

''నా గురించి చెప్పు''

''అంతే! నీవైనా అంతే.''

విజయ చప్పున ఆడపులిలా మంచంమీంచి లేచి – ''నన్నంత మాట అంటావా '' చెలంని ఫెఢేల్మని ఒక లెంపకాయ వేసింది –

చెలం మొదట స్టన్నయిపోయేడు. తరవాత ఆమె కళ్ళల్లో ఏం కనిపించిందో –

''అంటాను, ముమ్మాటికీ అంటాను'' అన్నాడు నొక్కి, నొక్కి.

ఆమె రెచ్చిపోయింది.

అతని జుట్టుపట్టుకు గట్టిగా పీకేసింది. పీకేస్తూ –నేను చెడిపోయేనని అంటావా ? అంటావా? అని ఏడుస్తూ – ''చెడిపోయింది నేను కాదు – నీవు, నీవు'' అని అరుస్తూ అతని షర్టుని గుంజి గుంజి అతని చెక్కిళ్ళు రక్కేసింది. అతని చొక్కా చింపేసింది.

అంతసేపూ అతను ఒక శాడిస్టులా ఆమె ఆవేశాన్ని ఎంజాయ్ చేసాడు.

అందుకే ఆమెను కొట్టేబదులూ, చితకతన్నే బదులూ...పక పకా నవ్వేడు. ఆమె అతనిపై ఎటాక్ ఇచ్చిన కొలదీ''నీవు చెడిపోయేవని'' పదేపదే అన్నాడు.

అయితే పళ్ళునాటుకు పోయేలా గట్టిగా జబ్బ కరవడంతో – తిమురు వదిలి, విపరీతంగా నొప్పి కలిగి – ఆమెను వొక ఊపున తోసేసాడు.

అప్పటికే సందీప్ తుళ్ళి పడిలేచి బిగ్గరగా ఏడ్వడం మొదలెట్టగా – బాబుని ఒడిలోకి తీసుకుంది పార్వతమ్మ.

చెలం తోసెయ్యడంతో పడిపోయిన విజయకి గోడ తగిలి నుదురు గాయమైంది.

పార్వతమ్మ సందీప్‌ని రంగంమామ్మకి అందించి – పడిపోయిన కోడల్ని లేవదీసింది. లేవదీసిన అత్తయ్యని కౌగలించుకు ఏడ్చేసింది విజయ.

''అత్తయ్యా. నేను ...నేను చెడిపోయేనట. నీవు నమ్ముతావా .''

''లేదమ్మా లేదు! నీవు అలాంటిదానివి కావు'' అని దగ్గరికి తీసుకుని కొడుకు చెలంవైపు తిరిగి ''ఛ! అవేం మాటలు నాయనా...నా కోడలు అలాంటిది కాదురా '' అంది గట్టిగానే.

విజయ చెడిన ఆడదని అతనుమాత్రం అనుకుంటున్నాడా ?

లేదు !

అతని కోపమల్లా వద్దంటే ఆమె రాత్రిళ్ళు తిరగడం ! మాట మీద మాటొచ్చి ఏదో అనేశాడు. అనేశాక ఆమాటపై నిలబడిపోవల్సివచ్చింది. అన్నమాటని వెనక్కి తీసుకోడం అతనికి ఇష్టంలేదు. ఎక్కడలేని అభిమానం!

అయితే – విజయను ఎలాగోలా ఇపుడు వంచి బుద్ధి చెప్పి తిరుగుళ్ళు అరికట్టకపోతే చెడిపోవచ్చునే భయం కూడా వుంది. అందులోనూ ఛాయతో స్నేహం ఒకటి! అదొక భయం!

''లేదమ్మా ! దీని సంగతి నీకేం తెల్సు?...ఇదెలాంటిదో నాకు తెల్సు !'' తల్లితో అన్నాడు.

విజయకి ఒళ్ళు వుడికిపోతోంది.

చెలంపై ఎక్కడలేని కసి.

''నీకేం తెల్సు నాగురించి ! తెలిస్తే నీవిలా దుర్మార్గంగా మాటాడవు. కాని నీ గురించి నాకు తెల్సు!'' అంది విజయ.

'' ఏమిటి తెల్సు?''

''నీవు పూర్తిగా భ్రష్టు పట్టిపోయేవు. చెడిపోయింది నీవు – నేను కాదు. నువ్వు. నువ్వు... చెడిపోయింది నువ్వు'' అరిచింది విజయ.

ఆడది చెడపోవడమంటే అర్థమయిందిగాని మగవాడు చెడిపోవడం ఏమిటో పార్వతమ్మకి అర్థంకాక కోడలుకేసి విస్తుపోతూ చూసింది.

''నీ కొడుకు చిన్నోడు కాదత్తా ! పరమ దుర్మార్గుడు...వేరే ఆడదానితో కులుతున్నాడు తెల్సా?''

పార్వతమ్మ ఆశ్చర్య పోలేదు. కొడుకు వేరే ఆడదానితో వెళితే పరమ దుర్మార్గం

ఎందుకవుతుందో ఆమెకి అర్థం కాలేదు. అందులో పెద్ద తప్పు కూడా కనిపించలేదు

వీడు ఒకదానితోనే కులుతున్నాడు వెర్రి సన్నాసి! ఒకరు కాకుండా ఏ పదిమందితోనో కులికితే వీడికి అచ్చం మమ్మూర్తులా తండ్రి బుద్ధులే అని మురిసిపోయే పాతకాలం మనిషి పార్వతమ్మ!

శీలం అనేది ఆడదానికైనా, మగాడికైనా ఒకటే అనేది ఆమెకి చచ్చినా అర్థంకాదు చెలం మాత్రం గతుక్కుమన్నాడు.

విజయ చెలం మీదికి వెళ్ళింది.

అతని కళ్ళల్లోకి చూస్తూ అడిగింది –"ఇంతవరకూ నా తిరుగుళ్ళు గురించి అడిగేరు...ఇపుడు నేను మీ తిరుగుళ్ళు గురించి అడుగుతున్నాను.చెప్పండి ? మీరు ఈ రోజు ఎనిమిది గంటలకి ఎక్కడికి వెళ్ళేరు?"

"ఎక్కడికెళ్తే – నీకెందుకు?" – దబాయించేడు

"నాక్కావాలి – చెప్పండి"

"క్లబ్‌కి"

"అబద్ధం! కనకరాజు ఇంటికెళ్ళేవు!"

గుటకలు మింగేడు.

"అవును. ముందువెళ్ళేను – అతను లేడు. అక్కణ్ణించి క్లబ్‌కి వెళ్ళే "

"నేనడుగుతున్నది – ఎనిమిది గంటలకి అక్కడ వున్నావా ? లేదా ?"

"టైము తెలీదు. వెళ్ళడం వెళ్ళేను. అతను లేడు"

"అతనెందుకు నీకు. అతను లేకపోవడమే కావాలి నీకు. అతను లేనప్పుడు అతని పెళ్ళాం వుండడమే కావాలి నీకు!"

"అతను లేకపోవడంతో – క్లబ్‌కి వెళ్ళిపోయానంటే నమ్మవేం ?" దబాయించేడు.

"నమ్మను. నేనేకాదు. నీ ప్రాణ స్నేహితుడు కనకరాజు కూడా నమ్మడు"

చెలంలో చెలనంలేదు!

అలా వుండిపోయేడు కాసేపు.



జ్వరంతోవున్న సందీప్ పట్ల విజయ మనసు లాగేసి – ప్రోగ్రామ్ దగ్గర పూర్తిగా వుండలేక– తన పని మిగతా వాళ్ళకి చూడమని అప్పజెప్పి – కంపెనీ కారుపై ఇంటికి బయల్దేరింది. అయితే–

బయల్దేరిన కారు తోవలో బ్రేక్ డవున్ అయింది.

ఎంతలో ఇంటికెళ్తానా అని వేగిరపడుతున్న విజయ – కారు బ్రేక్ డవున్ కావడంతో – ఉస్సురని నిట్టూర్చి నిస్సహాయ స్థితిలో వున్న విజయ – అదే తోవలో వెళిపోతున్న కనకరాజు కారు ఆపి లిఫ్టు ఇచ్చేడు.

ఇంటి దగ్గర డ్రాప్ చేస్తానన్నాడు. అయితే అతని ఇల్లు 'విజయనిలయం' కి ముందే తగుల్తుంది కాబట్టి – తన ఇంట్లో టీ తీసుకుని వెళ్ళ వల్సిందిగా రిక్వెస్టు చేశాడు. బాబు పరిస్థితి చెప్పి, మరోసారి చూద్దాం – అని ఆమె అన్నప్పటికి 'ప్లీజ్' అని బలవంతం చేశాడు.

కారుని అతని ఇంటికి పోనిచ్చేడు – ''ఓహ్! వాట్ ఎ సర్‌ప్రైస్! మీ శ్రీవారి కారు ఇక్కడే వుంది. హీయీజ్ వెయిటింగ్ ఫర్‌మీ – నో ప్రాబ్లెమ్. టీ తీసుకున్నాక మీవారి కారులో వెళ్ళిపోదురు'' అన్నాడు విజయతో.

ఇంకేం టీ!

కనకరాజు కిటికీ దగ్గరే ఆగిపోయేడు.

ఆగిపోవడమే కాదు – విజయని చూడమని చూపించేడు.

విజయ ఆ దృశ్యాన్ని అరనిముషం కన్నా ఎక్కువ చూడలేకపోయింది.

అక్కడనుంచి పరుగు, పరుగున వచ్చేసింది.

చీకట్లో భోరున ఏడ్చేసింది.

చెలంపై అసహ్యంతో నిలువెల్లా వణికిపోయింది. కడుపులో తిప్పేసింది. భళ్ళున వాంతి చేసుకుంది.

వెనక్కి వెళ్ళి – చెలాన్ని పొడిచేసి తన బతుకు తనే బతకాలనుకుంది.

ప్రాణం కన్నా ప్రాణంగా ప్రేమించిన తన చెలం...పరస్త్రీ పొందులో... గుర్తు కొస్తుంటే... ఆమెకి నిలువెల్లా దుఃఖం కోపం, అసహ్యం వేసింది.

ఆమెకి ఇంటికి వెంటనే వెళ్ళాలనిపించలేదు.

ఏం చేయాలో, ఎక్కడికెళ్ళాలో తోచని స్థితిలో ఆమెకి ఛాయ గుర్తుకొచ్చింది.

ఛాయ దగ్గరికి వెళ్ళింది

జరిగిందంతా చెప్పుకు ఏడ్చింది.

తర్వాత ఛాయ ఇచ్చిన ధైర్యంతోనే ఇంటికి రాగలిగింది.

ఇంటికి వచ్చిన దగ్గరనుంచీ తను ఎంతో కంట్రోల్ చేస్కోడానికి ప్రయత్నించింది.

కాని 'తను చెడిన ఆడదని' – అనవసరంగా చెలం నింద వేసి రెచ్చగొట్టడంతో – తను చూసిన అతని 'చెడు' ని వెళ్ళగ్రక్కకుండా వుండ లేకపోయింది విజయ.

''అయితే ఏమంటావ్'' అన్నాడు చెలం.

దిగ్భ్రమ చెందింది విజయ.

అతని రంకుభాగోతం బట్టబయలుచెయగానే షాక్ అవుతాడనుకుంది. నోటిమాటరాక, అతని ముఖం నల్లబడియి, పాలిపోతుందనుకుంది

తప్పు చేసినట్టు తలవంచుతాడనుకుంది.

దొంగ దొరికిపోయినట్టు వణికి పోతాడనుకుంది.

''ఎవర్నో చూసి నన్ను అనుకుంటున్నావ్. నేను కాదు' అని కనీసం ఏదో బొంకి,

తత్తరపడతాడనుకుంది.

చేసిన పాపానికి పశ్చాత్తాప్పడితే – క్షమించేద్దామనకుంది కాని – అలాంటిదేమీ లేదు పైగా 'అయితే ఏమంటావ్' అని దబాయిస్తున్నాడు.

విజయకి కోపం, దుఃఖం, అసహ్యం కసి ... ఒక్కసారిగా ముప్పిరి గొన్నాయి

అంతే ! చెలాన్ని జడాయించేసింది విజయ.

''చెలం ! నీవింత నీచుడివని అనుకోలేదు నీవింత భ్రష్టుడివనుకోలేదు తాగుడూ, జూదం లాంటి వెధవ వ్యసనాలే వున్నాయనుకున్నాను గాని... నీవు స్త్రీలోలుడవని ఏమాత్రం ఊహించలేదు.

పెళ్ళం వుండగా వేరే స్త్రీలతో కక్కుర్తిపడాల్సిన అవసరం నీకేవిఁటొచ్చిందని అడుగుతున్నాను?

ఏం? ఆ హైమ ఇచ్చే సుఖం నేను ఇవ్వడం లేదా ? ఇవ్వలేనా ?నేనివ్వలేని సుఖం అది ఇస్తోందా ? దానికి వున్నవే నాకు వున్నాయి గదా ! ఆ వున్నవి – అది నీకెలాగిస్తుందో – నేన్నీకు అలా ఇవ్వగలను.కదా ! చెప్పు ? నేను ఇవ్వనన్నానా ? లేక అలా ఇవ్వడం నాకు చేతకాదా ?

చెప్పు ? ఆ అవసరం ఏవిఁటొచ్చింది?

నీదంటూ ఒక స్త్రీ వుండగా పరాయి కొంపల్లోకి, కోకల్లోకి దూరాల్సిన అవసరం ఏమొచ్చింది?''

అని కాసేపాగి –

''అత్తలాంటి ఆడవాళ్ళని అర్థం చేసుకోగలను. తరతరాలుగా ఇల్లూ, సంసారం తప్ప బయట ప్రపంచం, నాగరికత, సామాజిక అవగాహనలేని స్త్రీ ఆమె! పదిమంది ఆడాళ్ళ దగ్గరకెళ్ళే ఆమె భర్త ఆదర్శ పురుషుడుగా భ్రమిస్తే మూర్ఖ ఆచార సాంప్రదాయాలు జీర్ణించుకున్న పాతకాలం స్త్రీ ఆమె!

మొగుడుగాడు పరాయిస్త్రీని పొందడం తప్పుకాదని ఆమె అనుకుంటుంది. అది ఆమె అజ్ఞానం. అది ఆమె సంస్కారం.

కాని – నీవు ?

నీ సంస్కారం ఏమైంది?

నీవు చదువుకున్నవాడివి ! బుద్ధీ బుర్ర వున్నవాడివి ! అది ఖచ్చితంగా 'తప్పు' అని స్పష్టంగా తెల్సినవాడివి!

తప్పనితెల్సి తప్పుచేసిన వాళ్ళని ఏమనాలి ?

పోనీ కక్కూర్తి పడ్డావే అనుకో – పశ్చాత్తాప పడే బదులు అదొకహక్కుగా హూంకరించే నీలాటి వాళ్ళని ఏమనాలి?

శీలంలేని మగాడివి నాపై నిందలు వేస్తావా ?

ఇపుడు చెప్పు ?

కులుకుతున్నది నీవా ? నేనా? కిటికీలు బార్లా తెరిచేసి, కొవ్వెక్కిపోయి కన్నూమిన్నూ కానకుండా రోడ్డు మీద పశువుల్లా, బురదలో పందుల్లా బోసిమొల్లతో కార్పెట్‌మీద అదీ... నీవు ఛీ ఛీ ...'' అంటూ మొహం చీదరించుకుంది విజయ

ఇంక ఆమెను కట్ చేయక తప్పదనుకున్నాడు చెలం.

''నోర్ముయ్! ఆపు నీ అధిక ప్రసంగం. నా యిష్టమొచ్చినట్టు యిష్టమైన దానితో వెళ్తాను. కులుకుతాను. అంతే. నీకనవసరం!'' అన్నాడు కటువుగా !

ఈ దబాయింపుతో పూర్తిగా రెచ్చిపోయింది విజయ.

గొంతు పెంచేస్తూ –

''నాకు అనవసరం ఎలా అవుతుంది? నీవు నాకు మొగుడువైతే నేన్నీకు పెళ్ళాన్ని ! పెళ్ళాం మరో మగాడు దగ్గర చీరెత్తడానికి వీల్లేదనే నియమం ఏడ్చినప్పుడు – మొగుడనేవాడు పెళ్ళాం దగ్గర తప్ప మరో ఆడదాని దగ్గర ఫేంట్ విప్పడానికి వీల్లేదు ! మగాణ్ని, అంచేత నాయిష్టం, దొరికిన చీరలో కల్లా దూరిపోతానంటే దొబ్బదు''

ఆమెకి తెలీకుండానే మాటలు కూడా మొరటుగా రాసాగేయి.

''సరే ! నీ యిష్టమొచ్చిన ఆడదాని దగ్గర కెళ్తానంటావా వెళ్ళు! నేనూ వెళ్తాను – నాకు నచ్చినోడితో!'

అంతే ! ఆమె చెంప ఛెళ్ళుమంది.

అయిదేళ్ళు అంటుకుపోయేయి. మరిక నోరెత్తావంటే మూతి మీద తంతానన్నాడు – రౌద్రం ప్రకటిస్తూ.

విజయ ఆ చెంప దెబ్బకి ఏమాత్రం దిగిరాలేదు.

చలించలేదు.

''నీవు హైమ పైన పడుకున్నప్పుడు – నేను కనకరాజు కింద పడుకోడంలో తప్పేవిఁటీ ?''

''లంజముండా'' అంటూ ఆమె మూతిమీద ఒక్కటి ఇచ్చేడు. ఆమెనోరు ఎలా మూయించాలో అతనికి తెలీడంలేదు. వెర్రెత్తిపోతోంది అతనికి.

అతను కొట్టిన దెబ్బకి ఆమె కింది పెదవి చిట్లింది. రక్తం !

విజయకూడా వెర్రిపట్టినదాన్లా తయారయింది.

''ఏది ? ఇంటర్‌కోర్సు...ఎప్పుడు నీతోనేనా ! నాకూ వైరైటీ కావాలి. రేపు కనకరాజు ! ఎల్లుండి రవి! ఆ మర్నాడు రాంబాబుని కూడా స్పేర్ చేయమని ఛాయనడుగుతాను... చెలం ! గ్రూప్ సెక్సు ఎలా వుంటుంది ? మీ నల్గురితోను ఒకేసారి ఒకేరాత్రి ఎలావుంటుంది '' అంటూ ఆరంభించిన విజయని చెలం కొట్టేడు.

పరమ బూతులు తిడుతూ ఎడాపెడా లెంపలు వాయించేడు.

అయినా విజయ చలించలేదు.

దీనికేదో దయ్యంపట్టుకున్నట్టుంది అనుకున్నాడు.

పిచ్చెక్కినట్టు జుట్టు పీక్కున్నాడు.

చెలం ఒళ్లంతా చెమట ఒకటే ఆయాసం!

ఉబ్బసం రోగిలా జాపోస్తున్నాడు

విజయని కొట్టేటప్పుడు అడ్డువచ్చిన రంగంమామ్మనీ, పార్వతమ్మనీ నెట్టేసాడు

కొంతసేపటికి –

నెమ్మదిగా లేచి నించుంది.

మళ్ళీ చెలం ఎదురుగా నించుంది

అయితే – నోరు విప్పలేదు

రెండు నిమిషాల నిశ్శబ్దం !

రక్తం గడ్డకట్టిన కింద పెదవి వణుకుతోంది. ఆమె ముక్కు పుటాలు అదురుతున్నాయి. పళ్ళు బిగుసుకున్నాయి. కళ్ళు అగ్ని గోళాల్లా వున్నాయి.

పెదవి విప్పి ఒకే ఒక మాట అంది –

''ఐ హేట్ యూ, చెలం ఐ హేట్ యూ''

ఆ వెంటనే కాండ్రించి 'ధ్బూ' అని అతని ముఖంపై వుమ్మింది.

తరవాత – గబగబా మెట్లెక్కి బెడ్‌రూమ్‌కి వెళిపోయింది.

నాలుగునిమిషాల తర్వాత–

అందరి దృష్టీ మెట్లమీద కెళ్లింది !

చేతిలో సూట్‌కేస్‌తో మెట్లుదిగుతూ విజయ !

ఇంటిల్లిపాది ప్రాన్పడిపోయేరు.

విజయ ఇల్లు వదిలి వెళ్ళిపోతుందని ఎవరూ ఊహించనిది !

చెలం చెదిరిన జుట్టుతో, చిరిగిన షర్టుతో పిచ్చివాడులా వున్నాడు.

ఇల్లు విడిచి వెళ్లొద్దని కోడల్ని పార్వతమ్మ బతిమాలుతుంటే –

''బతిమాలనవసరంలేదు. వెళ్ళేవాళ్ళని వెళ్ళనీయ్'' అన్నాడు చెలం.

''ఇంకెవరైనా వెళ్ళ దల్చుకుంటే – వాళ్ళూ వెళ్ళిపోండి'' – అన్నాడు చెలం.

అది తనని ఉద్దేశించి అన్నట్టుగా రంగంమామ్మ భావించింది.

గదిలోకి వెళ్ళి తన డొక్కు సూట్‌కేస్ తెచ్చుకుంది.

''పదమ్మా'' అంటూ విజయ వెనుక నిలుచుంది రంగంమామ్మ.

గుమ్మందాకా వెళ్ళిన విజయ ఏదో మర్చిపోయినట్టు – వెనక్కి తిరిగి సూట్‌కేస్ అక్కడే వదిలేసి – సందీప్ గదికేసి నడుస్తోంది.

చెలం టక్‌న ఆమెకి అడ్డుపడ్డాడు.

''వాడు నా కొడుకు'' అంది విజయ.

''కాదు. నాకొడుకు '' అన్నాడు చెలం.

నా కొడుకుని నాకివ్వమని విజయ ఎంతగా వాదించినా, ఎంత గీపెట్టి ఏడ్చినా – అతను వినలేదు. కరగలేదు.

సందీప్‌ని ఇవ్వలేదు.

అపుడు పార్వతమ్మ కలుగజేసుకుంది.

''సందీప్‌కి కన్నతల్లివి నీవైతే పెంచిన తల్లిని నేనమ్మా !... ఫర్లేదు తల్లీ ! బాబుని ఇక్కడే వున్నియ్యమ్మా ! ...బాబుకి జ్వరం కూడానూ...ఇంత రాత్రప్పుడు మంచులో ఎక్కడకని తీసుకెళ్తావు తల్లీ...ఇక్కడే రెండురోజులు వున్నియ్యి ....నేనెవరికోసం బతకాలి చెప్పు ?'' కళ్ళునీళ్ళు పెట్టుకుంది.

అవును, బాబుని ఈ రాత్రప్పుడు ఎక్కడికి తీసుకువెళ్తుంది ? రెండు రోజుల్లో... క్వార్టర్ చూసుకుని...బాబుని తీసుకెళ్ళడం మంచిదనుకుంది విజయ.

నోటికడ్డంగా, చెంగు పెట్టుకుని దుఃఖం దిగమింగుతూ...మౌనంగా అక్కణ్ణించి కదిలింది.

రంగం మామ్మ విజయని ఫాలో అయింది.

విజయ నిలయం నుంచి బయటకి వచ్చిన విజయ – వెనుదిరిగి విజయనిలయాన్ని ఒకసారి చూడకుండా వుండలేకపోయింది. చూసి ఏడుపు ఆపుకోలేకపోయింది.

ప్రేమమయంగా, మధురాతిమధురంగా, చల్‌మోహనరంగా అంటూ హాయిహాయిగా, తీయతీయగా సాగిపోవాలని కమ్మని కలలుకన్న జీవితపూల రథం ఇలా కూలిపోతుందని తను ఎన్నడైనా అనుకుందా ?

## 30

సమయం రాత్రి ఏడుంపావు.

సాయంత్రం ఆరుగంటలకి రావాల్సిన పిల్లలు – ఇంకా రాకపోవడంతో సుజాతలో కలవరపాటు. అలజడి. ఆందోళన.

అదిగో పిల్లలు వచ్చేస్తారు, వచ్చేస్తారు – అని అనుక్షణం ఆమె అనుకుంటుండగా – టైము ఏడుంపావు అయింది.

ఆమెలో అధైర్యం, గుండెల్లో గుబులు.

ఆమె పిల్లలు శిరీష, సురేష్ ఇద్దరూ ఉదయమే తయారై స్కూలికి వెళతారు. సాయంత్రం నాలుగ్గంటలకి స్కూలు నుంచి డైరెక్టుగా ట్యూషన్‌కి వెళతారు. అక్కణ్ణించి ఇంటికి ఎంతకాదన్నా ఆరు అవకముందే చేరిపోతారు.

పిల్లలు ఇద్దరూ రిక్షామీద వెళ్ళి, అదే రిక్షామీద ఇంటికి వస్తారు. పిల్లలకి బస్ అయితే ఇబ్బందని రిక్షా ఎరేంజ్ చేసింది తను. రిక్షావాడు రంగయ్యరోజూ పిల్లల్ని జాగర్తగా తీసుకెళ్ళి

జాగర్తగా తీసుకొొస్తాడు. అందుకు తను ఇద్దరు పిల్లలకి కలిపి మొత్తం నెలనెలా ఎనభై రూపాయలు ఇస్తుంది. ఏరోజైనా వాడు ఎగ్గొడితే మరుచటిరోజు ఛెడామడా తిట్టి వార్నింగ్ ఇస్తుంది. పిల్లలని తీసుకెళ్ళడానికి ఏరోజైనా వీలుకానప్పుడు ముందుగా వచ్చి చెబుతాడు. ఒకోసారి చెప్పడు. ఏం చేస్తుంది ? ఆమెకి రంగయ్య కన్నా మంచివాడూ, నమ్మకస్తుడు నగరంలో దొరకలేని స్థితి.

అయితే వాడు ఈ రోజు పిల్లల్ని తేనూ లేదు. ఏ కబురూ లేదూ !

గాభరాగా, భయంగా వుంది సుజాతకి.

పిల్లలు ఆరుగంటల్లోపుగా ఇంటికి చేరకపోతే – సుజాతకి పిచ్చెక్కినట్టుగా వుంటుంది. పిల్లలు వచ్చేవరకూ ఏపనీ చేయబుద్ధికాదు. వరండాలో నిలబడి ఆదుర్దాగా పిల్లలకోసం అలా ఎదురుచూస్తూ వుండిపోతుంది.

ఎప్పుడో ఉదయం అనగా వెళ్ళిపోయిన పిల్లలను సాయంత్రం చూడకపోతే తల్లిమనసు తల్లడిల్లిపోతుంది. పిల్లల్ని చూసే వరకూ ఆమె మనసు శాంతించదు. సాయంత్రం పిల్లలురాగానే – మెరిసే కళ్ళతో, ఉప్పొంగే హృదయంతో – వాళ్ళని ఒడిలోకి అమాంతంగా తీసుకుంటుంది. ఎత్తుకుంటుంది. ముద్దులాడుతుంది. రాగానే వాళ్ళకేదో తినడానికి స్వీటు పెట్టి ఓ అయిదు నిముషాలైనా పిల్లలతో గడిపితేగాని ఆమెకి తనివితీరదు. తర్వాత పిల్లలకి స్నానం చేయించి, బట్టలు మార్చి, హోమ్ వర్క్ చేస్కోమని కూర్చోబెట్టి – వంటకి ఉపక్రమిస్తుంది. అంతవరకు తను వంటేకాదు – ఏపనీ చేయబుద్ధికాదు సుజాతకి.

అయితే ఈరోజు – పిల్లలకోసం ఎదురుచూస్తూనే – పిల్లలకి తిండి పెట్టాలని లేటు కాకూడదని స్టౌవ్‌పై బియ్యం పెట్టింది. పెట్టి పిల్లల ధ్యాసలో పడి ఆ సంగతే మర్చింది. అన్నం జావయి, స్టౌ ఆరిపోయింది.

పిల్లలు సరిగ్గా ఆ సమయానికొస్తే –''మీనించే అన్నం జావయిపోయిందని' ఆ నేరం పిల్లమీదకినెట్టి – వాలుగుకేకలు వేసి రెండు అంటించేది.

ఏరీ పిల్లలు?

పిల్లలు ఇంకా రాలేదు.

అయ్యో ! ఏమైంది నా చిట్టితల్లికి ?

ఏమయ్యిందేమయింది నా చిన్నారి బాబుకి ?

సుజాతలో భయాందోళనలు!

అలాంటి సమయాల్లో ఆమె ఆందోళన పంచుకోడానికి పక్క వాటాలో లక్ష్మీ దేవమ్మ వుంది. ఆమె చాలా మంచిది.

లక్ష్మీ దేవమ్మ సుజాత ఆబ్సెన్సులో సుజాత పిల్లలను ఎప్పటికప్పుడు సాకుతుంది. ఆమె దగ్గర ఆ పిల్లలకి బెరుకులేదు. బిడియం లేదు. మమ్మీ లేకపోతే 'ఆంటీ' అంటూ ఆమె ఇంటిలోకి చనువుగా చొరబడతారు పిల్లలు. ఒకోసారి తను ఏకారణంచేతైనా ఇంటికి రావడం

లేటయితే పిల్లలు లక్ష్మీ దేవమ్మగారి ఇంటిలోనే భోంచేసి నిద్రపోవడం కద్దు.

పిల్లలు ఇంతకు ముందు – ఇలానే ఇంటికి రాకపోతే – లక్ష్మీ దేవమ్మ పదహారేళ్ళ కొడుకు గోపి సైకిలు వేసుకుని వెళ్ళిన సందర్భాలున్నాయి.

ఈ రోజు తన దురదృష్టం ఏవిఁటో – లక్ష్మీ దేవమ్మ వుందిగాని, ఆమె కొడుకు గోపీలేడు. కంబైన్డ్ స్టడీకి ఒక ఫ్రెండు ఇంటికి వెళ్ళాడు.

లక్ష్మీ దేవమ్మ, ఫర్లేదని, పిల్లలు వచ్చేస్తారని ధైర్యం చెబుతున్నప్పటికి – సుజాతలో భయం క్షణక్షణానికీ హెచ్చుతోంది.

అయ్యో ! భగవంతుడా ! ఏమయింది నా పిల్లలకి ! నాచిన్నారి చిట్టితల్లులకి ! ఏమైనా అయితే తను భరించగలదా ?

భర్తలేకున్నా తను బతగ్గలదు. కాని పిల్లలు లేకుండా తనులేదు. తన బతుకులేదు.

పిల్లలు రావడం ఆలస్యమయితేచాలు. ఆ తల్లి మనసు పరిపరివిధాలుగా పోతుంది.

ఏ ఆక్సిడెంటయినా అవలేదుగదా!

నగరంలో బస్సులూ, లారీలూ...వాటిని మనవేఁ చూసుకు తప్పుకోవాలి తప్పా – అవి తప్పుకోవు. పిల్లలతో అదే భయం తనకి. అందుకే తను రిక్షా పెట్టింది. అయినా ఒకోసారి తనకీ టెన్షను తప్పడంలేదు.

ఆక్సిడెంట్సేకాదు – పిల్లల్ని ఎత్తుకుపోతున్నారనే వార్తలూ తనువింది. ఈ రోజు పేపర్లోనయితే బాక్సుకట్టిన వార్త కూడా చూసింది. పదేళ్ళ బాలిక వీరోచితంగా తప్పించుకున్న వైనం. స్కూలు పిల్లలు ముగ్గురు మోసగాళ్ళకి పట్టుబడిపోగా – ఆ ముగ్గురిలో ఒక పిల్ల తెలివితేటలతో – చాకచక్యంగా తప్పించుకు వచ్చిన సాహసగాధ! ఆ తెలివితేటలు ఆ చలాకి తన పిల్లలకి లేవని ఆ తల్లి నమ్మకం. అయినా తన పిల్లల వయసెంత ? భగవంతుని దయవల్ల – తన పిల్లలకి ఆ స్థితి రాగూడదు గాక రాకూడదు.

సురేష్ అసలు ఏమాత్రం ఆకలికి తట్టుకోలేడు. ఇంట్లో వున్నంతసేపు ఏదో ఒకటి తింటూనే వుంటాడు. అయితే ఆకలికి అమ్మని తప్ప – ఎదుటి వాళ్ళని గ్లాసుడు మంచినీళ్ళుకూడా అడగని వెర్రినాన్న!

అయినా అంత చిన్నారి పసివాడికి అన్ని గంటలు చదువేంటి ? అన్ని పుస్తకాల మోత ఏవిఁటి?

ఈ ఏడాది లోయర్ కేజీలో వేసింది వాడిని.

ఎలా వున్నాడో, ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో – ఆ తల్లి హృదయం తల్లడిల్లిపోయింది.

శిరీష అంతే! గడుసుతనం లేదు. ఎవరేం చెబితే అంత! ఏపని చేయమంటే ఆ పని గభాల్న చేసేస్తుంది. అంతేగాని ఆలోచించదు. మాయగాళ్ళకీ మోసగాళ్ళకీ శిరీషని ఎరవేసి పట్టుకోడం పెద్దపనికాదు. ఒకసారి ఎవడో అలానే చెవిరింగులు, పాపని ఎత్తుకుపోయేడు ! ఇపుడు పాపనే ఎత్తుకు..

తల్లి గుండెలు దడదడలాడేయి.

టైము చూస్తే ఏడున్నర!

సుజాత ఒక్క క్షణం కూడా ఇంట్లో వుండలేకపోయింది. ఒక నిమిషంలో చీర మార్చుకుని రోడ్డుకి వస్తుంటే – ఎదురుగా రిక్షావాడు రంగయ్య !

వాడిని చూడగానే రెండుగట్టిగాకేకలేసి – ''పిల్లలు ఏరి ?'' అనడిగింది.

''అదేమిటమ్మా ఇంటి దగ్గరలేరా ?''

''బాగుంది ! నీవు తీసుకురాకుండా ఎలా వస్తారనుకున్నావ్ ?''

''అయ్యో తల్లీ! భగవంతుడి సాక్షిగా – నేను ఆరుగంటలకే పిల్లల్ని తీసుకురాడానికి వెళ్ళేనమ్మా! వెళ్తే – పిల్లలు ట్యూషన్‌కి రాలేదంది టీచరమ్మ...అయితే తమరు పిల్లల్ని ఏ పనిమీదో స్కూలినుంచే తీసుకెళ్ళిపోయి వుంటారనుకున్నా.... కాని ఎందుకో నా మనసు కీడు శంకిస్తుంటే – భయంతో వచ్చేను...అనుకున్నట్టే అయ్యిందనమాట''

''అనుకున్నట్టే అవ్వడం ఏమిటీ?''

'' పిల్లల్ని ఎత్తుకుపోడాలు ఈ మధ్దెన ఎక్కువైపోనాయి తల్లీ. అదే నా భయ్యం''

రిక్షావాడి భయంగాదు గాని సుజాతని పూర్తిగా భయపెట్టేశాడు.

సుజాతకి కళ్ళుంట నీళ్ళు తిరిగిపోతున్నాయి.

''ఎందుకేనా మంచిది.నేను స్కూలుకాడకెళ్ళి చూసొస్తాను తల్లీ '' అని వెళిపోబోతుంటే.

''రంగయ్యా ! నేను వస్తాను పద'' అని రిక్షా ఎక్కింది. రిక్షా మీంచే – లక్ష్మీ దేవమ్మని కేకేస్తూ – ''ఒకవేళ పిల్లలొస్తే చూడమంది'' సుజాత.

రిక్షాని వేగంగా పోనియ్యమంది సుజాత.

రిక్షా వేగంగానే పోతోంది. కాని పోతున్నట్టుగా ఆమెకి అనిపించడంలేదు.

రిక్షా దిగిపోయి ఆటో ఎక్కితే !

రాత్రి సమయం.....ఆడది ఒక్కతి...ఆటోవాడు ఎక్కడికి తీసుకెళ్తాడో. తీసుకెళ్ళి ఇంకేంచేస్తాడో – ఎందుకొచ్చిన గొడవ. ముందే రోజులు బాగాలేవు... రంగయ్య తెల్సినవాడు. రిక్షాయే తప్పదుమరి!

రిక్షా కాన్వెంట్ గేటు ముందు ఆగింది.

గేటుమూసి వుంది. అక్కడ పెద్ద మీసాలతో వాచ్‌మాన్ వున్నాడు. అతనికి విషయం చెప్పింది.

వాచ్‌మెన్ అందుకు పెద్దగా రియాక్ట్ కాలేదు. ఒక రిజిస్టరు ఇచ్చి అందులో పిల్లలపేర్లు, చదువుతున్న క్లాసు వివరాలు వ్రాయమన్నాడు.

వ్రాసింది సుజాత.

రేపు వుదయం వచ్చి హెడ్ మిస్ట్రస్‌ని కలవమన్నాడు.

రేపు వుదయం వరకూ ఈ టార్చర్ ఏ తల్లి భరించగలదు ?

పిల్లలవయసూ, రూపురేఖలూ ఎలావుంటాయో చెప్పింది. ఎవరైనా తీసుకెళ్ళారేమో గుర్తుచేసుకు చెప్పమంది.

వాచ్‌మన్ ఏ మాత్రం గుర్తుచేసుకునే ప్రయత్నం చేయకుండా ''అరె ! పైనుంచి ఏబద్మాసోవచ్చి స్కూలు పిల్లల్ని మోసం చేసి తీసుకెళ్ళే అవకాశం లేదు అలాంటి మచ్చ ఈ స్కూలు చరిత్రలోనే లేదు'' అని తెలియజేసాడు.

ఆ మాదర్‌చోత్ పని ఎవడైన గేటు బయటే చేయాలితప్ప లోపలికి వచ్చి తీసుకెళ్ళిపోవడం వాడితరం కాదన్నాడు. తెల్లారివచ్చి హెడ్‌మిస్ట్రస్‌ని కలుసుకోండి. అంతకన్నా నేను చేసేదేమీ లేదన్నాడు

ఆ కాన్వెంట్ డిసిప్లెన్, స్ట్రిక్ట్‌రూల్సు సుజాతకి తెలియనివికావు. క్లాసులో పిల్లల్ని మాయచేసి ఎత్తుకుపోవడం అసంభవం. క్లాసు మధ్యలో పిల్లలని పంపరు. పేరెంట్సుగాని గార్డియన్స్ గాని పిల్లలని తీసుకెళ్ళడానికి వస్తే వచ్చింది ఎవరు, ఎందుకు అనేది కన్‌ఫర్మ్ చేసుకోకుండా పంపరు.

సుజాతకి ఉదయం వచ్చి హెడ్‌మిస్ట్రస్‌ని కలవడం కాకుండా ఇపుడు సురేష్ క్లాసుటీచర్నిగాని, శిరీష క్లాసు టీచర్నిగాని కలిస్తే బాగుంటుందనిపించింది. అయితే తనకి ఆయా క్లాసు టీచర్ల పేర్లు తెలీవు. పిల్లల క్లాసు, డివిజన్ మాత్రమే తెలుసు.

ఆ వివరాలు చెప్పి ఆ టీచర్ల ఇళ్ళు నీకు తెల్సా ? అని వాచ్‌మెన్‌ని అడిగింది.

తెలీదన్నాడు వాచ్‌మెన్.

అయితే అక్కడనుంచే ఒక టీచర్ ఇల్లు వున్న సందు చూపించేడు. ఆమెను వెళ్ళి కనుక్కోమన్నాడు. ఇంచుమించు చాలా మంది టీచర్ల ఇళ్ళు ఈ చుట్టుపక్కలే వున్నాయి గనుక వివరాలు తెలియవచ్చు అన్నాడు.

రిక్షా వాచ్‌మెన్ చూపించిన ఆ టీచర్ ఇంటి ముందు ఆగింది.

ఆ టీచర్ మంచిదిలా వుంది. జరిగిందంతా విని మంచి రెస్పాన్సు చూపించింది.

శిరీష క్లాసు టీచర్ ఇల్లు తనకి తెల్సు అంది.

పక్క సందులో – మూడో ఇల్లు అని చెప్పింది. చెబుతూ సుజాతని భయపడవద్దని ధైర్యం చెప్పింది.

థాంక్స్ చెప్పి కదిలింది సుజాత.

పేరంటే తెలీదుగానీ – శిరీష టీచర్‌ని తను ఇంతకుముందు చూసి వుంది.

''ఏమి ఇలావచ్చారు ?'' అనడిగింది శిరీష టీచరు.

విషయం చెప్పింది సుజాత.

''లాస్టు పిరీయడ్ వరకూ క్లాసులోనే వుంది. మధ్యలో ఎవరూ వచ్చి తీసుకెళ్ళేదే.. ఏ ఫ్రెండ్సుతోనైనా కలిసి వాళ్ళింటికి వెళ్ళారేమో !''

''నా పిల్లలెప్పుడూ అలా ఎవరింటికీ వెళ్ళరు టీచర్'' అంది ఏడుస్తూ సుజాత – ''

నాపిల్లలు నాకు దక్కరా టీచర్ ?''

పిల్లలు ఏమయ్యారో ఆ టీచర్‌కి తెలీదు. ఆ తల్లిని ఎలా ఓదార్చాలో కూడా ఆమెకి తెలీడంలేదు.

సుజాతని దగ్గరికి తీసుకుని – ''మరేం ఫర్వాలేదమ్మా! ''నీ పిల్లలు నీకు దొరుకుతారు భయపడకు. రేపొకసారి స్కూలుకి రండి ఎంక్వయిరీ చేద్దాం. ఈలోగా ... పోలీస్ రిపోర్టు కూడా ఇవ్వండి – ఎందుకైనా మంచిది'' అని సలహా ఇచ్చింది టీచరు

ఎవరేం చెబితే అది చేసే స్థితిలో వుంది సుజాత. ఆ స్థితిలో తను ఒంటరిగా, దిక్కులేనిదానిగా ఫీలయిది. ఆమెకి దుఃఖం ఆగడంలేదు.

రిక్షా పోలీస్‌స్టేషన్‌వైపు దారితీసింది.

స్టేషన్ కునుకుతున్నట్టుగా వుంది. రైటర్, ముగ్గురు నలుగురు పోలీసులు తప్ప స్టేషన్లో ఎవరూలేరు.

కునుకు మొహం రైటర్ ఆమెను రిపోర్టురాసి ఇమ్మన్నాడు. రిపోర్టు ఎలా వ్రాసి ఇవ్వాలో ఆమెకి సరిగా తెలీకపోడంతో – అడిగితే చిరాకు పడ్డాడు. చిరాకు పడుతూనే ఎలా వ్రాయాలో, ఎవరికి ఎడ్రసు చేయాలో చెప్పేడు.

తను రిపోర్టువ్రాసి ఇచ్చింది. అది అలా టేబుల్‌పై పడివుండడమే తప్ప – దానిపై ఏక్షను ఎలాంటిది వుండదేమోనని ఆమె భయపడింది. ఆమె అలా భయం పడాలనే – వాళ్ళలా నిర్లక్ష్యంగా, సోమరిగా ప్రవర్తించారని ఆమెకి తెలీదు.

ఒక పోలీసు రంగయ్య చెవిలో ఊదేడు. ఆ ఊదింది రంగయ్య సుజాతని పక్కకి పిలిచి చెప్పేడు.

ఆమె పర్సుతీసి ఒక 50 రూపాయలు అందజేసింది. నిద్రపోతున్న స్టేషన్‌కి చైతన్యం వచ్చింది. పోలీసులు ఎక్కడలేని ఎటెన్షను, ఇంట్రెస్టు ఆ కేసుపై చూపి – సుజాతకి ఎలగైనా పిల్లల్ని వెదికి అందజేసే పూచీ మాదని తెలియజేసారు. భరోసా ఇచ్చారు.

ఒక్క యాభైతోనే పోలీసులు వూరుకుంటారేమో అనుకుంటోంది సుజాత. వాళ్ళు అడిగినప్పుడల్లా – ఎంతో కొంత సమర్పించుకుంటూపోక తప్పదనే సంగతి ఆమెకి తెలియకమానదు.

స్టేషన్ నుంచి బైటకి రాబోతుంటే – అప్పుడే మోటరు బైకుపై వస్తున్న ఇన్‌స్పెక్టర్ కనిపించేడు.

అతనితో మాటాడ్డం చాలా అవసరంగా సుజాత భావించింది.

అతను ఎంతో మర్యాదగా ''కూర్చోమ్మా'' అని, ఆమె వచ్చిన పని తెల్సుకున్నాడు.

ఆమె రాసి ఇచ్చిన రిపోర్టు చదివేడు, పిల్లలకి సంబంధించి చాలా వివరాలు అడిగేడు.

పిల్లల్ని ఎత్తుకుపోడం అంటూ నిజంగా జరిగితే – ఆ పిల్లలని ఎలాగైనా మీకు అందజేస్తానని హామీ ఇచ్చేడు. పిల్లల్ని ఎత్తుకుపోయే రెండు మూడు ముఠాలున్నాయి. ఆ సంగతి

కనుక్కుంటాను. మీరు అధైర్య పడకండి. వెళ్ళండి'' అని ఎంతో సౌమ్యంగా చెప్పేడు.

సుజాత అధైర్య పడకుండా వుండలేకపోయినప్పటికీ - ఇన్‌స్పెక్టర్ ప్రవర్తన ఆమెకి తృప్తినిచ్చింది. అతనికి చేతులెత్తి నమస్కరించి - స్టేషనునించి బయటకు వచ్చింది

ఆమె రిక్షాని వేగంగా ఇంటికి పోనియ్యమంది

తను వెళ్ళేటప్పటికి - పిల్లలు ఇంటి దగ్గర తప్పక వుంటారని ఆమెకెందుకో బలంగా నమ్మకం ఏర్పడింది.

ఇంటికి చేరిన సుజాతకి డిజప్పాయింట్‌మెంటే ఎదురయింది. నీరసం పూర్తిగా ఆవహించింది.

ఏమైందీ - పిల్లలు కనిపించేరా - అనుకుంటూ వచ్చిన లక్ష్మీ దేవమ్మని కౌగలించుకుని భోరున ఏడ్చేసింది.

ఆమెని సముదాయించడం ఎలాగో లక్ష్మీ దేవమ్మకి తెలీడంలేదు.

అప్పటికే ఆమె కొడుకు సైకిలు వేసుకుని పిల్లలని వెదకడం మొదలెట్టేడు వెదికి, వెదికి డెస్పరేటడ్‌గా తిరిగివచ్చేడు.

లక్ష్మీ దేవమ్మ కాచిఇచ్చిన టీ అయినా తాగకుండా - గోపీని వేసుకుని ఆటోపై బయల్దేరింది.

పిల్లల ఫ్రెండ్సు ఇళ్ళకీ, సుజాత ఫ్రెండ్సు ఇళ్ళకీ ఆటోని పోనిచ్చింది.

పిల్లలు ఎక్కడా కనిపించలేదు.

తర్వాత -

ఆమె కొలీగ్స్ రాజారావు, రఘు వగైరాలు ఆమెను ఇంటి వద్ద వుండమని చెప్పి - స్కూటరు వేసుకుని పిల్లలని వెదకడం మొదలెట్టారు.

ఇద్దరి పిల్లల ఫోటో తీసుకుని పేపర్లో వేయించడానికి దినపత్రిక కార్యాలయంకి వెళ్ళేరు. రేడియోకి, దూరదర్శన్‌కి కూడా పిల్లలు తప్పిపోయిన సంగతి ప్రకటన ఇవ్వడానికి వెళ్ళేరు.

సుజాతకి ఆ రాత్రంతా జాగరణే. తిండిలేదు, నిద్రలేదు. కాసేపు మౌనంగా దుఃఖం. మరికాసేపు - ఏదో గుర్తుకొచ్చినట్టు గుండెలు బాదుకుని రాగాలు తీస్తూ ఏడుపు.

ఆమె ఏడుపుని చూసి లక్ష్మీదేవమ్మ కూడా ఏడ్వడం తప్ప - ఆమెను ఓదార్చడం చేతకాలేదు.

తెలతెలవారుతుండగా పోలీసులు ఇద్దరు వచ్చేరు. వచ్చి పోలీసు రిపోర్టు ఇవ్వడం వల్ల - మీకు నష్టం, మాకు లాభం అన్నట్టుగా ప్రవర్తించి నీవు రిపోర్టు చేసిన నేరానికి అన్నట్టు కొన్ని యక్షప్రశ్నలు వేసి, నాలుగుపదుల నోట్లు జేబుల్లో దూర్చుకుని వెళ్ళిపోయేరు.

సుజాత ఉదయానికి పూర్తిగా నీరసించిపోయింది. ముఖం పూర్తిగా వడలిపోయింది. లక్ష్మీదేవమ్మ వెంటరాగా కాన్వెంటుకి ఉదయాన్నే వెళ్ళింది. వెళ్ళి హెడ్‌మిస్ట్రస్‌ని కలిసింది. పిల్లల క్లాసు టీచర్లని కూడా కలిసింది.

లాభం లేకపోయింది. ఫలితం లేకపోయింది.

సుజాతని పూర్తిగా నీరసం ఆవహించింది.

కాన్వెంటు నుంచి బయటకి నడుస్తున్న సుజాతకి ఒక్కసారిగా ప్రపంచమంతా చీకట్లుకమ్మినట్టయింది. భూమి గిర్రున తిరుగుతున్నట్టయి దబ్‌మని కిందపడిపోయింది.

సుజాతను ఆస్పత్రికి చేర్చి రెండు సెలిన్‌బాటిల్స్ ఎక్కించేరు. లక్ష్మీదేవమ్మ దగ్గరుండి సేవలు చేసింది.

మధ్యాహ్నం ప్రాంతంలో సుజాతను డాక్టరు ఇంటికి పంపించాడు. పంపిస్తూ సుజాతకి పూర్తి విశ్రాంతి అవసరమని, జాగర్తగా చూస్కోమని సలహా ఇచ్చేడు.

డాక్టరు సలహాకి – సుజాత ఒక్కసారిగా ఫకాల్న నవ్వింది – నవ్వి వెంటనే ఏడుపులోకి దిగిపోయింది!

సుజాతకి పిచ్చిపట్టలేదు కదా!

ఇంటికి సుజాతను తీసుకువెళ్ళేక కూడా అలానే పిచ్చి పిచ్చిగా ప్రవర్తించింది.

లక్ష్మీదేవమ్మ భయపడింది. భయపడి డాక్టర్ని పిలిపించింది.

డాక్టరు ఇంజక్షను ఇచ్చేక – మత్తులోకి వెలిపోయి మగతగా నిద్రలోకి జారుకుంది.

రెండూ, మూడు గంటల ప్రాంతంలో డైరక్టుగా డ్యూటీనుంచి, పరుగుపరుగున వచ్చి, వగరుస్తూ నించున్నాడు రాజారావు.

అతని చేతిలో టెలెక్స్ మెసేజ్ వుంది.

మెసేజ్ వైజాగునించి విజయ పంపింది.

నిద్రలోకి పోయిన సుజాతని వెంటనే లేపడం చాలా కష్టమయింది. పలకడం పలికిందిగాని – కనురెప్పలు బరువుగా వుండి పైకి ఎత్తడం కష్టమయింది.

టెలెక్స్ మెసేజ్‌ని చేతిలోకి తీసుకుని చదువడానికి ప్రయత్నించింది. కనాకష్టంగా కళ్ళు తెరిచి...మసకబారిన అక్షరాలని ... ఒక అరనిమిషంలో స్పష్టంగా చూడగలిగింది, చదవగలిగింది.

చదవగానే ఆమె కళ్ళు ఒక్కసారిగా మెరిసేయి.

మత్తు వదిలిపోయినట్టు చివాల్న లేచికూర్చుంది.

మరోసారి ఆ మెసేజ్ చదివింది.

ఆరేడు లైన్లువున్న డిటైల్డు టెలెక్సు అది! విషయమంతా అర్థమయింది.

మెరిసిన ఆమె కళ్ళు ....ఎర్రగా అయిపోయేయి.

ఆమె నీరసం అంతా ఎగిరిపోయినట్టు – చివాల్న లేచి నించుంది.

సుజాత పోలీస్ స్టేషన్లోకి అడుగు పెట్టేటప్పటికి –

ఇన్‌స్పెక్టర్ లాఠీతో ఒక పాతికేళ్ళ యువకుడిని చొక్కా విప్పించి – వీపు మీద గొడ్డును బాదినట్టు బాదుతున్నాడు. వాడు హృదయవిదారకంగా అరుస్తున్నాడు. వాడు చేసిన నేరం

ఏవిటంటే దొంగతనం. ఒకరింట్లో ట్రాన్సిస్టర్ కొట్టేసాడు.

ఇన్‌స్పెక్టర్ సుజాతను కూర్చోమని చెప్పి . దొంగని దబ్‌మని కడుపులో తన్ని లాకప్‌లోకి ఈడ్చేశాడు

ఆ దృశ్యం చూడలేకపోయింది సుజాత.

దొంగలకిదన్నమాట శిక్ష!

ఇన్‌స్పెక్టర్ వచ్చి కూర్చుంటూ – ''మీ కేసు ప్రోగ్రస్‌లో వుందమ్మా. రెండు, మూడు చోట్ల ట్రేస్ చేయమన్నాను. రేపొకసారి వచ్చి కనిపించండి.'' అన్నాడు సుజాతతో.

''థాంక్సండీ. మీకా శ్రమ లేకుండా.. పిల్లల్ని ఎత్తుకుపోయిన వాడి ఆచూకి దొరికిందండి''

''అలాగా ! ఎవడాడు ? చెప్పండి. ఇరవై నాలుగ్గంటలపాటు మిమ్మల్ని క్షోభకి గురిచేసిన ఆ కిరాతకుడు ఎవడో చెప్పండి. వాడిని వున్నపాటున ఈడ్చుకొచ్చి చర్మం వలిచేసి – చింతపండుని కుమ్మేసినట్టు కుమ్మేస్తాను. డొక్కచీరేసి లాకప్‌లో పడేస్తాను ఎవడాడు ? ఎక్కడున్నాడు?''

''పిల్లల్ని దొంగలించుకు వైజాగు తీసుకువెళిపోయేడండి.''

''అంత దూరమా ?''

''అవును. అతనుండేది అక్కడే.''

''ఎవడా రాస్కెల్!''

''నా భర్త !''

పాలమారేడు ఇన్‌స్పెక్టర్ !

అతను వెంటనే పకపకనవ్వేసి ''గొప్ప జోక్ వేశారండి'' అన్నాడు.

''జోక్ కాదండి. సీరియస్ విషయమే. కొన్నాళ్ళుగా మా ఇద్దరిమధ్య సంబంధాలు తెగిపోయేయి. విడిగా వుంటున్నాం. నా పిల్లలు పుట్టినకానించి నాతోనే వుంటున్నారు.''

''కావొచ్చు! కాని ఆ పిల్లలు నీకెంతో తండ్రికీ అంతేకదమ్మా!''

''అదెలా అవుతుందండీ ! ఒక ట్రాన్సిస్టర్ కాజేసిన చిన్న నేరానికి అతన్నలా శిక్షించారే ! మరి నా ప్రాణంలో ప్రాణంలా... నవమాసాలు మోసి కనిపెంచిన నా పిల్లల్ని ఎవరెత్తుకుపోయినా అదెంత నేరం ? నా పిల్లలు ట్రాన్సిస్టరు పాటి విలువచేయరా ! పిల్లల్ని అమానుషంగా ఎత్తుకుపోయినవాడు 'తండ్రి' అనే ముద్రవున్నంతమాత్రన అతను నేరస్థుడు కాకుండా పోతాడా ? అతను చేసింది నేరంకాకుండా పోతుందా?''

''నేరం ఎలా అవుద్దీ ? అతని పిల్లల్ని అతను తీసుకువెళ్ళేడు అంతే !''

''కాదు ! నా పిల్లల్ని మాయచేసి పట్టుకుపోయేడు.''

ఇన్‌స్పెక్టర్ చిరాకు పడ్డాడు.

''చూడమ్మా ! ఇది పూర్తిగా మీ కుటుంబ వ్యవహారం ! ఇందులో మేం చేసేదేంలేదు'' అని చేతులెత్తేశాడు!

''చిత్రంగా వుంది సార్! కుటుంబవ్యవహారాల్లో జరిగే ఎలాంటి నేరాల్నయినా మీరు పట్టించుకోరా ? లేక కుటుంబాల్లో జరిగే దారుణాలు అమానుషాలు నేరాలు కాకుండా పోతాయా?''

''చెబుతున్నది అర్థంచేసుకోండి! అది మీ సొంత వ్యవహారం! మాకు సంబంధంలేదు ''

''సంబంధం లేకపోవడం ఏవిఁటండీ ! నా ఖర్మ కొద్దీ నేనతనికి భార్యనేకావచ్చు ! ఒప్పుకుంటాను. కాని దానికిముందు నేనొక భారతీయ పౌరురాలినని గుర్తించరేం ? రాజ్యాంగంలో నాకు గ్యారంటీ ఇచ్చిన నా ఫండమెంటల్ రూల్స్ సంగతేవిఁటి ? దొంగని చూపిస్తున్నా మీరు పట్టుకోనంటున్నారంటే – స్త్రీగా నాకు రక్షణ ఏవిఁటి ? మరి నా పిల్లలు నాకెలా దక్కుతారు ? నా పిల్లల్ని నాకెవరు అందజేస్తారు?'' అంటుంటే సుజాత కళ్ళల్లో నీళ్ళూరేయి.

''అదేదో మీ పెద్దల మధ్యనో లేకుంటే కోర్టులోనో తేల్చుకోండి. మా డ్యూటీస్ ఏవిఁటో మాకు తెల్సు! మీరు మాకు పాఠాలేం నేర్పక్కర్లేదు. మీరిక వెళ్ళొచ్చు'' అని ఆమె ఇచ్చిన రిపోర్టుని మూడుముక్కలు చేసి చెత్తబుట్టలో పడేసాడు.

సుజాత విజయతో ఫోన్‌లో మాటాడ్డానికి ప్రయత్నం చేసింది. లైను దొరకలేదు!

చూస్తుంటే అవతల రైలుకి టైమయిపోతోంది. అంచేత –

ఈరోజు గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి బయల్దేరి వస్తున్నట్టు విజయకి టెలిగ్రామ్ ఇచ్చి –

రైలెక్కింది సుజాత.

## 31

రవి పిల్లలని తీసుకొచ్చేయడమైతే తీసుకొచ్చేశాడుగాని – తను చేసింది ఎంత ఘోరమైన పనో అతనికిపుడు అర్థమవుతోంది.

సుజాతపై కసితో ఆమెను ఏడిపించాలనే తను తీసుకొచ్చేడు.

తను యాత్రను ముగించుకుని, చివరి మజిలీగా హైద్రాబాద్‌లో దిగినపుడు – అతనికి సుజాతనీ, పిల్లలనీ చూడాలనిపించింది.

సుజాతని చూడాలనిపించినందుకు తనని తాను తిట్టుకుని – పిల్లలని చూడ్డానికి స్కూలుకి వెళ్ళేడు.

తనకి తీవ్రంగా అన్యాయం చేసిన సుజాతపై కసి, కోపం పెంచుకుని – ఆమెను ఎలాగైనా ఏడిపించాలనుకున్నాడు.

ఆమె పొగరు అణగదీయాలనుకున్నాడు.

ఆ ఉన్మాదంలో వివేచన కోల్పోయి – వున్నపాటున పిల్లల్ని స్కూలు నుంచి వస్తున్న పిల్లల్ని – అలాగే ఆ యూనీఫాం బట్టల్లో వున్న పిల్లల్నే – తనతో బాటు రైలులో తీసుకొచ్చేశాడు.

తీసుకొచ్చేసాడేగాని తన గుండెలు విపరీతంగా కొట్టుకోసాగేయి.

పిల్లలని తెచ్చిన దగ్గర నుంచి – పిల్లలతో తనకి తంట అయిపోతోంది.

పిల్లలని సాకడం అతనికి చేతకావడం లేదు! ఏనాడైనా తను పిల్లలని సాకితేగా తెల్సేది.

పిల్లలని తెచ్చిన మరుక్షణమే – తనని హింస పెట్టేస్తున్నారు.

సురేష్ బాంబుగాడయితే – మమ్మీ కావాలని ఒకటే ఏడుపు.

పిల్లకాయలనుంచి తనెక్కడికీ కదలడానికి వీలవుకుంటోంది.

వీళ్ళకి స్నానాలు, పానాలు తను చూడలేకపోతున్నాడు.

పిల్లలని కాస్త చూడు తల్లీ – అని పనిమనిషి లక్ష్మికి అప్ప జెప్పేశాడు.

లక్ష్మి ఆ ఇంటిలో చిన్న రాణీలాగే వెలగబెడుతోంది.

ఆమె ఇంట్లో అన్ని పనులతోబాటు, రవి అవసరాలు కూడా తీరుస్తోంది రాత్రులు!

పిల్లలనుంచి ఈ రోజు కూడా డ్యూటీకి వెళ్ళడం అవలేదు. డ్యూటీ కేకాదు. ఎక్కడికీ వీలు అవ్వడంలేదు.

పిల్లలని ఇక్కడికి తీసుకొచ్చి 24 గంటలైనా కాలేదు – తండ్రి అంత విసిగిపోతున్నాడు. మరి ఇన్నాళ్ళుగా పెంచి పెద్ద చేసిన తల్లి ఎంత విసిగిపోవాలి ?

పిల్లలని సుజాత తెల్లవారే లేపుతుంది. ముఖాలు కడిగించి హార్లిక్స్ ఇస్తుంది. పుస్తకాలు ముందేసి చదివిస్తుంది. చదివిస్తూ ఒకపక్క వంటకి ఉపక్రమిస్తుంది. స్కూలుకి టైమవుతుండగా – పిల్లలని స్నానం చేయిస్తుంది. సురేష్‌కి స్నానం చేయించాలంటే ఆమె తల ప్రాణం తోకకి వస్తుంది. తనకే ముందు స్నానం చేయించాలంటాడు. ఏదైనా ముందుగా తనకే చేయాలంటాడు. ఇవ్వాలంటాడు. లేకుంటే టాపులేచిపోయేలా కిందపడి ఏడుస్తాడు. తల్లి వాడిని భరించి సముదాయిస్తుంది. వాడిని దగ్గరకి తీసుకుంటే శిరీష ఏడుస్తుంది. వాడిని చూస్తున్నట్టుగా తనని చూడటంలేదంటుంది. ''పిచ్చిముండా' అంటూ నవ్వుతూ పాపనీ దగ్గరికి తీసుకుంటుంది. ''పదండి.పదండి. స్కూలుకి టైమవుతుంది'' అంటూ గబగబా పిల్లలని తయారుచేస్తుంది.

బూట్లు పాలిష్ చేస్తుంది. ఉతికిన సాక్సు వేస్తుంది. ఉతికిన యూనిఫాం ఇస్త్రీ చేసి వేస్తుంది. ఇద్దరికీ టిఫెన్ చేసి తినిపిస్తుంది. స్కూలుకి బయల్దేరుతూ సురేష్ రబ్బరు లేదంటాడు. పెన్సిలు పోయిందంటాడు. శిరీష పుస్తకం కనబడలేదంటుంది. ఆమె అన్నీ సమకూరుస్తుంది – అష్టావధానం చేస్తూ! పిల్లలని స్కూలుకి రిక్షా ఎక్కిస్తుంది.

పిల్లలకి కారియర్ కడ్తుంది. అది మధ్యాహ్నం కారియర్స్ మోసే పాపకి అందించమని లక్ష్మి దేవమ్మకి ఇస్తుంది.

పిల్లలు వెళ్ళడంతో – తుపాను వెలిసినట్టవుతుంది ! మిగిలిన పదినిమిషాలు, పావుగంటలో వెంటనే తెమిలితేగాని ఆఫీసుకు చేరలేదుతను.

అరనిమిషం ఆలస్యం అయితే ఆఫీసర్ చిందులువేస్తాడు. ఆఫీసులో 8 గంటల చాకిరీ చేసి – ఇంటికి వచ్చి – ఒక పక్క పిల్లలను చూసుకుంటూ, వంటచేసి, వాళ్ళతో హోమ్‌వర్క్ చేయించి, వాళ్ళకి భోజనాలు పెట్టి – పక్కలు పరిచి పిల్లలను పడుకోబెట్టి కథలు చెప్పి నిద్ర

పుచ్చి - తను బట్టలు ఉతుక్కొని - ఇంటి చాకిరీ అంతా చేసి ఇల్లంతా సర్దుకొని భోంచేసి నిద్రపోయేటప్పటికి రాత్రి తొమ్మిది, పది అవుతుంది సుజాతకి !

సుజాత కష్టం దగ్గర, శ్రమ దగ్గర రవి కష్టమెంత ? శ్రమ ఎంత ?

ఆమెలా పిల్లలకి చాకిరీ చేయగలడా తను ?

ఇంట్లో పని, ఆఫీసులో పని - రెండు ఉద్యోగాలు చేసే సుజాత ఎక్కడ ? రవి ఎక్కడ ?

ఆమెకున్న, ఓరిమి, ఓపిక అతని కెక్కడివి ?

వుంటే పిల్లలమీద ఎందుకలా చిరాకు పడతాడు ?

రెండు రోజులకే పిల్లలమీద కసురుకొని రెండు మూడు సార్లు బాదేడు.

పిల్లలు ఇద్దరూ పావుగంట క్రితం అతణ్ని చిరాకెత్తించేయగానే అతను పిల్లలకి రెండేసి 'అల్లరి చేశారంటే తంతాను - నోరు మూసుకు పడి వుండండి ' అని కేకలేసాడు.

శిరీష, సురేష్ బిక్కముఖాలు వేసుకుని ఒక మూలన కూర్చున్నారు.

అస్థిమితంగా వున్న రవి - పడుకొని చిరాగ్గా పేపరు తిరగేస్తున్నాడు.



పిల్లలు ఇద్దరిలో ఒక్కసారిగా చైతన్యం చిమ్ముకొచ్చింది.

అప్పుడే ఇంట్లోకి పాదం మోపిన సుజాతని 'మమ్మీ' అంటూ చుట్టుముట్టేశారు

పిల్లల ముఖాలు మతాబుల్లా వెలిగిపోయేయి.

రవి ముఖం కందగడ్డలా అయిపోయింది.

సుజాత పిల్లల్ని ఎన్ని యుగాల వియోగం తర్వాతో చూసినట్టు పిల్లల ఒళ్ళంతా తడిమి, ముద్దులతో ముంచెత్తింది. పిల్లలని తాకిన పారవశ్యంతో ఆమె ఒళ్ళు పులకరించింది. ఆమె కళ్ళు తడిసేయి.

''ఎందుకొచ్చేవు ఇక్కడికి ?'' ఘర్జించేడు రవి.

అలా ఘర్జించడానికి రెండు నిమిషాల టైము తీసుకున్నాడు.

తలెత్తి రవి వేపు తీక్షణంగా చూసింది.

''ఎందుకొచ్చేవని అడగడానికి సిగ్గులేదూ ! నా పిల్లల్ని తీసుకుపోడానికి వచ్చేను. నా పనయింది. వస్తాను. '' అంటూ పిల్లల్ని తీసుకెళ్ళిపోతుంటే రవి పరుగున వచ్చి ఆమెను గుంజి పిల్లలని ఆమె వద్దనుంచి లాక్కున్నాడు. లాక్కొని ''గెటౌట్'' అని ఆమెను తోసేడు.

పిల్లలు ఏడుపు.

సుజాత ఏడుపు.

''నీకు దండం పెడతాను ! నా పిల్లల్ని నాకిచ్చేయ్. నిన్నేమీ అడగను. నీ జోలికి రాను. నా పిల్లలు లేకుండా నేను బతకలేను. నా పిల్లల్ని నాకిచ్చేయ్ !''

''నీకు పిల్లలెందుకే ! అందరి దగ్గర పడుకునే లంజవి. లంజలకి పిల్లలతో ఏంపని ?''

''అవును. నేను లంజనే. ఒప్పుకుంటాను. లంజకి పుట్టిన పిల్లలు నీ పిల్లలెలా అవుతారు

? లంజనైనా నేను వాళ్ళకి తల్లిని !.. లంజ పిల్లలు నీకెందుకు ? నా పిల్లలు నాకిచ్చేయ్ '' అని చేతులెత్తి నమస్కారం పెట్టింది.

''ఎక్కువ వాగకుండా ముందు బయటకెళ్ళు ? నా పిల్లలకి నీగాలి సోకడానికి వీల్లేదు.''

''రెండురోజులు నీగాలి సోకగానే నీ పిల్లలయిపోతారా? నేను నవమాసాలు మోసి, కన్నాను. నా కష్టంతో నా డబ్బుతో పెంచి పెద్ద చేసాను. నన్ను బాధపెట్టకు. నన్ను విడాకులిచ్చి వదిలేయ్. నేను బాధపడను. నా పిల్లలని మాత్రం నాకు కాకుండా చేయకు. నాకీ ఉపకారం చేయి. నిన్ను ప్రార్థిస్తున్నదదే. నిన్ను బతిమాలుకుంటున్నదదే. నా పిల్లలని నాకిచ్చేయ్. నాయినోయ్ నాకిచ్చేయ్'' అంటూ ముందుకు వచ్చి ఆమె పిల్లల రెక్కలు పట్టుకోబోతుంటే రవి ఆమెని ఊపున కిందికి తోసేసాడు.

తోసేసినా, ఆమెలేచి పిల్లల దగ్గరకొస్తుంటే – ఆమె జుట్టు పట్టుకుని బయటకీడ్చేశాడు.

తల్లిదగ్గర కొస్తున్న పిల్లల్ని ఈడ్చి వాళ్ళని వంటగదిలో పెట్టి గడియ పెట్టేశాడు.

నా పిల్లలు నాకిచ్చేయమని లోనకి వచ్చిన సుజాతని ఇష్టమొచ్చినట్టుగా ఉన్మాదంగా కొట్టసాగేడు.

నీ వెంత కొట్టినా నా పిల్లలని నాకిస్తేగాని నేను కదల్ను అంటోంది సుజాత.

అక్కడ అదంతా పెద్దసీను అయింది. చుట్టుపక్కలవాళ్ళంతా గుమిగూడేరు. నిలబడి తిలకిస్తున్నారేతప్ప ఎవరూ కలగజేసుకోవడంలేదు.

సరిగ్గా ఆ సమయంలో విజయ వచ్చింది. కొడ్తున్న రవి విజయ కేకలు వేయగానే ఆగిపోయేడు.

''రవి ! నీవింత నీచంగా ప్రవర్తిస్తావనుకోలేదు. పెళ్ళాలని కొట్టడంలో మగాళ్ళు అందరూ ఒకటే. పిల్లల్ని నీవు ఎత్తుకు రావటం తప్పు ! పిల్లలని తీసుకోపోడానికి వస్తే – ఆమెనలాకొడతావా ? నీవు మనిషివేనా ?''

''విజయా ! దయచేసి మా విషయంలో కలుగజేసుకోకు.''

''ఒక ఆడదాన్ని కొట్టడం సొంత విషయం ఎలా అవుతుంది ?''

''అది నా భార్య. కొట్టుకుంటాను. తిట్టుకుంటాను. అది నా యిష్టం. మిగతావాళ్ళకి అనవసరం.''

నిర్ఘాంతపోయింది విజయ.

''చెలమే అనుకున్నాను, కాని నీవుకూడా ఇంత సంస్కార హీనుడవి, మూర్ఖుడివి అనుకోలేదు. పెళ్ళాలని కొట్టే హక్కు భర్తలకి ఏ చట్టమిచ్చిందో ఆ చట్టం అంతు చూస్తాను. సుజాత పిల్లలను సుజాత కెలాగ ఇవ్వవో అదీ చూస్తాను'' అంటూ విజయ సుజాతను తీసుకొని వెళుతూ –

''రవీ ! పిల్లలు అమ్మా ! అమ్మా ! అని అరుస్తున్నారు. నీవు తల్లినుంచి పిల్లలని దూరం చేశావు. నిన్ను ఆ భగవంతుడు కూడా క్షమించడు. నీవు ఏదొకరోజున ఆమె పిల్లలని ఆమెకి

ఇవ్వక తప్పదు. ఈ లోగా ఆ పిల్లలకి ఏది జరిగి ఏదైనా – నీవా బాధ్యత పూర్తిగా వహించాల్సి వుంటుంది?'' అని హెచ్చరించింది.

విజయ, సుజాత వెళిపోగానే – అక్కడ చేరిన జనం మీద – 'మీ కిక్కడేం పని – పోండి' అని అరిచి – తలుపులు దబ్‌మని వేసుకొని – ఆ తలుపులకి నుదురు బాదుకొని ఏడ్చేడు రవి!

స్టేషన్లో సుజాతను కలిసుంటే – ఆమె ఒక్కతినే రవి దగ్గరికి వెళ్ళనిచ్చేది కాదు విజయ.

గోదావరికి వస్తున్నట్టు సుజాత ఇచ్చిన టెలిగ్రాం ఈరోజు ఉదయం డ్యూటీలో అందుకుంది. టెలిగ్రాం కంపెనీ అడ్రసుకి ఇవ్వడంతో సాయంత్రం ఆఫీసు కట్టేయడం చేత టెలిగ్రాం ఉదయం డ్యూటీకి వచ్చినపుడు చేరింది.

చేరినప్పుడు టైము ఎనిమిదిన్నర!

తను పరుగున స్టేషనుకి రాబోయేటప్పటికి – అప్పటికి ఇరవై నిమిషాలముందే రైలు వచ్చేసింది! సుజాత ఖచ్చితంగా రవి దగ్గరికే వెళ్ళుంటుందని ఊహించి తను అటు బయల్దేరి వచ్చేసరికి... జరిగిందది!

## 32

సుజాతకి ఛాయని పరిచయం చేసింది విజయ.

''నీకు టెలెక్సు మెసేజ్ ఇచ్చింది నేనే అయినా – ఆ యిన్ఫర్మేషన్ సంపాదించింది ఛాయే '' అని తెలియజేసింది విజయ.

యాత్ర నుంచి వైజాగ్ చేరుకున్న రవి – తన గది తాళాలకోసం ఛాయని కలిసేడు. అపుడు తెల్సింది పిల్లలని తీసుకొచ్చేసిన వ్యవహారం. రవిని మందలించి – ఆ సంగతి విజయకి తెలియజేసింది. ''ఆమె పిల్లలు ఇక్కడ క్షమంగా వున్నారనే విషయం – అందించకపోతే ఆ తల్లి చచ్చిపోతుంది '' అని విజయచేత ఇమిడియట్‌గా టెలెక్స్ మెసేజ్ పంపించింది ఛాయ!

సుజాత ఛాయకి కృతజ్ఞతలు తెలియచేసింది.

విజయకి కూడా !

కేవలం తన కాపురమే ఇలా ఏడుస్తోంది అనుకుంది. ఎంతో అన్యోన్యంగా వుండే విజయ, చెలంలు విడిపోవడం –మొత్తం జరిగిందంతా విని దిగ్భ్రాంతి చెందింది. బాధపడకుండా వుండలేకపోయింది సుజాత.



''ఇపుడు ఇంచుమించు మనమిద్దరం ఒకే సమస్యను ఎదుర్కొంటున్నాం'' అని – ''అందుకే అనుకుంటాను – మనమింత చేరువయ్యాం'' అంది విజయ. అలా అన్నప్పుడు విజయ కళ్ళల్లో నీళ్ళు సుజాత గమనించకపోలేదు.

ఆ రోజు రాత్రి – చెలంతో గొడవపడిన తర్వాత –

విజయ రంగంమామ్మతో కలిసి విజయనిలయం నుంచి – ఛాయ దగ్గరికి వెళ్లేరు.

రవి యాత్రలో వుండటం చేత, రవి ఇంటి తాళాలు ఛాయ దగ్గర వుండటం చేత - ఛాయ రవి గదిని ఉపయోగించుకోమంది. ఆ తర్వాత ఓ నాలుగురోజులకే విజయకి క్వార్టరు దొరికి క్వార్టరులోకి షిఫ్టు అయిపోయింది.

రెండు రోజులు పోయేక సందీప్ కోసం రంగంమామ్మని పంపితే ఇవ్వలేదు చెలం.

తర్వాత తను వెళ్ళింది. అక్కడ పెద్ద గొడవే అయిందే తప్ప - సందీప్‌ని తనతో తెచ్చుకోలేకపోయింది.

తర్వాత సందీప్‌కి జ్వరం ఎక్కువై - ఆస్పత్రిలో జాయిన్ చేశారనే సంగతి తెల్సింది.

పరుగున ఆస్పత్రికెళితే - చెలం అక్కడకూడా పేచీ పెట్టేడు.

ఆస్థితిలో బిడ్డ దగ్గర తల్లిని వుండొద్దు అంటే ఎట్లా ?

ఎట్లాగైనా, ఏది ఏమైనా ఆమె సందీప్ వద్ద వుండడానికి వీల్లేదంటాడు చెలం.

మళ్ళీ గొడవ!

గొడవ అవ్వడంతో అక్కడ పెద్దలు అనబడే వాళ్ళు కలుగజేసుకున్నారు.

ఆమె బిడ్డని రోజుకో గంట వచ్చి చూసి వెళ్ళిపోడానికి చెలాన్ని ఒప్పించేరు.

అంతే తప్ప బిడ్డదగ్గర తల్లి వుండకపోతే ఎట్లా - అని చెలాన్నెవరూ నిందించలేదు.

బాబుని రోజూ పరాయిస్త్రీలా విజిటింగ్ హవర్స్‌లో చూసి వచ్చేది. ఆమె దుఃఖాన్ని, బాధనీ ఎవరూ అర్థం చేసుకోలేదు. ఎవరిక్కావాలి ?

సందీప్‌ని ఆస్పత్రి నుంచి డిశ్చార్జి చేశాక రోజుకి ఒక గంట బాబుని చూసే ఆ అదృష్టాన్ని కూడా కోల్పోయింది.

చెలం లేని టైము చూసుకొని బాబుని చూసి రావాల్సిన దుస్థితి ఏర్పడింది.

వారం కిందట పార్వతమ్మే సందీప్‌ని దొంగచాటుగా తీసుకొచ్చి ఒక గంట వుంచి తీసుకెళిపోయింది.

కొడుకుని దొంగచాటుగా చూడాల్సిన ఖర్మ తనకేవిటి ?

''నా కొడుకు నా దగ్గరుండాలి. నా దగ్గర పెరగాలి. నవమాసాలు మోసి కనిపెంచిన కొడుకుపై హక్కు నాదిగాని చెలంది ఎలా అవుతుంది ?'' అని ఆక్రోశిస్తోంది ఆమె మనసు.

తన బిడ్డను తను పొందడంకోసం చివరికి కోర్టు కెళడానికే నిర్ణయించుకుంది విజయ.

ఆ విషయమై కన్సల్టు చేయడానికి లాయర్ యశోదా దేవి దగ్గరికి వెళ్తోంది.

యశోదా దేవి ప్రోగ్రసివ్ భావాలుకల లాయరు. ఆమెకు చాలా మహిళా సంఘాలతో, మానవ హక్కుల సంఘాలతో సంబంధాలున్నాయి..అంచేత యశోదాదేవి బాగా ఛాయకి తెల్సు.

విజయని యశోదాదేవి వద్దకి తీసుకెళ్తానంది ఛాయ.

''నేనూ వస్తాను'' అంది సుజాత.

ముగ్గురూ లాయర్ యశోదాదేవి దగ్గరికి ఆ రోజు సాయంత్రం బయల్దేరారు.

## 33

ఆ గదిలోకి-

భారత రాజ్యాంగ పౌరులుగా, తమకి జరిగిన అన్యాయాన్ని కోర్టుకి నివేదించడంకోసం, సలహాకోసం ఇద్దరు స్త్రీలు విజయ, సుజాతలు అడుగుపెట్టేరు. వాళ్ళతో ఛాయకూడా వుంది

ఛాయ ఆ గదిని పరికించింది.

ఆ గదినిండా బీరువాలు. బీరువాలనిండా పుస్తకాలు. ఇంతింత లావు పుస్తకాలు. రాతిగోడలకీ, ఆ పుస్తకాల బీరువాలకీ పెద్ద తేడా కనబడలేదు ఛాయకి.

ఈ పుస్తకాలు ప్లీడర్లని పెంచడానికి, వున్నతవర్గాల కాపుకాయడానికి తప్ప సామాన్య ప్రజానీకానికి అందుబాటులో లేనివి, అర్థం కానివి అనిపించింది ఛాయకి. కాఫిన్‌లో భద్రపరచబడే శవాల్లా వున్నాయి ఆ పుస్తకాలు!

నూతన రాజ్యాంగం వచ్చి మూడు దశాబ్దాలు దాటినా - ఆ 'లా' పుస్తకాలు చెదపట్టి, ముక్కిపోయి కంపుకొడుతున్నాయేతప్పా- భారత పౌరులందరికీ యూనిఫాంగా గవర్న్‌చేసే విధంగా (పూర్తిగా మార్చకపోయినా) కనీసం ఎందుకు రివైజ్ చేయబడ్డంలేదు.

ఈ పుస్తకాలా దీనజన ప్రజలకి న్యాయం అందించేవి ?

ఆ పాపాల పుస్తకాల మధ్య - పుణ్యమూర్తిలా కూర్చుని వుంది లాయర్ యశోదాదేవి.

ఆమెకి నలభై ఏళ్ళుంటాయి. సన్నంగా, పొడవుగా, తెల్లగా వుంటుంది. కాస్తనెరసిన జుట్టు, కళ్ళకి వున్న అద్దాల ఫ్రేమ్, ఆ ముఖంలో సౌమ్యత, మాటల్లో నమ్రత, నిశితమైన చూపు - ఆమెనొక మేధావిగా చూపిస్తాయి. ఎర్ర బోర్డరు గల గోధుమరంగు చీరకట్టుకుని సింపుల్‌గా, నిరాడంబరంగా వుంది.

ఛాయ ఆమెకి విజయ, సుజాతలను పరిచయం చేసింది.

''నమస్తే'' అంది

వాళ్ళకి సీట్లు చూపించి కూర్చోమంది.

కూర్చున్న విజయని యశోదాదేవి వెంటనే గుర్తించి -''మీరు ఆరోజు టౌనుహాల్లో మహిళా సంఘం సభలో మాటాడేరు కదూ'' అంది.

తనని గుర్తించినందుకు విజయ పరమానందభరితురాలై - అవునన్నట్టు తలవూయించింది.

''నేను లాయర్ అన్న సంగతి మర్చిపోండి. ఒక స్నేహితురాలిగా మీ సమస్యలేవిటో చెప్పండి. నా శక్తిమేరకు మీకు సహాయపడతాను'' అంటూ విజయ, సుజాతలకి ఆమెపై కాన్ఫిడెన్సు కలిగించింది.

విజయ తన కథ చెప్పింది.

తర్వాత సుజాత తన కథ చెప్పింది.

ఆ కథలు వినేటప్పుడు – లాయర్ అవసరమైనప్పుడల్లా ప్రశ్నలు వేసింది.

ఇద్దరు స్త్రీలు. ప్రాబ్లెమ్ ఒకటే.

పిల్లల సమస్య!

భర్తల వద్దనున్న తమ పిల్లలను తమకి కోర్టువారు అందజేయాలి

యశోదాదేవి కళ్ళద్దాలు సవరించుకుంటూ అంది – ''చూడండమ్మా! మీ ఇద్దరికి జరిగిన అన్యాయం నాకు అర్థమయింది. న్యాయంకోసం మీరు వచ్చేరు. మీకు న్యాయం చేకూర్చడానికే నా శక్తిమేరకు ప్రయత్నిస్తాను. కాని మీరేమీ అనుకోనంటే ఒకమాట...''

''చెప్పండి''

''ఓ స్నేహితురాలిగా చొరవచేసి చెబుతున్నదేమిటంటే... మీ భర్తలతో ఎలాగోలా రాజీకి రావడం మంచిది. నేను అనేక కేసులు మీకులాంటివి డీల్‌చేసిన అనుభవం మీద చెబుతున్నాను. మీ భర్తలు మిమ్మల్ని పెట్టిన టార్చర్ అమానుషం అయినప్పటికీ – కంపేరిటివ్‌గా మీ భర్తలు చాలామంది భర్తలమీద నయం అని చెప్పడానికి సాహసిస్తున్నాను. ఏమీ అనుకోవద్దు.''

ఈవిడేం ప్రోగ్రసివ్ భావాలు గల లాయరు బాబు అనుకుంది విజయ.

మొగుళ్ళు మంచోళ్ళయితే ఇలా న్యాయంకోసం మీదగ్గరికి రావల్సిన అవసరం ఏవిఁటి?

''మీకు కోర్టు అంటే తెలీదు. ఒక లాయర్‌గా నేను అనగూడదు గాని మీరు పులినోట్లో తలపెడుతున్నారన్నమాట! ఎందుకు చెబుతున్నానో అర్థం చేసుకోండి. మీ భర్తలకున్న ఆపాటి హృదయం కూడా కోర్టుకి వుండదు. మా ప్లీడర్లకి వుండదు. కేసు గెలిపిస్తామన్న ఆశ చూపిస్తూ మీ దగ్గర డబ్బు తినేసి మిమ్మల్ని భక్షించేయడమే మాపని.''

నవ్వేరు ముగ్గురు.

''అవునమ్మా! రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు – మీకు తెల్సుకదా – వారు ఏమని జోక్ చేస్తారంటే– 'పి' అనే అక్షరంతో మొదలయ్యేవాళ్ళని నమ్మొద్దంటాడు. అంటే ప్లీడర్లనీ, పోలీసులనీ, ప్రాస్టిట్యూట్‌లనీ...'' అంటూ నవ్వింది.

ముగ్గురు స్త్రీలూ నవ్వేరు.

''మీరు అలాంటివారు కాదనీ, మీరు మాకు న్యాయం చేయగలరనే పూర్తి నమ్మకంతో వచ్చేమండి – మీ గురించి ఛాయ చెప్పింది'' అంది విజయ.

''రైటేనమ్మా! మీరు నన్ను నమ్మేరు. కాని నాకా శక్తిఏది ? చట్టమే స్త్రీకి అన్యాయం చేస్తుంటే– ఆ చట్ట పరిధిల్లో వాదించాల్సిన లాయరు మీకు ఎంత వరకు న్యాయం చేకూర్చగలదు?''

''ఎవరికైనా నిష్పక్షపాతంగా న్యాయం అందించాల్సిన చట్టం –స్త్రీలకి అన్యాయం చేయడం ఏవిఁటీ? – తెల్లబోతూ, అమాయకంగా అడగింది సుజాత.

యశోదాదేవి నవ్వుతూ – ''చూడమ్మా! మీ సంగతే తీసుకుందాం. న్యాయంగా మీకు చెందాల్సిన పిల్లలని మీకు ఇప్పించమని న్యాయం కోసం వచ్చేరు. అవునా ?'' అంది.

''అవును''

''పిల్లల విషయంలో బెటర్ పేరెంట్, రైట్ పేరెంట్ ఎవరు ? తల్లా ? తండ్రా ? అంటే తల్లే అని బుద్ధి బుర్ర వున్నవాళ్ళంతా ఒప్పుకుంటారు. అవునా ?''

''అవును''

''కాని చట్టం ఏమంటుందో తెల్సా ? బెటర్ పేరెంట్ తండ్రే అంటుంది. పిల్లలు తండ్రికే చెందుతారు అంటుంది. తండ్రి మాత్రమే పిల్లలకి నేచురల్ గార్డియన్ అంటుంది. చట్టం బిడ్డపై తండ్రి గల హక్కుని ప్రొటెక్టు చేస్తుంది – అది పసివాడి భవిష్యత్తుని దెబ్బతీసినా సరే!

నిర్ఘాంతపోయి – కుర్చీలకి చేర్లబడిపోయేరు తల్లులు!

''మన హిందూ ఆక్టేకాదు, ముస్లిమ్ ఆక్ట్, క్రిష్టియన్ ఆక్ట్... ఏ చట్టమైన సరే తండ్రే పిల్లలకి లీగల్ గార్డియన్ అంటుంది. ఆ విషయమై క్లైమ్ చేస్కోడానికి కూడా తల్లికి అధికారం, అర్హతలేదు. మన ఇండియన్ ట్రెడిషన్‌లోనే, మన కల్చరులోనే పురుషాధిపత్యం వుంది. ఆయా ధర్మాలని చట్టం పరిరక్షిస్తుంది. ఇక స్త్రీకి న్యాయమేమిటి ?''

''స్త్రీ పిల్లల్ని కని ఇవ్వడానికేనా వుంది ? పిల్లలమీద ఆమెకే మాత్రం హక్కులేదా ?'' – సుజాత ఆందోళన!

''చట్టం తండ్రిని నేచురల్ గార్డియన్‌గా గుర్తించినప్పటికీ – చిన్న పిల్లలు తల్లి ఆధీనంలో పెరగడానికి అవకాశం ఇస్తుంది. అదైనా అన్ని సందర్భాల్లో కాదు. కేస్ టూ కేస్ డిఫర్ అవుతుంది.''

''ఎలా ?''

''మీ సంగతే తీసుకుందాం. కస్టడీ ఆఫ్ చిల్డ్రన్ మీకు ఫేవర్ బుల్‌గా కోర్టు తీర్పు ఇచ్చిందనుకుందాం. కాని మీరు తిరిగి పెళ్ళి చేసుకోవడంవల్లో, లేక ఏదైనా వూరు ట్రాన్స్‌ఫర్ అవడంచేతో ఇంకేదో ఉత్పన్నమయ్యే సమస్య మళ్ళీ కోర్టుకి వెళ్తుంది. అది కోర్టువారు పరిశీలించి లాభం లేదని – తండ్రి కస్టడీకి పిల్లలని మార్చవచ్చు''

మా పిల్లల గురించి ఏం చేయాలో చెప్పకుండా ఇంకేదో చెబుతాదేవిఁటీ అనుకుంది సుజాత.

''మా పిల్లల గురించి ఎలాగండీ ? వాళ్ళని నేను చూడకుంటా వుండలేవండీ'' కళ్ళు నీళ్ళు నిలిచేయి సుజాతకి.

''మీ పిల్లలు మీ భర్తల దగ్గరున్నప్పటికీ – మీరు పిల్లల్ని చూసి వస్తుండొచ్చు. అందుకు కోర్టు అనుమతి ఇస్తుంది''

''భర్త చూడ్డానికి వీల్లేదంటే'' – విజయ.

''వీల్లేదంటున్నాడని కోర్టుకు చెప్పుకోడమే! కోర్టు అపుడు అతనిని మందలించవచ్చు. అప్పటికీ వినకపోతే పిల్లల కస్టడీ తల్లికి అప్పజెప్పవచ్చు.''

అంటే పిల్లలు తండ్రి ఆధీనంలో పెరిగినా – తల్లి వెళ్ళి పిల్లలను చూసిరావచ్చు.

అవును. అలాగే పిల్లలు తల్లి ఆధీనంలో పెరిగినా తండ్రి వచ్చి చూడవచ్చు. అభ్యంతరం పెట్టడానికి వీల్లేదు.

పిల్లల విషయమై ఎంతో ఆశతో వచ్చిన ఆ తల్లుల ముఖాలు నల్లబడి పోయేయి. వాళ్లలో నిరాశ నిస్పృహలు ఆవహించేయి.

వాళ్ళకేం చేయాలో తెలీక –

''మమ్మల్ని ఏం చేయమంటారో మీరే చెప్పండి '' అన్నారు.

''పిల్లల వయసు ఏడేళ్ళ లోపునే గనుక – పిల్లలు మన కస్టడీలోనే పెరగడానికి కోర్టు అనుమతినీయవచ్చు. పదేళ్ళ లోపు పిల్లలను సాధారణంగా తల్లినే పెంచమంచారు. అందుకు మెయింటెనెన్స్ అలవెన్సు తండ్రి చేత ఇప్పిస్తారు.''

''ఆ ముష్టి భరణం మాకక్కర్లేదండి మా ఉద్యోగాలతో మా పిల్లలని పెంచగలం '' అంది విజయ.

''అందరు స్త్రీలు ఉద్యోగస్తురాళ్ళు కాదు కదా !'' అంది నవ్వుతూ లాయరు. ''సరే నా సలహా ఏమిటంటే ఇపుడు మనం వెంటనే కోర్టుకి వెళ్ళొద్దు. మనం ఏం చేద్దామంటే మామూలుగా మీ భర్తలకి గట్టిగా నోటీసులు పంపిద్దాం.

ఏమనంటే – పిల్లలు పసివాళ్ళు గనక ....వాళ్ళు తల్లి కస్టడీలో పెరగడం న్యాయం కాబట్టి – మీ ఆధీనంలోవున్న ఆయాపిల్లలని మా క్లయింట్లకు ఈ నోటీసు అందిన మూడురోజుల్లోగా అప్పచెప్పవలసివుందని రిక్వెస్టు చేస్తాం. మూడురోజులలోగా పిల్లలను మా క్లయింట్లకి అప్పజెప్పకపోతే దాని యొక్క తీవ్ర పరిణామాలు కోర్టులో ఎదుర్కోవలసి వుంటుందని హెచ్చరిస్తాం.

అలా ఒకటి, రెండు నోటీసులు జారీచేసి.. వాళ్ళ రియాక్షను చూసి అప్పుడు అవసరమైతే కోర్టుకి వెళ్ళొచ్చు ! ఏమంటారు ?''

అలాగే అన్నారు ఆ యిద్దరు తల్లులు.

''అయితే ఎల్లుండి ఆదివారం ఉదయం రండి. ఆ పనిమీదే కూర్చుందాం .''

''ఫీజు..''

''తర్వాత చూసుకుందాం'' అంది నవ్వుతూ.

ఆడవాళ్ళు ముగ్గురూ లాయర్‌కి నమస్కరించి ఇవతల కొచ్చేరు.

తాము కన్న పిల్లలమీద తమకి హక్కు లేదనే విషయం – ఆ తల్లులు సుజాత, విజయలను విపరీతంగా కృంగదీసింది.

గుండెలు బరువెక్కగా – నీరసంగా నడవసాగేరు.

# 34

రాంబాబు, ఛాయ నెలరోజులుగా ఇద్దరూ కలుసుకోవడంలేదు. ఆఫీసులో, తోవలో ఛాయ ఎదురుపడితే ముఖం తిప్పుకు వెళ్ళిపోతున్నాడు రాంబాబు. ఛాయ అంతే చేస్తోంది

రాంబాబు చేసిన వెధవపనికి అసహ్యించుకోకుండా వుండలేకపోతోంది ఛాయ.

తను అతనికి ఎలాంటి బర్డెన్ అవకుండా అతన్ని ఎలాంటి ఇబ్బందుల్లో పెట్టకుండా అతణ్ణి ఎంతో యిదిగా ప్రేమగా చూసుకొస్తుంటే తనని మోసం చేస్తాడా ? మాయచేస్తాడా ? ఛీఛీ –

ఆ రోజు – శనివారం

రవి ఇంట్లో –

''తల్లివి అవాలనుకుంటున్నావా ? పెళ్ళికాకుండా ఎలా అవుతావు ?'' అన్నాడు రాంబాబు.

''పెళ్ళికాకుండా ఎలా ప్రెగ్నెంట్ అయేను ! అలానే '' అంది ఛాయ

''అదెలా ?'' అంటే–

''ఎలా అవుతానో చూడు '' అంది.

''నీవు చేస్తున్నపని నాకిష్టంలేదు''

''నేను చేస్తున్న పని నాకిష్టం''

''నీవు తీసుకున్న నిర్ణయం వల్ల చాలా ఇబ్బందులకు గురి అవుతావు ''

''అందుకు నేను సిద్ధం''

''నీవు చాలా మందిని బాధ పెట్టిన దానివవుతావు. ముఖ్యంగానన్ను''

''నేను సంతానవతిని కావడంవల్ల నీకేం బాధ. పురిటి నొప్పులు నాకు''

''సంతానం కలిగేది స్త్రీకే అయినా పుట్టిన పిల్లలని తన వారుసులుగా పురుషుడు స్వీకరిస్తాడు. నీవు నాకా అవకాశం ఇవ్వడం లేదు. బాధగా వుండదూ !''

''రామ్ ! నీలో ఇంకా ఫ్యూడల్ ఆలోచనలు పోలేదు. పూర్వకాలపు స్త్రీలలా ఈతరం స్త్రీ పురుషుడికి వారసుణ్ణి కనిచ్చే యంత్రంకాదు. ఆమెకి పిల్లలు కావాలనుకుంటేనే కంటుంది. అంతే తప్ప పురుషుడికి వారసుణ్ణి ఇవ్వడానికి కాదు. ఆ రోజులు పోయేయి. జంతువుల్ని చూడు. పక్షుల్ని చూడు. పిల్లల సంరక్షణ మొత్తం తల్లే చేస్తుంది . బాధ్యతగా స్వీకరిస్తుంది. తండ్రికాదు. ఆ మాటకొస్తే వాటికి తండ్రిలేడు అనాలి ''

''నీకు చెబుతున్నది జంతు ధర్మం''

'' ఈ పురుషాధిక్య సమాజంలో నీవు కళ్ళు తెరిచి, అహం మరిచి జంతువుపాటి ఆలోచిస్తే చాలు''

రాంబాబుకి చిరాకు వేసింది.

''నీవు తల్లి కావాలని ఆశ వున్నప్పుడు –నేను తండ్రి కావాలనుకోడం దురాశ అవుతుందా?''

''దురాశే! లేకుంటే తండ్రినవుతానని ఇంతపట్టు పట్టవు''

క్షణకాలం నోటిమాటరాలేదు రాంబాబుకి.

నెమ్మదిగా, నచ్చజెప్పే ధోరణిలో అన్నాడు ''ఛాయా! మనకో వివాహ వ్యవస్థ, సమాజం నిర్దేశించిన నీతి వున్నాయి కదా! మనం దాన్ని ఫాలో అవాలి నీకు తోచినట్టుగా ప్రవర్తిస్తానంటే ఎట్లా? నీలా ఎవరికి తోచినట్టు వాళ్ళు ప్రవర్తిస్తే – ఇక సమాజం ఎందుకు? నీతెందుకు?''

'' ఆ సామాజిక నీతి ప్రకారం అయితే మనం ఇలా కలుసుకోడమే తప్పు. అంతేకాదు. నీవు కడుపు చేయడం, అంత కన్నా తప్పు. సమాజం అంటే అంత గౌరవమున్నవాడివి నీ వెందుకు చేశావు తప్పు?''

''నిన్ను పెళ్ళి చేసుకొని నా తప్పు సరిదిద్దుకుంటాను''

''తప్పుని సరిదిద్దుకోడానికే నీవు తప్పు చేశానంటావు. నీవు పెళ్ళయినవాడివై యుండి పరస్త్రీని పొందడానికి – ఏ నీతినైతే ధిక్కరించావో – ఆ నీతినే ఇపుడు నీవు నాపై ప్రయోగిస్తున్నావు – అని నేనంటాను. అవసరంబట్టి నీతి మారిపోతూవుంటుంది. అంతేనా?''

''సరే! ఇవ్వనీ ఎందుకూ – నీవు పెళ్ళి పెడాకులు లేకుండానే తల్లి అవుతానంటావు. దానివల్ల నీకొచ్చే లాభం ఏవిఁటీ?''

''లాభం కాదు. నేను నష్టపోకుండా చూసుకుంటున్నాను''

''అంటే''

''స్త్రీకి శారీరకంగా పదిమంది మగాళ్ళతో అనుభవమున్నా పుట్టేబిడ్డకి తండ్రి ఎవరనీ వాపోదు. ఆలోచించదు, పుట్టిన బిడ్డని అప్యాయంగా, ఆనందంగా స్వీకరిస్తుంది.

అయితే – రాను రాను ఆస్తి అనేది బయల్దేరాకా – పురుషుడిలా స్త్రీ స్వేచ్ఛగా ఇష్టమైన మగాడితో అనుభవం నిషేధింపబడింది ఎందుకు?

ఆమెకి కల్గిన సంతనం ఎవరివల్ల కల్గిందనేది వివాదస్పదమైన విషయం. అంచేత స్త్రీ ఒకే పురుషుడికి కట్టుబడి వుండాలనే నియమం అవసరమైంది.

వివాహం కాకుండా స్త్రీ పురుషునితో కలియకూడదు. వివాహానంతరం పరపురుషునితో పడుకోగూడదు.

ఈ నియమాలన్నీ ఎందుకు? ఆస్తిని రక్షించుకునేందుకు? పుట్టిన బిడ్డ మగ ప్రపంచపు వారసుడని తెలియజేసేందుకు!

ఎంత అక్రమంగా బిడ్డ మీద హక్కు పొందేడు భర్త!

అందుకే నిన్ను ప్రార్థిస్తున్నాను – దయచేసి నీవు నా భర్తవి కావొద్దు. నాకు పుట్టే బిడ్డపై ఆశలు పెట్టుకోవద్దు. ఏ హక్కులూ ప్రకటించవద్దు'' అంది ఛాయ, బతిమాలే ధోరణిలో

''ఛాయా! నీవెంత రీజనింగుతీయి, నీలో పెరుగుతున్న నా ప్రతిబింబంపై నాకు

హక్కులేదంటే నాకు బాధకాదా ?''

''ఆ భావమే నేను వద్దంటున్నది ! అయినా, నాలో పెరుగుతున్నది నీ ప్రతిబింబమే అన్న నమ్మకం ఏవిఁటీ?''

''ఛాయా ! '' తీవ్రంగా అన్నాడు రాంబాబు.

''అవును ! ఎవరెవరి దగ్గర పడుకుంటున్నానో నీకేం తెల్సు !''

''నాకు తెల్సు. నీవలాంటి దానివి కాదు. నీపై నాకా నమ్మకం వుంది''

''అది ఆత్మవంచనే కాని నమ్మకం కాదు. అయినా నీవు నన్ను నమ్మాలనుకోవడంలేదు. బహుశా నిన్ను నీవు వంచించుకొని – నన్ను అదుపులో వుంచడానికే – నన్ను వివాహ బంధంలో ఇరికించ చూస్తున్నావు. రామ్! నేనొకటి అడుగుతాను చెప్పు ''

''ఏవిఁటి ?''

''ఇన్నాళ్ళు మనం కలుస్తున్నది శారీరక తృప్తికోసమేగాని సంతానం కోసం కాదుగదా ! అది ఆలోచించు. అదీకాక నీకు భార్య వుంది. ఆమె నీకు ఒక్కర్నికాదు – ముగ్గురు పిల్లల్ని ఏకంగా కని ఇచ్చింది. సంతోషించు. నన్ను హింసించకు''

''నీకెలా చెప్పాలో అర్థంకాదు''

''నాకర్థమయింది. నీకు మగబిడ్డగావాలి. ఆ బిడ్డని కని నీకు ఇవ్వాలి. అంతేనా ?''

''అలా కోరుకోడంలో తప్పేం కనబడ్డంలేదు. ఒకవేళ నీవు ఆడపిల్లని కనినా నాకు అభ్యంతరం లేదు. నేను నిన్ను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నది కేవలం నీపై ప్రేమతో.. అంతేగాని – ఈ కాలం కుర్రాళ్ళలా నిన్ను వాడుకున్నంతకాలం వాడుకుని మోజాతీరేక వదిలేయడానికాదు.''

''నీవు అలాంటివాడివైతే నేను నిజం గా సంతోషిద్దును రామ్ ! నీ పెళ్ళి గోలలేకుండా హాయిగా వుందును ''

'' ఛాయా !''

''అవును రామ్ ! ఆకర్షణలేని, అర్థంలేని ప్రేమ వ్యర్థం. ప్రేమని పెళ్ళి చట్రంలో బంధించాలనుకుంటే – ఆ వున్న ప్రేమ కూడా మృగ్యమవుతుంది. పరస్పర ప్రేమ, స్వేచ్ఛ – పెళ్ళిలో ఎలా లభ్యమవుతా యనుకున్నావో నాకు అర్థంకావడంలేదు. ఒకవేళ పెళ్ళి అయినా – అందులో కుళ్ళి చావకుండా ఒకరిపై ఒకరికి ప్రేమ అంతరించినపుడు, లేక మరొకరిపై ప్రేమ ఏర్పడినప్పుడు ఇద్దరూ విడిపోడం వాళ్ళకీ, సమాజానికీ ఆరోగ్యం.''

''పోనీ పెళ్ళి చేసుకున్నాక – నీకిష్టం లేకుంటే అలా బయటకొచ్చేయ్ !''

''సారీ !'' అంది ఛాయ.

రాంబాబుకి కోపం వచ్చింది.

''ఛాయా ! నీవేమను. మన ఎఫైర్ నాకు నచ్చే రీతిలో కాకుండా – నీకు నచ్చే రీతిలోకి వెళ్తున్నట్టు నాకు తోస్తోంది....చూస్తుంటే నీవు నన్ను మేల్ ప్రాస్టిట్యూట్‌గా మాత్రమే

ఉపయోగించుకున్నట్టుగా నాకు అనిపిస్తోంది.''

ఆ మాటకి ఛాయ బాధపడింది.

''రామ్ ! ఇదా నీవు నన్ను అర్థం చేసుకున్నది!'' అన్నట్టు చూసింది.

''రామ్ ! నీవు మగ వ్యభిచారివని నేను అనుకోడంలేదు. మగ వ్యభిచారి డబ్బుకి సుఖం ఇస్తాడు. నా రాంబాబు ప్రేమకి సుఖం ఇస్తాడు. సుఖానికి సుఖం ఇస్తాడు. నీవు నన్ను ప్రేమించడంలేదా ? నీ నుంచి నేనెంత సుఖాన్ని పొందుతున్నానో – నా నుంచి నీవంత సుఖాన్ని పొందడంలేదా ? చెప్పురామ్?'' అంది ఆవేదనగా.

సుఖం పొందుతున్నానని ఒప్పుకున్నాడు రాంబాబు.

''అదికాదు ఛాయా ! నేను నీకు ఎంత దగ్గరవాలని ప్రయత్నిస్తున్నానో – అంత దూరంలో నీవు నన్ను ఉంచుతున్నావు. అసలు నీవు నన్ను నీ సమస్యల్లో ఏ మాత్రం తలదూర్చనీయవు.''

''చూడు రామ్ ! ఇంతవరకూ జరిగిన వ్యవహారాలన్నీ నాకు సంబంధించినవి. నేను తేల్చుకోవల్సినవి. నిన్ను ఏ బాధల్లోనూ, ఇబ్బందుల్లోను ఇరికించగూడదనే నా తపన నా వ్యవహారాల్ని నేను పరిష్కరించలేని స్థితి వచ్చినపుడు తప్పక నీ దగ్గరకే సాయంకి వస్తాను. నీవు తప్ప ఎవరున్నారు నాకు?

రామ్ ! మన పవిత్రమైన నిష్కళంకమైన ప్రేమ బంధాన్ని పెళ్ళి లంకెతో నీతి బంధానికి గురిచేసి ఎందుకు మలినం చేస్తావ్ ! ఎందుకు కలుషితం చేస్తావ్ ! ఏ యితర బంధాలు, బాధ్యతలూ, విసుక్కోడాలు కసురుకోడాలూ, రోషాలూ, రొప్పులూ, కోపాలు, కావేషాలూ, తిట్లూ, కొట్లాటలూ – ఇవేం లేకుండా – అన్నిటికీ అతీతంగా మన ప్రేమ ఉందనీ మనం ప్రేమ జీవులం అని ఎందుకు గర్వపడవు ? ఒకవేళ ఈ ప్రేమ నిజంగా అంతరించినపుడు మనం స్నేహితులుగానే విడిపోదాం – అంతేగాని మన ప్రేమ బంధాన్ని పెళ్ళి రొచ్చులోకి ఈడ్వకు'' అంది ఆవేశంగా ఛాయ.

''ఛాయ! నీవన్నది బాగానే వుంది ఒప్పుకుంటాను. ప్రేమ జీవులుగానే వుండిపోదాం. సరే, కాని అందుకు ఒకటే అవరోధం''

''ఏమిటి ?''

''నీ కడుపు''

'' నా కడుపేంచేసింది నిన్ను. నీవు చేసిన కడుపేకదా అది !'' అంది నవ్వుతూ.

''నీకు పెళ్ళి ఇష్టం లేనపుడు నీకు ఆ కడుపు వుండడం కూడా నాకు యిష్టం లేదు. అబార్షన్ చేసుకో''

మతిపోయినట్టు చూసింది ఛాయ.

తను మొదట్లో అబార్షన్ చేసుకుంటానంటే వద్దు, వీల్లేదు తల్లికమ్మన్నాడు. ఇపుడు తల్లి కావొద్దు అబార్షన్ చేసుకోమంటున్నాడు. ఏం మనిషి!

''రామ్ ! ఇది పూర్తిగా నాకు సంబంధించిన సమస్య. నాకడుపు వుంచాలో తుంచాలో

అది నేను చూసుకుంటాను.''

''పెళ్ళి రక్షణ లేకుండా నీవు పదిమందిలో కడుపేసుకు తిరగడం నాకు ఏమాత్రం ఇష్టం లేదు''

ఛాయ నవ్వింది. ''కడుపుతో తిరిగేదాని పక్కన నీకు తిరగడం ఇష్టంలేదు అంతేనా? ఎందుకా డొంకతిరుగుళ్లు!''

''నీవు పెళ్ళికీ ఒప్పుకున్నావు కాదు. పోనీ అబార్షన్ చేసుకో అంటే అందుకూ ఒప్పుకో నంటున్నావ్. తప్పునాది.'' తల కొట్టుకున్నాడు.

''నీ తప్పేమిటి ? అంది.

నాలిక కర్చుకుని ''ఏమీలేదు'' అన్నాడు.

ఏదో విషయం దాస్తున్నాడని గ్రహించి – అదేదో చెప్పేదాక వదల్లేదు ఛాయ. చెప్పక తప్పలేదు రాంబాబుకి.

'' మొదట నుంచీ నీవు నాతో పెళ్ళికి ఒప్పుకోనంటున్నావు. నిన్ను ఏ విధంగానైనా సరే పెళ్ళికి నీవు ఒప్పుకుతీరే తప్పనిసరి పరిస్థితిల్లో నిన్ను పడేయాలని – నేనొక వెధవ పని చేశాను.''

''ఏమిటీ ?''

''నీవు కడుపు రాకుండా కడు జాగర్తలు తీసుకున్నప్పటికీ నిన్ను బోల్తా కొట్టించాను.''

''ఎలా ?''

''ప్రతి నెలా గర్భనిరోధక మాత్రలని తెచ్చి ఇచ్చేవాడిని కదా ''

''అవును?''

''అవి గర్భనిరోధక మాత్రలుకావు. విటమిన్ టాబ్లెట్లు!''

షాక్ తిన్నట్టు అయిపోయింది ఛాయ.

''ఎందుకలా చేశావ్?'' తీవ్రంగా అడిగింది ఛాయ.

''నీకు కడుపు అవ్వాలనీ – అయ్యేక చచ్చినట్టు నన్ను పెళ్ళి చేసుకోడానికి అంగీకరిస్తావని..'' రాంబాబు చెంప ఛెళ్ళుమంది.

''నీవింత స్వార్థపరుడవీ, మోసగాడివీ'అనుకోలేదు... ఛీ ఛీ''

''క్షమించు ఛాయ!''

ఛాయకి దుఃఖం ఆగలేదు.

చాలాసేపు వెక్కి వెక్కి ఏడ్చింది.

''నీవంటే నాకు అసహ్యం వేస్తోంది. వెళ్లిపో ! ఇక్కణ్నించి తక్షణం వెళ్లిపో ! ప్లీజ్ ! '' అరిచింది ఛాయ.

ఎన్ని జాగర్తలు తీసుకున్నా – ఎలా వచ్చిందీ మాయదారి కడుపు అని ఇన్నాళ్ళు మిస్టరీగా నిలిచిపోయిన ప్రశ్నకి ఈ రోజా సమాధానం దొరికింది. అయితే – ఆ విషయం తెలియకున్నా బాగుండేది. రాంబాబు స్వరూపం తెలిసేది కాదు. అసహ్యించుకునేది కాదు.

రాంబాబుకి రోషం పొడుచుకొచ్చింది. సర్రుమని లేచేడు.

''వెళ్తాను! వెళ్ళకపోతే నీ దగ్గరెవడుంటాడు? నీవు ఆడదానివి కాదు... నీపట్ల నేను జాలిపడ్డమే తప్పు... పెళ్ళాం పిల్లలుండగా నాకెందుకీ రంకు తిరుగుళ్ళు! ... వస్తాను. ఈ రోజునుంచి నీకూ, నాకూ ఎలాంటి సంబంధంలేదు. నీ యిష్టమొచ్చినట్లు కడుపేసుకు తిరుగు'' అని విసురుగా వెళ్ళిపోయేడు రాంబాబు

నెలరోజుల కిందట జరిగిందది. అప్పట్నించి వాళ్ళిద్దరి మధ్య సంబంధాలు బెడిసికొట్టేయి.

## 35

లాయర్ యశోదాదేవి దగ్గరికి వెళ్ళి వచ్చిన –

ఆ మరుచటి రోజు –

ఉదయం ఏడుగంటలవుతున్నప్పటికీ –

విజయ గదిలో నిద్రపోతున్న సుజాత లేవలేదు.

విజయ కాఫీ తీసుకొచ్చి సుజాతను లేపింది.

లేచి కూర్చున్న సుజాతకి తల బరువుగా వుంది. ఒళ్లంతా పచ్చి పుండులా వుంది. రాత్రంతా నిద్రలేనట్టు కళ్ళు ఎర్రగా వుబ్బివున్నాయి.

పళ్ళు బ్రష్ చేసుకోకుండా కాఫీతాగే అలవాటు లేదు సుజాతకి.

లేచి వెళ్ళి – ముఖం కడుక్కునే ఓపికలేదు. గ్లాసు అందుకుంది.

కాఫీని సిప్ చేస్తుంటే –

ఆమెకి పిల్లలు గుర్తుకొచ్చేరు.

తెల్లారే తను పిల్లలకి హార్లిక్స్ కలిపి ఇచ్చేది. అయినా సురేష్ ఆకలని ఏదో చిరుతిండి తెల్లారే తినేవాడు... ఇప్పుడు వాళ్ళకెవరస్తారు? ఇవ్వాలని రవికి తెల్సా? తెల్సినా ఇస్తాడా?

పిల్లలు ఏం తింటున్ననారో? ఎలా వుంటున్నారో?

పిల్లలు ఆరోజు నుంచి ఈరోజుదాక ఏమీ తినకుండా – ఆకలితో అల్లాడి పోతున్నట్టే ఆ తల్లి భావించింది. దాంతో...

ఆమెకి కాఫీ సయించలేదు. తాగకుండా టేబుల్పై పెట్టేసింది.

సుజాతకి ఏడుపు వస్తోంది.

తన పిల్లలు తనకు దక్కరని... ఈ పోలీసులూ, కోర్టులూ చట్టాలూ ఏదీ ఎవరూ తనకి న్యాయం చేయలేరని ఒక అభిప్రాయానికి వచ్చేసిన సుజాతకి ఏడుపు ఆగటంలేదు.

అంతలో –

ఆమె రక్తంలో రక్తం – ప్రాణంలో ప్రాణం అయిన ఆమె పిల్లలు సురేష్, శిరీష, 'మమ్మీ' అంటూ కెరటాల్లా వచ్చి ఆమెపై పడిపోయేరు.

సుజాత తుళ్ళి పడింది. ఇది కలా ! నిజమా!

లేచి పిల్లలిద్దర్నీ దగ్గరికి తీసుకుని ఒళ్ళంతా తడిమింది. ఇంకా అనుమానం తీరకపోవడంతో తన ఒళ్ళు గిల్లుకుంది.

తల్లిఒడలు పులకించగా, ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతూ 'విజయా !' అని ఉత్సాహం పట్టలేక అరిచింది.

ఏదోపనిలో వంటగదిలో వున్న విజయ చప్న బయటకి వచ్చి ఆ దృశ్యం చూసి నిశ్చేష్టురాలైంది.

''ఇక్కడకి పిల్లలెలావచ్చేరు ?'' సందేహం వెలిబుచ్చింది విజయ.

ఆ విషయం సుజాతకి ఇంతవరకూ తట్టలేదు.

''డాడీ తీసుకొచ్చేడు'' అంది శిరీష.

విజయ వడివడిగా బయటకి వచ్చింది.

ఆమె వెనుక సుజాత, పిల్లలూ వచ్చేరు. రవి స్కూటర్‌పై – వెళిపోతూ కనిపించేడు

విజయ 'రవీ' అంటూ గట్టిగా కేకేసి పిలిచింది – రెండడుగులు ముందుకివేసి.

రవికి వినబడింది గాని వెను తిరగలేదు.

స్కూటర్ ఆపలేదు.

పిల్లలు పుస్తకాల సంచులూ, కొత్తగా కొనిన పిల్లల రెడీమేడ్ డ్రెస్సులూ – వరండాలో వదిలేసి వెళిపోయేడు.

భార్యలను వేధించే చాలా మంది భర్తల కన్నా మీ భర్తలు నయం – అన్న లాయర్ యశోదాదేవి మాటలు – ఆ క్షణంలో విజయకి గుర్తుకొచ్చింది.

ఒక నిట్టూర్పు విడిచింది.

సుజాత పూర్తిగా పిల్లల లోకంలో వుంది !

ఆ సాయంత్రమే–

పిల్లలతో గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి బయల్దేరింది సుజాత.

## 36

వచ్చిన కడుపుని తుంచుకోలేకపోయింది ఛాయ.

తవ్విమీదకు తోసుకున్నట్టయింది.

పరిస్థితులు ఎలా విషమించాయి ? రాంబాబు మోసం చేయకుంటే తనకీ కడుపువచ్చేదా ? పోనీ వచ్చిన కడుపుని తీయించుకుందామంటే... ఒక స్టేజ్‌లో మనసు తిరగబడింది. తిరగబడి ఆమెలో మదర్లీ ఇన్‌స్టింక్ట్సు జయించేలా చేసింది.

'మాతృత్వం లేనిదే స్త్రీ జీవితం పరిపూర్ణం కాదు' అని తను ( కడుపు రాకముందు ) ఎన్నడూ, ఏనాడూ అనుకోలేదు. గర్భవతి అయ్యేక ఛాయ అనుకోని విధంగా మాతృత్వం

వైపు మొగ్గుచూపకుండా వుండలేకపోయింది.

దాంతో మాతృత్వం అనేక ఇతర సమస్యలను సృష్టించింది.

పెళ్ళికాకుండా, తండ్రిలేకుండా – బిడ్డనుకని తల్లికావడానికి సాహసించడంతో ఆమె తీవ్రమైన ఇబ్బందులకు గురిఅయ్యింది.

ఛాయకి కడుపు అని తెలియగానే ఇంటిల్లిపాది దద్దరిల్లిపోతే – ఛాయ తండ్రి నారాయణ మాత్రం గుప్‌చుప్ ! తనకు సంబంధం లేనట్టే వున్నాడు.

నారాయణలో అదే నిర్లిప్తత!

ఇలాంటి తండ్రి ఎక్కడా ఎవరూ చూసి వుండరు!

ఇలాంటి తండ్రి ఏ సినిమాల్లోను, నవల్లోను కనిపించరు !

పరువు మంట గలిపిందని, అప్రదిష్ట తెచ్చిందని, కుటుంబానికి ఎప్పుడూ ఎవరూతేని మచ్చ తెచ్చిందని – మరో తండ్రయితే ఆమెను బతకనిస్తాడా ? ఏ కొడవలో, కత్తో తీసుకుని – పరువు ప్రతిష్టలకి నైవేద్యంగా ఒక్కవేటుకి ఆమె తలను బలి ఇచ్చుండేవాడు కాదా !... నీవేం తండ్రివయ్యా నారాయణా !

నీ కళ్ళ ముందే నీ కన్న కూతురు కడుపేసుకు తిరుగుతుంటే ఎలా సహిస్తున్నావయ్యా తండ్రీ!

అయితే ఇక్కడొక విషయం –

కూతురు చేసిన పనికి నారాయణ సహించలేకపోతున్నాడనేది నిజం! అయితే అందుకు కూతుర్ని నిందించేబదులు – భగవంతుణ్ని నిందించేడు. ఇలాంటి అకృత్యాలూ, ఇలాంటి విపరీతాలూ చూసి భరించగలిగే శక్తి నిచ్చిన భగవంతుణ్ని – 'నీకిది భావ్యం కాదు తండ్రీ ! నన్నీ పాప కూపంనుంచి త్వరగా – అతి త్వరగా తీసుకుపో తండ్రీ ' అని ప్రార్థించేడు.

అదే ఆ తండ్రి చేసిన పని.

అంతేతప్ప – కూతుర్ని పల్లెత్తుమాట అనలేదు తండ్రి.

తల్లి సీతమ్మ అలాకాదు –

కూతురు చేసినపనికి కుమిలి కుమిలి ఏడ్చింది. నెత్తీ నోరు కొట్టుకు ఏడ్చింది. ఆ దుఃఖంలో కూతుర్ని అన్నరాని మాటలంది.

కూతురు కడుపుని అందరికన్నా ముందు పసిగట్టింది సీతమ్మ!

పసిగట్టి ''ఏమిటి తల్లీ ఇది ! .... నిజమేనా ?'' అనడిగింది.

''నిజమే'' అంది ఛాయ.

అలా అనగానే తల్లి తన చెంప ఛెళ్ళుమనిపిస్తే అంతగా బాధపడేది కాదు ఛాయ. కాని తల్లి ప్రవర్తనా, విసుర్లూ ఆమెను బాధించేయి.

ఆ స్థితిలో ఏ తల్లి అయినా అలానే ప్రవర్తిస్తుందని ఆమెకి తోచినప్పటికీ – బాధపడకుండా వుండలేకపోయింది ఛాయ.

నిశ్శబ్దంగా రోదిస్తూ ''ఇంత పనిచేస్తావనుకోలేదు'' అంది సీతమ్మ అంటూ అనుమానంగా ''రాంబాబేనా'' అనడిగింది.

''ఏ బాబుతో తిరిగానో మీ అందర్కీ తెల్సు ! తిరుగుతున్నాక యింతపని అవకుండా ఎలా వుంటుంది ?'' అన్లేదు ఛాయ.

''మీ ఇద్దరూ .... గుళ్ళో పెళ్ళి లాంటిదేదైనా...'' అనడిగింది సీతమ్మ.

రాంబాబు పెళ్ళి అయినవాడు. అదీకాక తమ కులం కానివాడు. అతణ్ని అల్లుడిగా ఎలా ఆమోదిస్తుంది ?

కూతురికి కడుపు చేసేక యిక పెళ్ళి అయినవాడు ఏమిటి కులం కాని వాడు ఏమిటి ? అల్లుడిగా తను ఆమోదించినా, ఆమోదించకపోయినా – కూతురి మొగుడిగా గుర్తించక తప్పదు.

''అవునమ్మా పొరపాటు అయిపోయింది. మీకు తెలీకుండా.... మేమిద్దరం గుళ్ళో పెళ్ళి చేసుకున్నాం. క్షమించు'' అని కూతురు అంటుందని ఆశించింది. అలా అంటే క్షమించేయాలనే అనుకుంది.

కాని ఛాయ ''అలాంటిదేమీ లేదు'' అనేసింది.

అదేంవిటి ?!

సీతమ్మకి అర్థం కాలేదు. అంతా ఆమెకి అయోమయంగా, భయంగా వుంది.

ఆమెలో చికాకు, కోపం రాజుకోసాగేయి.

''ఏం చేసుకోనన్నాడా ?'' సహనంగానే అడిగింది.

''చేసుకోమని నేను అడగలేదు... చేసుకోడం అతనికిష్టమే!.... నాకే యిష్టంలేదు''

''నీకిష్టంలేదా ?

''ఇదెక్కడ మనిషివే తల్లీ –''

తల్లి బుర్ర తిరిగిపోతోంది. ఒళ్ళు మండిపోతోంది.

''ఇష్టం లేక పోవడం ఏవింటే!... నీకు మతిగాని పోయిందా'' కసిరింది సీతమ్మ.

''మిగతా విషయాలు ఎలా వున్నా... నేను అతనితో పోతే – మీ గతేవింటి ?'' అంది ఛాయ.

''మాగతి గురించి ఆలోచిస్తున్న దానివైతే... మా పరువు ఇలా తీస్తావా తల్లీ !''

''పరువు ప్రతిష్టలు తిండిపెడతాయా అమ్మా !''

తల్లికి చిర్రుమంది.

''అంటే... నీవు తిండి పెడుతున్నావని మమ్మల్ని పరువు ప్రతిష్టని వదుల్కోమంటావా? తల్లీ ! నీవెడుతున్న తిండికో దండం! ... నీకు పుణ్యెం వుంటుంది. ఆ రాంబాబుతోనే వెళిపో తల్లీ! .... మేం ఎలాగో ఓలా చస్తాం''

''మీరు చావకూడదనే కదమ్మా .... నా బాధంతా !''

''మా మీద అంత అభిమానం వున్నదానివి... ఇదేం పని తల్లీ'' తల్లి ఏడుపు.

''ఏం చేయమంటావమ్మా'' ఛాయ కళ్ళల్లో నీళ్ళు.

''అంతా చేసేసి ... ఏం చేయాలని అడుగుతావేమే దెష్టముండా! కడుపు తీయించుకుంటే పోదూ!''

''అమ్మా!''

''అవును. ఇన్నాళ్ళూ ఇంట్లో అంతా నీదే పెత్తనం అయిపోయింది. నీ యిష్టమొచ్చినట్టు తిరుగుతుంటే... చూసీ చూడనట్టు వూర్కున్నాం. వెధవ తిరుగుళ్ళు తిరిగితే వూరుకున్నోళ్ళు కడుపేసుకు తిరిగినా వీళ్ళేం చేస్తార్లే అని నీ ధైర్యం! నీ దృష్టిలో మేం మనుషులం కాదు. మాకు విలువలేదు. పోనీ నీవనుకున్నట్టు – మాకు సిగ్గులూ, చీమ నెత్తురూ లేవనే అనుకుందాం! కాని లోకానికి మేం ఏం సమాధానం చెప్పుకోవాలి? లోకం మమ్మల్ని బతకనిస్తుందా?'' అంది సీతమ్మ.

''మీ భయమేగాని, ఎవరికి పట్టిందమ్మా మన గురించి పట్టించుకోడానికి! ఈ నగరంలో ఎవరి బతుకులు వాళ్ళవి. ఇదేం పూర్వకాలం పల్లెకాదు అమ్మా! – పెద్దలూ, రచ్చబండా, పరువు ప్రతిష్టలకి విలువ కట్టడాలూ, వెలివేయడాలూ – ఇంకెక్కడమ్మా! ఆ రోజులు పోయేయి. ఎవరి బతుకు గురించి వాళ్ళు స్రగులవడంతోనే సరిపోతోంది. పక్కవాళ్ళ గురించి పట్టించుకునే టైమేదీ?'' అంది ఛాయ.

''పెద్ద కబుర్లు చెప్పకు! ఇప్పటికే నీవు తిరుగుతున్న తిరుగుళ్ళు నలుగురూ నాలుగు రకాలుగా వూసులాడుకోడం వినలేక చస్తున్నాను... సహిస్తున్నాను. కాని ఈ ముదనష్టపు పని సహించలేను... కొంపలు మునగక ముందే... రహస్యంగా అదేదో తీయించేసుకో... కావలిస్తే ఆ రెండ్రోజులూ ఆస్పత్రిలో నీతో అఘోరిస్తాను''

''ఎంత మాటన్నావమ్మా!'' బాధగా నవ్వింది ఛాయ. – ''కన్న కూతురికి పురుడు పోయాల్సిందిపోయి – కడుపు తీసుకోమంటున్న తల్లివి! అందుకు సాయం పట్టడానికి అభ్యంతరంలేని మహాతల్లివి!'' – ఛాయ దుఃఖం ఆగలేదు.

''అయ్యో!'' – రెండు చేతులతో తల కొట్టుకు ఏడ్చింది తల్లి – '' సవ్యంగా వచ్చిన కడుపయితే నేనెందుకలా అంటానే! లంజయినా, రాక్షసయినా తల్లి తల్లేనే!....కాని నీ లాంటి కూతురు ఏ తల్లికీ ఈ ప్రపంచంలో వుండదే... పెళ్ళికాకుండా, మొగుడులేకుండా కడుపేమిటే! నీదెంత గుండె ధైర్యవే... ఇదెక్కడి చోద్యమే! నేనెక్కడా వినలేదే! నీవు మా కొంపలు తీయడానికి దాపురించావే'' అని రాగాలు తీసి ఏడ్చింది సీతమ్మ.

ఏడ్చి – ''ఇదిగో అమ్మాయ్! నీకిదే చెప్పడం – నీవు కడుపుతీయించుకు తీరాలి. లేదా వాడిని పెళ్లాడు...లేచిపోయినా బాధలేదు. ఆ రెండింటిలో నీవు ఏదికాదన్నా మా అందిరికీ తలోగుక్కెడు విషం ఇచ్చి – నీ యిష్టమొచ్చినట్టు చేసుకో'' అంది.

''మీరు చచ్చిపోవడానికి కూడా నేనే విషం ఇవ్వాలా అమ్మా!''

చప్పన తలెత్తి కూతురి కళ్ళలోకి చూసింది సీతమ్మ.

ఒక నిమిషం నిశ్శబ్దం!

మరునిమిషంలో –

ఛాయ బరస్టయింది. తల్లిని వాటేసుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

ఏడుస్తూ – ''నిన్ను బాధ పెట్టినందుకు క్షమించమ్మా' అంది. అంతే గాని 'నీవు చెప్పినట్టే చేస్తాను' అన్లేదు.

ఆ తర్వాత –

ఎన్నో విధాల ఎంతగానో నచ్చజెప్పే ప్రయత్నం చేసింది సీతమ్మ.

వినలేదు ఛాయ.

ఒకసారి బొప్పాయి పండు కోసి పెట్టింది.

తినలేదు ఛాయ.

ఏవో నాటు మందులు ఇవ్వబోయింది.

తీసుకోలేదు ఛాయ.

ఇలా కాదనుకుకొని సీతమ్మ ఒకరోజు రాంబాబు వద్దకు వెళ్ళింది.

రాంబాబు వద్దకి వెళ్ళి వచ్చిన సంగతి – వెళ్ళి వచ్చేకగాని ఛాయకి చెప్పలేదు సీతమ్మ!

రాంబాబు దగ్గరికి వెళ్లినందుకు తల్లిని కోప్పడింది ఛాయ. కూతురి కోపం తల్లి పట్టించుకోలేదు.

''నేను ఏదో అనుకున్నానుగాని.. రాంబాబు మంచోడమ్మా.... నేనడిగితే అతనేవింటన్నాడో తెల్సా ? 'మీనోట మట్టి కొట్టను. ఛాయ సంపాధన మీది. ఛాయ నాది' అన్నాడు. ... ఇంకేవింటి కావాలమ్మా! మా జరుగుబాటుకి జడిసే కదా పెళ్ళాడనంటున్నావు. అతను నీ జీతం వద్దంట్టున్నాడుగా .. పెళ్ళి చేసుకోడానికేం ?'' అంది సీతమ్మ.

''అమ్మా ! రాంబాబు మంచోడే !.... మొగుడుగా మారేక ఆ మంచితనం అలానేవుంటుందని నమ్మకం ఏమిటి ?'' అంది ఛాయ.

''నీ సంపాదన పైసా అడగనని...కావలిస్తే బాండ్ రాసిస్తానన్నాడే! అంతకన్నా ఎవరంటారు?'' అంది సీతమ్మ!

''అతను అడగకపోవచ్చు! కాని నాదంటూ ఒక సంసారం ఏర్పడ్డాక నాకు మొగుడూ, పిల్లలూ తప్ప.... మీరు కనబడరమ్మా ! నా ఇంటి అవసరాలు నాకెన్నో కనపించి .... రాను రాను మీకు పదిపైసలు ఇవ్వాలన్నా చేతులురాని పరిస్థితికి స్వార్థానికి నేను చేరుకుంటానని నా భయం అమ్మా!''

''నీ భయమే నిజమనుకో... మేం పస్తులున్నా ఫర్వాలేదు. – నీ మెళ్ళో పుస్తెలతాడు వేలాడితే చాలు... మేం ఏ నిందాపడకుంటే అదే పదివేలు''

''నాకు పుస్తెలొద్దు. మీకు పస్తులూ వద్దూ.... దయచేసి ఇక ఆ విషయం

ప్రస్తావించకమ్మా'' అని ప్రార్థించింది ఛాయ.

ఆ విషయం సీతమ్మ ప్రస్తావించడం మానేసినంత మాత్రాన సమస్య ముగిసిపోతుందా?

రోజురోజుకీ... పెరుగుతున్న ఆమె కడుపు మీద అందరి కళ్ళు పడ్డాయి.

గుసగుసలాడేయి.

ముసిముసినవ్వులు నవ్వేయి.

''అవ్వ! కలికాలం' అని నోళ్ళు కొట్టుకున్నాయి.

బుగ్గలు నొక్కుకున్నాయి.

ఇంట్లోవాళ్ళు ఛాయని ఏమనాలో తెలీక – బయట తలెత్తుకోలేక లోలోనే హింస అనుభవించేరు. సిగ్గుతో చితికిపోయేరు. అవమానంతో కృంగిపోయేరు.

ఏదో పనుంటే తప్ప ఇంటినుంచి ఎవరూ కదలడం మానేశారు. ఏ ఒక్కరూ ఏ స్నేహితులు ఇంటి గుమ్మం తొక్కలేకపోయేరు. ఇరుగుపొరుగు ఇళ్ళ వైపు తలెత్తే ధైర్యం కోల్పోయేరు.

ఛాయ మాత్రం మామూలుగానే తిరుగుతోంది.

కడుపు లేకముందు ఎలా వుందో, ఎలా తిరిగిందో – ఇప్పుడూ అలానే వుంది. అలానే తిరుగుతోంది.

అది చూసి ఇంట్లోవాళ్ళకి ఇంకా కడుపుమంట!

శివకైతే అక్కని చంపేయాలన్నంత కోపంగా వుంది. చచ్చిపోవాలన్నంత బాధగావుంది.

ఊరుమీద హీరోలా తిరిగే శివకి తలకొట్టేసినట్టుగా వుంది.

''మేం తలెత్తుకు తిరగాలా లేదా ''అని తల్లితో గొడవ పడటం జరిగింది. 'ఛీ వెధవకొంపలో వుండను – వెళిపోతాను' అని బెదిరించేడు కూడా

అయితే –

ఇంటినుంచి శివ వెళ్ళిపోలేదు.

ఇంటి నుండి ఛాయే వెళిపోవాల్సి వచ్చింది.

ఆరోజు –

శివ రోడ్డుకి వెళ్ళేడు.

తిరిగే ప్రాణం రెండు మూడు రోజులుగా – ఇంటిదగ్గరే వుండి పోవటంతో బోర్ కొట్టి అలా రోడ్ జంక్షన్‌కి వెళ్ళేడు సాయంత్రం.

రోజూ సాయంత్రం అక్కడ మిత్రులు కలుసుకుంటారు. కబుర్లు చెప్పుకుంటారు. అది ఫలానా అనిలేదు. ఆ కబుర్లకి లిమిట్సు వుండవు. నోటికి ఏదొస్తే అది. ఎంతొస్తే అంత!

ఒకణ్ని బాధించి, ఆటపట్టించి మిగతావాళ్ళు నవ్వుకోడం అక్కడ చాలా మామూలుగా జరిగే విషయం.

ఆరోజు మిత్రులకి శివ దొరికిపోయేడు.

పెళ్ళీ పెడాకులు లేకుండా కడుపు తెచ్చుకున్న ఛాయపై – వాళ్ళు సరదాగానే, జోకీగానే

అయినప్పటికీ – కామెంట్ చేయడం శివ భరించలేకపోయేడు. సీరియస్ అయిపోయేడు.

ముఖం నల్లబడిపోయింది.

శివలో సీరియస్‌నెస్ గమనించి, ఉడికిపోతున్నాడని గ్రహించి మిగతావాళ్ళు తగ్గేరు. కాని ఆ మిత్రుల్లో గోపీ అనేవాడు మాత్రం తగ్గలేదు... ఆ వాగుడు కొనసాగించేడు.

గోపీకి శివమీద కసి వుంది. వాడిని శివ చాలాసార్లు అల్లరిపెట్టేడు. ఏడిపించివున్నాడు. ఇప్పుడు దొరికిన అవకాశాన్ని గోపీ ఎలా వదుల్కుంటాడు ?

''ఒరే ! ఆపరా గోపీ !...లేకుంటే తంతాను''

గోపీ ఆపలేదు...

''ఒరే ! నోరుమూస్తావా లేదా ?'' అరిచేడు శివ.

గోపీ నోరు మూయలేదు.

అంతే! వాడి మూతిమీద గభిల్‌మని గుద్దేడు శివ!

వాడు వూర్కుంటాడా ?

శివ పొట్టమీద ఊపున తన్నేడు.

దబ్‌మని పడిపోయేడు శివ. పడిపోయిన శివని లేవనీయకుండా మీదకి లంఘించేడు గోపీ.

ఇద్దరూ తన్నుకుని కుస్తీపట్టేశారు. రోడ్డుపై దొర్లేశారు.

రోడ్డుపై జనం. మోలీ చూసినట్టు మూగేసారు... వినోదం తిలకించేరు.

మిత్రులు కాసేపు ఆనందించి... ఇద్దర్నీ విడిపించేశారు.

విడిపించేకా... గోపీ నోరు మరీ విజృంభించింది. శివనీ, శివ అక్కనేకాదు – తల్లినీ, చెల్లెళ్ళనీ... ఎవర్నీ స్పేర్ చేయకుండా అందర్నీ పరమబూతులు అసహ్యంగా వాడినోట రాసాగేయి.

శివ వాడిపై కలియబడేవాడే !

మిత్రులు బలవంతగా శివని అక్కణ్ణించి ఈడ్చుకుపోయి... ఇంటి దగ్గర పడేసి వెళిపోయేరు.

''ఒరే ! లంజాకొడకా ! నీయమ్మా ! నీ అంతు చూస్తాన్రా'' అని గోపీ కోసం రోడ్డు మీదకు పరిగెట్టలేదు శివ.

కోపం అంతా ఇంట్లో వున్న ఛాయపై చూపించేడు. ఛాయపై తీవ్ర పదజాలం ఉపయోగించేడు. ఎప్పుడూ వాడు అక్కని అన్ని మాటలు అనలేదు.

ఛాయ అవాక్కయింది.

కొయ్యబారిపోయింది.

వాడున్న పరిస్థితి అర్థం చేసుకున్నదై... గొడవకి దిగకుండా... తనని కాదన్నట్టు కామ్‌గా వుండిపోయింది.

తిట్టి, తిట్టి ...ఎప్పుడూ ఏడ్వని శివ ఏడ్చేడు. బిగ్గరగా ఏడ్చేడు.

తల్లి సీతమ్మ హృదయం తల్లడిల్లిపోయింది.

తల గోడకేసి బాదుకున్నాడు.

తల్లి ఆపింది.

''ఛీ ఛీ ! ఈ బజారు కొంపలో నేను వుండను కాక వుండను'' అని బట్టలు సర్దుకోసాగేడు.

తల్లి ఏడుస్తూ వెళిపోతున్న కొడుక్కి అడ్డుపడింది.

''వెళ్ళకురా నాయినా ! వెళ్ళకు. నా మాట వినరా !.. ఆ ముండ నించి మన బతుకులిలా కాలిపోయేయి. ఏం చేస్తాంరా ! రోడ్డెక్కే మగాళ్ళున్న ఇళ్లని అది లక్ష్యపెట్టింది కాదురా ! ఏం చేస్తాం. మన ఖర్మరా బాబు ఖర్మ !... నీవెళ్ళకురా నాయినా వెళ్ళకు... నీవెళితే నేను చచ్చిపోతాను'' అని రాగాలు తీసింది తల్లి!

తల్లి ధోరణికి విస్మయం చెందింది ఛాయ.

ఛాయకి కళ్ళంట నీళ్ళు తిరుగుతున్నాయి.

శివ అంటున్నాడు ''నన్ను ఆపకమ్మా ఆపకు. ..అది వున్న ఇంట్లో నేను వుండలేను. నాతరంకాదు''

''మన ఖర్మ అనుకొని భరించరా నాయినా ! మేం భరించడంలేదా ! అది కుటుంబానికి తెచ్చినమచ్చకి....సంతోషిస్తున్నామనుకుంటున్నావా ? ....మేం సుఖంగా వుంటున్నామనుకుంటున్నావా .... ఆ మహాతల్లి చేసిన పనికి ఎంత కుమిలి కుమిలి ఏడుస్తున్నామో – లోలోన ఎంత రోదిస్తున్నామో – ఆ భగవంతుడికే ఎరుక !.... నా మాటవిను నాయనా ! నాయిన్నాయినా ! నాబాబువి కదూ ! ఆ దెష్టముండని క్షమించేయరా ! ...క్షమించరాని తప్పంటావా.... అది నీ అక్క కాదనుకుని వుండరా ! మమ్మల్ని వదిలి వెళ్లకురా తండ్రీ! ...లేకుంటే నీతోబాటే మమ్మల్నీ తీసుకుపోరా !''

''అమ్మా !'' అని అరిచింది ఛాయ.

ఆ తీవ్రతకి నోరు మూసేసింది సీతమ్మ!

ఆ వెంటనే 'అమ్మా!' అని నెమ్మదిగా పూడుకుపోయిన గొంతుకతో అంది ''వాడూ వెళ్ళక్కర్లేదు. వాడితోపాటు మీరూ వెళిపోనక్కర్లేదు.... నేనే వెళిపోతానమ్మా ! మీ పరువు మర్యాదలు నిలబడేటంత దూరంగా వెళిపోతాను.... నన్ను మీరెవరూ భరించనక్కర్లేదు... వస్తాను''

రెండు చీరలు సంచిలో కుక్కి ... ఇంటినుంచి బయటకొస్తూ... గుడ్లనీళ్ళు కక్కుతూ...కుటుంబసభ్యులు ఒకొక్కరి దగ్గరికీ వెళ్ళింది. వాళ్ళను బాధ పెట్టినందుకు క్షమాపణలు చెప్పింది. జాగర్తగా వుండమంది. మీరు నన్ను అక్కగా గుర్తించుకోకపోయినా ... అవసరం అయితే నన్ను తప్పక కలవండి. నాకు చేతనైన సాయం చేస్తానంది.

చెల్లెళ్ళు ఏడ్చేరు. తల్లి ఏడ్చింది. తండ్రి తనని కాదన్నట్టు తల దించుకున్నాడు. తమ్ముడు

శివ దగ్గర కొచ్చి చేతులు పట్టుకున్న ఛాయని శివ తోసేసాడు. ఆమెవైపు చూడకుండా తలపైకెత్తి శూన్యంలోకి చూస్తూ వుండిపోయేడు.

ఛాయ కళ్ళు తుడుచుకుని గబగబా ఇంటిని దాటి బయటకి వచ్చింది.

సిటీబస్ ఎక్కింది.

విజయ వుంటున్న క్వార్టరుకి చేరుకుంది

విజయని కౌగలించుకుని ఏడ్చేసింది ఛాయ.

జరిగిందంతా విన్నాక – ''అవును, ఇదినేను ఊహించినదే. ఇలా జరుగుతుందని నేను అపుడే అనుకున్నాను'' అంది విజయ.

ఛాయని దగ్గరకు తీసుకుని – ''ఛాయా! నాకునీవు, నీకునేనుగా ఇద్దరం ఇక్కడే వుందాం...ఇదినాయిల్లుకాదు. మనిద్దరి ఇల్లు... ఛాయా నీవు భయపడకు. నీ పురుడు నేను పోస్తాను'' అంది చెమ్మగిల్లిన కళ్ళతో.

ఛాయ దుఃఖం ఆగలేదు.

## 37

ఆరోజు సందీప్ పుట్టినరోజు.

ఇన్నాళ్ళుగా బాబు తనతో లేకపోయినా... ఆరోజు మాత్రం పూర్తిగా సందీప్‌తోనే ఎత్తుకు, ముద్దులాడుతూ గడపాలని వుంది విజయకి.

తెల్లారుతుండగనే – ఎంతలో బాబుని ఎంతలో చూస్తానా, సరదాగా గడుపుతానా అని వువ్విళ్ళూరుతోంది. ఆతృతపడుతోంది విజయ!

ఉదయం ఏడుగంటలకే చెలం ఇంటికి బయల్దేరింది.

అసలు ముందురోజు సాయంత్రమే తను వెళ్ళింది. బిడ్డని ఆ సాయంత్రమే తీసుకుపోయి... తెల్లారగనే బాబు ముఖం చూసి తలంటి స్నానం చేయించి, కొత్తబట్టలు తొడిగి, వాడికి ఇష్టమైన స్వీటు తయారుచేసిపెట్టి, ఒకటాయ్‌ని వాడికి ప్రెజెంట్ చేసి ఆ రోజు డ్యూటీకి సెలవు పెట్టి... పూర్తిగా బాబుతో గడపాలని తన ఆలోచన.

అయితే చెలం పడనివ్వలేదు.

ఆ సాయంత్రం బాబుకోసం గేటుదగ్గర అరగంట వెయిట్ చేస్తే సందీప్‌తోకాకుండా, వట్టి చేతులతో పార్వతమ్మ వచ్చింది.

''ఇపుడు ఇవ్వనంటున్నాడమ్మా. ఉదయం రాతల్లీ'' అంది అత్త.

ఏడ్వడం తప్ప ఏం చేయాలో తోచలేదు విజయకి. ఉదయమే వచ్చి బాబుని తీసుకువెళ్ళడానికి నిశ్చయించుకుంది.

ఏంచేస్తుంది మరి.

మర్నాడు ఉదయమే ముస్తాబై విజయ బయల్దేరింది.

బయల్దేరిందిగాని... సందీప్‌ని తనతో పంపుతాడో, లేదో అనే బెంగ ఆమెను పీకుతునే వుంది.

అంచేత ఎందుకైనా మంచిదని... ముందుగానే బాబుకి ఇష్టమైన చక్కెర పొంగలి చేసి కారియర్‌లో పెట్టి పట్టుకుంది. తను బాబుకోసం కొత్తగా కొన్న రడీమేడ్ డ్రస్సు పట్టుకు వెళ్తోంది అవన్నీ సంచిలో పట్టుకు వెళ్తోంది.

చెలం ఎంత కఠినుడు!

బాబుని ఆమె చేతికివ్వలేదు. సరిగదా కనీసం చూడనీయలేదు.

గేటు దగ్గరే గంటకిపైగా వెయిట్ చేస్తూ హింస భరించింది.

ఆమెకి దుఃఖం కోపం గొంతు వరకూ వచ్చేసాయి. ఏది ఏమైనా, ఆరునూరైనా తను బాబుని చూడకుండా వెళ్ళేది లేదని తీర్మానించుకుంది అంతే!

గబగబా గేటుదాటి గుమ్మం తొక్కి ఇంట్లోకి ప్రవేశించింది.

ఆ రోజు గొడవయ్యేక ఇల్లు వదిలిపెట్టేక... మళ్ళీ ఇదే తను ఆ ఇంటిలోకి ప్రవేశించడం!

హాలులో సోఫా మీద కూర్చుని పేపరు చదువుతున్న చెలం... వచ్చిన విజయను చూసి నిర్ఘాంతపోయేడు! టీ తాగుతున్నవాడల్లా పొలమారేడు!

ఆమె లోనికి వస్తుందని ఊహించలేదు!

ఆమె వచ్చింది అతనికోసం కాదు. అంచేత ఆమె అతని దగ్గరికిరాలేదు. అతని ముఖం వేపు కూడా చూడలేదు. సరాసరి సందీప్ గది లోకి వెళ్ళింది.

ఆ గదిలో కొడుకు సందీప్‌ని చూడగానే విజయ హృదయం పరవశించిపోయింది.

బాబు వళ్ళంతా తడిమి, ముద్దులతో ముంచెత్తి క్షణం, క్షణం బాబు ముఖంలోకి తనివితీరా చూసింది.

సందీప్ అప్పటికే తలంటి స్నానం చేసి, కొత్తబట్టలు ధరించి వున్నాడు.

విజయకి ఏదో గుర్తుకొచ్చినట్టయి – సంచిలోంచి బొమ్మని తీసి బాబు చేతిలో పెట్టింది.

సందీప్ ఆ బొమ్మని అందుకొని ఎగిరి గంతేసాడు.

వాడి ముఖం మతాబులా వెలిగిపోయింది.

ఆ బొమ్మను చూడగానే వాడి ముఖంలో కనిపించిన ఆనందం చూసి విజయ మురిసిపోయింది.

సందీప్‌ని ఎత్తుకుని కారియర్ విప్పి గిన్నెలో చక్కెర పొంగలిని తినిపించబోతుంటే –

చెలం దూసుకువచ్చి ఆమె చేతిలో గిన్నెని విసిరికొట్టేడు.

సందీప్ చేతిలో బొమ్మని లాక్కొని విసిరిపారేసాడు. సందీప్ ఒకటే ఏడుపు.

సందీప్‌ని 'నోర్ముయ్' అని అరిచేడు.

భయంతో సందీప్ నోరు మూసేసాడు.

చెలం సందీప్‌ని ఎత్తుకొని – విజయని 'గెటౌట్!' అని బయటికి చేయి చూపించేడు.

''నీ ఇంట్లో వుండడానికి రాలేదు. నా బాబుని తీసుకుపోడాని కొచ్చేను'' అని బాబుని అతని వద్దనుంచి తీసుకోబోయే ప్రయత్నం చేస్తుంటే – ఆమె చెంపపై కొట్టి తోసేసాడు.

బాబుని పార్వతమ్మకిచ్చి... విజయ చేయి పట్టుకొని బరబరా బయటకి ఈడ్చేశాడు. ఈడ్చేసి ఆమె తెచ్చిన కేరియర్, బొమ్మ, బట్టలు ఆమె ముఖం మీద కొట్టి – తలుపులు ధనేల్న మూసేసాడు.

విజయ ఏడుస్తూ, చెలంని తిడుతూ .... తలుపులు దబదబా చాలాసేపు బాది...బాది ... అక్కడ చాలా సేపు వుండిపోయింది.

తర్వాత –

అక్కణ్నించి తిన్నగా లాయర్ యశోదాదేవి వద్దకు వెళ్ళింది. జరిగింది విని – ''మనం ఆలస్యం చెయవద్దు. సందీప్ తల్లి కస్టడీలోనే వుండాలని కోర్టుకి క్లయిమ్ చేద్దాం'' అంది లాయర్.

''ఎంత డబ్బు ఖర్చయినా ... ఫర్వాలేదండీ. హైకోర్టు, చివరికి సుప్రీం కోర్టుకైనా నేను సిద్ధం లాయర్! నాబాబు నాకు చేరాలి. ఎలాగైనా నా కస్టడీలోకి రావాలి'' ఆవేశంగా అంది విజయ.

''మనం తప్పక గెలుస్తాం. మీరు బాధపడకండి'' అని లాయర్ ఓదార్చే ప్రయత్నం చేసింది.

అక్కడ ఆఫీసులో తనలా దగాపడిన తల్లులు ఇద్దరు ముగ్గురు వున్నారు. వాళ్ళు విజయని ఓదార్చేరు. ఆ తల్లులు కొన్నేళ్ళుగా... వాళ్ళ పిల్లల కస్టడీ కోసం ఫైట్ చేస్తున్నారు. వాళ్ళముందు తనెంత ?

వాళ్ళు చెప్పిన కథలూ, బాధలూ విని దద్దరిల్లిపోయింది విజయ.

అక్కడ నుంచి ఎలాగోలా ఇంటికి చేరింది విజయ.

ఆరోజంతా పిచ్చిదానిలా అయిపోయింది.

ఛాయకి ఆమెని ఓదార్చడం సాధ్యం కాలేదు.

ఆరోజంతా బాబుని తల్చుకొని విజయ ఏడుస్తూనే వుంది.

ఆ రాత్రి విజయకి నిద్రపట్టలేదు.

నిద్రపట్టేక ... పిచ్చి పిచ్చికలలు.



విజయ సందీప్ తన కస్టడీలో వుండాలని కోర్టులో క్లయిమ్ చేసేక – తీర్పు వచ్చేవరకూ విజయకి పిచ్చెక్కినట్టుగా వుండేది.

అదృష్టవశాత్తూ కోర్టువారు నెలాపదిహేను రోజులకే ఆమె క్లయిమ్‌ని పరిశీలించి... సందీప్ తల్లి కస్టడీలో వుండడం చట్టరీత్యా న్యాయ సమ్మతంగా భావించేరు.

అయితే మళ్ళీ అక్కడ చిన్న చిక్కు ముడివేశారు కోర్టువారు. ( లేకుంటే అది కోర్టు ఎలా

అవుతుంది?)

అదేవిటంటే -

విజయ వర్కింగ్ ఉమెన్‌గా బట్టి- ఉదయం వెళ్ళి, సాయంత్రం వరకు ఇంటికి రావడం ఆమెకి కుదరదుగా బట్టి - ఆ సమయమంతా సందీప్ తండ్రి ఇంటిదగ్గరే వుండేలా కోర్టువారు నిర్ణయించేరు. పసితనం నుంచి సందీప్ పార్వతమ్మ చేతుల్లోనే పెరుగుతున్నాడనేది కోర్టు గుర్తించింది.

ఆ తీర్పు ప్రకారంగా-

విజయ సాయంత్రం అయిదుగంటలకి భర్త ఇంటికి వెళ్ళి - సందీప్‌ని పికప్ చేసుకుని...మళ్ళీ ఉదయం ఎనిమిది గంటల్లో బాబుని అక్కడకి అందజేయాలి!

ఏది ఏమైనా ఆ తీర్పు తన విజయంగా భావించింది విజయ.

ఉదయంనుంచి సాయింత్రం వరకూ ఎలానూ తను వుండదు. మిగతా టైమంతా తను ఇంటి దగ్గర వుంటుంది. ఆ సమయమంతా బాబు తనతో వుంటాడు. అంతకన్నా ఇంకేం కావాలి?

విజయ సాయింత్రం డ్యూటీ నుంచి డైరక్టుగా వెళ్ళి సందీప్‌ని పికప్ చేసుకుని ఇంటికి వచ్చేది. మరుచటిరోజు ఉదయం తనుగాని, లేకుంటే రంగంమామ్మ బాబుని అక్కడకి అప్పగించడం జరిగేది.

అయితే అది కేవలం నాలుగైదు రోజులు మాత్రమే జరిగింది.

తర్వాత విజయ ఇబ్బందులు మళ్ళీ మొదలయ్యేయి - కాదు - కంటిన్యూ అయ్యేయి.

ఏ పరిస్థితుల్లోనైనా విజయ కాకుండా - ఏ రంగం మామ్మో, ఛాయో వెళితే సందీప్‌ని అప్పగించేవాడు కాదు చెలం.

వచ్చినట్టు విజయ వెళ్ళేది. వెళ్ళిన వెంటనే ఆమెకి సందీప్‌ని ఏనాడు అందజేయలేదు.

అయిదుగంటలకి వచ్చే విజయని...అలా గంటల తరబడి గేటు దగ్గర గుమ్మంముందు నిలబెట్టేసేవాడు.

కావాలని గంటా, గంటన్నర ఆలస్యం చేసి....బాబుని ఇచ్చేవాడు.

ఇంచుమించు రోజూ అలానే సందీప్‌ని చికాకు పెట్టి అందజేసేవాడు.

ఉద్యోగం చేసి, అలసిపోయి వచ్చిన విజయకి రోజూ గంటల తరబడి నిలబడి వెయిటింగ్ - ఆమెకొక పెద్ద పనిష్మెంట్! తీవ్రమైన, దారుణమైన హింస!

ఆ హింస భరించలేక రోజూ వెళ్ళడం అనేది తగ్గించేసింది.

వారానికి మూడు, నాలుగురోజులు మాత్రమే... తీసుకురావడానికి వెళ్ళేది - ఆ వెయిటింగ్ నరకం భరించలేక.అయితే ఎపుడు వెళ్ళినా ఆమెను ఏడిపించకుండా బాబుని ఇచ్చేవాడుకాదు.

భరించలేక ఒకరోజు చెలంతో పెద్ద గొడవ పెట్టుకుంది.

''కోర్టువారి ఆర్డరు అతిక్రమించడానికి వీల్లేదు....నేను వచ్చిన వెంటనే నా బాబుని నాకివ్వకపోతే ఊరుకునేదిలేదు'' అంది విజయ.

''ఊరుకోకపోతే ఉరేసుకుచావు...నా యిష్టమొచ్చిన టైముకి ఇస్తాను. అప్పటిదాక వెయిట్‌చెయ్! లేకుంటే దొబ్బెయ్!'' అన్నాడు చెలం.

''నీవు ఆర్డరు అతిక్రమిస్తున్న సంగతి కోర్టువారికి మనవి చేసి నీ అంతుచూస్తాను''

పకపకా నవ్వాడు చెలం.

'కోర్టు నా అంతు కాదు, నీ అంతు చూస్తుంది...చూస్తావుగా' అన్నట్టుంది అతని నవ్వు.

మళ్ళీ కోర్టుకి వెళ్ళింది విజయ.

బాబుని టైముకి ఇవ్వడంలేదనీ, ఒకోసారి ఇవ్వను పొమ్మంటున్నాడనీ...కోర్టు ఉత్తర్వుని ఏమాత్రం ఫాలో అవ్వడంలేదని.. లాయర్ ద్వారా కోర్టుకి విన్నవించుకోక తప్పలేదు విజయకి.

కోర్టు చెలంని హాజరుకమ్మంది.

కోర్టుకి చెలం హాజరయ్యేడు.

''నీపై విజయచేస్తున్న ఫిర్యాదుపై నీ ఎక్స్‌ప్లనేషన్ ఏమిటి?'' అనడిగింది కోర్టు.

''ఆమె ఆరోపణలన్నీ అబద్ధం'' అని బుకాయించేడు చెలం. పైగా ఆమె అసలు రావటమే లేదనీ... ఒకవేళ వచ్చినా... ఆ రావడం ఇష్టమొచ్చిన రోజున ఇష్టమొచ్చిన టైముకి వస్తోందనీ...కోర్టువారు ఇచ్చిన టైము అయిదుగంటలకి ఆమె ఏనాడు రాలేదనీ...అయినప్పటికీ తను బాబుని అందజేస్తున్నాననీ'' చెప్పేడు.

''అంతా అబద్ధం, అబద్ధం – పచ్చి అబద్ధం!'' అని అరిచింది విజయ.

''ఆర్డర్! ఆర్డర్! '' అని కోర్టు వారు ఆగ్రహించేరు.

''నీ భర్త చెబుతున్నది అబద్ధం, అవునో కాదో తేల్చాల్సింది నీవుకాదు –మేము'' అని హుంకరించింది కోర్టు!

నిజానిజాలు తెలీడానికి, కోర్టు ఉత్తర్వు సరిగా అమలు పరుస్తున్నాడా లేదా అని చూడ్డానికి నోటరీని అపాయింట్ చేసింది కోర్టు.

నోటరీ ప్రతి సాయంత్రం విజయ ఖర్చుమీద – విజయతో చెలం ఇంటికి వెళతాడు. విజయకి చెలం వెంటనే బాబుని అందజేస్తున్నాడా లేదా అని గమనిస్తాడు. కోర్టు అతన్ని కఠినంగా శిక్షిస్తుంది అన్నమాట. – ఆమె అభియోగం నిజమైతే.

అంతవరకూ బాగానే వుంది. ఐతే ఆ విషయం చెలంకి తెలియదు గనుకనా ?

నోటరీతో విజయ వచ్చినప్పుడల్లా బుద్ధిగా సందీప్‌ని ఆమెకి అందజేసేవాడు.

అదీ బాగానే వుంది.

అయితే ఎంతకాలమని – ఖర్చులు భరించి నోటరీని వేసుకొని వెళ్తుంది విజయ.

ఆడదానికది సాధ్యమా ?

కోర్టువారి కది న్యాయమా ?

ఏరోజైనా నోటరీని తీసుకెళ్ళకపోతే – అసలు బాబునే ఇచ్చేవాడు కాదు చెలం!

కోర్టుతీర్పు ఎప్పటికప్పుడు ఆమెకి అనుకూలంగానే వున్నట్టు కనిపిస్తోంది– ఆచరణలో అది అసాధ్యంగా మిగిలిపోయింది. హాస్యాస్పదంగా పరిణమిస్తోంది. డబ్బూపోయి, శ్రమా అయి.. తలనొప్పి కలిగిస్తోంది. ఆమాటకోస్తే సమస్య ఇంకా జటిలంగా తయారవుతోంది!

విజయకి దుఃఖం వస్తోంది

లాయర్ యశోదాదేవి ఆమెకి న్యాయం జరిగేలా చూడడానికి శాయశక్తులా ప్రయత్నిస్తోంది.

తన క్లయింటు తరపున మళ్లీ కోర్టువారిని అభ్యర్థించింది లాయర్.

''ఎదుగుతున్న పసివాడు అలా చేతులు మారి అక్కడ నుంచి ఇక్కడికి – ఇక్కణ్నించి అక్కడికీ తిప్పడం – ఆ పసివాడి భవిష్యత్తునే దెబ్బ తీస్తుంది. అంచేత ఆ పసివాడి శ్రేయస్సు దృష్టిలో పెట్టుకుని బాబుని-ఒకేదగ్గర వుంచడం మంచిది. అది తల్లి కస్టడీలోనే పెరిగితేనే ఆ పసివాడి భవిష్యత్తు బాగుటుంది. అయితే కోర్టువారి అభ్యంతరమల్లా – తల్లి ఉద్యోగస్తురాలు గనక – ఉదయం నుంచి సాయంత్రం వరకూ తండ్రి వద్ద వుండాలని ఉత్తర్వు జారీచేశారు. కాని ఆ సమయంలో ఆ కుర్రవాడు తండ్రి వద్ద వుండే వయసుకాదు.

స్కూల్ కెళ్ళే వయసు!

తల్లితో బాటు బయల్దేరి స్కూలుకిపోయి – సాయంత్రం తల్లి వచ్చే టైముకి స్కూలు నుంచి వస్తాడు.

నా క్లయింట్ పనిచేస్తున్న కంపెనీలో స్కూలు వుంది. ఆ స్కూల్‌లో బాబుని ఆమె చదివించు కోగలదు. అంచేత దయచేసి పిల్లవాడి భవిష్యత్తు దృష్టిలో పెట్టుకుని...పిల్లవాణ్ని పూర్తిగా నా క్లయింట్ విజయ కస్టడీ లోనే వుంచా'' లని కోర్టువారిని అభ్యర్థించింది లాయర్.

అయితే యశోదాదేవి గారి అభ్యర్థనను కోర్టు త్రోసిపుచ్చింది.

ఏమంటే అప్పటికే సందీప్... ఒక స్కూలులో చదువుతున్నాడు. ఆ స్కూలు ఒంటిపూటబడి! అంచేత మధ్యాహ్నం నుంచి సాయంత్రం వరకూ ఆ కుర్రవాడికేర్ చూసేది ఎవరు?

అంచేత కోర్టు ఒప్పుకోలేదు.

అసలు విషయం ఏమిటంటే విజయ పూర్తిగా సందీప్‌ని పొందే అవకాశం ఇవ్వగూడదనే – సందీప్ ఒంటిపూట స్కూలులో అప్పటికే చదువుతున్నట్టు దొంగకాగితాలు సృష్టించేడు. సృష్టించిన వెంటనే ఒంటి పూటబడిలో పడేశాడు!

డబ్బు, పవరుతో ఈ దేశంలో కొనలేనిదేది ? సృష్టించలేనిదేది ?

అయితే –

కోర్టువారు పూర్తిగా సందీప్‌ని తల్లి కస్టడీకి ఇవ్వకపోయినప్పటికీ – ఇంకోవిధంగా తీర్పునిచ్చింది.

అదేవిటంటే –

ఇకమీదట సాయంత్రాలు సందీప్‌ని విజయ వెళ్ళి పికప్ చేసి తెచ్చే బదులూ – చెలమే టంచనుగా ఆరోగంటకి ఆమె ఇంటికి వచ్చి బిడ్డను అందజేయాలి!

గుడ్డిలో మెల్ల ! ఫర్వాలేదు, కొంత నయం అనుకుంది విజయ.

ఆచరణకి వచ్చేటప్పటికి.... మళ్ళీ మామూలే !

ఏ రోజూ సరిగా టైముకి సాయింత్రం బాబుని అక్కడ దింపలేదు చెలం!

మళ్ళీ ఎక్కడిసమస్య అక్కడే !

చెలం ఎందుకలా ప్రవర్తిస్తున్నాడో, తననెందుకలా ఏడిపిస్తున్నాడో – విజయకి అర్థం కావడంలేదు!

''అతనెందుకు నన్ను ఏడిపిస్తున్నాడు?'' అడిగింది లాయర్ని విజయ.

''నిస్సందేహంగా బిడ్డ తల్లి దగ్గరే పెరగడం న్యాయమని చెలంకి తెలియకకాదు. నేచురల్ గార్డియన్‌గా అతనికున్న విశేష హక్కులు తెలపడంకోసమే మిమ్మల్ని బాధించడం'' అంటూ ''ఒక విషయం చెప్పమంటారా ?'' అనడిగింది.

''చెప్పండి''

''చెలంకి మిమ్మల్ని వదులుకోడం ఇష్టంలేదు. అది ప్రేమంటారో, ఏమంటారో నాకు తెలీదు. మీతో బంధాన్ని తెంచుకోడానికి అతను ఏ మాత్రం సిద్ధంగాలేడని నాకు అనిపిస్తోంది''

''నేనలా అనుకోడంలేదు... అదే నిజమైతే అతనలా పశువులా ప్రవర్తించడు. నన్ను ద్వేషించడు''

''ప్రేమించినవాడే ద్వేషించగలడని ఎక్కడో చదివేను'' అంది నవ్వుతూ యశోదాదేవి.

''నేనుమటుకు అతన్ని విపరీతంగా ద్వేషిస్తున్నాను.... ప్రేమ కృశ్ఛనులేదు!''

''అంటే మీరు చెలంతో విడాకులు తీసుకోడానికి సిద్ధంగా వున్నారా ?''

విడాకులు అనేమాట కత్తిలా తగిలి – ఆమె గుండెల్ని పిండినట్టయింది.

ఆమెలో ఇంకా భారతనారీ రక్తం ప్రవహిస్తోందా ?

''ఆ విషయం .... ఇంతవరకూ ఆలోచించలేదండీ.''

''అంటే మీకు అతని బంధం వదుల్చుకోవాలనిలేనట్టేకదా !''

విజయకి ఇబ్బందిగావుంది –'' ప్లీజ్! ఆ టాపిక్ ఎత్తకండి''

'' విడాకులు మీరు వాంఛిస్తున్నారా లేదా అనేది మన కేసుకి అవసరం!... సరేలెండి... ప్రస్తుతం మీరు చెప్పక్కరలేదు...మీరు మాత్రం ఏదో ఒక నిర్ణయానికి రావల్సి వుంటుంది.''

''అలాగే'' అంటూ లాయర్ వద్ద నుంచి వచ్చేసింది విజయ.

ఆ రోజు రాత్రి పదయినా చెలం సందీప్‌ని తీసుకురాలేదు విజయ ఇంటికి.

చెలం సందీప్‌ని తీసుకుని సాయింత్రమే బయల్దేరాడు.

బయల్దేరాడేగాని...వెంటనే బాబుని విజయకివ్వడం ఇష్టంలేక ... బాబుని తీసుకొని

ఫస్ట్‌షో సినిమాకి వెళ్ళేడు

సినిమా నుంచి బాబుని తీసుకువచ్చేటప్పటికి రాత్రిపదవుతోంది

నిద్రపోతున్న బాబుని చెలం ఎత్తుకుని విజయ గదిలోకి వచ్చేడు

తలుపులు తీసే వున్నాయి

బాబుకోసం తను అంతవరకూ ఎదురుచూసి చూసి నిద్రపోయింది

చెలం సందీప్‌ని నెమ్మదిగా ఆమె పక్కలో వేసేడు

వేస్తూ అలా విజయ ముఖంలో చూస్తు వుండిపోయేడు

ఆమెనలా, ఆబగా, తన్మయంగా, తనివితీరా ఎంతసేపో అలా చూస్తూ వుండిపోయేడు

నెమ్మదిగా ఆమె తలను తాకేడు ముంగురులను సవరించేడు

నెమ్మది నెమ్మదిగా అతని పెదాలు ఆమె పెదాల మీదకు వెళ్ళేయి

ఆ తీయని స్పర్శకి విజయ ఒళ్ళు జలదరించి – తుళ్ళిపడిలేచింది!

ఆశ్చర్యం !

ఎదురుగా చెలం లేడు!

తన పక్కలో చూసింది సందీప్ లేడు

తలుపులు లోన గడియ వేసేవుంది!

అంటే ఇదంతా కల!

కొన్ని క్షణాల్లో వాస్తవంలోకి వచ్చిన విజయ – జరిగిందంతా కలగా నమ్మక తప్పలేదు

ఏది కల ? ఎంతవరకు కల?

సందీప్ పుట్టిన రోజున భర్తచే పరాభవింపబడి ప్లీడరు దగ్గరికి వెళ్ళినంతవరకే నిజం తర్వాతదంతా కల!

లాయర్ ఆఫీసులో తనలా దగాపడిన తల్లుల కథలు . విజయని కదిలించి, కలవరంరేపేయి అవి కలలో కొచ్చేయి ఆ రోజంతా ఏడ్చి ఏడ్చి నిదురపోతే తనకి పీడకల వచ్చింది!

పీడకల!

మొత్తం కలంతా పీడకలేనా ? చివర్న ప్రేమగా చెలం తన ముంగురులను సవరించి – తీయగా తన పెదాలపై ముద్దు పెట్టుకోడం కూడా పీడకలేనా ?

కాదు తీయతీయని అతి కమ్మని కల!

ఛీ ఛీ మనసేమిటి ఇలా పెడదోవ పడుతోంది !

మనసు చిక్కబరుచుకుని – గట్టిగా కళ్ళు మూసుకు పడుకుంది విజయ!

# 38

సమయం రాత్రి పదిగంటలు!

రోడ్లపై జనం పెద్దగా అలికిడిలేదు

బార్లో.. మాత్రం హౌస్ఫుల్ అన్నట్టు కిటకిటగా వున్నారు

ఆ బార్లో ఏవో రెండు, మూడు టేబుల్స్ తప్ప. . మొత్తం టేబుల్స్ అన్నీ కళకళలాడుతూ, గలగలమంటూ, ఘుమఘుమలాడుతూ, చల్లచల్లగా దిగితూ, గరమ్ గరమ్గా, కరకరగా, నిషానిషాగా, కుషీకుషీగా మజాలు యిస్తూ.. ఫుల్స్వింగ్లో వున్నాయి.

ఒక్కో టేబుల్ది ఒకో ప్రపంచం అన్నట్టుగా ఎవరిలోకం వారిది

ఆ మూలన. . గుడ్డి వెలుతురులో. ఒక టేబుల్ దగ్గర . పాతమిత్రులు చెలం, రవిల ప్రపంచం కూడా వుంది!

పెళ్ళాల గొడవలతో, స్పర్థలతో, మనసులుపాడై. . మనశ్శాంతిని కోల్పోయిన ఆ మిత్రులని సీసాలు సేదతీరుస్తున్నాయి.

రవి ఒకగ్లాసు పూర్తి చేసేలోగా. . చెలం రెండోగ్లాసు ముగించే స్థితికి వెళుతున్నాడు , అలాగే చెలమే ఎక్కువగా మాటాడుతున్నాడు.

తాగుతూ... ఏదో మాటాడ్డంకాదు.

మనసారా... మాటాడుకోవాలనే తాగుతున్నారు

గుండెల్లో బరువంతా, మనసుల్లో బాధంతా... వెళ్ళగ్రక్కి... టెన్షన్స్ నుంచి తాత్కాలికంగా రిలీవ్ అవుతున్నారు.

చెలం రవితో కాకుండా కనకరాజుతో కూర్చోవచ్చు. కాని తననతడు డామినేట్ చేస్తాడు. తనని మాటడనివ్వడు. అతనే మాటాడ్తాడు మాటాడినా దాన్ని మధ్యలో తుంచేసి తనేదో కోస్తాడు... కనకరాజుతో స్నేహం వేరు! డబ్బుతో వచ్చేడు కనకరాజు!

రవితో స్నేహం వేరు. ఒక్కరవితోనే తను మనసు విప్పి మాటాడగలడు.

తను హైమ కౌగిల్లో వుండగా... ఆరోజురాత్రి.. .కిటికీలోంచి చూసిన రాత్రినుంచి కనకరాజుతో రిలేషన్స్ దెబ్బ తింటాయనుకున్నాడు కాని అలాంటిదేమీ లేదు.

ఆ విషయమై కనకరాజు గుండెల్లో అగ్ని పర్వతాలు మండుతున్నాయో, లేదో చెలంకి తెలీదుగాని... అతను తనతో ప్రవర్తించేతీరులో స్నేహంలో ఏ మాత్రం ఛేంజ్ లేదు!

ఆ మాటకొస్తే చెల్మే ఇంతకు ముందులా వుండలేకపోతున్నాడు. కనకరాజు ఇంటికి వెళ్ళలేకపోతున్నాడు. ఏదో గిల్టీ !

కనకరాజు తనతో అసలు ఆ విషయమే ఎత్తలేదు. మహా అయితే ఆరోజు రాత్రి అతను హైమతో గొడవపడితే పడుండొచ్చు! ఆ మాత్రం గొడవ పడకపోయినా ఆశ్చర్యం లేదు!

ఎటొచ్చి – ఆ యిన్సిడెంటు తనని దెబ్బతీసింది. విజయ చూసి అల్లరి చేసింది. దాంతో–

విజయని కోల్పోయేడు!

విజయ తనని వదిలివెళిపోయిన కాణ్ణించి తీవ్ర మనస్తాపానికి గురి అయేడు చెలం!

''పోనిద్దూ! పీడాపోయింది అదుంటే ఇల్లే జైలులా వుండేది సాయంత్రాలు, సరదాలూ అంటూ చంపుకుతినేది లేకుంటే రాత్రి అయ్యేదాకా తిరుగుళ్ళు తిరుగుతూ వచ్చేది ఇపుడవేంలేవు నవ్ అయామ్ హేపీ! ఇష్టమొచ్చినట్టు వుండొచ్చు తిరగొచ్చు అడిగే వాళ్ళు లేదు' – అని అనుకోలేకపోతున్నాడు

ఈ క్షణం వరకూ కూడా తనకి విజయ లేని జీవితం దుస్సాధ్యంగా, అర్థరహితంగా ఫీలవుతూనే వున్నాడు

రెండు, మూడుసార్లు విజయకి క్షమాపణలు చెప్పుకుని ఇంటికి తీసుకొచ్చేద్దామని బయిల్దేరిన సందర్భాలు లేకపోలేదు బయిల్దేరినవాడిని ముందుకి అడుగేయకుండా గోడలా అహం అడ్డేది విజయముందు నిలబడే ధైర్యం అతనికి చాలేది కాదు అహాన్ని, పిరికితనాన్ని విస్కీతో డయిల్యూట్ చేసినా అడుగు ముందుకి పడేది కాదు

అనుకోకుండా నే విజయపట్ల క్రూయల్‌గా, నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించేలా చేసేవి – అహం రోషం, కోపం, దుఃఖం , చేతకానితనమూనూ! తనను హింసించి, బాధించి చిత్రవధ చేస్తున్న ఆమెను అదే స్థితికి గురి చేయాలనిపించేది

అంచేతనే విజయకి బాబుని ఇచ్చేవాడుకాదు తనకి తెలియకుండానే ఒక శాడిస్టుగా తయారయ్యేడు

విజయని ఏ విధంగా క్షోభకి గురి అయినా ఎంత తృప్తిపడేవాడో అంత వ్యథ అనుభవించేవాడు ఇమీడియట్‌గా గ్లాసుమీద గ్లాసు గుటక్ గుటుక్ మని మింగేసి వంటరిగా ఏడ్చేసేవాడు కూడాను!

ఈ రోజైతే విజయపట్ల అంత దారుణంగా ప్రవర్తించినందుకు ప్రాణాలే తీసేసుకోవాలనిపించింది

సందీప్ పుట్టినరోజు ఈ రోజు ఆ ముందురోజే బాబుని పికప్ చేసుకువెళ్ళడానికి వస్తే ఇవ్వలేదు తను! ఆమెను బాధ పెట్టినందుకు బాధ పడ్డాడు ఈ రోజు సందీప్‌ని ముస్తాబు చేసి విజయ దగ్గరికి తీసుకువెళ్దామని అనిపించింది తనకి వెళ్ళే ధైర్యం చాలకపోతే తల్లి చేతనయినా సందీప్‌ని పంపిద్దామనుకున్నాడు

అంతలో ఉదయాన్నే విజయ బాబుకోసం వచ్చేసింది ఆమె రాగానే అతనిలో రాక్షసుడు మేల్కొన్నాడు అనుకోని రీతిలో ప్రవర్తించేడు

కొడుకుని చూడ్డానికి వచ్చిన భార్యని అమానుషంగా కొట్టి, బయటకీడ్చేయటం తల్చుకుంటే తనపై తనకే అసహ్యం వేస్తోంది ఎందుకలా రాక్షసంగా బ్రూటల్‌గా ప్రవర్తిస్తున్నాడో అర్థం కావడంలేదు విజయని కొట్టిన చేతులు రైలు చక్రాల కింద పెట్టేయాలనిపిస్తోంది

ఆ దుఃఖం భరించలేకే పిచ్చి పిచ్చిగా ఎక్కడెక్కడో తిరిగి – తర్వాత రవి దగ్గరకు వెళ్ళేడు

తర్వాత ఇద్దరూ ఇలా బార్‌కి వచ్చేరు.

ఇదిలా వుండగా –

పాతిక లక్షల లాభం తెస్తుందనుకున్న ల్యాండ్ బిజినెస్... తన గుండెలని గుయ్‌మనిపిస్తోంది. మనిషిని రెస్ట్‌లెస్‌గా .. మనశ్శాంతి లేకుండా చేస్తోంది ఆ వ్యవహారం! మొత్తానికి ప్రాజెక్టు సక్సెస్‌గా ముగుస్తుందా అనేది అనుమానంగా తయారయింది. తొలుత కక్కుర్తిపడ్డ కరణంతో రాజీకి రాకపోడం తెచ్చింది ముప్పు ! ఇప్పుడు వాడు ఎగ్రిమెంటు చేయని రైతుల్నే కాకుండా – చేసిన రైతులనుకూడా రెచ్చగొట్టి ఎదురు తిరిగేలా చేస్తున్నాడు. ఫీల్డులోకి ఇంకో పార్టీని దింపి...రైతులు భూమిని ఆ పార్టీకే ఇప్పించే ఏర్పాట్లు చేస్తున్నాడని కూడా తెల్సింది... అదే నిజమైతే తను పిచ్చివాడై పోవడం తథ్యం !

మొత్తం మీద తన రోజులు బాగాలేవని చెలంకి స్పష్టంగా అర్థమవుతోంది!

పదిమందీ పది సలహాలు !

ఎవరో మిత్రుడి సలహాపై.... రాజమండ్రి పనికట్టుకుని వెళ్ళి... ఒక సిద్ధాంతిని కలిసేడు.

ఆ సిద్ధాంతి నీవు కట్టిన ఇల్లు వేళా విశేషం బాగా లేదన్నాడు. ఇల్లు బాగుచేయాలన్నాడు. ఇల్లు పడగొట్టేయ్యక్కర్లేదుగాని. ... హాలుగది... గచ్చు అంతా పెళ్ళగించేయమన్నాడు. గునపాలతో, తనువచ్చి పూజలు చేసి ఆ నేలను ప్రక్షాళణం చేస్తానన్నాడు. అంతేకాదు ఇంటిముందు అలా ఖాళీ-స్థలం వుంచకుండా ... ఒక అవుట్ హౌస్ లాంటది కట్టమన్నాడు.

సిద్ధాంతి చేయమన్న విధంగా చేసేడు చెలం. అవుట్ హౌస్ కట్టేడు.

ఇంటిహాలు గచ్చు అంతా కొట్టేసి ... సిద్ధాంతితో పూజలు చేయించి... కొత్త గచ్చు చేయించాడు.

అంతేకాదు... ఎవరో బాబా సింహాచలం దేవాస్థానానికి వచ్చేడని తెల్సి – అతని వద్దకీ వెళ్ళేడు– ఏం చేస్తాడు ?

ఎవరేం చెబితే అది చేస్తున్నాడు–

తనబాధంతా రవికి చెప్పుకుని ఏడ్చేసాడు. తన బాధను తీర్చేది మనశ్శాంతి నిచ్చేది కేవలం విజయ తప్ప ఏ సిద్ధాంతులూ, ఏ బాబాలూ, ఏ దేవుళ్ళూ కారు, కారు, అని ఏడ్చేడు.

అలా ఏడ్వడం తాగినవాడికే సాధ్యం !

చెలం పరిస్థితి చూసి...విజయకి నచ్చజెప్పి... ఇద్దర్నీ కలిపే ప్రయత్నం చేస్తే ఎలా వుంటుంది అనిపించింది రవికి.

ఆ వెంటనే నవ్వుకున్నాడు.

తనున్న స్థితి ఏమిటి ?

తన బతుకు పంట ధ్వంసమయినవాడు, తన సంసారాన్ని చక్కబరుచుకోలేనివాడు... తగుదునమ్మా అని ఇంకొకరి సంసారం సరిదిద్దగల నైతిక హక్కు ఎక్కడిది ?

గ్లాసు అందుకున్నాడు రవి!

## 39

ఇంటిముందు స్కూటర్ ఆగిన చప్పుడై – గదిలోంచి బయటకి వచ్చింది విజయ.

''నీవా రవీ ! రారా... చాన్నాళ్ళ కొచ్చేవు'' – అంది విజయ.

రవి నవ్వుతూ – ''నయ్యం ! గెటౌట్ అంటావనుకున్నాను'' అన్నాడు – లోనకి వస్తూ.

''అదేం ! అలా అన్నావ్ !'' అంది విజయ.

''వూర్కె నే !'' అనేసి – మంచినీళ్ళు ఇవ్వమన్నాడు.

మంచినీళ్ళు ఇస్తూ అడిగింది – ''అదేం రవీ ! ... ఆ రోజు పిల్లల్ని దింపేసి వెళిపోయేవ్ – లోనకి రాకుండా ! ఏం, మా మీద కోపమా ?''

''అవును, కోపమే !''

విస్మయంగా చూసింది విజయ.

రవి నవ్వేడు – ''కోపం నీమీద కాదు. నీ గెస్టుమీద''

''అంటే సుజాతమీద!''

''అవును'' అన్నట్టు తల ఊయించేడు.

''ఏం చేసిందని అంత కోపం! పిల్లల్ని ఇవ్వకుండా ఏడిపించి, నేను చూస్తుండగనే ఆమెను గొడ్డులా బాదేవు... నాకప్పుడు నీపై ఎంత కోపం వచ్చిందో తెల్సా? పెళ్ళాలని కొట్టడంలో నీవూ, మీ ఫ్రెండూ గొప్ప ఘనులుస్మీ !''

''నిన్ను కొట్టిన సంగతి తెల్సింది... అదివిని చాలా బాధపడ్డాను. ''

''ఇది నిజంగా జోక్!'' అంది – ''నన్ను కొట్టిన సంగతి నీకెవరు చెప్పారు బాబు ?''

''చెలం''

''అవున్లే ! మీ ఫ్రెండు కదా ! నన్ను ఎలా కొట్టింది పెద్ద వీరుడిలా చెప్పి వుంటాడు.''

''లేదు. కొట్టినందుకు బాధపడ్డాడు.''

ఒక క్షణం తెల్లబోయి – వెంటనే పకపక మంది విజయ.

''నీవునమ్మూ, నమ్మకపో. నిన్ను కొట్టినందుకు చెలం కుమిలిపోడం నిజం''

''నమ్మడమేవిఁటి రవీ ! పశువులు కొమ్ములు విసురుతాయిగాని కుమిలిపోవు''

''అతను ఏడ్చాడు.''

''మొసలి కన్నీళ్ళు!''

''మరి నీవు నమ్మకపోతే – నేనేం చేస్తాను''

''అవున్లే ! మీదంతా ఒకేజాతి! మీరు పెళ్ళాలని కొట్టడం గొప్ప! కొట్టి కన్నీళ్ళు కార్చడం ఇంకెంతో గొప్ప''

''నిన్ను కొట్టడం తప్పుగాబట్టే చెలం బాధపడుతున్నాడు. కాని నేను సుజాతను కొట్టినందుకు బాధపడ్డంలేదు. నేనైతే కొట్టి వూర్కున్నాను గాని, అదే మరొకడూ, మరొకడూ,

అయితే దాని ప్రాణాలు నిలువునా తీసిపారేస్తాడు''

''ఏం ? ఎందుకూ ?''

''ఎందుకా ? అదిచేసిన పనికి ! అది వేసే రంకువేషాలకీ !''

వినలేకపోయింది విజయ!

''ఏమిటి రవీ ! అంత పచ్చిగా మాటాడుతావ్ ! ... నీ అనుమానం పెనుభూతంలా పెరుగుతున్నట్టుందే!''

''అనుమానంకాదు – అక్షరాలా నిజం ! అది విటుడితో కులుకుతుండగా నేకళ్ళారా చూసేను''

''ఏవిఁటీ !'' అదిరిపడింది విజయ.

''నేను చూస్తుండగానే... ఒక అంకుల్‌గాడితో ముద్దు పెట్టించుకుంది. ఆ రోజు సురేష్ చెప్పింది నిజం ! నీవు కొట్టి పారేశావు. అనుమానం అనేది మగాడి రక్తంలోనే వుందని సిద్ధాంతీకరించేశావు !''

''నీవు చెబుతున్నది నిజమా రవీ ! సుజాత అలాంటిదంటే – నేను ఇంకా నమ్మలేకపోతున్నాను''

''నీవు నమ్మవు... ఎంతైనా ఆడదానివి కదా ...వెనుకేసుకొస్తావు'' ఆమె మాటాడే పద్ధతిలో ఆమెకే కొట్టేడు.

విజయ మనసు అదోలా అయిపోయింది

''సుజాత... నాకీ విషయం చెప్పనేలేదే !'' తనలో అనుకుంటున్నట్లుగా అంది!

''బలేదానివి విజయా ! అక్రమం సంబంధం పెట్టుకున్నట్టు నీకెలా చెబుతుందనుకున్నావ్?'' అని వివరంగా తను చూసిన సంగతి చెప్పేడు.

విజయ తలదించుకుని 'సారీ' అంది – ''నేను సుజాత అలాంటిదని అనుకోలేకపోయాను'' అని కాసేపు మౌనంగా వుండిపోయింది.

'' ఈ విషయం ఇంతకాలం చెప్పలేదేం?''

''ఏమిటో, చెప్పాలనిపించలేదు... అయినా చెప్పుకోవల్సిన విషయాలా ఇవి! నాలో నేనే మధనపడుతున్నాను.... నీకు చెప్పినా నమ్మవని అనుకున్నాన్లే!'' అని ''ఇప్పుడు చెప్పు. నేను కొట్టడం తప్పా!''

''తప్పే రవీ !'' అంది విజయ – ''నీకు ఇష్టంలేకపోతే విడాకులు పుచ్చుకో ! కొట్టడం మాత్రం అమానుషం!... ఆమె పిల్లలని చెప్పా చేయకుండా తీసుకొచ్చేసి ఏడిపించడం అంతే అన్యాయం ! సుజాత ఎలాంటిదైనా ఆ పిల్లలకి కన్నతల్లి అనే సంగతి మరిచిపోతే ఎట్లా?''

''ఎమోషనల్‌గా ఆమెను కొట్టేను – కావాలని కొట్టలేదు కదా ! పిల్లల విషయంలో అంటావా ! ...అలా చెప్పా చేయకుండా తీసుకురావడం తప్పే ! ఆఫ్‌కోర్స్ ! నా ఒళ్ళు మండి ఆమెను ఏడిపించాలనే అలా చేశాను''

''తల్లినుంచి బిడ్డల్ని వేరు చేయడం మహా పాపం రవీ!'' అంటుంటే విజయ కళ్ళు నీళ్ళు తిరిగేయి – ''నిన్న బాబు పుట్టినరోజు.. సరదాగా ఎత్తుకుని కాసేపు గడపడానికి కూడా నోచుకోలేకపోయేను. ''

విజయ ఏడ్చింది.

రవి ఇబ్బందిగా కదిలేడు.

కాసేపు అయేక – 'వస్తాను' అని లేవబోయేడు.

''వుండు రవీ! ....టీతాగి వెళ్ళువుగాని... కాసేపటిలో ఛాయకూడా వస్తుంది'' అంది విజయ.

టీకాచి, తెచ్చి ఇచ్చింది విజయ.

''ఛాయ ఇక్కడే వుంటోందట కదా!''

''అవును. దానిదో కథ!''

''తెల్సు! ఛాయ చెప్పిందంతా!'' అని – ''తను రాంబాబుని పెళ్లి చేసేసుకుంటే ఈ ఇబ్బందులేమీ వుండేవి కాదు కదా!''

''అవును – నేనూ అలానే అనుకున్నాను. నీవూ నేనేకాదు. అందరూ అలానే అనుకున్నారు. ఈ కుళ్ళిన వివాహ వ్యవస్థలో, ఈ సిస్టంలో మనం అన్ని అవస్థలు పడుతూనే, అన్ని బాధలూ పడుతూనే ... మన లైనులోకి అది రాదేం అని తెల్లబోతున్నాం! రారా, రమ్మని ఆహ్వానిస్తున్నాం... రాకుంటే తప్పుపడుతున్నాం. అది మానవ స్వభావం అనుకుంటాను. అదిగో మాటల్లో వస్తోంది ఛాయ'' అంది విజయ.

''అయితే నూరేళ్ళు నీకు'' అన్నాడు రవి ఛాయని.

ఛాయ నవ్వుతూ – ''ఎంత సేపయింది వచ్చి'' అడిగింది రవిని – ఉత్సాహంగా ఛాయ.

''చాలా సేపయింది... నిన్ను చూసి పోదామని వున్నాడు'' అంది విజయ.

''థాంక్యూ'' అంది ఛాయ – ''ఒక్కనిముషం'' అంటూ –

వంటగదిలోకి వెళ్ళి టీ తెచ్చుకుని కూర్చుంది.

కాసేపు ముగ్గరూ కబుర్లు ఆడుకున్నారు.

రవి ఏదో గుర్తుకొచ్చినట్టు అడిగేడు ఛాయని – ''మెటర్నటీలీవుకి అప్లయి చేస్తే ....అభ్యంతర పెట్టేరన్నావు కదా! ఏమైందది''

''ఏమవుతుంది! చచ్చినట్టు శాంక్షన్ చేశారు'' అంది ఛాయ.

మెటర్నటీ లీవు వర్కింగ్ ఉమెన్‌కి డెలివరీకి ముందు ఆరువారాలు డెలివరీ తర్వాత ఆరువారాలు ఇమ్మని వుంది ఆక్ట్‌లో.

అయితే ఆ కంపెనీలో – ఛాయ లాంటి కేసు ఇంతవరకూ తగలక పోవడంతో – ఛాయ లీవు శాంక్షను చేయాలా, లేదా, అనే విషయమై చిన్న గందరగోళం జరిగింది.

ఆదిలోనే హంసపాదు అన్నట్టు –

ఆమె ఆఫీసరు అప్లికేషన్ ఫార్వార్డు చేయనన్నాడు. రికమెండ్ చేయనన్నాడు.

''ఎందుకు చేయవు'' అనడిగింది ఛాయ.

''నీవు అన్‌మారీడ్ ప్రెగ్నెంట్ ఉమన్‌వి. నీకు మెటర్నిటీ లీవు ఇవ్వరు''

''ఎవరు చెప్పేరు మీకు?''

''చూడమ్మాయ్ ! నీకు పెళ్ళికాలేదు. భర్త లేడు. నీది లీగల్ ప్రెగ్నెన్సీ కాదు. అంచేత మెటర్నటీ లీవు యివ్వబడదు... కావలిస్తే ఎరన్డ్ లీవు పెట్టుకో. శాంక్షన్ చేస్తాను'' అన్నాడు ఆఫీసర్.

అతను ఆ డిపార్టుమెంటుకుకి కొత్తగా వచ్చేడు.

ఛాయ చరిత్ర విని అసహ్యించుకున్నాడు అతను.

కంపెనీ స్టాండింగ్ ఆర్డరులో గాని, ఇండస్ట్రియల్ ఆక్ట్‌లో గాని ఏ మాత్రం అవకాశం వున్నా – ఆమెను ఉద్యోగం నుంచి టెర్మినేట్ చేయడమో, సస్పెండ్ చేయడమో ఖచ్చితంగా చేసేవాడు.

అతను పరమ ఛాందసుడు, సనాతనుడు. మన విశిష్ట సాంప్రదాయాలూ, సనాతన ఆచారాలూ నేటి యువతరం వల్ల భ్రష్టు పట్టుకుపోతున్నాయని బాధపడే వారిలో అతనొకడు.

ఛాయ కొన్నాళ్ళు ఎవడితోనో లాడ్జీలంట తిరగడం, తర్వాత పెళ్ళీ పెడాకులు లేకుండా, సంఘభయం లేకుండా వివాహ వ్యవస్థను గౌరవించకుండా – నిర్లజ్జగా కడుపేసుకు తిరగడం చూస్తుంటే అతనికి పరమ అసహ్యంగా వుంది.

ఒకసారి ఆమెని పిలిచి ''ఇటీజ్ నాట్ గుడ్ – బీయింగే ఇన్‌డియన్ ఉమన్ యూ ఆర్ నాట్ సపోజ్‌డు టూ హేవ్ ఇల్లీగల్ ప్రెగ్నెన్సీ...'' అని ఇండియన్ కల్చరు గురించీ... ఇంకేదో చెప్పబోతుంటే –

ఛాయ కట్ చేస్తూ అంది – ''సర్ ! ఎక్స్క్యూజ్మీ ! ఇటీజ్ ప్యూర్లీ మై ప్రయివేట్ మేటర్ ! యూ ఆర్ నాట్ సపోజ్‌డు – టూ టాక్ ఇన్‌దట్ మేటర్స్ ! థాంక్యూ ! అని అక్కడనుంచి వచ్చేసింది.

వర్కు విషయానికొస్తే ఆమెనేమీ అనలేడు. తప్పుపట్టలేడు. ఆ రోజు ఆమెకి ఎలాట్ చేసిన వర్కంతా అక్షరం పొల్లుపోకుండా పెర్‌ఫెక్టుగా, నీట్‌గా, స్పీడ్‌గా, సిన్సియర్‌గా చేసేస్తుంది. అందులో ఆమెను ఏ కామెంట్ ఎవరూ చేయలేరు.

ఆమె కొలీగ్స్ వున్నారంటే మొదట్లో ఏదో చాటుగా గుసగుస లాడుతూ, చెవులు కొరుక్కున్నారు. ఎంతని చెప్పుకుంటారు. కొన్ని రోజులకి వాళ్ళకే విసుగుపుట్టి వూరుకున్నారు. ఇపుడు మెటర్నటీ లీవు సమస్యగా తయారవగానే కొలిగ్స్‌లో మళ్ళీ ఉత్సాహం – టాపిక్‌కి మేటరూ వచ్చింది. గుసగుసలు మళ్ళీ మొదలయ్యేయి.

ఛాయ లైబ్రరీకి వెళ్ళి ఇండస్ట్రియల్ లా పుస్తకాలు రిఫర్ చేసింది. అందులో ''ది మెటర్నిటీ బెనిఫిట్ ఆక్ట్, 1961'' చూసింది. ఇండస్ట్రీలో 'ఉమెన్' అనేదానికి డెఫినిషన్ చూసింది తర్వాత–

నా కొచ్చిన కడుపు లీగల్ అవనీ ఇల్లీగల్ అవనీ – నీకు అనవసరం. అలాగే నేను మారీడా

, అన్ మారీడా అనేది కూడా అనసరం. వర్కింగ్ ఉమెన్‌కి మెటర్నటీ లీవు పొందే హక్కు వుంది – ఆ హక్కు మీరు మీజేబులోంచి ఇచ్చిందికాదు. ఏనాడో కార్మికులు సాధించుకొని – అది ఒక హక్కుగా కొనసాగుతున్నది. మీరు లీవు రికమెండ్ చేయకపోతే... జనరల్ మానేజర్ దగ్గరికి వెళ్ళాల్సి వస్తుంది లేదా యూనియన్ని రంగంలోకి దింపాల్సి వస్తుంది'' అంది ఛాయ.

''బెదిరిస్తున్నావా ?'' అన్నాడు గాని నిజానికి బెదిరిపోయేడు!

అప్లికేషను టేబుల్ మీద వుంచి వెళ్ళమన్నాడు ముఖం రుమాలుతో తుడుచుకున్నాడు.

తర్వాత స్టాండింగ్ ఆర్డరు, ఇండస్ట్రియల్ ఆక్ట్ పుస్తకాలు మెసెంజర్‌తో తెప్పించి చూసాడు. పర్సనల్ డిపార్టుమెంటునీ వెల్‌ఫేర్ డిపార్టుమెంటునీ కాంటాక్టు చేసాడు.

చివరికి ఆమె లీవు రికమెండ్ చేయక తప్పలేదు. చేస్తూ – ' సబ్జెక్ట్ టు ది ఎలిజిబిలిటి ' అని కింద చేర్చేడు. తన జాగ్రత్తలో తను వుండాలిగా!

అంటే ఎలిజిబిలిటి లేకుంటే తను రికమెండ్ చేసినా చెల్లదన్న మాట! ఆ విధంగా సంతకం పెట్టేడు.

యజమాన్యం ఆమె పెట్టుకున్న మెటర్నటీ లీవుని పరిశీలించింది.

ఆక్ట్‌లో మెటర్నటీ లీవుకి సంబంధించి వర్కింగ్ ఉమెన్ అని మాత్రమే వుంది ఆ వర్కింగ్ ఉమెన్‌కి వచ్చిన కడుపు చట్టబద్ధమై వుండాలి, లేదా ఆమె మారీడ్ ఉమెన్ అయి వుండాలి – ఇలాంటి క్లాజులులేవు!

''లీవు శాంక్షన్ అవడంతో మా పట్టబుర్ర ఆఫీసర్ ముఖం నల్లగా మాడిపోయిందనుకో '' అంది ఛాయ.

రవీ, విజయ నవ్వేరు. తర్వాత–

వస్తానని బయల్దేరబోతుంటే –

''రవీ! చిన్న హెల్పు చేయాలి'' అంది ఛాయ.

''ఏవిఁటి ?'' అనడిగేడు.

''నీవు వెళ్తున్నప్పుడు కొద్దిగా మా ఇంటివైపు వెళ్ళాలి.''

''అలాగే. ఎందుకూ?''

''మా అమ్మకి ఈ డబ్బు ఇచ్చేయి''

''ఏవిఁటిది?''

''నా జీతం.''

తన ఖర్చుకి మూడొందలు తీసేసి మిగతా జీతమంతా తల్లికి పంపించేస్తోంది.

''నిన్ను తగిలేసిన వాళ్ళుకెందుకివ్వాలి... వాళ్ళ పాట్లు వాళ్ళు పడనీయ్! నీవు అక్కర్లేదుగాని... నీడబ్బు కావాలా! ఏం మనషులు....వద్దు... ఇవ్వకు'' అన్నాడు రవి. ''అయినా రేపు నీకు డబ్బు ఎంతైనా అవసరం పడొచ్చు... నెలలటైము కదా!''

''ఆ జాగ్రత్తలో నేను వున్నాను రవీ! .... అంతకీ చాలకపోతే... మీరంతా నాకు

వున్నారు... వాళ్ళ కెవరున్నారు చెప్పు? నేను తప్ప! ''

''తీసుకుంటారంటావా డబ్బు ?''

''తీసుకుంటారు... ఎందుకు తీసుకోరు ?.. చస్తారా లేకుంటే !''

ఛాయ ఇచ్చిన డబ్బు జేబులో పెట్టుకుని లేచేడు రవి !

'' ఏవిఁటలా చూస్తున్నావ్!... నేను చేసున్నది తప్పా !'' అనడగింది ఛాయ విజయని

'' నీదెంత మంచి హృదయం!'' అంది విజయ.

రవి వెళ్ళిన తర్వాత -

విజయ ఛాయతో అంది - ''రవి చెప్పేక గాని సుజాత కారెక్టరు సంగతి తెల్సింది కాదు ! అబ్బ! ...అది విన్నాక సుజాతపై గొప్ప అసహ్యం కలిగింది. . ఛీ! సుజాత అలాంటిదనుకోలేదు''

''రవి ఏవిఁటి చెప్పేడు ?'' అడిగింది ఛాయ.

ఏవిఁటి చెప్పిందీ - చెప్పింది విజయ.

చెప్పినదంతా విన్నది ఛాయ. విన్నాక -

''అసహ్యం ఎందుకూ ?'' అనడిగింది ఛాయ.

''భర్తని వంచించి... నీచంగా ఎవర్తోనో ... అక్రమ సంబంధం''

''ఉమెన్స్ లిబ్ అంటూ ఉపన్యాసాలిచ్చే నీవుకూడా అందరి నీతివంతుల్లాగే ఆలోచిస్తున్నావు'' అంది ఛాయ.

విజయ తెల్లబోయి చూసింది !

''స్త్రీ ఔన్నత్యం, నీచం... ఆ స్త్రీయొక్క కామజీవితం మీదే ఆధారపడే వుంటుందని నీ భావమా ?''

''అవును'' అనలేకపోయింది విజయ.

''నీకు తెలీన్దేముంది విజ్జీ! .. ఒకప్పుడు గదిగోడలే ప్రపంచంగా జీవించిన ఆడది ఇపుడు బయటకొచ్చింది. మగవాళ్ళ మధ్య వుంటోంది. అంచేత సహజంగానే ఆమెపై ఎన్నో ఒత్తిడులూ, బలహీనతలూ, బలవంతాలూ, వంచించడాలూ, మోసపోడాలూ, మాయల్లో పడిపోడాలూ ఆర్థిక, శారీరక అవసరాలూ... వీటిమధ్య నలిగే స్త్రీకి - ఇష్టమున్నా లేకున్నా - పర పురుషునితో సెక్సువల్ కాంటాక్టుకి అవకాశాలు లేకపోలేదు. అవునా ?''

''అవును''

''అవును కదా ! అంచేత సుజాత ఏ పరిస్థితుల్లో అలా ప్రవర్తించిందీ పూర్తిగా మనకి తెలీదు. మనకు తెల్సిన మేరకైనా... సానుభూతితో అర్థం చేసుకోగలిగితే - నీకే కాదు ఎవరికైనా సరే సుజాతపై ఏహ్యాభావం కలుగుతుందని నేననుకోను''

''నిజమే'' అని ఒప్పుకుంది విజయ. ''నేనా దృష్టితో ఆలోచించలేకపోయేను'' అంటూ తనలో ఇంకా మెదుల్తున్న చిన్న అనుమానం కదిపింది.

''మరి ఎందుకలా సుజాత తనకి ఏ అంకుల్‌తో సంబంధంలేదని అడ్డంగా రవితో బొంకింది! అది మోసం కింద రాదా ?''

''వివాహం సామాజిక కట్టుబాటైతే సెక్సు అనేది శారీరక సహజలక్షణం! భర్త వుండి కూడా భర్తలేని స్త్రీలా బతుకుతున్న సుజాతలో సెక్సు ఇన్ ఏడక్క్యుసీ కట్టుబాటుని కాదనేలా చేసింది. అదే సమయంలో సుజాత కట్టుబాటునీ, సామాజిక నీతినీ గౌరవిస్తుండటం చేత... సహజంగానే తను చేస్తున్నది తప్పుగా భావిస్తుంది. చాటుగా రహస్యంగా సాగుతున్నది లీక్ కాగానే భయంతో కంపించిపోయి బొంకి వుండవచ్చు''

ఛాయ అన్నది సమంజసంగానే తోచింది విజయకి.

''అది కాదే విజ్జీ ! అసలు గొడవంతా ఎక్కడొస్తున్నదంటే...మగాడు సాటిస్త్రీని 'నా సొంతం' అనుకోడంలోనే వస్తోంది చిక్కు ! ఒక వస్తువులా ఆడదాన్ని ''నా ఆస్తి '' అని ఎప్పుడనుకున్నాడో అప్పుడే ఆ మగడిలో అహం, అజమాయిషీ, హక్కు, ప్రైత్యం, ద్వేషం, క్రోధం, కసీ, జెలసీ, అనుమానం వగైరాలు అతడిని ఊపిరి సలనీయకుండా చేస్తాయి. సొంత ఆస్తి పునాదులపై లేచిన ఈ సమాజంలో, భార్యభర్తల సంబంధాలు ఇలానే వుంటాయి మరి!'' అంది ఛాయ.

## 40

తను ఏనాడు ఊహించినది ఒకటి జరిగింది. రవికి

అది నిజంగా ఒకప్పుడు – సుజాతతో సంబంధం బాగున్నప్పుడు జరిగితే ఎంతగానో సంతోషించి వుండేవాడు రవి.

అది హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్!

తను పనిచేస్తున్న కంపెనీ బ్రాంచి ఒకటి హైద్రాబాద్‌లో తెరవడంతో ప్రమోషన్ మీద రవిని ట్రాన్సఫర్ చేస్తూ ఆఫీస్ ఆర్డరు!

అదీ ఇమీడియట్ ఎఫెక్టు! వెంటనే జాయిన్ కావాలి !

ఆ సంగతి విని –

కంగ్రాచ్యులేషన్సు చెప్పేరు, ఛాయా, విజయలు!

అంతవరకూ బాగానే వుంది. కాని ఆ మిత్రురాళ్ళు ఇద్దరూ... అది సమయంగా భావించి... ఒకడుగు ముందుకు వెళ్ళేరు. సుజాత విషయం ప్రస్తావించేరు.

''అయిందేదో అయింది! ఇద్దరి ఉద్యోగాలు ఇక ఒకే దగ్గర గనుక ఇకమీదట ఏ ప్రాబ్లెమ్ లేకపోవచ్చు....అంతే, జరిగిందంతా మరిచిపోయి, నీవు సుజాత కలిసి వుండడం బావుంటుంది.'' అన్నారు.

''అది ఇంపాజిబుల్'' అన్నాడు రవి.

అయితే ఆ మాట నింపాదిగా... గుండెలోంచి కాకుండా... గొంతుకలోంచి

వచ్చినట్టుగా... ఆ స్త్రీలకి అనిపించి ధైర్యంతో రవికి నచ్చజెప్పే యత్నం చేసారు.

''మీరెన్ని చెప్పండి. మేం కలిసి వుండడం అయేపనికాదు... అసలునేను విడాకుల కోసం కోర్టుకెళితే బాగుంటుందనే ఆలోచనలో కూడా వున్నాను''

''అలాంటి ఆలోచన పెట్టుకోవద్దు'' అంది విజయ.

''కోర్టుకెందుకు రవీ!... కోర్టు నీదే న్యాయమని ఎలా చెబుతుందను కుంటున్నావ్?'' అంది ఛాయ.

''వ్యభిచారం ఇండియన్ పీనల్ కోడ్ కింద శిక్షార్హమైన నేరం! నేరం చేసిన ఆమెను శిక్షించి నాకు ఆమెనుంచి విముక్తి ప్రసాదిస్తుంది కోర్టు''

''ఇంతవరకూ నీవు ఆమెను ఏడిపించిన శిక్షచాలదనా . చాల్లే వూరుకో'' అంది విజయ.

''వ్యభిచారం ఏవిటి రవీ! నీకామాటకి అర్థం తెల్సా!.. సరే! నీ ఉద్దేశంలో సుజాత చేస్తున్నది వ్యభిచారం! ఆ విషయాన్ని నీవు కోర్టులో రుజావు చేయగలవా ?'' అంది ఛాయ

'' నేను ప్రత్యక్ష్యంగా చూసేను! అంతకన్నా రుజావేంటి?''

''ఏవిఁటి చూసేవు ? ఎవరో ఆగంతకుడు వచ్చి బలవంతంగా ముద్దు పెట్టి వెళిపోడం చూసేవు... అది వ్యభిచారం అని అభియోగం మోపడానికి ఆకారణం సరిపోతుందా ? నీ వాదన రైటని చెప్పడానికి అనుకూలంగా సాక్షులను తేగలవా ?... నీ చిన్న కొడుకు సురేష్ తప్ప సాక్షు లెవరున్నారు ?'' అని ఒకదానిమీదొకటి అడిగేసింది ఛాయ.

''నీవే ప్లీడరు లాగున్నావు'' అన్నాడు నవ్వుతూ రవి.

''ప్లీడరు సహవాసం'' అంది విజయ.

''సరే ! సుజాత వ్యభిచరిస్తుందని కోర్టుకెళతావు. బాగానే వుంది. అయితే అది నీ సమ్మతం, నీ ప్రమేయం లేకుండా ఆ సంబంధానికి పాల్పడిందని నీవు నిరూపించుకోగలవా ?''

''ఇది మరీ బాగుంది! నా సమ్మతం, ప్రమేయం వుండటం ఏవిఁటి ? అయినా పెళ్ళాన్ని మొగుడు వ్యభిచారంలోకి దింపడమేవిఁటి నాన్సెన్స్''

''అలాగనకు ! ఎంత మంది తమ పెళ్ళాల్ని స్వప్రయోజనాల కోసం వ్యభిచారంలోకి దింపిన వాళ్ళు లేరు ?''అంది విజ.

''అయితే నేను అలాంటి వాణ్ని అంటారా మీరు ?''

''అయ్యో ! మేం అనడం కాదు రవీ! నీవు అలాంటివాడివి కాదని కోర్టులో రుజావు చేస్కోవాలి. ఆ 'సంబంధానికి' నీవు కారకుడవని రుజావైతే ఆమెది తప్పుకాదని కేసు కొట్టివేస్తుంది కోర్టు!''

'' నేను కారకుడవటం ఏవిఁటి ?''

''భార్యని నీతో కలిసి కాపురం చేయనీయకుండా... ఆమె కలిసి వుందామని ఎంత మొత్తుకొని గోల పెడుతున్నా ఆమె మాట వినిపించుకోకుండా, ఆమె బాధ అర్థం

చేసుకోకుండా... ఆమె ఒక్కర్తినే అలా అక్కడ హైద్రాబాద్‌లో సంవత్సరాల తరబడి వుంచేసి అందుకు అవకాశం కల్పించేవు. చాలు ఆ కారణం!'' అంది ఛాయ.

రవి ఖంగుతిన్నాడు ! తెల్లబోయి ఆమె వేపు చూసేడు.

''నీతి, న్యాయం వున్న కోర్టు అయితే .. నీవు చివరికి సుప్రీంకోర్టు కెళ్ళినా ... సుజాతది తప్పుకాదనే తీర్పునిస్తుంది. సెక్సుని హ్యూమన్‌నీడ్‌గా గుర్తించే కోర్టు సుజాతది తప్పుకాదనే భావిస్తుంది .. నాకీ సందర్భంగా ఒకటి గుర్తుకొస్తోంది. . నేను ఈ మధ్యనే...సెక్సు సంబంధాలపై సుప్రీంకోర్టు తీర్పొకటి పేపర్లో చూసేను'' అందులో విషయం చెప్పిం ఛాయ–

''లైంగిక తృప్తి వివాహ వ్యవస్థకు పునాది వంటిది. లైంగిక తృప్తి ప్రభావం స్త్రీ శరీరం మీద మనసు మీద చాలా వుంటుంది. సెక్స్ సంబందాలు సక్రమంగా వుంటే స్త్రీ మేధస్సు వికసిస్తుంది. జవసత్వాలు పెంపొందుతాయి

సెక్సు కొరవడితే నిస్పృహ తప్పదు వివాహానికి ఇంత కన్నా అఘాతం మరొకటి ఉండదు'' అని సుప్రీంకోర్టు తీర్పు న్యాయమూర్తి ఒక కేసులో నపుంసకుడైన భర్తనుంచి భార్యకి విడాకులే కాకుండా, భరణం కూడా ఇప్పించేడు. వివాహం చేసుకున్నంత మాత్రాన సరిపోతుందా ?.. తన శారీరక అవసరం తీర్చలేని భర్తను ఏ ఒక్కరూ సమర్థించరు రవీ ! ... తప్పు ఆమె చేసిందని నిందించేకన్నా ... అందుకు మన మెంతవరకూ బాధ్యులమని ఆలోచించాలి'' అంది ఛాయ.

రవి చాలాసేపు మాటాడకుండా అలా వుండిపోయేడు నేల చూపులు చూస్తు.

రెండు నిమిషాల నిశ్శబ్దం తర్వాత

''నీ వొక్కడివే అని కాదు గాని రవీ... చాలా మంది స్త్రీ శీలంకి సంబంధించి చాలా సంకుచితంగా, సంస్కారహీనంగా ఆలోచిస్తారు... నేను ఒకటి అంటున్నానని బాధపడుకు... నీకు పనిమనిషి లక్ష్మితో కాంటాక్టు వుంది. అవునా !'' అనడిగింది ఛాయ.

ఒకసారి ఛాయ రవి ఇంటికి వెళ్ళినపుడు – లక్ష్మితో రవిని చూడ్డం తటస్థించింది. తను చూసిందనే విషయ రవికి తెల్సు!

అంచేత వున్న విషయం ఒప్పుకోక ఏం చేస్తాడు?

రవికి పనిమనిషి లక్ష్మితో కాంటాక్టు వుందనే సంగతి అంతవరకూ తన ఊహకు తట్టని విజయ... ఆశ్చర్యపోయింది. ! ఛీ ఛీ ! రవికూడా ఇంతేనా ! ఏం మగాళ్ళు!

భరించలేక విజయ ఒకమాట అనేసింది. ''ఈ సంగతి దాని మావఁకి తెలిస్తే... ఇద్దర్నీ నరికి పోగులెట్టేస్తాడు.. సందేహం లేదు''

రవి ఒక క్షణం పాటు కంపించిపోయేడు.

మరుక్షణం రవి నవ్వు తెచ్చుకుంటూ ''విజయకి నాపై అంత కోపం వుందన్నమాట ! '' అన్నాడు.

''నా కెందుకు కోపం!'' అంది విజయ కోపాన్ని అణచుకో యత్నిస్తూ.

''విజయ అన్నదాంట్లో నిజం లేదంటావా రవీ! అలాంటి హత్యాకాండ మనం తరచూ పేపర్లో చూస్తున్నాం కదా'' అంది ఛాయ.

''నిజమే. నేను కాదనడంలేదు. . అలాగైతే నేనూ సుజాతని నరికిపోగులెట్టాలి కదా '' అన్నాడు రవి చిన్నగా నవ్వుతూనే!

''నీవు సుజాతను ఆ క్షణంలో నరికిపోగులెట్టలేదంటే... అది నీ మంచితనం, మెతకతనం అని నేననుకోను.

నీకు శీలంపై ఆ పెళ్ళాన్ని చంపే హంతకులకున్నంత బలమైన విశ్వాసం నీకు లేకపోయివుండాలి.

లేదా ఆమె తెచ్చే జీతం ఆశించి .. నీతిని తొక్కేసే యత్నం చేసి... ఈ రోజుల్లో 'శీలం' దేముంది ? అనే ఆత్మవంచన చేసుకొనైనా వుండాలి ?

సుజాత శీలం కోల్పోయిందని... అప్పటికే నీవు మెంటల్‌గా భరించేశక్తికి చేరుకోవడం చేత... ఆ రోజు నీకు హత్యకు కావల్సిన ఎమోషన్ కలగకపోయి ఉండాలి...

అయినా, మన తరగతికి చెందిన మగవాడు.. లోయర్ క్లాస్ వాళ్ళలా పెళ్లాలని చంపేటంత హంతకులుకాలేరు. శాసాడిస్టులవగలరు.

నీవు శాడిస్టువి! నీవు పిల్లలని కిడ్నాప్ చేయడం, చేసి ఇంకెన్నో విధాలుగా ఆమెను తిట్టి, కొట్టి ఏడిపించటం అవి శాడిస్టిక్ అట్రాసిటీస్ తప్ప ఇంకోటి, ఇంకోటి కాదు.

నన్నడిగితే పెళ్ళాలని అనుక్షణం చంపేనీలాంటి, చెలంలాంటి సాడిస్టులకన్నా... ఒక్కసారిగా పొడిచి చంపే హంతకులే నయం'' అని రవిని కడిగేద్దామన్నంత ఆవేశం వచ్చింది విజయకి. అయితే అతన్ని రెచ్చగొట్టినట్టవుతుందని తమాయించుకుంది.

రవికి ఎలాగోలా నచ్చజెప్పి ఒకదారికి తీసుకువచ్చే ఛాయ ప్రయత్నానికి అవరోధం కలుగుతుందని వూరుకుంది విజయ్.

'' ఈరోజు వీళ్ళిద్దరికీ నేనిలా దొరికిపోయానేవిట్రా బాబు'' అని అనుకోలేదు రవి. వాళ్ళు అనే మాటలకి బిగుసుకుపోడంలేదు. చిరాకు చెందడంలేదు. ఆ మాటకొస్తే ఆ ఇద్దరి స్త్రీల మాటల్లో... ముఖ్యంగా ఛాయ మాటల్లో అతనికి కొన్ని జీవిత సత్యాలు అర్థమవుతున్నట్టుగా తోచింది.

తను ఎంతో నమ్ముతున్నట్టి, గౌరవిస్తున్నట్టి శీలం, నీతుల గురించి ఛాయ అన్నమాటలు అతన్ని ఆలోచింపచేసాయి.

''నీతి అనేమాటకి అర్థంలేదు రవీ!'' అంది ఛాయ. ''ఒక్కప్పుడు మగవాడు ఉద్యోగం చేస్తున్న ఆడదాన్ని వివాహం చేసుకోడానికి వెనుకంజ వేసేవాడు. ఇపుడు ఈ రోజుల్లో మగవాడు వివాహానికి ఉద్యోగం చేస్తున్న స్త్రీలకే ఫస్టు ప్రిఫరెన్సు ఇస్తున్నాడు. ఎంచేతంటావు! ఇంకాస్త వెనక్కివెళితే ఆడది పుష్పవతికాక ముందే .... మగాడికి పెళ్ళి అయిపోవాలి. అది అప్పుడు నీతి! అంచేత ఏవిటంటే–

నీతి అనేది మారుతున్న సమాజానికనుగుణంగా ఎప్పటికప్పుడు మారిపోతుంది.

ఇంతకీ నేను అనేదేవిఁటంటే –

నీవు సుజాతకి విడాకులు ఇచ్చి హైదరాబాద్‌లో రెండో ఇల్లు వేరుగా నీవు చూస్కోవలసిన పరిస్థితులు ఏం లేవనే నేను భావిస్తున్నాను.

నీవు సుజాత లేకే కదా... పనిపిల్ల లక్ష్మికానియ్, మరెవరు కానియ్!... వ్యవహారం నడుపుతున్నావు! అక్కడ సుజాత అంతే కదా ! సుజాత నీలా హ్యూమన్ బీయింగ్ – అని మర్చిపోకు.

ఇందులో నీతప్పుగాని, సుజాత తప్పుగాని ఏమాత్రంలేవు రవీ! భార్యను భార్యగాను, భర్తను భర్తగానూ బతకనివ్వని సమాజమిది. దైనందిక జీవితంలో ఏ ఒక్కరినీ సుఖపడనీయదది! సంతృప్తి, సుఖ సంతోషాలు కలగనీయదు. మానసిక జాడ్యానికీ, దిగులుకీ, బాధకీ గురి చేస్తూ వుంటుంది.. నీవిది గుర్తిస్తే ఈ సమస్యను అంత సీరియస్‌గాతీసుకోవు.

మీ ఇద్దరూ కలసి మళ్ళీ సంసారం సాగించే అవకాశం వచ్చింది గనుకనే ఇంతగా చెబుతున్నాను. బాగా ఆలోచించు'' అని ఎంతగానో నచ్చజెప్పే ప్రయత్నం చేసింది ఛాయ.

ఛాయతోబాటు విజయకూడా!

ఆ రాత్రంతా రవికి నిద్రపట్టలేదు.

ఛాయ అన్నమాటలు అతనికి జ్ఞానోదయం కలిగించాయనీ, కళ్ళు తెరిపించాయనీ కాదుకాని ఆమె మాటలు అతనిపై బాగా పని చేసాయి. మనిషిని అతలా కుతలం చేసాయి.

ఇన్నాళ్ళుగా సుజాతని స్వీకరించాలో, విడిచి పెట్టాలో తనకే తెలీని అయోమయస్థితి! ఇపుడతను ఒక నిర్ణయానికి రాకతప్పదు.... తీసుకున్న నిర్ణయం తప్పయినా రయిటయినా!

అస్థిమితంగా మంచంపై అటూ, ఇటూ పొర్లుతున్న రవికి... ఎదురుగా లక్ష్మి!

అతనలా చూస్తుండగానే... ఆమె తన జాకెట్‌ని విడిచింది.. చీరను విప్పింది.

నగ్నంగా అతన్ని చేరింది.

అతని పక్కలో పడుకుంది.

అయితే –

అతనిలో వుద్రేకంలేదు.

ఎలాంటి స్పందనా లేదు.

సరిగ్గా ఈ సమయంలో... విజయ అన్నట్టు లక్ష్మి మావ వచ్చి తనవి నరికి పోగులెట్టేస్తే బాగుణ్ణు అనిపించింది. అంతేకాదు–

అక్కడ... ఎవరి పక్కనో ఇలా నగ్నంగా సుజాత...

కళ్ళకు కట్టినట్టు కనిపించి – గభాల్న మంచంపై నుంచి లేచేడు.

లక్ష్మి నివ్వెరపోయింది!

ఆమెపై బట్టలు విసిరి... వెంటనే బయటకు వెళ్ళిపోమని ఆదేశించేడు.

తర్వాత – అక్కడ నుంచి లక్ష్మి వెళ్ళిపోవడం కూడా చూడలేదు. బీరువాలో బాటిల్ తీసి గ్లాసునిండా ఒంపుకున్నాడు

సిగరెట్ అందుకున్నాడు. సిగరెట్ మీద సిగరెట్!

టేబుల్ ముందు కూర్చొని లెటర్‌పాడ్ తీసేడు. కలం తీసేడు.

ఏదో వ్రాద్దామని తీసేడు గాని. ... ఏమి వ్రాయాలో తోచదాయె!

మందు తాగడం, సిగరెట్ వెలగడం కనిపిస్తోంది గాని, కలం నడవదాయె?

ఏదో వ్రాయడం... వ్రాసి మధ్యలోనే ఆ కాగితాన్ని ఫర్‌మని చింపి నలిపి పారేయడం!

నలిపి పారేసిన పది, పన్నెండు కాగితాలు గదిలో చిందరవందరగా పేరుకున్నాయి

చివరికి ఒక గ్లాసు ముగించి, సిగరెట్ దమ్ము ఒకటి లాగి ధృఢమైన, స్థిరమైన నిశ్చయంతో ఆత్మ విశ్వాసంతో వ్రాయడం సాగించేడు.

డియర్ సుజాతా !

ఈ పిలుపూ, ఈ ఉత్తరం నీకు ఆశ్చర్యం కలిగిస్తున్నాయికదూ ! నిన్ను చేరిన ఈ ఉత్తరం మళ్ళీ మనిద్దరినీ ఒకటిగా చేరుస్తుందనీ, నా బతుకు పండిస్తుందనీ ఆశతో ఈ ఉత్తరం.

నా ఉత్తరం నీ చేతిలో వున్నట్టే నా భవిష్యత్తు ... కాదు మన భవిష్యత్తు... నీ చేతుల్లో వుంది.

నీవు తీసుకునే నిర్ణయం మీద ఆధారపడి వుంది.

నీవు నా జీవితంలోకి... మంగళ వాయిద్యాల మధ్య ప్రవేశించిన కానించి నా దగ్గరే వుండాలని కోరుకున్నావు. వుద్యోగం వదిలి వైజాగ్ రావడానిక్కూడా సిద్ధపడ్డావు. కాని నిన్ను అర్థం చేసుకోకుండా ఒక అయోమయంలో, ఒక అర్థం కాని స్థితిలో నిన్ను అక్కడ అలానే దూరం వుంచాను. అయితే ఆ గేప్... కొన్ని విషమ పరిస్థితులను సృష్టించి మనిద్దరి మధ్య మరింత గేప్‌ని పెంచింది.

ఏ విధంగా చూసినా ఆ గేప్‌కీ, ఆ విషమ పరిస్థితులకీ కారణం నేనే తప్ప నీవు కాదు. అవును సుజాత, నీవు కానే కాదు!

ఇక ఎలాంటి గేప్‌కి అవకాశం లేని విధంగా నీకు అతి చేరువగా, నాలో నీవుగా, నీలో నేనుగా ఐక్యమై జీవనరాగం ఆలపించేటందుకు ఒక మంచి అవకాశం నాకు లభించింది. నీవు వైజాగు రావల్సిన పనిలేకుండా నేనే నీ ముందుకు వాలబోతున్నాను! నేను భాగ్యనగరం వచ్చేది ఒకరోజా, రెండ్రోజులు కాదు. జీవితాంతం ?

అవును సుజాతా ! నేను ట్రాన్సఫర్ మీద అక్కడికి వస్తున్నాను.

ట్రాన్సఫర్ మనిద్దరినీ ఏకం చేయడానికే వచ్చిందంటున్నారు మన మిత్రులు ఛాయ, విజయలు! నేను అలానే అనుకుంటున్నాను. మరినీవు ?

''నీవు చేసిన తప్పులు నేను క్షమించేస్తున్నాను'' అని నేను అనను ఏమంటే నీవేం తప్పు చేయలేదు గనుక! నీవు చేసింది తప్పని నేను అనుకోడం లేదు గనక!

ఒక వేళ సంఘం నీది తప్పని నిన్ను దోషిగా నిలబెడితే ఆ దోషిగా నిబలబైడితే ఆ దోషం నాది. ఆ తప్పుకి బాధ్యత వహించాల్సింది నేను! ఆ సంఘానికి క్షమాపణలు అడగవల్సింది నేను !

కాని సుజాతా ! . నీవు నన్ను తప్పక క్షమించాలి. పిల్లల్ని కిడ్నాప్ చేసి, నిన్ను అమితంగా దుఃఖపెట్టి .. ఎంతగానే హింసించేను . ఈ దుర్మార్గుడ్ని క్షమించగలవా సుజాతా !

నేను చేసింది క్షమించరాని తప్పయితే క్షమించకు. దండించు ! శిక్షించు! ఏ శిక్ష విధిస్తావో విధించు!

కాని, నీవు లేనిదే నా బతుకులేదని.. నీవు కాదంటే బతికేది కూడా లేదని ఇందుమూలంగా తెలియజేస్తున్నాను.

గతాన్ని పీడకలగా మర్చిపోయి, ఎలాంటి మచ్చలేని... నూతన జీవితాన్ని నీతో పంచుకోడానికి నీవు నాకు అవకాశం ఇస్తావని ఆశిస్తున్నాను.

ఈ నెల 24 వ తారీఖున గోదావరిలో బయల్దేరుతున్నాను. ఆ మరసటి రోజా ఉదయం నీవు సికింద్రాబాద్ స్టేషనుకి రావాలి.

నీవు వస్తే అది గ్రీన్ సిగ్నల్ నాకు.

నన్ను మన్నించి, నాతో నూతన జీవితం సాగించడానికి అంగీకరించేవనడానికి సూచన.

నీవు స్టేషనుకి రాకుంటే అనంగీకారంగా భావిస్తాను.

అయితే నా సుజాత... తప్పక స్టేషనుకి వస్తుందని... నన్ను రిసీవ్ చేసుకుంటుందని నాకు నమ్మకం వుంది. నా బతుకు పంట పండిస్తుందని నమ్మకముంది.

ఆ నమ్మకంతో –

ఆ సుదినం... ఆ సుందర ఉదయం... మెరిసే నీళ్ళ కోసం... నవ్వే నీ పెదాలకోసం... ఆహ్వానించే నీ చేతులకోసం... ప్రేమగా, ఎదురుచూస్తూ –

నీ రవీ

## 41

మనిషి సామాజిక జీవి అయితే కుటుంబం అనేది ఆ సమాజంలో చిన్న విభాగం!

సమాజం దరిద్రంగా ఏడుస్తున్నపుడు –

దరిద్రపు సమాజంలో కుటుంబాలు కూడా అంతే దరిద్రంగా ఏడుస్తాయి మరి!

చాలావరకూ కుటుంబంలో సభ్యుల జీవితాలు 'డబ్బు'తో ముడి పడి వుండగా ఆ సమాజపు ఆర్థిక సంబంధాల వల్లగాని, కుటుంబ సంబంధాలవల్లగాని, మనిషికి మనశ్శాంతి, తృప్తి ఏమాత్రం లేకుండాపోతోంది – అనిపించింది విజయకి ఛాయ జీవితం చూసి.

ఛాయ ఇల్లు వదిలి బయట ఎక్కడోవున్నా... ఆమెపై ఆర్థిక వత్తిడి అలానే వుంది.

మొదటినెల ఒక్కసారే.... రవి చేత జీతం పంపించింది ఇంటికి తను. ఆ మరుచటి నెల

నుంచి ఆ కుటుంబసభ్యులే రావడం మొదలెట్టేరు.

నెలనెలా జీతాలకి ఠంచనుగా రావడమేకాదు మధ్య, మధ్య ఆ అవసరం ఈ అవసరం అంటూ రావడం మొదలెట్టేరు. అడిగినది ఇవ్వకపోతే.. ముఖం మాడ్చుకోడం!

మళ్ళీ మామూలే!

అక్కడున్నా ఆమెకి తప్పలేదు.

ఇక్కడున్నా ఆమెకి తప్పలేదు.

ఆ కుటుంబానికి రక్తంలో రక్తమైన ఛాయతో సంబంధం కేవలం డబ్బుల్తోనే అయినప్పటికీ తల్లి తల్లే కదా !

ఛాయ ఆస్పత్రిలో ఉందనగానే తల్లి సీతమ్మ పరుగున వెళ్ల కుండా వుండలేకపోయింది.

ఛాయకి పురిటి నొప్పులు!

ఛాయ తన తల్లిని పిలవమని చెప్పలేదు విజయకి.

సీతమ్మకి తెలియజేయడం ధర్మంగా భావించింది విజయ. అయితే 'మీరు రావాలి' అనలేదు. సమాచారం మాత్రమే తెలిపింది.

అమెరికన్ ఆస్పత్రిలో అన్ని సౌకర్యాలు వున్న గది అది !

మంచి లేడీ స్పెషలిస్టుని ఎరేంజ్ చేసింది విజయ.

ఆస్పత్రికి వచ్చిన సీతమ్మ... కూతుర్ని వదలలేదు. ఇంటికి వెళ్లకుండా ఛాయ దగ్గరే వుండిపోయింది.

కూతురు చచ్చిపోయేటట్టు వేస్తోంది పురిటికేకలు.

సీతమ్మ ఛాయకి ధైర్యం చెబుతోంది. వెన్నురాసి... కాళ్ళు పట్టి ఎంతగానో సపర్యలు చేస్తోంది సీతమ్మ.

ముదిరిన వయసు కావడం చేతో, మరెంచేతో... ఛాయ డెలివరీ కష్టమయింది.

ఒక గంటలో పురుడైపోవచ్చు... అనే డాక్టరు అంచనాలను తారుమారు చేసి... గంటలకొలదీ మెలికలు తిరిగిపోయి... విపరీతమైన కేకలు వేయసాగింది ఛాయ.

రవి అక్కడే వరండాలో వుండి, ఏది కావాలంటే అది... స్కూటర్‌పై పరుగున రోడ్డుకి వెళ్ళి... సమయానికి అందిస్తున్నాడు.

రవి భోజనానికి కూడా వెళ్ళకుండా అక్కడే వున్నాడు.

అతనిలో విపరీతమైన టెన్షన్. సొంత చెల్లి ఆపదలో వున్నట్టు ఆందోళన!

గంటా గంటా గడిచి... పన్నెండు గంటలైనా... ఛాయకి పురుడు రాకపోవడంతో –

విజయకి వణుకు పట్టుకుంది. చాలా భయపడిపోయింది

సీతమ్మయితే ధారాపాతంగా కన్నీళ్ళు పెట్టుకుంది.

బిడ్డ ప్రాణం దక్కకపోయినా తల్లిప్రాణం దక్కించమని డాక్టర్ని ప్రార్థించింది.

ఇక ఆపరేషన్ చేసి.. తల్లి నుంచి బిడ్డని తీద్దామని నిర్ణయించుకుని అందుకు ఏర్పాట్లు

ఒక పక్క థియేటర్‌లో చేయిస్తూ ..

చివరిసారిగా.. నాచురల్ డెలివరీ కోసం మరో ప్రయత్నం చేసింది డాక్టరమ్మ. అందుకు సహకరించమంది ఛాయని.

ఛాయ నొప్పిని భరించి పెదవులు బిగబెట్టి. . డాక్టర్‌కి కావాల్సిన రీతిలో సమస్తశక్తినీ కూడగట్టుకుని సహకరించింది –

అంతే !

బంగారంలాంటి బిడ్డను ప్రసవించింది ఛాయ.

తన బంగారాన్ని, ముద్దుల మురిపాన్ని చూసుకోగానే ఛాయకి ఎక్కడలేని శక్తి.. పటాపంచలైన నీరసం, ముఖంలో జీవం. కళ్ళల్లో మెరుపు, మాతృత్వపు గర్వం. ప్రాణానికి ఎక్కడలేని సుఖం. మేఘంలా తేలికైన శరీరం. పురివిప్పిన చైతన్యం బతికేయగలనని ధీమా. బతుకు మీద మరెంతో ఆశ!

తల్లి, పిల్లా క్షేమంగా వుండటంతో ... తృప్తిగా నిట్టూర్చింది విజయ.

తేలికైన హృదయంతో లోనకి వచ్చి... కంగ్రాట్స్ చెప్పేడు రవి.

కృతజ్ఞతా పూర్వకంగా చెమర్చిన కళ్ళతో మిత్రులను చూసింది ఛాయ!

ఛాయ ఆస్పత్రినుంచి డిశ్చార్జి అయినంతవరకూ సీతమ్మ తల్లీ పిల్లలకి ఎనలేని సేవ చేసింది.

''అమ్మా! నీకెందుకమ్మా శ్రమ! విజయ వుంది. రంగం మామ్మ వుంది నాకేం ఫర్వాలేదు. నీవెళ్ళు'' అంది ఛాయ.

''ప్రతి పైసా నీది. ఇందులో నేను చేసిందేవుందమ్మా! రేపు బారసాలనాడు వీశమెత్తు బంగారం పెట్టలేని బతుకునాది'' అని కూతుర్ని వచ్చి పురటాలని – ఇంటికి తీసుకు వెళ్ల లేకపోతున్నందుకు కుమిలిపోయింది సీతమ్మ.

## 42

ఇరవై నాల్గవతేదీ... సాయంత్రం గోదావరి ఎక్స్‌ప్రెస్ రవి భవితవ్యం తేల్చబోతోంది!

స్టేషన్‌కి చాలా మంది స్నేహితులు రవికి వీడ్కోలు చెప్పడానికొచ్చేరు.

లైఫ్ ఎంత బిజీ అయినప్పటికీ... ఎవరెవరికి ఎన్నెన్ని పనులున్నప్పటికీ ... రవి అంటే అభిమానం చేత చాలామంది మిత్రులు, కొలిగ్స్ అందరూ వచ్చేరు.

వచ్చిన వారిలో రాంబాబు వున్నాడు.

విజయ వుంది.

ఛాయరాలేదు. వచ్చేదే! కాని నాలుగైదురోజుల క్రితమే డెలివరీ అయ్యుండటం చేత రాలేని స్థితి! అయితే ఈ రోజు మధ్యాహ్నం లంచ్ ఛాయా, విజయలతోనే తీసుకున్నాడు.

అంతా బాగానే వుంది. అందరూ వచ్చేరు ఒక్క మిత్రుడు తప్ప!

అతను చెలం!

తన బాల్య స్నేహితుడు మొన్నమొన్నటిదాకా ఆప్తమిత్రుడు. ప్రాణమిత్రుడు.

చెలం స్టేషనుకి తప్పక వస్తానన్నాడు గాని వస్తాడని తనకు నమ్మకం లేదు.

చెలంని తలుచుకుంటేనే బాధగా వుంది రవికి

తన హైద్రాబాద్ ప్రయాణం చెలంకి చెప్పడానికి... గతమూడు, నాలుగురోజులుగా ... చెలం ఇంటికి ఎన్నోసార్లు తిరిగేడు. మనిషి జాడలేదు. డ్యూటీలో కలుద్దామంటే డ్యూటీకి రావడంలేదు... చివరికి కనకరాజు ఇంటికీ, క్లబ్‌కీ కూడా వెళ్ళేడు. దొరకలేదు మనిషి.

చివరికి ఈ రోజు ఉదయం అదొక పనిగా పెట్టుకొని... చెలం ఇంటికి వెళ్ళేడు.

అదృష్టం! దొరికేడు.

పరగడుపునే...చెలం చేతిలో విస్కీ గ్లాసు చూసి ఆశ్చర్యపోయేడు రవి.

''అదేవిఁట్రా ?'' అంటే

''అదంతే!'' అన్నాడు చెలం. మాట ముద్దగా వస్తోంది.

''నీతో మాట్లాడే శక్తి కావాలంటే ...మరో గ్లాసు'' అని మళ్ళీ పోసుకున్నాడు విస్కీ. తననీ తీస్కోమన్నాడు. వద్దన్నాడు రవి.

మూడు, నాలుగు రోజులుగా... తన కోసం ఎంతగా తిరిగంది చెబితే 'సారీరా' అన్నాడు చెలం.

తనకి లక్షల లక్షల లాభం తెస్తుందనుకున్న ల్యాండ్ బిజినెస్... ఎన్ని గొడవల్లో చిక్కుకున్నదీ చెప్పేడు. ఆ గొడవలమీదే రాత్రనకా, పగలనకా తిరుగుతున్నానని చెప్పేడు.

రవి ట్రాన్స్‌ఫర్ గురించి చెప్పేడు. అందుకు చెలం పెద్దగా రియాక్ట్ కాలేదు.

''ఆహా!'' అని ... మరునిమిషంలోనే తన గోడులోకి వెళిపోయేడు.

'విజయ చూసేవా! సందీప్ కోసం నన్ను కోర్టుకి లాగుతోంది' అని విజయ విశేషాలు కూడా మాటడలేదు.

ఆ ఉదయం చెలం తనతో మాట్లాడింది ఒక అరగంట. అందులో ఇర్వై తొమ్మిది నిమిషాలు తన గురించే. ఆ బిజినెస్ గొడవ గురించే!

ట్రాన్స్‌ఫర్ వివరాలు గాని, సుజాత సంగతి గాని తను ఎత్తనూ లేదు. రవి చెప్పడానికి అవకాశం ఇవ్వనూలేదు.

ఒరే మిత్రమా! ఎలాంటివాడివి ఎలా అయిపోయేవురా ? అనుకున్నాడు రవి.

ఈ స్టేజిలో... ఒరే చెలం నీవు సంపాదించింది చాలు. ఇక బిజినెస్ ఆలోచనలు మానుకో అని నచ్చచెబితే వినే దశలోలేడు. తాగుడు కన్నా హీనంగా ... బిజినెస్‌కి ఎడిక్ట్ అయిపోయేడు.

సంపాదనలోపడి చెలం సాధించిందేవిఁటి ?

వంటరివాడయ్యేడు. ఒకప్పుడు ప్రోగ్రసివ్‌గా వుండే మనిషి... ఏ మాత్రం మనిషికాకుండా అయిపోయేడు. అతని బతుకు శూన్యంగా మారింది.

బిజినెస్‌లో పడ్డాక చెలంలో టెన్షన్, ఆరాటం, ఆశ తప్ప అతనిలో వుత్సాహం , శాంతి

ఏనాడూ చూసినట్టు గుర్తులేదు
అందులో పడి . . స్నేహమే కాదు... ప్రాణ ప్రదమైన భార్యని గూడా పోగొట్టుకున్న చెలాన్ని చూస్తుంటే రవి గుండెలు బరువయ్యేయి.

బిజినెస్ గొడవ గురించి . ఉద్రేకంగా ఊగిపోతూ తనని తాను మర్చిపోయి... అరుస్తున్నట్టుగా మాటాడుతుంటే – భయపడ్డాడు రవి!

వస్తానంటూ బయల్దేరుతూ 'గొడవలు పడొద్దు జాగర్త' అని చెలాన్ని హెచ్చరించేడు.

''ఎలాగైనా సరే... నిన్ను సాయంత్రం స్టేషన్‌లో కలుస్తాను'' అన్నాడు చెలం.

చివరిసారిగా చెలంను గట్టిగా కౌగలించుకుని – కళ్ళు నీళ్ళు చిప్పిల్లగా గబగబా బయటకి వచ్చేశాడు.

స్కూటర్ తీయబోయేడు రవి.

తాళం చెవి గదిలో మర్చిపోయిన సంగతి గుర్తుకొచ్చింది. తాళం కోసం వెనుతిరిగబోయి.. ఎవరో ఆపినట్టు ఆగిపోయేడు రవి.

ఆ స్కూటర్ తనకి ఎలా వచ్చింది ?

తన కాయ కష్టంతో కొంటే వచ్చిందా ?

కాదు. తనకు చెలం ఇచ్చినది ! తను లాండ్ బిజినెస్.. ముప్పయి ప్లాట్లు అమ్మి పెట్టిన బ్రోకర్ పనికి ... చెలం కమీషన్‌గా ఇచ్చేడు స్కూటర్.

అది తల్చుకుంటే తన్పై తనకే అసహ్యం వేసింది రవికి!

ఓ మూడు నిమిషాలపాటు అలా నించుండిపోయేడు రవి!

తర్వాత–

తను స్కూటర్ 'కీ' కోసం చెలం గదివేపు వెళ్ళలేదు.

స్కూటర్‌ని అక్కడే విడిచిపెట్టి... గబగబా బయటకి నడుచుకు వెళిపోయేడు రవి!

గోదవరి కదిలే టైము అవుతున్నా... మిత్రుడు చెలం వచ్చే జాడ లేదు. వస్తాడన్న నమ్మకమూ లేదు రవికి.

గార్డు పచ్చజెండా వూపేడు.

అందరూ విష్‌చేస్తూ షేక్‌హాండ్ ఇచ్చేరు.

''మరో ప్రమోషన్‌తో తిరిగి వైజాగ్ రావా'' అన్నాడు రాంబాబు.

''విష్‌యూ హేపీ స్వీట్ హోమ్'' అంటూ ''బెస్టాఫ్‌లక్'' అని చేతులు జోడించింది విజయ.

విజయ కళ్ళల్లో నీళ్ళు!

థాంక్యూ అనడానికి రవి నోరు పెగల్లేదు ఎవరో గొంతు నొక్కేసినట్టు.

రైలు కదుల్తుంటే రవి గుండె బరువయింది.

వైజాగ్‌ని వదిలి తన మిత్రులకు దూరంగా వెళిపోతుంటే – తన గుండెలమీంచే రైలు

చక్రాలు పరిగెడుతున్నట్టు అనిపించింది రవికి !

ఆ రాత్రి నిద్రపోయేవరకూ.. వైజాగ్ స్మృతులు వెంటాడేయి.

చెలం, విజయ, ఛాయ, రాంబాబు తెరలు తెరలుగా సాక్షాత్కరించి మాయమయ్యేరు.

నిద్రపోయేడు రవి!

విజయ 'బెస్టాఫ్‌లక్' అనే మాటలు తట్టిలేపేయి.

తెల్లవారింది!

ఇపుడతనికి సుజాత ఒక్కతే కళ్ళెదుట కనిపిస్తోంది.

సికింద్రాబాద్ స్టేషను దగ్గర పడుతున్న కొలదీ రవి గుండెల్లో రైళ్ళు పరిగెత్త సాగేయి.

సుజాత తనను స్వీకరించడానికి తప్పక వస్తుంది. వచ్చి తనకి గ్రీన్ సిగ్నల్ ఇస్తుంది... అనుకున్న రవికి ఏదో శంక!

స్టేషనుకి వస్తుందో, రాదోనని భయం, అనుమానం.

స్టేషనుకి సుజాత రావాలని భగవంతుణ్ని ప్రార్థన.

సుజాతను భౌతికంగా, మానసికంగా అనుమానించి, అవమానించి, పిల్లలని కిడ్నాప్ చేసి హింసించి, కొట్టి, తిట్టి, దుఃఖపెట్టినందుకు తనని క్షమించి వస్తుందా ... లేక వ్యతిరేకంగా నిర్ణయం తీసుకుంటుందా ?

నో!

లేదు. లేదు. సుజాత వస్తుంది. నన్ను కాదని జీవించ లేదు వస్తుంది. నాకోసం వస్తుంది. నన్ను రిసీవ్ చేసుకోడానికి వస్తుంది.

నన్ను క్షమించి తప్పక వస్తుంది –

తనని క్షమించినా, క్షమించకపోయినా పిల్లలకోసమైనా వస్తుంది. సమాజం తండ్రే నేచురల్ గార్డియన్ అంటోంది. గనుక పిల్లలు లేకుండా బతకలేని సుజాత పిల్లల కోసమైనా తనను ఆహ్వానిస్తుంది. ఖచ్చితంగా స్టేషనుకి వస్తుంది.

గోదావరి ఎక్స్‌ప్రెస్ సికింద్రాబాద్ ప్లాట్‌ఫాం మీదకి చేరుతుండగానే... రవి కళ్ళు చురుగ్గా ఆత్రుతగా సుజాతను వెదకసాగేయి.

ప్లాట్‌ఫాంనిండా ... కిక్కిరిసినట్టు ఎంత జనమున్నా సరే... తన సుజాతను గుర్తుపట్టేయగలవు రవికళ్ళు!

## 43

వెన్నెల ఆహ్లాదంగా ఊరంతా పరుచుకున్న వేళ –

తలుపులు తెరుచుకుని... రాంబాబు వెన్నెల రేడులా వచ్చేడు.

నెలవంకలా నిలిచేడు.

లోనకి వచ్చిన రాంబాబుని చూసి... సంభ్రమాశ్చర్యాలతో చకితురాలైంది ఛాయ.

పరమానంద భరితురాలైంది ఛాయ!

ప్రేమలో తప్ప, నీతిలో నమ్మకంలేని ఛాయకి, అతని ప్రేమలో తప్ప ప్రపంచంలో మరెక్కడా, మరెవ్వరిదగ్గరా శాంతి లభించని ఛాయకి ఆమె పురుషుడు, ఆమె ప్రియుడు సాక్షాత్కరించేటప్పటికి ఆమె హృదయం పారవశ్యంతో ఉప్పొంగిపోయింది.

ఆమె గుండెలు గజ్జెలు కట్టి ఘల్లు ఘల్లున... వేయి నెమళ్ళు నృత్యం చేసేయి. మానసవీణ సవరించుకొని సమ్మోహనంగా మధురాతి మధురంగా శతకోటి రాగాలు గానం చేసింది.

రాంబాబు ముఖారవిందాన్ని అలా తనివితీరా చూస్తూ వుండిపోయింది. అలా ఎన్ని యుగాలైనా... చూస్తూ వుండిపోగలదు ఛాయ.

ఆ రోజు - రాంబాబు గొడవపడి వెళ్ళిపోతూ... తీవ్రంగా గుప్పించిన పరుష పదజాలం ఆమెకప్పుడు గుర్తురాలేదు. గర్భనిరోధక మాత్రలంటూ విటమిన్లు ఇచ్చి మోసగించిన విషయం .. అందుకు తనని క్షమించని విషయం... ఆమెకిపుడు స్ఫురణకే రాలేదు.

ఆమె శరీరం అణువణువు రాంబాబే ప్రతిబింబిస్తున్నాడు.

రాంబాబు అడుగులో అడుగు వేసుకుంటూ... ఆమె వద్దకు వచ్చి ''నిన్ను చూడకుండా, నీవు లేకుండా బతకడం నాతరం కాదు ఛాయ! అందుకే వచ్చేసాను'' అన్నప్పుడు అతని కళ్ళు తడిసేయి.

రాంబాబుకి ఛాయ ఇంతకు ముందుకన్నా ఎంతో అందంగా కనిపించింది.

తనదంటూ ఒక జీవితం ఏర్పర్చుకున్న ఆమె వ్యక్తిత్వం... అతనికి హిమాలయ శిఖరమంత ఉన్నతంగా కనిపించింది. ఛాయని చూస్తుంటే అబ్బురంగా వుంది. ఎవరో కొత్త స్త్రీని చూస్తున్నట్టుగా వుంది.

ఛాయ పరిస్థితీ ... అందుకు అనుగుణంగా ఛాయ మలుచుకున్న జీవన విధానం - అతను అర్థం చేసుకోగలిగేడు. ఒక స్టేజిలో ... నీతి బంధానికి ఆమె ఎప్పుడైతే తిలోదకాలిచ్చిందో ఆ క్షణం నుంచీ ఆమెలో వున్న సహజ గుణాలను విప్లవ రీతిలో పెంపొందించుకోవడం అతను చూడగలిగేడు. ఇంత విలక్షణమైన స్త్రీ, ఇంత ఆత్మాభిమానం గల స్త్రీ, ఇంత ఆత్మ విశ్వాసం గల స్త్రీ... తనెక్కడా చూసి వుండలేదు. ఆమె ప్రేమను సంపాదించిన తను .... అర్థాంతరంగా ఆమెను వదులుకోడం మూర్ఖంగా దురదృష్టకరంగా భావించేడు. కొన్ని నెలల ఎడబాటులో యుగయుగాల వేదన అనుభవించేడు.

స్వేచ్ఛ ఆమె ఊపిరి! ఆమె స్వేచ్ఛకి అడ్డురాని రీతిలో మళ్ళీ ఆమె జీవితంలోకి ప్రవేశించేడు రాంబాబు. అందుకే -

ఆమె బిడ్డను చూపించి ''ఎలా వుంది నా చైల్డ్'' అంటే 'నా' ఏవిఁటి, మన బిడ్డ అంటే ఏం పోయింది - అని అనుకోలేదు రాంబాబు! బాధపడలేదు రాంబాబు!

ఆ బిడ్డకి తను తండ్రి అవుదామని రాలేదు. అలాంటి ఆలోచన తనిక చేయడు కాక చేయడు.

తను వచ్చింది బిడ్డకోసం కాదు.... అతని ప్రేయసిని విడవలేక వచ్చేడు. తను ఆ బిడ్డకి తండ్రి కాదు. ఛాయ ప్రియుడు మాత్రమే ! పుట్టిన బిడ్డ ఆడపిల్లా, మగపిల్లా అనడగలేదు. 'ఆడయినా, మగయినా నా బిడ్డే! ఆ తేడా నాకు లేదు. ఎవరైనా సరే పెరిగేది ఒకేరీతిలో' అంటుందని తెల్సు!

చేతులు చాచింది ఛాయ. ఒక అంగలో ఆమెను చేరుకున్నాడు రాంబాబు! గట్టిగా కౌగలించుకున్నాడు రాంబాబు. అతని కౌగిల్లో ఉక్కిరి బిక్కిరి అయింది ఛాయ. ఇద్దరి కళ్ళల్లో నీళ్ళు... ఆనందపు కన్నీళ్ళు !

అతను ప్రేమాతిశయంతో, ఆవేశంతో... ఆతృతగా, ఆబగా... ఆమె నుదురునీ, చెవులనీ, చెంపలనీ, మెడనీ, మెడకింద మెత్తటి ఎత్తుల్నీ చెక్కిళ్ళనీ, గెడ్డాన్నీ, నాసిక కొసనీ, కనురెప్పల్నీ సుతారంగా వందల సార్లు చుంబించి, ఆమె వణుకుతున్న పెదాలను ఆక్రమించేడు.

అంతే! ఛాయకి ప్రపంచమంతా పచ్చపచ్చగా మల్లెపూల ఘుమ ఘుమలతో వెండి, వెండి మబ్బుల తోరణాల మధ్య... వెన్నెల వాడలో ముత్యాల పందిరిలా, ఆ పందిరిలో పూలపాన్పులా, హాయిగా... హాయిహాయిగా...

## 44

ఆ రాత్రి

పది గంటల ఇరవై నిమిషాల సమయం.

అశాంతిగా... అస్థిమితంగా...విజయ.

ఆమెకు నిద్ర పట్టడం లేదు.

ఆమె మస్తిష్కంలో ఆలోచనల కందిరీగలు.

అవి చెలంకి సంబంధించిన ఆలోచనలు.

ఆ రాత్రే కాదు... ప్రతీరాత్రి... అవే ఆలోచనలు. ఆ ఆలోచనల ఊబిలోంచి.. సుడిగుండం నుంచి... బయటకి రాలేని స్థితి!

ఎందుకా ఆలోచనలను తను ప్రతిఘటించ లేకపోతోంది!

తను చెలాన్ని ఎంత ద్వేషిస్తున్నా – ఆమెను కలవరపరుస్తున్న విషయం ఒకటుంది.

అది –

చెలం పూర్తిగా చెడిపోతున్నాడనే విషయం !

చెలం పూర్తిగా పాడైపోతున్నాడనే విషయం!

పోతేపోయేడు... పోనియ్ అని ఎందుకు అనుకోలేక పోతోంది తను?

అతనితో బంధం తెంచేసుకుని బయటకొచ్చేసేక... అతనేమైపోతే తనకేం ? –

అని సమాధాన పడలేకపోతోంది విజయ.

ఆ రోజు ఇంట్లోంచి తను బయటకి వచ్చేయకుండా వుంటే... చెలం ఇంత చెడిపోయి

వుండేవాడా ?

ఏది ఏమైనా... తను ఇంటినుంచి అలా బయటకి వచ్చేయడం పొరపాటేనేమో !

తను తొందరపడిందేమో !–

అనిపించగానే ఛెళ్ళుమని చెంప దెబ్బ తగిలినట్టు తుళ్ళి పడింది. గుండెలపై చేతులు వేసుకుంది.

తమాయించుకుంది. తేరుకుంది

ఏవిఁటి తనేనా అలా ఆలోచిస్తున్నది... ఇంత అసహ్యంగా ఇంత అసందర్భంగా –

ఛఛ.. ఏమైంది తనకి!

తప్పు చేశానేమో అనే భావన అసలు ఎందుకు కలగాలి ?

ఆ సమయంలో... మానాభిమానాలున్న ఏ ఆడదైనా తనలానే ప్రవర్తిస్తుంది –

అవును ప్రవర్తిస్తుంది –

''నాది పొరపాటు కాదు. నేను తప్పుచేయలేదు' అని పైకే అనేసింది విజయ.

మరో త్రోవలో పయనిస్తున్న ఆలోచనలని... అరికట్టడానికి అతనిపై మరింత అసహ్యం, ద్వేషం తనకి నిలువెల్లా కలిగేలా... ఇన్నాళ్ళు తన పట్ల దారుణంగా అతను ప్రవర్తించిన తీరు, చేసిన అకృత్యాలు, ఆడిన దుర్భాషలు, అమానుషంగా జుట్టుపట్టుకు బయట కీడ్చి కొట్టడాలూ సందీప్ విషయంలో పెట్టిన దారుణమైన హింస... కావాలని గుర్తు చేసుకో యత్నించింది.

ఎందుకో విజయకి ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది.

తలగడ అన్చుకొని ఏడ్చేసింది.

ఏడుస్తూ... మగత నిద్రలోకి వెళ్ళిన విజయ...

అంతలోనే

తుళ్ళిపడి లేచింది!

తలుపు టాప్ చేస్తున్న చప్పుడు.

కలకాదు.... నిజమే అని గ్రహించేలోపుగా... అవతల అసహనంగా తలుపు బాదుతున్న చప్పుడు!

ఇంతరాత్రప్పుడు ఎవరు ?

చెలమా ?

అతనెందుకొస్తాడు ? వచ్చినా తనెందుకు తీయాలి ?

తలుపు తీయాలా, వద్దా అనుకుంటుండగానే

ఈలోగా –

ఛాయ నిద్రలేచింది.

రంగం మామ్మ లేచింది.

ఎవరో చూడమంది విజయ.

నెమ్మదిగా తలుపు తెరిచి చూసింది రంగంమామ్మ!

పార్వతమ్మ !

పార్వతమ్మను ఇంతరాత్రప్పుడు రావడం చూసి... విజయ ఎంత ఆశ్చర్య పోయిందో... పార్వతమ్మ తీసుకొచ్చిన వార్తకి అంతగా కుప్ప కూలిపోయింది విజయ!

అయిదునిమిషాల్లో –

పార్వతమ్మతోబాటు, విజయ, ఛాయ ఆటోపై బయల్దేరారు.

ఆటో కింగ్ జార్జ్ హాస్పిటల్ వద్ద ఆగింది

ఆ వార్డులో... ఎడమ వైపునున్న మంచం మీద చెలం!

తలకి పెద్దకట్టు, వళ్ళంతా బేండేజ్ ! అన్‌కాన్షస్‌గా పడివున్న చెలానికి గొట్టాల ద్వారా ఆక్సిజన్, సెలిన్ అతని శరీరానికి అందజేయబడుతున్నాయి.

ఏమైంది చెలంకి?

ఏక్సిడెంటా ?

బాగాతాగి... రేష్‌గా డ్రైవ్ చేసి... ఏచెట్టుకో..

కాదు –

చెలంపై జరిగింది హత్యాయత్నం!

పాతిక లక్షల లాభం తెస్తుందనుకున్న ల్యాండ్ బిజినెస్ అతని ప్రాణంకాటేసేలనేటంత వరకూ వెళ్ళింది.

తనకే భూమి అమ్ముతామని వాగ్దానం చేసిన రైతులు... కరణం రాజకీయలవల్ల. మరో పార్టీకి ఇవ్వజూపడంతో ఘర్షణ రేగింది.

ఉద్రిక్త వాతావరణం నెలకొంది.

చెలం అంతమంది రైతులతో గొడవ పెట్టుకోవడం అయ్యే పనికాదు.

అంచేత –

మధ్యలో ప్రవేశించిన కొత్త పార్టీ మీద పడ్డాడు.

రైతులు ముందే వాడిని నానా దుర్భాషలాడేడు. తన బిజినెస్‌కి అడ్డురాకుండా మర్యదగా తప్పుకోమన్నాడు.

తప్పుకోకుంటె నీ అంతు చూస్తానన్నాడు.

ఆ వుద్రేకంలో వాడి మూతిపై... రక్తం వచ్చేలాగుద్దేడు.

అంతే!

ఆ మరుచటి రోజు రాత్రి...

చెలం రైతులతో ఏవో రాజీ చర్చలు జరిపి... ఆ గ్రామం నుంచి... చీకట్లో... రోడ్డుపైనున్న తన కారువద్దకి వస్తూండగా..

ఒక్కసారిగా తాటితోపుల్లోంచి కర్రలు లేచేయి

అతనిపై దాడి చేసేయి.

నేలకొరిగిపోయేడు చెలం.

దయగల తండ్రులెవరో... చెలాన్ని ఏ నక్కలో ఈడ్చుకుపోకుండా... కొన ప్రాణంతో వున్న చెలాన్ని ఆస్పత్రికి చేర్చేరు.

తలకి బలమైన గాయాలు తగిలి పూర్తిగా అపస్మారక స్థితిలో వున్న చెలాన్ని బతికించడానికి డాక్టర్లు విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు.

రేయింబవళ్ళు భర్తవద్ద ఉండి సేవలు చేస్తోంది విజయ!

అతనికి సేవలు ఎందుకు చేయాలి, ఎందుకు చేస్తున్నాను – అనే ప్రశ్నలు – ఏ ఒక్కసారికూడా ఆమెకా సమయంలో వుదయించనేలేదు.

గతంలో భర్త తనని ఏడిపించిన సంఘటనలు కన్నా...జీవితంలో అతనితో గడిపిన మధురమైన ఘట్టాలే మాటమాటకీ గుర్తుకొచ్చి ఆమె గుండెల్ని కోసేసేవి.

ఒక్కోసారి దుఃఖం ఆపుకోలేక... వెక్కి వెక్కి ఏడ్చేసేది.

చెలాన్ని ఎలాగైనా బతికించుకోవాలని వుందామెకు. అందుకు ఏమైన చేయడానికి సిద్ధంగా వుంది. వుండడం కాదు చేస్తోంది.

చెలం ఖచ్చితంగా బతుకుతాడని... బలమైన నమ్మకం విజయకి.

నమ్మకం లేనిది డాక్టర్లకే !

అయితే ఆ విషయం వాళ్ళు విజయకి చెప్పలేదు

విజయతో బాటు వున్న ఛాయకి చెప్పేరు.

ఛాయ గుండె విలవిల్లాడింది.

ఛాయ కళ్ళల్లో నీళ్ళు నిలిచేయి.

ఏమంటే – ఏ అనారోగ్యం వల్లో , ఏ ప్రకృతి వైపరీత్యం చేతో, ఏ వ్యార్ధక్యం ముంచుకొచ్చో... మనిషి దక్కకపోతే అది వేరే సంగతి!

చెలం అలాకాదే ! ఆరోగ్యవంతుడు. అందమైన యువకుడు. పెద్ద ఉద్యోగం, ప్రేమించిన భార్య, ముద్దొచ్చే కొడుకు.... ఎంచక్కా భవిష్యత్తు పూవులపడవగా... హాయిగా సాగిపోవల్సిన జీవితం...

అయ్యో ... ఎందుకిలా అయింది?

చెలం ఎలాంటివాడో తనకి తెల్సు. మొదట్లో ఎంత మంచివాడో తను విన్నది.

అలాంటి చెలం ఎందుకిలా అయిపోయేడు?

'ఏ మనిషీ దుర్మార్గుడుగా పుట్టడు. మానవ మనస్తత్వంలో సహజ ద్వేషమంటూ లేదు ' అని కొందరంటారుగాని, అందులో పూర్తి వాస్తవం వున్నట్టుగా ఆమెకి తోచదు.

ఏమంటే మనిషిలోకూడా ఏనిమల్ ఇన్స్టింక్ట్స్ వుంటుంది. తిండి కోసం, జత కోసం

జంతువు పట్ల జంతువు చూపే సహజ ద్వేషం... మనిషిలో వుండదా? వుంటుంది. అయితే ద్వేషాలకీ, దౌష్ట్యాలకీ మనిషిని దూరంగా వుంచడానికే నియమాలతో కూడిన సంఘం ఏర్పడింది. ఏర్పడి ఏం లాభం ? రాను, రాను ' ఆస్తి' అనేది సంతరించుకుంది. దాంతో సమాజమే దౌష్ట్య సమాజంగా మారింది.

పరిమితుల్లేని ప్రయివేట్ ప్రాపర్టీ . ఎంతో మంది చెలంల ధ్వంసానికి కారణమౌతోంది - బాధ పడింది ఛాయ.

ఏది ఏమైనా -

*చెలం బతుకుతాడనే విజయ నమ్మకాన్ని ఛాయ కొట్టేయలేకపోయింది.*

*విజయకి చెలం దక్కుతాడనే తనకూ అనిపించింది. దక్కాలనే కోరుకుంది.*

*చెలం పశ్చాత్తాపం చెందుతాడు. సంపాదన కోసం పరుగులెట్టడం ఎంత అర్థరహితమో, దానివల్ల తను ఎన్ని కోల్పోతున్నాడో, మనిషిగా మిగలకుండా ఎలా అయిపోతున్నాడో తప్పక తెల్సుకుంటాడు. తెల్సుకోకపోతే.... తెలియజేస్తుంది విజయ. అతన్ని ఇక ఒంటరిగా వదిలేయదు విజయ. అతన్ని మనిషిని చేస్తుంది. దక్కించుకుంటుంది. గతం అంతా ఒక పీడకలగా మర్చిపోయి.... ఇక ప్రేమతో అన్యోన్య జీవితం సాగిస్తారు అనుకుంది ఛాయ. అందుకు తను చేయాల్సిన ప్రయత్నాలను చేయాలని నిశ్చయించుకుంది ఛాయ.*

*ఆ సాయంత్రం చలం పరిస్థితి కాస్త మెరుగ్గా కనిపించడంతో తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది ఛాయ.*

*గుండె దిటవు పర్చుకుంది విజయ.*

***అయితే -***

*భగవంతుడు నిజంగా లేడో, వుంటే దయలేనివాడో.... ఆ మరుసటి రోజు ఉదయం నాలుగు ఇరవై నిమిషాలకి తనువు చాలించేడు చెలం.* ✿



# స్వాతి పాఠకులు
# సంధించిన ప్రశ్నలు-నవలాకర్త సమాధానాలు

స్వాతి సపరివారపత్రికలో 'ఈతరం స్త్రీ' ధారావాహికంగా ప్రచురింపబడుతూ పాఠకలోకంలో ఎంత సంచలనం రేపిందో, అప్పుడు నిర్వహించిన 'ముఖాముఖి' (ప్రశ్నలు-సమాధానాలు) అంతకు నాలుగింతల సంచలనాన్ని కలిగించింది. మరోసారి ముద్రణ పొందుతున్న ఈ నవలతోపాటుగా ఈ 'ప్రశ్నలు - సమాధానాలు' కూడా ప్రచురించడం బాగుంటుందన్న రచయిత సూచన మేరకు 21-12-84 నుంచి 12-4-85 వరకు పత్రికలో ప్రచురింపబడ్డ 'పాఠకుల ప్రశ్నలు - రచయిత జవాబులు' ఇక్కడ పొందుపరచడం జరిగింది.

ఎన్.హెచ్.ఎన్. సాగర్ (తెనాలి)

● 'ఈతరం స్త్రీ' అనే పేరును మీరే పెట్టేరా? ఇంకెవరైనా సూచించేరా?

☛ *మొదట్లో ఈ సీరియల్‌కి నేను పెట్టిన పేరు "సంధియుగంలో సంసారాలు". తర్వాత సంపాదకుని సూచనతో 'ఈతరం స్త్రీ'గా మార్చబడింది.*

వి. చంద్రశేఖరరెడ్డి (విజయవాడ), ఎ. శ్రీహరి (నవీపేట), ఎ. విజయభాస్కరరెడ్డి (తెనాలి)

● మీరు ఈ సీరియల్ ద్వారా పాఠకులకిచ్చే సందేశం ఏమిటి?

☛ *నేను నవల్లో జీవితాన్ని చిత్రీకరించడానికే ప్రయత్నిస్తున్నాను. ఇందులోనేనిచ్చే సందేశమేమైనా వుంటే - నవల పూర్తిగా చదివేక అది మీకే తెలుస్తుంది.*

జె. నవరాజు (తొస్సిపూడి)

● ఇప్పటివరకు మీరు వ్రాసిన సీరియల్‌లో ఏదీ అసహజం కాదు. ప్రతి మధ్యతరగతి పాఠకుడికి తెలిసిన విషయమే. కాని కొందరు నిజాన్ని భరించలేరు. పోతే శృంగారం, సెక్సు విషయాలు పాఠకుల ప్రయోజనాలకు అనుగుణంగా చర్చించడంలో మొదటివారు చలం, రెండవ స్థానం వడ్డెర చండీదాస్, మూడవ స్థానాన్ని మీరు తప్పక పొందుతారు. ఇకపోతే స్త్రీగా మీరింత చొరవ ఎలా తీసుకోగల్గుతున్నారు? (సారీ మన పాఠకులు పాశ్చాత్య దేశాల స్థాయిలో లేరు కదా)

☛ *థాంక్స్! ఇటీవల మన పాఠకులు చాలా ఎదగలేదంటారా?*

సి.వి. నరసింహదాసు (విజయనగరం)

● 'ఈతరం స్త్రీ' సీరియల్‌లో సెక్సీ వర్ణనలు లేకుండా వ్రాయలేరా?

☛ *ఒక దేవరహస్యం. రచనలో వచ్చే వర్ణనలు అన్నీ రచయిత(త్రు)ల దృష్టితోనే చేయరు. ఆ సన్నివేశంలో ఒక పాత్ర మానసిక స్థితిని, చూపును అనుసరించి ఒకప్పుడు వర్ణించాల్సి ఉంటుంది.*

సుజనరావు (ఖమ్మం), సి.వి. నరసింహదాసు (విజయనగరం)

● ఛాయ ప్రవర్తన తీరు చాలా అసహజం అని నా అభిప్రాయం.

☛ *మనకి తెలిసింది మాత్రమే ప్రపంచమంటారా?*

శ్రీమతి బి. రుక్మిణి (విజయవాడ)

● 'ఈతరం స్త్రీ' అంటే 'సెక్సుముచ్చు' అని అభిప్రాయం వచ్చేలాగా అసలు ఆడదంటేనే కామపిశాచి అనే అపవాదు పాఠకలోకంలో ఏర్పడేలాగ - రచన చేయడంలో మీ ఉద్దేశం ఏమిటి?

☛ మీరు చాలా అన్యాయమైన ఆరోపణ చేస్తున్నారు. ఇందులో మూడు స్త్రీ పాత్రలున్నాయి. ముప్పయ్యేళ్ళు వస్తున్నా పెళ్ళి కాని స్త్రీ- ఛాయ. పెళ్ళి అయినా భర్తకి దూరంగా వున్న స్త్రీ - సుజాత. భర్త దగ్గర వున్నా సుఖం నోచుకోని స్త్రీ - విజయ. ఆ ముగ్గురు స్త్రీ పాత్రల్లో ఛాయ గురించి మీరొక అభిప్రాయానికి అప్పుడే రాకండి. దయచేసి సీరియల్ పూర్తిగా చదవండి. ఇకపోతే సుజాత, విజయలు కామపిశాచాల్లా మీకు కనపడకూడదే!

విజయ్‌కుమార్ (తుని)

● "......................"

☛ *మీ ప్రశ్న ఇక్కడ రాయను. మీ అక్క సంగతి నాకు తెలియదు. లోకంలో ఆడపిల్లలందరూ ఛాయ పరిస్థితుల్లోనే లేరు కదా!*

కె.వి.యస్. (గంగినేని)

● ఆడదాని బ్రతుక్కి సెక్సే పరమావధి అన్నట్లుగా ఏనాడో చెలం వ్రాసేశాడు. కాని మీ అంత నాసిరకంగా మాత్రం కాదు. ఆయన నిరుద్యోగ స్త్రీల గురించి వ్రాస్తే - మీరు ఉద్యోగం చేసుకునే వాళ్ళకు పడి ఏడుస్తున్నారు. స్త్రీకి సమస్య సెక్సే తప్ప మరేం కాదనే నీచమైన అభిప్రాయం మీకెందుకొచ్చిందో మాకు అర్థం గావటం లేదు.

☛ *అవును - మీకు అర్థం కాదు. ఏమంటే మీకు చెలమే అంతలా అర్థమైనపుడు - నేనెంత?*

*ప్రభుధీర్ (పాండిచ్చేరి)*

● మీ దృష్టిలో కూడా ఆడవాళ్ళంటే ఈతరం స్త్రీ అంటే - పేద స్త్రీలు కారన్నమాట, వృద్ధులు కారన్నమాట! కేవలం యవ్వనంతో సెక్సుకు వీలుగా సంపాదించుకోగలిగేవాళ్ళేనన్నమాట! పబ్లిక్ రోడ్ల మీదా, ప్లాట్‌ఫారాల మీదా శృంగారాం చేసుకోగలిగిన గర్భదరిద్రుల్ని మీ కలంతో చిత్రించలేరా?

☛ *మీ ఆవేదన నాకు అర్థమయింది. మరో నవల రాయడానికి నాకు అవకాశం వస్తే మీ ఉత్తరం నాకు తప్పకుండా గుర్తు వుంటుంది ప్రభుధీర్‌గారూ!*

పి. యశోదాదేవి (కాకినాడ), కె. అప్పారావు (ఖర్గపూర్)

● ఈతరం స్త్రీలు ఛాయ, సుజాత, విజయలా! అంతకన్నా ఆదర్శ స్త్రీలు మీకు దొరకలేదా?

☛ *సమాజంలో తరానికీ తరానికీ తేడా వుంటుంది. నిన్నటి తరం వారి 'హయ్యర్ గోల్స్' నేటి తరం వారికి అంటగట్టినా - నేటి తరం వారి విలువలకన్నా - నిన్నటి తరం వారి విలువలే గొప్పవని నేను చెప్పదల్చుకున్నా - అది ఈతరం స్త్రీ కథ కాదు, ఈతరం జీవితమూ అవ్వదు. అంతేకాదు, నెగ్లిజబుల్ మైనార్టీలో వుండే నేటితరం ఆదర్శ స్త్రీల కథ తీసుకన్నా అది నేటితరం స్త్రీ కథ కాదనే నేను భావిస్తాను. ఈ అభిప్రాయంతో ఏకీభవించని వారితో క్షమించమనడమే తప్ప వాదించలేను.*

బి. సుధాషాయర్ (మద్రాస్)

● తెలుగు నవలా జయమాలినీ, తెలుగు వచన సిల్కుస్మితా! - నువ్వు నైట్‌క్లబ్ డాన్సర్ వైతేనే చూడగలం గాని - సంసారాల్లోకొచ్చి సంబరాలు చేస్తే చూడలేకపోతున్నాం తల్లీ! మంచాల యిబ్బందీ, పెళ్ళాం మంచం మీద కాకుండా వేరేచోట పడుకోడాలూ, తమ్ముడి లుంగీ రేగి, అప్పగారు పరిగెట్టడం... ఇంత అసహ్యంగా ఎందుకూ వ్రాయడం - పైగా సెక్స్ అనే పదాన్ని అశ్లీలమైన ధోరణిలో వ్రాయడం ఏం బాగాలేదు... అది లేకుండా నవల సాగదా?

☛ *నవల సాగదా అంటే ఎందుకు సాగదూ సాగుతుంది. కాని మీబోటి విమర్శకులే దొరకరు! (మీ ఉత్తరం బలే సరదాగా వుందిస్మీ!).*

**ఎం. వీణాకుమారి (కాకినాడ)**

● ఎవరైనా మగ రచయితలు - స్త్రీల గురించి అసభ్యముగానూ, హీనముగానూ వ్రాయటం జరిగినచో అది మగవారి బుద్ధిలే అనుకుంటాము కాని, మీరు కూడా స్త్రీలకు తలవంపులు కలిగే రచనలు చేయుచున్నారు.

☛ *స్త్రీని భోగవస్తువుగా చిత్రించే మగదృష్టి గల రచయిత(త్రు)లే కాదు, యధార్థస్థితిని చిత్రించే రచయిత(త్రు)లు కూడా వుంటారు.*

**గోవిందరాజుల రామ్మోహన్ (టి.పి. గూడెం)**

● వెనుకటికో ఫ్రాడ్‌గాడు - తల్లి తన బిడ్డకు పాలు పట్టడం కూడా సెక్సే అన్నాడు. మీరు అంతకన్నా రూడ్‌గా - అక్క కామంతో తమ్ముడి పక్కలో చేరిందని వ్రాయగలిగారు. మీ నవల పదిమంది నోళ్ళబడి సెన్సేషన్ సృష్టించాలని రాశారా? లేక వేరే అభిప్రాయాలూ, గట్రా కూడా ఏమైనా ఉన్నాయా!

☛ *సమాజం నిర్దేశించే నీతినియమాలకీ, ఉచితానుచితాలకీ మానవోద్రేకాలను పూర్తిగా అదుపులో ఉంచగల శక్తి లేదని అన్ని దేశాల సాహిత్యం నిండా కోట్లాది ఉదాహరణలు ఉన్నాయి. నిన్నా, నేడూ పేపర్లలో వింత వార్తలు మీరు చదవడం లేదా? జీవితం వడ్డించిన విస్తరిగా అమరినవాళ్ళకి ఛాయ ఉద్రేకాలు, ప్రవర్తన అందకపోవచ్చునని - నేను భయపడుతూనే వున్నాను. రామ్‌మోహన్‌గారూ! సెన్సేషన్ కోసం అయితే నేను ఆ ఘట్టం ఇంకోలా ముగించేదానిని.*

**ఐ. శారద (కావలి)**

● ఎంత మంచి సబ్జెక్టు? ఎంత బాగా డీల్ చేశావ్! అమ్మో 'మామ్మూల్దాయిదిగాదు' అనుకన్నామా మరిదేంపని. అన్నం పెట్టి విస్తట్లో వుమ్మేసినట్లు ఎందుకా సెక్సు?

☛ *పైన రామ్‌మోహన్‌గారికిచ్చిన సమాధానం చూడండి.... ప్లీజ్!*

**బి.రామారావు (హైదరాబాద్), వసంత రాధిక (కర్నూలు), పి. యమున (సామర్లకోట), ఆర్. లక్ష్మి (విశాఖపట్నం)**

● తన తమ్ముడైన శివ పట్ల ఛాయ కామోద్రిక్తయై ప్రవర్తించడం చాలా అనుచితంగా వుంది. ఛీఛీ! ఎందుకలా వ్రాసారు? వ్రాసేదానికి నీతి లేకపోతే ఎలా?

☛ *హ్యూమన్ ఎమోషన్సు ఉచితానుచితాలకు కట్టుబడి ప్రవర్తిల్లితే - అసలు కథే లేదు. ఛాయ దయనీయ స్థితిని చిత్రించిన ఘట్టంలో (కొందరికే అనుకోండి) నీతి, అవినీతులు కనబడితే అది ఛాయ దురదృష్టం. నా దురదృష్టం కూడా. మీలాంటి నీతిమంతులు కాదు, కూడదనుకుంటే - ఛాయ పరిస్థితుల్లోకి, ఛాయ ఆవేశాల్లోకి క్షణకాలం ప్రయాణించగలిగితే - ఈ ఆరోపణ చేసి వుండరని నేను గట్టిగా భావిస్తాను.*

**దేవులపల్లి రుక్మిణి (అవార్‌పూర్, మహారాష్ట్ర)**

● నవల రాసినంత నిజాయితీగానూ సమాధానం చెబుతారని నమ్మి ఈ ప్రశ్న! చెలం విజయలు అలకదీరటానికి సెక్సే మార్గంగా ఎంచుకున్నారు మీరు. ఆ స్థితిలోనే విజయ ఎన్నో కోరికలు కోరి చెలం చేత ఔననిపించుకుంది. అదేవిధంగా సుజాత తన రెజిగ్నేషన్ విషయం కూడా - సెక్స్ ప్రిపరేషనప్పుడే రవికి చెప్పింది. వ్యభిచారిణికి డబ్బులిచ్చినట్లుగా మగాడు స్త్రీకి కొన్ని వరాలిచ్చి వాడుకుంటున్నాడని మీ అభిప్రాయమా? లేకపోతే అంత మగవాణ్ణీ ఆడది 'సెక్సు' దగ్గర చవటన్నర చవటని చేసి తన పనులు నెరవేర్చుకుంటుందని అర్థమా? ఏది మీ భావం?

☛ రుక్మిణిగారూ! మీ వయసెంతో నాకు తెలీదు. పోనీ "నను(బ్రోవమని చెప్పవే...." అన్న పాట విన్నారా? వినకపోతే ఆ రికార్డు లేక కేసెట్ ఎక్కడైన సంపాదించి వినండి. దొరక్కపోతే మరో పాట "నడిరేయి ఏ జాములో..." అనేదైనా!

భారతి (నిజామాబాద్)

● ఈ నవల ఒక స్త్రీ వ్రాసిందంటే ఇక్కడ సిగ్గుతో తల వంచుకుంటున్నాం. అసలు మీరు వ్రాశారా? మీ పేరును మగవారెవరైన మన స్త్రీ జాతిని కించపరచాలని వాడుకుంటున్నారా?

☛ నవల మరోసారి చదవండి. ఇందులో స్త్రీ పాత్రలు సిగ్గుతో, ఆత్మవంచనతో తల వంచుకునేవి ..వు. స్త్రీ జాతిని కించపరిస్తే సహించని పాత్రలవి. తిరగబడే స్వభావం కలవి. అంచేత మీరు సిగ్గుతో తల వంచుకోవద్దని మనవి.

బట్టు శ్రీనివాస్ (అల్లీపూర్)

● ప్రతి యువతి పెండ్లి చేసుకుని పిల్లాపాపలతో సుఖముగా జీవించాలనుకుంటుంది గదా! మరి ఛాయ ఎందుకు నిరాకరించింది? పెండ్లి పట్ల అయిష్టతా? తలిదండ్రులపై ప్రేమా? తను కోరుకున్న శారీరక సుఖంతో సంతృప్తి చెందా? లేక మగవాడి ఆధిక్యతను సహించలేకనా?

☛ మీ ప్రశ్నలకి సమాధానాలు నవల్లోనే వున్నాయి. నవల పూర్తిగా చదవండి. ఛాయ పెళ్ళికి ఎందుకు నిరాకరించిందీ తెలుస్తుంది.

మహమ్మద్ గౌస్ (నడిగూడెం)

● సామాజిక స్పృహగల ఉత్తమ రచనలకు శృంగారం అవసరమంటారా? మీ రచనని అభిమానించే వాణ్ణిగా అడిగే ఈ ప్రశ్నకి దయచేసి సమాధానం ఇవ్వగలరు.

☛ శృంగారం లేని ఉత్తమ రచనలు లేకపోలేదు. చిత్రించే జీవితాన్ని బట్టి శృంగారం పాలు ఎక్కువ తక్కువ లుండడం జరుగుతుంది

పి. లక్ష్మణరావు (గాజులపేట)

● పాపం! స్వాతి యాజమాన్యం గర్వంగా సపరివారపత్రిక అంటున్నారు. మీ సీరియల్‌లోని శృంగారం చూస్తుంటే - కుటుంబమంతా కలిసి కూర్చుని చదవగలిగే పత్రికవుతుందా?

☛ సపరివారపత్రిక అంటే సకుటుంబంగా చదువుకునే పత్రిక అని మీకు తెలిసిందే కదా. కుటుంబంలో అన్ని అభిరుచులు కలవారు వుంటారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క అభిరుచి. మరి అందరికీ కావలసిన అన్ని రసాలూ వుండాలి. నవరసాల్లో శృంగార రసమొకటి. సపరివారపత్రిక వారు అందుకే అందిస్తున్నారేమో!

విజయమోహన్ (మండపేట)

● రవి సుజాతల మధ్య - సురేష్ పేల్చిన బాంబు బలంగా లేదు. పిల్లాడు ఏదో అనేసరికే పెళ్ళాన్ని అవమానించడం - ఆమె వెళ్ళిపోవడం కనిపించినట్టుగా వున్నాయి గాని ఏమాత్రమూ నేచురాలిటీ లేదు.

☛ ఎవరూ ఏదీ అనకుండానే, వూర్కెనే పెళ్ళాల్ని అనుమానించే వాళ్ళనీ, అవమానించే వాళ్ళనీ మీరు చూళ్ళేదా? - సుజాతలా వెళ్ళిపోయిన వాళ్ళని చూడకపోయినా!

టి. పాణి (మద్రాసు)

● పెళ్ళి కాని ఛాయ రాంబాబుతో తిరుగుతూ తన జిల గురించి ఏడ్చి - 'వేరే ఎవరితోనో' అని రాంబాబు జోకగానే - అతన్ని చాచి లెంపకాయ కొట్టింది. అవతల పనిపిల్ల లక్ష్మి- పెళ్ళయిందయుండీ నాజాకు రవి కోసం 10 రూపాయలకే వచ్చేసి, తన తృప్తితో నిమిత్తం లేకుండా దులుపుకుపోయింది.

ఏమిటీ లీల?

☛ పాత్రల ఆలోచనాస్థాయి, ప్రవర్తనా తీరు ఒకేలా వుండవు

లేళ్ళ శ్రీనివాసరావు (బాపట్ల)

● పత్రికంటే ఇంటిల్లిపాదీ చదువుకునేది సీరియల్ అన్న తర్వాత కొద్దిగా శృంగారం వుండాల్సిందే కాదనను కాని మీరు చాలాచోట్ల అతిగా వ్రాస్తున్నారు ఉదా॥కు రవి, సుజాతలకు సురేష్ అన్న మాట కారణంగా చెలరేగిన వివాదంలో ఒక చోట రవి సుజాతను 'లంజ' అని తిడతాడు అసలు మీరు ఆ మాట రాయాల్సిన అవసరం ఏమిటి?

☛ ఆ తిట్టు మీరు ఎన్నో వేలసార్లు విని ఉంటారు అవునా? అదే అచ్చులో చూసినాక గాని మీకది ఎంత అసహ్యమో తెలిసి రాలేదు అవునా? ఆ ఎఫెక్టు కోసమే వ్రాసేను

సిహెచ్ వరలక్ష్మి (నిజామాబాద్)

● ఛాయ అవివాహితగా వుంటూ అంత అసభ్యకరంగా ప్రవర్తించడం వలన స్త్రీ జాతిని అవమానించినట్టు అనిపిస్తుంది మీరు ఛాయ పాత్రనలా ఎందుకు సృష్టించారు?

☛ నేను ఛాయ పాత్రను సృష్టించింది స్త్రీ జాతిని అవమానపరచడానికి కాదు ఈతరం స్త్రీ ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలను ఎత్తి చూపేందుకు వాళ్ళ ఆగచాట్లు చిత్రించేందుకు!

వి ఆర్ మోహనరావు (నిడదవోలు)

● మీకు మా నూతన సంవత్సర శుభాకాంక్షలు ఛాయ లాంటి వాళ్ళు నిజజీవితంలో వుంటారా?

☛ థాంక్యూ! ఛాయ లాంటి వాళ్ళు నిజజీవితంలో వున్నారో లేరో నాకు తెలియదు గానీ - ఛాయ వున్న పరిస్థితుల్లో కనీసం కొందరైనా వుండే అవకాశం లేదంటారా?

బి సునీతాకళాకేళి (గుంటూరు)

● ఈతరం స్త్రీలపై ఓ రచయిత్రిగా మీ అమూల్యాభిప్రాయం

☛ అంత పెద్దమాట ఎందుకులెండి- ఈతరం స్త్రీ కొత్త పరిస్థితుల్లో, కొత్త బాధ్యతలతో, కొత్త సమస్యలతో, కొత్త పరిష్కారాలతో వారు సాగిస్తున్న జీవనపోరాటం ఎవరికైనా ఒళ్ళు జలదరింపజేస్తుంది

పి రాజారావు (న్యూ ఢిల్లీ)

● మీరు నిజంగా గ్రేట్! మీ రచన ముందు మధు రచనలు బలాదూర్ మరో ఘాటైన రచన స్వాతి ద్వారా పంపండి చదివి ఆనందిస్తాం మరిక మధు పుస్తకాలు అనవసరమంటాను మీరేమంటారు?

☛ మధెవరూ?

జి జగదీశ్వర్‌రెడ్డి (పటాన్‌చెరు)

● మీ సీరియల్ చదివే పాఠకుల్లో నేనొకణ్ణి! ఇంతకాలమూ 'శృంగార' పదాన్ని తమ రచనల్లో రచయితలు మాత్రమే వాడుతూ వచ్చేరు అనుకోకుండా, కుండబద్దలు కొట్టినట్టుగా మీరు చక్కని ఇతివృత్తంతో ఈ రచన చేయటం రచయిత్రులకు కనువిప్పే! (ఆడది నాలుగ్గోడల మధ్యన కూర్చుని సంసారికంగా 'బానిస' అని గుర్తు చేసే రచనలే చేస్తూ వచ్చారు) మీ సీరియల్‌లో నాకు ప్రతీ సంఘటనా, సన్నివేశం ఎంతో గొప్పగా తోచాయి కారణం మీరు వాడిన కొత్తరకం శైలే కావచ్చు బీనాదేవి రంగనాయకమ్మల తర్వాత ధైర్యంగా రాయగలిగింది మీరేనని నిక్కచ్చిగా చెబుతాను మీ పేరు ఇంత క్రితం వినలేదు మీ ఇతర రచనలు మరేమున్నవో తెల్పండి!

☛ మీ అభిమానానికి కృతజ్ఞతలు రమణీమణి పేరు ఇంతవరకూ వినకపోవడం రయిటే ఇది నా తొలి సీరియల్ రచన

ఆర్.ఎస్.ఎస్.ఆర్. (విజయవాడ)

● మీరు నవల బాగా వ్రాస్తున్నారు. సీరియల్ ఆనందంతో, ఆహ్లాదంగా సాగుతోంది. తండ్రి తల్లిని ముద్దులాడటం చూసిన సురేష్ అచ్చు అంకుల్ ఇలానే ముద్దు పెట్టాడనే సంచలనం సృష్టించిన సురేష్ పాత్ర నవలలో ఎంత వరకు సాగుతుంది?

☛ మీకు నవల నచ్చుతున్నందుకు థాంక్స్! సురేష్ పాత్రే కాదు, ఏ పాత్ర అయినా నవల్లో ఏ మేరకు వుండాలో ఆ మేరకే వుంటుంది.

పి. రాఘవరావు, ఎస్. చిన్నారావు, పి. లలిత, యమ్. రాజ్యలక్ష్మి, కమలకుమారి

● అసలు మీరు రచయిత్రా లేక ఆడపేరుతో రాస్తున్న మగవాడా అని మా అనుమానం. ఎందుకంటే రచయిత్రులు శృంగార వర్ణనలు ఎన్నయినా చేస్తారు. కాని సెక్సును పచ్చిగా వర్ణించలేరు. రచనాధోరణి గమనిస్తే రచయితేనన్న అనుమానం బలపడుతోంది. సరే! మీరు ఆడ అయితేనేం మగ అయితేనేం మాక్కావల్సింది ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు. శృంగారం ఎక్కడ అంతమవుతుంది? సెక్సు ఎక్కడ ప్రారంభమవుతుంది? రెంటికీ తేడా వుందా లేదా? వుంటే ఏమిటి?

☛ *సమస్త జీవరాశుల సహజలక్షణమయిన సుఖేచ్ఛే సెక్సు. సెక్సు యొక్క రసజ్ఞతే శృంగారం!*

● పిల్లలందరికీ సెక్స్ గురించి తెలియాలి అన్న సెక్స్ ఎడ్యుకేషన్ ఈ సీరియల్‌లో ఒక భాగం కావాలని మీ ప్రయత్నమా?

☛ *మీ వ్యంగ్యం అర్థం అయింది. నాది ఆ ప్రయత్నం కానే కాదు.*

● మగవాడు చెడిపోతే తప్పు లేదుగాని ఆడది చెడిపోతే తప్పేం అని వాదిస్తారా? మగవాడు కూడా చెడకూడదు అనేది అభివృద్ధికరమైనదా లేక ఆడది కూడా చెడిపోవాలన్నది అభివృద్ధికరమైనదా?

☛ *ఆడైనా, మగైనా ఎవరు చెడినా అది నిస్సందేహంగా చెడడమే అవుతుంది. అది పాత్ర డైలాగైతే ఆ డైలాగు ఆ పాత్ర పలకడం ఎంతవరకు సమంజసం, సహజం - అని ఆలోచించగలరు.*

● ఈ కాలంలో బూతులేని సినిమాలు గాని, పత్రికలుగాని ఏమీ లేవని మీ వాదన. అందుకని మేం కూడా రాస్తే తప్పేమిటని రాయండి తప్పు లేదు. కాని మధ్య మధ్యలో నీతులూ, సూక్తిముక్తావళులూ ఎందుకూ? ఇవన్నీ దగా కాదా? మిమ్మల్ని మీరు మోసం చేసుకుంటూ, పాఠకుల్ని మోసం చేస్తూ వాళ్ళ బలహీనతల మీద డబ్బు చేసుకుంటున్నారు. మధ్య మధ్యలో ఈ పట్టు ముసుగులెందుకూ?

☛ *మీ బాధ నాకు అర్థమయింది. చూడండీ - సమాజంలో విలువలే పడిపోయినప్పుడు ఆ సమాజాన్ని ప్రతిబింబించాల్సిన సాహిత్యం ఆ పడిపోయిన విలువలనే ఆవిష్కరిస్తుంది. మార్గాంతరం లేదు.*

● ఈ కథని మదన, అభిసారిక లాంటి సెక్స్ పత్రికలకు పంపవచ్చుకదా. పెద్దలు చదివి ఆనందిస్తారు. ఇలా చిన్న పిల్లల మనస్సులో భావోద్రేకాలు రేపి వాళ్ళకు ఈ సీరియల్స్‌ను జారుడుమెట్లుగా తయారుచేయడం అంత అవసరమా?

☛ *మీ భయమేకాని చిన్న పిల్లలు ఇలాంటి సీరియల్స్ చదవరు. వాళ్ళకీ పత్రికలో అనిల్ స్వాతి వుంది కదా! ప్రత్యేకంగా మదన, అభిసారికల గురించి వేరే పత్రిక స్వాతిలో చర్చించడం ఎటికెట్ కాదని విన్నాను.*

యం. ప్రసాదరావు (మక్కువ)

● మీ కలం నుంచి వెలువడిన ధారావాహిక సీరియల్ చాలా బాగుంటోంది. అయితే శృంగారానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వకుండా వుండాల్సింది. ఛాయ తన తమ్ముడు శివతో శృంగారం మోటుగా ఉండటమే కాదు - తప్పు కూడా!

☛ పెళ్ళికాని, ఇరవై తొమ్మిదేళ్ళ ఛాయ, ఇంద్రియాలను ఇక లొంగదీసుకోవడం చేతకాని ఛాయ - ఆ

*రాత్రి పండు వెన్నెల్లో సలసల కాగిపోతున్న ఛాయ - కోరిక తీర్చుకోవడానికి కావాలని తమ్ముణ్ణి ఎంచుకుని ఆతని పక్కలో పడుకోలేదు. ఆ ఉద్రేకంలో అతడు తమ్ముడనే స్పృహ కోల్పోయి ఒక పురుషుడి పక్కలోకి వెళ్ళింది. ఆమె ఉద్రేక తీవ్రతని, ఆమె బలహీనమైన పోరాటాన్ని చిత్రించడానికే ఆ ఘట్టం!*

నీలం కైలాసబాబు (నవర)

● మీరు వ్రాస్తున్న 'ఈతరం స్త్రీ' వాస్తవానికి చాలా దగ్గరగా ఉంది. కానీ శృంగారం ఎక్కువగా వున్నదని వచ్చిన విమర్శలన్నీ అనాలోచితంగా వున్నాయి. నేటి మహిళామణులు గానం చేసే క్షేత్రయ్య మొదలగు కవులు రచించిన కీర్తనలను అధిగమించలేదు మీ రచన. మీరు చేస్తున్నదల్లా స్వచ్ఛంగా, సహజంగా తెలుగులో వివరిస్తున్నారంతే! మీరు విమర్శలకు భయపడి మీ రచనలో మార్పులు ఏమీ చేయకుండా కొనసాగిస్తారని నాకు హామీ ఇస్తారా?

☛ *విమర్శలను నేను గౌరవిస్తానే గాని భయపడను. అదే నా భవిష్యత్తుకు సోపానాలు.*

పెద్ది రమేష్ (ఇల్లెందు)

● మీరు ఈ సీరియల్‌లో సెక్సు విషయంలో చిన్న పదంతో చెప్పే సెక్సును కావాలని సాగదీసి ఆడవాళ్ళకి అసహ్యం కలిగించేలా వ్రాస్తున్నారని నా అభిప్రాయం.

☛ *ఆడవాళ్ళకి అసహ్యమని మీరు అనుకుంటే ఎట్లా?*

కాసు (విజయనగరం)

● 'ఈతరం స్త్రీ' అత్యద్భుతం - శృంగార పత్రికల్లో కథలనీ, నవలలనీ తలదన్నేట్లుంది. గత దశాబ్దం క్షుద్ర సాహిత్య దశాబ్దం, ఈ దశాబ్దం అశ్లీల సాహిత్య దశాబ్దంగా చరిత్ర సృష్టిస్తున్న ఘనత మీదే!

☛ *గత దశాబ్దం అంటే 1971 నుండి 1980 వరకనా మీ ఉద్దేశం!*

ఏ.యస్. నారాయణరావు (విశాఖపట్నం)

● ఈతరం స్త్రీలు ఛాయ, సుజాత, విజయ పాత్రలు చిత్రీకరణ బాగుంది. వారి సమస్యలు ఎంతో సహజంగా ప్రస్తుత కుటుంబాలకు అద్దం పట్టేవిగా వున్నాయి. అజ్ఞాన తెరలు చీల్చుకుంటూ బైటకు వస్తున్న స్త్రీలను చక్కగా చిత్రీకరించేరు. అయితే సందేహమేమిటంటే రాంబాబు ఛాయని వివాహం చేసుకుంటానంటే అపుడామె ప్రవర్తన, మాటలు అసహజంగా తోచేయి. ఛాయ తన స్వేచ్ఛ, వ్యక్తిత్వం, సౌఖ్యం కోసం మాతృత్వానికి స్త్రీ జన్మకి పరిపూర్ణతనిచ్చే ఒక ఉన్నత స్థాయిని కాదంటున్నట్లు అనిపించింది. ఈతరం స్త్రీ ఇంత కఠినంగా ఉందా? మాతృత్వం కావాలనుకుంటే సహజంగానే సామాజిక భద్రత కోసం పెళ్ళికి అంగీకరించేదేమో?

☛ *ఇంత సహృదయంతో అర్థం చేసుకుంటున్న వారు నవల కడవరకూ వేచివుండలేరా?*

కె. రవిశంకర్ (హైదరాబాద్)

● మీరు నవల్లో ఎక్కువగా అశ్లీల పదజాలం గుప్పిస్తున్నారు.

☛ *సింహాచలం దేవాలయం మీద బూతుబొమ్మలు చూస్తే మీకు అబ్సీనిటీ అనిపిస్తుందా? అని ఎదురడగవచ్చు! కాలం మారుతోంది సార్! బి.యన్.రెడ్డిగారి పాత సినిమాలు చూసేరా ... హీరో హీరోయిన్లు ఒకర్నొకరు ముట్టుకునేవారు కాదప్పుడు!.. మరిప్పుడో!...*

పి. వాసంతి (బేతంచెర్ల)

● నవల్లో ఏమిటండీ మరీ అంత సెక్సు?

☛ *'మరీ' అంటే?.. ఏదో కొలబద్ద వుందన్న మాట! అందుకే శ్రీశ్రీ అంటాడు 'సాహిత్యంలో బూతు లేదు. అది చూసేవాళ్ల హృదయంలో వుందని!'*

ఆర్. శ్రీనివాసరావు (మద్రాసు)
● మీరు ప్రోగ్రెసివా? రియాక్షనరీయా?
☛ *నవలను బట్టి నేనెరవో తెలియటంలా?*
ఎ. భగవతి (రాజమండ్రి)
● స్త్రీ జాతికి విముక్తి ఎప్పుడు?
☛ *పోషణకు గాని, ప్రొటక్షన్‌కిగాని పురుషుడి మీద ఆధారపడని సమాజం వచ్చినప్పుడు.*
యన్. శశిధర్ (తిరుపతి)
● ఈ నవల వ్రాయడానికి మిమ్మల్ని ఇన్‌స్పైర్ చేసినదేది?
☛ *ప్రస్తుతం వున్న సమాజపు ట్రెండ్!*
కగ్రి నాగప్ప (బెంగుళూర్)
● మీ నవల్లో స్త్రీ పాత్రలు రివల్యూషనరీగా వుంటూ మరో పక్క భగవంతుని ప్రార్థిస్తాయేవిఁటి?
☛ *ఎక్కడ ప్రార్థించాయి? అయినా రివల్యూషనరీస్‌లో కూడా అంగబలం, అర్థబలం వున్న వారిలోనూ, లేనివారి లోనూ తేడాలుంటాయి. ముప్పిరిగొన్న బాధలూ, భయాలూ, 'హే! భగవాన్' అనిపిస్తాయి.*
డి. జయవర్ధనరావు (బందరు)
● మీ సీరియల్ కథ, కథలో పాత్రలూ, ఆ పాత్రల డైలాగులూ, ఆ డైలాగుల్లో సరికొత్తదనం మమ్మల్ని ముగ్ధుల్ని చేస్తూ ప్రస్తుతం వున్న నవలలకి భిన్నంగా వుంది. మీరు కావాలని అలా భిన్నంగా వ్రాసారా?
☛ *భిన్నంగా వుందా? నాకు తెలీదు! తెలుగు సీరియల్ నవలలు చదివేది నేను చాలా తక్కువ. నాకు తోచినరీతిలో నాకు తెల్సిన జీవితం మీ ముందు చిత్రించే యత్నం చేస్తాను.*
కె. శ్రీధర్‌రెడ్డి (హైదరాబాద్)
● కొందరు పాఠకులు మీరు అధికంగా శృంగారం వ్రాస్తున్నారంటున్నారు. కానీ వారికి తెలీదేమో మనం పూజించే పురాణాల్లో ఎంత అసభ్య శృంగారముందో, మన ప్రాచీనకవులు అవసరం లేకపోయినా ఎంత బట్టబయలుగా అంగాంగ వర్ణన చేశారో! కాకపోతే వాళ్ళు సంస్కృతంలోనో, గ్రాంధిక భాషలోనో రాయటం వల్ల మనకి అలా అనిపించుండదు. అంచేత నా మాట విని - వారి మాటలు పట్టించుకోకుండా ఇలాగే వ్రాయండి.
☛ *నేను ఎవరి మాటా తీసివేయను. అందరి మాటలూ పట్టించుకుంటాను.*
పి.రాధ (అనకాపల్లి)
● మీరు తీసుకున్న సబ్జెక్టు గొప్పది. కానీ దానికి సెక్సు షుగర్ కోటింగ్ కొట్టడమే ఏం బాగాలేదు.
☛ *చేదు మాత్ర మింగడానికే షుగర్ కోటింగ్! ఎలాగోలా మాత్ర మింగించాలి కద! ఇదొక ఎక్స్పరిమెంట్! ఫలితం తేలాలి.*
విశ్వనాథ్ (జయపూర్)
● చలం రచించిన 'మైదానం' ఆ తరం స్త్రీ శృంగార ప్రేమ కావ్యం. మీ సీరియల్ ఈతరం స్త్రీ ప్రేమ శృంగార నవల. ఇది అన్ని తరగతుల పాఠకులను అలరించే నవల. కాని సుజాతపై రవికి గల అనుమానం తొలగించి, తిరిగి బలపర్చటం పాఠకుల దృష్టిలో ఈతరం స్త్రీ నీచంగా కనబడదూ!
☛ *స్త్రీ యొక్క ఔన్నత్యం, నైచ్యం, స్త్రీ కామ జీవితం మీదే ఆధారపడి ఉంటుందా? ఉండాలంటారా?*
బి.డి.సింగ్ (ఖమ్మం)
● మీరు 'ఈతరం స్త్రీ'లో సృష్టించిన పాత్రలన్నీ నిజజీవితంలో ఎక్కడో ఒక చోట తటస్థపడేవే కానీ సమాజం వాటిని ధైర్యంగా అంగీకరించదు. యిన్ని విమర్శలకు తట్టుకుంటూ ధైర్యంగా సమాధానాలు

యిస్తున్నందుకు మీకు నా అభినందనలు. మీ ఫొటో పంపించగలరు.
☛ *థాంక్యూ వెరీమచ్... సారీ సర్!*
సి. విశ్వనాథం (కాశీబుగ్గ)
● మీరు నవల్లో కథ కన్నా మనస్తత్వ చిత్రీకరణకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చినట్టుగా వుంది.
☛ *మనస్తత్వ చిత్రీకరణ కూడా కథలో అంతర్భాగమే!*
వై. మురళీకృష్ణ (రాజమండ్రి)
● ఇదివరకు మీ రచనలు నేను చదవలేదుగానీ 'ఈతరం స్త్రీ' చదువుతున్నాను. నిజంగా మీరు ఈనాటి రచయిత్రుల కంటే చాలా బెటరు. ప్రస్తుతం రచయిత్రుల ఆలోచన వరకట్న సమస్య వరకే! అదీ సరిగా వ్రాయలేకపోతున్నారు. భార్యాభర్తల మధ్య కమ్యూనికేషన్ గేప్.... చూసేవాళ్ళకి చిన్న సమస్యగా కనిపించవచ్చుగాని మీరు అది ఎంత ముఖ్యమైన విషయమో తెలియజేసి... బ్రహ్మాండంగా డీల్ చేశారు! మీరు ఈ సోకాల్డ్ పాఠకులకి అందడం లేదు! అందుకే ఆ కుప్పిగంతులు! అర్థం లేని విమర్శలు! మీరు ఆ విమర్శలకు భయపడి ఆత్మవంచన చేసుకోకుండా ధైర్యంగా ప్రొసీడ్ అవండి.
☛ *నేను ఆత్మవంచన చేసుకునే ప్రశ్నే లేదు. రాయాలనుకున్నది రాస్తాను. అదే సమయంలో విమర్శలను ఆహ్వానిస్తాను. ... మిగతా రచయిత్రులను కించపరచకండి. మంచి రచనలు రాసిన వాళ్ళున్నారు!*
సువర్ణ కమల (పిఠాపురం)
● మీరు నవల్లో రతికేళి పెన్నుతో ఒలికిస్తున్నప్పుడు - మీ ఫీలింగ్స్ ఎలా వుంటాయి?
☛ *ఇది చదివి పాఠకులు ఎలా ఫీలవుతారా అని!*
బి. లక్ష్మణరావు (శ్రీకాకుళం)
● మీరు మొట్టమొదటి నవలతోనే పాఠకులని విపరీతంగా ఆకర్షించేశారు. ఆకర్షించేయగానే మీరు వ్రాసింది గొప్ప నవలన అయిపోతుందనుకుంటున్నారా?
☛ *నేను అలా అనుకోవడం లేదు. ఆ మాటకొస్తే గొప్ప రచనలకి ఎప్పుడూ పెద్ద ఫాలోయింగ్ వుండదు. కొడవటిగంటి, చాసో, కారా అనే వారు గొప్ప కథలు వ్రాసేరని ఈతరం పాఠకులకి ఎంతమందికి తెలుసు?*
యస్.ఏ. రహిమాన్ (తిరుపతి)
● స్వాతి ద్వారా పరిచయమయ్యే ఇంత ఉత్తమ నవల అందించిన మీకు ధన్యవాదాలు. మీరు తీసుకున్న కథ కానివ్వండి లేక వ్రాసిన విధానం కానివ్వండి అత్యద్భుతంగా ఉంది. అయితే ఒక యువకుడిగా నాకు నవల ఎంతగానో నచ్చినప్పటికీ సపరివారంలో ఒక వ్యక్తిగా మాత్రం మితిమీరిన శృంగారం వున్నట్టు ఫీలింగ్. అంచేత నా రిక్వెస్టు ఏమిటంటే మీ కలం నుంచి (శృంగారం లేని) గొప్ప నవలలు మరిన్ని వెలువడాలని ఆశిస్తున్నాను.
☛ *కృతజ్ఞతలు. మీ అదరాభిమానాలని కీపప్ చేసుకోవడానికి ప్రయత్నిస్తాను.*
కో.ఈ.రావు (నెల్లూరు)
● ఛాయ పాత్ర చిత్రీకరణలో మీరు చాలావరకూ కృతకృత్యులయ్యేరు. ఆ పాత్ర మీకు నిజజీవితంలో ఖచ్చితంగా తటస్థపడి వుంటుందని నా నమ్మకం. అవును కదూ అక్కయ్యా?
☛ *తటస్థపడలేదు తమ్ముడూ!*
టి. మాధవ (మంథని)
● సృష్టిలో సెక్సును అనుభవించలేకపోయినవారు ఆ తృప్తిని పొందటానికి ఎదుటి వారితో తన ఇష్టమొచ్చినట్లు సెక్సు గురించి మాట్లాడుతూ కేవలం సెక్సు మాటలతో తన తృప్తిని తీర్చుకోటానికి

తన నోటిని ఉపయోగిస్తారు. కాని మీరు మీ పెన్నును ఉపయోగించారని నేను అంటాను. మీరేమంటారు? (మీకు దీన్కి జవాబు ఇవ్వకుంటే నా ఊహ నిజమవుతుంది)

☛ *నేను అవొచ్చు, కాకపోవచ్చు! కాని మాధవ గారూ- మీలా చదివి తృప్తిపడే వాళ్ళున్నంతకాలం, చెప్పి తృప్తిపరిచేవాళ్ళు వుంటూనే వుంటారు!*

వై.ఆర్.కుమార్ (కంచికచర్ల)

● ఈ నవల వ్రాసిన మిమ్మల్ని అభినందించకుండా వుండలేను. ఈ రోజుల్లో కూడా విద్యాధికులైనన రచయిత(త్రు)లు కేవలం ధనార్జనే ఆశయంగా పెట్టుకుని క్షుద్ర సాహిత్యాన్ని ప్రజలపైకి వదిలి భయభ్రాంతులను గావిస్తుంటే మీరు మాత్రం మీ నవల కారణంగా ఎంతటి దారుణమైన విమర్శలకు గురికావల్సివస్తుందోనని భయపడక మీరు చెప్పదలచుకున్న విషయాన్ని నిర్మొహమాటంగా వ్రాయగలిగినందుకు మీకు నా అభినందనలతో ఒక మాట! మీరు కేవలం ముగ్గురు స్త్రీలనే తీసుకున్నారు. అన్ని రకాలుగానూ చర్చించటం సాధ్యం కాదని నాకు తెలుసు. కాని మీ నవలలోని పాత్రలకు సంబంధించిన మరో స్త్రీని మరుగున పడేసారు. ఆమె రాంబాబు భార్య! భర్త మరొక ఆడదానితో తిరుగుతుంటే ఆ భార్య అనుభవించే మానసిక క్షోభను కూడా మీరు మీ నవలలో చిత్రీకరిస్తే బాగుండేది.

☛ *రాంబాబు భార్య మానసిక క్షోభను చిత్రీకరిద్దామనే అనుకున్నాను. కాని ఆ క్షోభ ఎలాంటిదో, ఆ క్షోభను చిత్రీకరించిన కథలూ మనకి వచ్చి వున్నాయి కదా అని మినహాయించి, వైవిధ్యమున్న ఆ మూడు పాత్రలనే తీసుకున్నాను. అప్పటికే కేన్వాస్ పెద్దదయింది!*

రాజరాజేశ్వరి (ఖమ్మం)

● అఖిల భారత బూతు రచయితల సంఘం పెట్టి మిమ్మల్ని ప్రెసిడెంట్ చేస్తే ఎలా ఉంటుంది?

☛ *ఐడియా గ్రేట్! అయితే ఆ పదవికి తగిన వాళ్ళు చాలామంది పెద్దలు వున్నారు. నా వరకూ రానిస్తారా?*

ఎస్. వాసుదేవరావు (హైదరాబాద్)

● మీకు వచ్చిన ప్రశ్నలు చూస్తుంటే రాసిన వాళ్ళపై కోపం వస్తోంది. మీరు అంతకన్నా శాంతంగా, బుద్ధిగా వాటికి సమాధానాలు ఇస్తుంటే మాకు ఆశ్చర్యం వేస్తోంది.

☛ *వినదగునెవ్వరు చెప్పిన....*

ఏడిద సూర్యకుమారి (విజయవాడ)

● స్త్రీకి వివాహం కంటే సెక్స్ ముఖ్యమనా మీ ఉద్దేశం!

☛ *వివాహం సామాజిక సంబంధమైన ఒక కట్టుబాటు. సెక్సు శారీరక సహజ లక్షణం.*

వి. నళిని (తెనాలి), పవన్‌కుమార్ (కడప)

● హైమతో చెలాన్ని చూసిన విజయ... చెలంతో గొడవపడి వెళ్ళిపోయినపుడు అలా మొరటుగా బూతిగా తిట్టడం!... ఏవిటండీ మీరు.. మరీ పచ్చిగా వ్రాస్తున్నారు.

☛ *విజయ అలా ప్రవర్తించడం అది ఆ పాత్ర సంస్కారం. ఆ స్థితిలో ఆమె అలా ప్రవర్తించడం సహజం. అవి మనం వినడానికి ఇబ్బందైన మాటలైనప్పటికీ... ఆ పాత్ర నోటి నుంచి వచ్చి తీరుతాయి. మీరూ, నేనూ ఆపలేం!*

యన్. శైలజ (కైకలూరు)

● ఛాయ వివాహానికి అంగీకరించదేవిఁటీ పిచ్చిముండా! స్త్రీకి రక్షణ వివాహమే కదా ఇచ్చేది?

☛ *స్త్రీ, పురుషులు భార్యాభర్తలుగా కలసి దాంపత్య జీవితం సాగించడానికి వివాహం. అంతే గాని స్త్రీకి సోషల్ సెక్యూర్టీ ఇవ్వడం కోసం కాదు. సెక్యూర్టీ ఇవ్వాల్సింది సమాజం!*

పి. శిరీష (కొత్తగూడెం)

● వివాహం నూరేళ్ళ పంట కదా. మన భారత సాంప్రదాయం కాదని - ఆధునిక స్త్రీలు భర్తని కాదని విడాకులకి పరిగెట్టడం తప్పని నా అభిప్రాయం. మీరేమంటారు?

☛ *భార్యాభర్తల్లో ఒకరిపై ఒకరికి ప్రేమ అంతరించినపుడు, ఇద్దరికీ ఏ మాత్రం పొసగనపుడు... ఇద్దరూ విడిపోడం వాళ్ళకీ, సమాజానికీ ఆరోగ్యం అని నా అభిప్రాయం.*

యస్. నళిని (కాకినాడ)

● భార్యాభర్తల్లో భర్తదే పై చేయి అన్నట్టుగా మీరు వ్రాస్తున్నారు. మా ఇంట్లో నాదే పెత్తనం. నా భర్త నా దగ్గర పిల్లి దగ్గర ఎలుక!

☛ *భార్యాభర్తల సంబంధాలు భార్యాభర్తల సంబంధాల్లా వుండాలిగాని- పిల్లీ - ఎలక సంబంధాల్లా కాదు. కావాల్సింది పరస్పర ప్రేమ, అన్యోన్యం, స్వేచ్ఛ!*

వై. రామారావు (తాడేపల్లిగూడెం)

● చదువుకున్న స్త్రీ కూడా భర్త పట్ల మానసిక బానిసత్వం నుంచి బయటపడ్డం లేదు ఎంచేత?

☛ *ఎంత చదువుకున్నా ఆయా వ్యక్తుల చైతన్యస్థాయిని బట్టి వారి నిర్ణయాలు వుంటాయి. మన సమాజం ఏ స్త్రీకైనా ఆలోచించుకునే అవకాశం ఇచ్చేస్థితిలో లేదు.*

పి.యస్. రాణి (బేతంచర్ల)

● భార్యని హింసించే భర్త పశ్చాత్తాపం చెందేదెప్పుడు. స్త్రీకి మంచి రోజులు వచ్చేదెప్పుడు?

☛ *భర్త పశ్చాత్తాపాలతో స్త్రీల సంకెళ్ళు తెగిపోవు. సమాజం సమూలంగా మారినపుడే అది సాధ్యం.*

సత్యవతి (అనకాపల్లి)

● 'భర్తే దైవం భర్త తోడిదే లోకం' అంటూ ఎంతో శాంతిగా, సుఖంగా వుండే ఆడవాళ్ళపై మీ అభిప్రాయం?

☛ *శాంతిగా, సుఖంగా వుండనివ్వండి - నిజంగా వుంటే!..... మధ్యన నా అభిప్రాయం ఎందుకు?*

శ్రీపాద శ్రీనివాస్ (చింతాడ)

● ప్రతి రచయిత్రీ ఆడవాళ్ళను వెనకేసుకొస్తారు. మీరూ అంతే!

☛ వెనకేసుకురావడం కాదు- వెనుకబడి వున్నారని తెలియజేయడం.

వి. సరళ (మందమర్రి)

● బి బ్రేవ్ మై చైల్డ్! కొందరు తమకు తెలిసిందే ప్రపంచం, తమకు తెలిసిందే నీతి నియమం అనుకుని ఇతరులను విమర్శిస్తూ వుంటారు. అలాంటి వారిని చూచి జాలి పడు. అంతే గాని - నీ అభిప్రాయాలనీ, నీ ఆత్మస్థయిర్యాన్నీ కోల్పోవద్దు. ఆ తరం మాటలకు ఈ తరం స్త్రీని వెనుకంజ వేయకు. రచనా ధోరణి మార్చకు. చలమంతటి మహనీయుడే యెన్నెన్నో విమర్శకుల గురి అయినప్పుడు ఇలాంటి విమర్శకుల బూజు మనసు చూచి జాలీగా జాలిపడు. నిన్ను విమర్శించే ఈ వ్యక్తులకు నిజాన్ని నిజంగా ఒప్పుకునే ఆత్మస్థయిర్యం లేనందున 'ఛాయ చేసిన తప్పేమిటో' అర్థం కానందుకు, అదేదో బూతు అని మహా మధనపడిపోతున్నందుకు వాళ్ళ అమాయకత్వానికి తల్లిలా జాలిపడి పిల్లల్లా క్షమించు.

☛ *క్షమించడానికి నేనెంత? సాహిత్యంలో అ ఆ లు నేర్చుకుంటున్న చిన్నదాన్ని! రాసిందానిలో తప్పులేమైనా వుంటే తెలుసుకోవలసిన దాన్ని... పోతే నీ అభిమానానికి కృతజ్ఞతలు.*

జె.యస్. మనోహర్ (బాపట్ల)

● మీ సీరియల్ చదివిన తర్వాత నాకు 'మీరు కూడా నిజ జీవితంలో సెక్సుని అంతగా వాంఛించారు'

అని నా బలమైన అనుమానం. నిజమేనా?

☛ మంచి పాఠకుడికి అలాంటి అనుమానాలు రాగూడదు! మీరు ఎందుకైనా మంచిది ఇండ్ల రామసుబ్బారెడ్డిని ఒకసారి కలవండి!

ఆర్. రాజయ్య (వెంకటాపూర్)

● సమస్త మానవకోటి ఆవిర్భావానికి సెక్స్ మూలం కదా. అలాంటి సర్వజనీనమైన సెక్స్‌ను మీరు 'ఈతరం స్త్రీ'లో ప్రవేశపెట్టినందుకు మిమ్మల్ని గుడ్డిగా ఎందరో విమర్శిస్తున్నారు. అలాంటి వారికి మీరిచ్చే ఘాటైన సమాధానం ఏమిటి?

☛ నేను వ్రాసిన నవల్లో సెక్సు సహేతుకంగా, సమంజసంగా లేనప్పుడు పాఠకులే నవలను తిరస్కరిస్తారు. అంచేత ఘాటైన సమాధానాలు, నవలని వెనకేసుకు రావడాలు అనవసరం కదా!

వి. రామచంద్రారెడ్డి (నల్గొండ), మీనాక్షి (ద్రాక్షారామం)

● విజయ, సుజాతలను..... ముఖ్యంగా ఛాయ కథను ఏ విధంగా ముగిస్తారో అని ఆందోళగా వుంది.

☛ ఆయా పాత్రల కథ ఎలా ముగుస్తుందో అని ఆందోళన చెందేకన్నా - ఆ పాత్రలను అలా మలుస్తున్న సామాజిక పరిస్థితులపై ఆందోళన చెందడం, ఆలోచించడం మంచిదని నేను అనుకుంటున్నాను.

రమాదేవి (బెబ్బులి)

● ఈతరం స్త్రీలు ఛాయని ఆదర్శ స్త్రీగా ఫాలో అవ్వమనా మీ ఉద్దేశం స్త్రీ సమస్యలకు అదే పరిష్కారమా?

☛ ఈతరం స్త్రీలకి ఛాయ ఆదర్శ స్త్రీ అని నేను అనలేదు. అనుకోలేదు కూడా! ఛాయ ద్వారా స్త్రీలు ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలను ఎత్తి చూపడమే నా ఉద్దేశం తప్ప - ఛాయలా జీవించడమే స్త్రీ సమస్యలకి పరిష్కారం అని నేను అనుకోవడం లేదు. అయితే ఛాయపై నాకు పూర్తి సింపతీ ఉంది!

కె. యశ్వంతరావు (హైదరాబాద్)

● కనకరాజు భార్య మొదట్లో ఒక దగ్గర - కనకరాజు స్పీచ్‌లో శకుంతల అని చెప్పించి, తర్వాత కథ నడిపేటప్పుడు, హైమగా వ్రాసారు.

☛ అది పొరపాటే! ధన్యవాదాలతో, సరిదిద్దుకుంటాను.

కె. రాజేశ్వరరావు (డోర్నకల్)

● పాఠకులకు పత్రికలు అందిస్తున్నది సాహిత్యం అనుకోవాలంటే నా మనసు ఒప్పుకోవడం లేదు. దీనిపై మీ కామెంట్ ఏమిటి?

☛ ఈ మైనార్టీ అభిప్రాయం మెజార్టీ అభిప్రాయంగా మారినప్పుడు మీరు కోరుకునే సాహిత్యం లభిస్తుంది!

ఎ. రాజారామ్, ఎ. రజని (ఆత్మకూరు)

● కుటుంబంలో స్త్రీకి రక్షణ లేదా?

☛ ఈ సమాజంలో స్త్రీకే కాదు. ఏ ఒక్కరికీ రక్షణ లేదు. అయితే ముందుగా ఈ విషయం గుర్తించిన కార్మికులు సంఘాలుగా ఏర్పడి ఎందరెందరికో మార్గదర్శకులైనారు! తమ రక్షణకై స్త్రీలు కూడా సంఘటితం అయ్యే రోజు ఎంతో దూరంలో లేదని అనుకుంటున్నాను.

జె.యస్.రావు (కాశీబుగ్గ)

● వైఫ్ బీటింగ్ అనేది ఎంత అమానుషమైనదో (నేను కొట్టినపుడు కన్నా) మీ నవల చదివినపుడు

నాకు అర్థమైంది. భర్త కొడితే పాశ్చాత్య స్త్రీ భరించదు. భారత స్త్రీ మాత్రం గొడ్డులా భరిస్తుంది. అది మా పురుషుల పాలిట అదృష్టంగా భావిస్తున్నప్పటికీ... సిగ్గేస్తుంది ఆ భావనకి!

☛ *సీతా, సావిత్రిలను చూపించి, మన ధర్మాలను వినిపించి భార్యని బాండెడ్ లేబర్‌గా మార్చింది మన పురుషాధిక్య సమాజం! ఆ విషయం మన స్త్రీలు కూడా తెల్సుకుంటున్నారిపుడు! స్త్రీకి స్వేచ్ఛ, ఆర్థిక స్వాతంత్ర్యం వున్న ఏ దేశంలోనైనా కొట్టే భర్తని ఏ భార్యా సహించదు.*

**ఒక పాఠకుడు .....**

● విద్యావంతులైన స్త్రీల సమస్యలూ, విద్యావంతులైన దంపతుల లైంగిక సంబంధాలు మీరు యథాతథంగా, నగ్నంగా, గొప్పగా చిత్రీకరిస్తున్నారు. అయితే కొందరు స్త్రీలు అవమానిస్తున్నట్లు భావించడం సహజం. వాళ్ళ రియాక్షన్ని మీరు అన్యథా భావించకండి!

☛ *థాంక్యూ! భావించను. అలాంటి వారిని అర్థం చేసుకోగలను.*

**సునీత (బేతంచెర్ల)**

● భార్యల హక్కులను పరిరక్షించే బదులు కాలరాచే చట్టం... అని మీరు వ్రాస్తుంటే నేను నమ్మలేకపోతున్నాను.

☛ *బ్రిటన్ నుంచి మనం అరువు తెచ్చుకున్న 'కామన్ లా'లో భార్యల హక్కుల విషయమై లార్డ్ డెన్నింగ్ అప్పుడెప్పుడో, ఒక సందర్భంలో చట్టాలు మార్చాలంటూ భార్యల పరిస్థితి ఏ విధంగా వున్నదీ ఇలా చెప్పేడు - "భార్యను ఈ చట్టం ఇంట్లో ఒక వస్తువుగా, ఫర్నీచర్‌గా మాత్రమే భావించింది. అంటే కుర్చీలు, మంచాలు, కంచాలను కట్టకట్టి వీధిలోకి ఎలా నెట్టివేస్తామో తన భార్యని కూడా ఆ భర్త అలా బంగీకట్టి అవతలికి తోలేయవచ్చు" (ఒక డైలీ ఎడిటోరియల్ నుంచి).*

**సుధీర్‌కుమార్ (విశాఖపట్నం)**

● 'ఈతరం స్త్రీ' లోని పాత్రల చిత్రణ అద్భుతం. ఇంత చక్కటి కారెక్టరైజేషన్ ఇప్పటి రచయిత(త్రి)లలో చాలా తక్కువ. ఇంతకాలం రచయిత్రిలంటే నాకు చాలా చిన్న చూపు వుండేది. సారీ! మీ పాత్రల మనస్తత్వాలతో, ప్రవర్తనలతో నన్ను, నాకు బాగా తెలిసిన కొంతమందిని నవలలోని చాలా సందర్భాలలో క్లియర్‌గా చూడగలిగేను. ఇలాంటి భావన నేనెలాంటి నవల చదువుతున్నప్పుడు పొందలేదు.

రవి తను తెలిసి తెలిసి తప్పు చేస్తున్నప్పుడు అతనిలోని సంఘర్షణ, చలం తను మగాణ్ని కదా అనీ చెప్పక చెప్పే అతని 'మగబుద్ధి'ని గురించి చాలా చక్కగా వ్రాసారు. విజయ, సుజాత, ఛాయ మీ నవలకి మూడు ముత్యాల్లాంటి పాత్రలు. ఈ నవల గురించి చెప్పాలంటే అంతా మంచే గాని మరొకటి కాదు. ఈ నవల ద్వారా మీరు లోకానికి పనికొచ్చే సందేశం ఇవ్వగలరని నాకు ఖచ్చితంగా నమ్మకం ఏర్పడిపోయింది.

☛ *మీ కంతటి నమ్మకం ఈ రచన కలిగించినందుకు నా ధన్యవాదాలు.* ✿



